# కొండవీటి ప్రాభవం

# శ్రీనాథుని వైభవం





పోలవరపు కోటేశ్వరరావు

# కొండవీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం

## పోలవరపు కోటేశ్వరరావు



అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణరత్న దీప్తికా
చుంబిత దిగ్విభాగ శ్రుతి సూక్త వివిక్త నిజ ప్రభావ భా
వాంబర వీథి విశ్రుత విహార ననుం గృపజూడు భారతీ!

ఎఱ్ఱాప్రగడ (అరణ్య పర్వం 4 - 216)

# కొండ వీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం



| | | |
|---|---|---|
| రచయిత | : | పోలవరపు కోటేశ్వరరావు |
| ప్రచురణ నెం. | : | 12 |
| ప్రథమ ముద్రణ | : | ఏప్రిల్, 1997 |
| ద్వితీయ ముద్రణ | : | మే, 1997 |
| ప్రతులు | | 1000 |
| పుటలు | : | 220 |
| డి.టి.పి. | : | ఎ. శ్రీనివాస్ |
| గ్రాఫిక్స్ | : | సక్సెస్ గ్రాఫిక్స్, విజయవాడ - 2. |
| చిత్రాలు | : | బాపు |
| ముద్రణ | : | పాండురంగ ఆఫ్ సెట్ ప్రింటర్సు<br>అరండల్ పేట, విజయవాడ-2 |
| ప్రచురణ | : | సుజాత ప్రచురణలు<br>33-16-12, కస్తూరిబాయి పేట<br>విజయవాడ - 520 010 |
| మూల్యం | : | రూ. 100-00<br>(5 డాలర్లు) |

# మనవి



ఈ రచన చేయటానికి ప్రేరణ యీ నాటిది కాదు. ఎప్పటినుంచో పోగుచేసుకున్న సమాచారాన్ని సూత్రబద్ధం చేయటానికి ఒకరకంగా మా ధర్మారావు కారణం.


ధర్మారావు

తరచు నేను చెప్పే శ్రీనాథులవారి చాటువులు వారి నాకర్షించేవి. "నాకు చలం పట్టి నట్లు, నీకు శ్రీనాథుడు పట్టాడు; రచన పూర్తి చేయి" అనేవారు. వారి వత్తిడివలన ఈ రచన పూర్తి చేయగలిగాను.

నాకు మరో సాహితీ మిత్రుడు కోటగిరి విశ్వనాథరావు గారు. సంస్కారం నిండిన సాహితీమూర్తులు. వారందించిన సాహితీ సహాయం మరువరానిది.

హైదరాబాద్‌లోని సుందరయ్య గ్రంథాలయ సంస్థలో పని చేస్తున్న మరో సాహితీ మిత్రుడు ఐ.ఎస్.ఎన్. రాజుగారు చాలా సహకరించారు.

పీఠిక వ్రాసిన సినారె గారికి,పరిచయం వ్రాసిన ప్రసాదరాయ కులపతి గారికి నమస్కారాలు చెప్పుకుంటున్నాను.

ఎందరో మహనీయుల పరిశోధనల నుండి, రచనల నుండి చాలా సమాచారం సేకరించి, యీ గ్రంథంలో పొందుపరచాను. వారందరికీ వందనాలందిస్తున్నాను.

మాన్యమిత్రులు అశ్వనీ కుమార్, జి.వి.వి సత్యనారాయణ, రమేష్ కె.గుడె, అసిస్టెంట్ స్థపతి ఈమని శివనాగిరెడ్డి, వెలగపూడి కృష్ణారావు, విశ్వనాథవారి శిష్యుడు గంథం నాగేశ్వరరావు, ఈశ్వర ప్రభు, పెద్దిభొట్ల సుబ్బరామయ్య - ఇంకా ఎందరో పుస్తకాలందించి, సలహాలిచ్చి, ప్రోత్సహించారు. వారికి నా కృతజ్ఞతలు.

ముఖచిత్రం, సరస్వతీ దేవి రేఖా చిత్రాలు వేసిన బాపు గారికి, పుస్తక ముద్రణకు సహకరించిన కొండపల్లి యోగీశ్వరరెడ్డి, కొండపల్లి ఉదయానందరెడ్డి గారలకు నా అభిమానా న్నెలా అందించాలో తోచటం లేదు.

ఈ గ్రంథానికి కృతిభర్తగా ఉన్న కొండపల్లి రామ్ రెడ్డి గారికి, వారి శ్రీమతి సుశీలాదేవి గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

విజయవాడ
ఈశ్వర ఉగాది
8-4-1997

పోలవరపు కోటేశ్వరరావు



# పీఠిక

"ప్రభు" శబ్ద భవం "ప్రాభవం". "విభు" శబ్దభవం "వైభవం". రెంటిపైనా రాజముద్ర ఉంది. ఒకటి కొండవీటి ప్రాభవం. రెండవది శ్రీనాథుని వైభవం. కొండవీడు నేలిన రెడ్డిరాజులది ప్రాభవం అనడం సహజం, సముచితం. మరి శ్రీనాథునికి విభుత్వం ఎలా కలుగుతుంది? కేవలం కవికదా అతడు. కాదు. అతడూ రాజే. అందుకు పతాక సదృశంగా నిలిచే ఉదాహరణం "కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా" అనే సీసం పంక్తి.

కొండవీటి ప్రభువరేణ్యులకూ శ్రీనాథ కవి సార్వభౌమునికీ అవిభాజ్యమైన అనుబంధం ఉంది. నూనూగుమీసాల నూత్న యవ్వనం దాటిన శ్రీనాథుడు ప్రౌఢకవిగా రూపుదిద్దుకున్నది కొండవీటి ప్రభువుల పేరోలగంలోనే. అందువల్ల ఈ గ్రంథం ఉభయ ప్రాభవ వైభవాల కమనీయ సంగమంగా నిలిచింది.

ఇటు సృజనాత్మక రచనలను, అటు విమర్శనాత్మక గ్రంథాలను సరితూకంలో, సమపాకంలో వెలువరించి సాహితీ రంగంలో రాణకెక్కిన మిత్రులు పోలవరపు కోటేశ్వరరావు గారు. ఈ గ్రంథ రూపంలో సముచిత చారిత్రక సమాచారాన్ని పొందుపరుస్తూ శ్రీనాథుని సముత్తాల వాఙ్మయమూర్తికి నిలువెత్తు అద్దం పట్టారు.

కొండవీటి రెడ్డిరాజుల సమకాలీనులైన అన్యరాజన్యులను గురించి ప్రస్తావిస్తూ, ప్రత్యేకించి కొండవీటి విభుల పరిపాలనలో జరిగిన బహుముఖాభ్యుదయాన్ని విశ్లేషించి చూపారు. సందర్భాన్ని బట్టి ఎన్నెన్నో పద్యాలను కొన్ని శ్లోకాలను ఉదాహరించారు. ఇక శ్రీనాథుని విషయానికొస్తే చాలు - కోటేశ్వరరావుగారి లేఖినికి నిలువెల్ల పులకలే. శ్రీనాథుడు చేసిన పర్యటనలను, సందర్శించిన వివిధ భూపతులను, సరదాగా మీటిన చాటువులను

ఎంతో రుచికరంగా ఉల్లేఖించారు కొటెశ్వరరావుగారు.

"దేశ భాషలందు తెలుగులెస్స" అనగానే సాధారణ తెలుగు పాఠకుడికి కృష్ణదేవరాయలు గుర్తొస్తాడు. కానీ అంతకంటే ముందే శ్రీనాథుడు తాను రచించిన "క్రీడాభిరామం"లో "జనని సంస్కృతంబు సకల భాషలకును / దేశ భాషలందు తెలుగు లెస్స" అన్న విషయాన్ని కోటేశ్వరరావుగారు ఉదాహరిస్తూ దాన్ని "తెలుగు వారంతా పులకించే పద్యం" అనడం అత్యంత సమంజసం. కొండవీటి ప్రభుత్వానికీ, కవిగా శ్రీనాథుని విభుత్వానికీ సంబంధించిన సమాచారాన్ని పుష్కలంగా సేకరించి ఈ పుస్తకంలో రాశి పోశారు పోలవరపువారు. ఏళ్ల తరబడిగా వారు చేసిన కృషికి ఆకృతి ఈ కృతి. ఒకవైపు "కృష్ణవేణి' ' లాంటి రసతుందిల రచనలు చేస్తూ, ఇలాంటి చారిత్రక గ్రంథాలను రచిస్తున్న మిత్రులు పోలవరపు కోటేశ్వరరావు గారి నిరంతర సాహితీ ప్రస్థానానికి హార్దికంగా అభినందన లందిస్తున్నాను.

*జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్*

**డా॥ సి. నారాయణ రెడ్డి,** ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్.,

# పరిచయం



ప్రతి జాతికి చరిత్ర, సాహిత్యము రెండూ పక్షికి ఉండే రెక్కల వంటివి. ఒకదాని కొకటి బలకరంగా ఉంటవి. సాహిత్య వాసన లేని చరిత్రకారులు కొందరుంటారు. కొందరేమిటి? ఎక్కువమంది అటువంటివారే. కేవలం చరిత్ర ప్రియులకు తప్ప తదితరులకు దానిలో రుచి ఉండదు. శాసనాలు, కైఫీయతులు, విదేశస్థుల వ్రాతలు ఆ కసరత్తుల మధ్య కవితా పరిమళం మనలేదు. అయితే వారిని తప్పు పట్టవలసిన పని లేదు. దాని లక్షణం అది. ఒక శాస్త్ర గ్రంథం వ్రాసే వాడు ఆ శాస్త్రం ఎలా చెప్పాడనేది మాత్రమే ప్రధానం. అందులో కవిత్వం వెదకడం ఉచితం కాదు. లేకుంటే కొందరు శాస్త్రకారులు రమణీయ రచనా శక్తి కలిగిన వారక్కడక్కడ ఉంటారు. ఆ విషయం అటుంచితే చరిత్ర నిర్మాణంలో ఒక ప్రత్యేకత ఉంది. కొన్ని సందర్భాలలో సమకాలికమైన సాహిత్యాన్ని కొందరి కాల నిర్ణయానికి జరిగిన సంఘటనల స్వరూపాన్ని వివరించటానికి గ్రహించవలసి వస్తుంది.

అయితే ఇక్కడ రచయిత కోటేశ్వరరావుగారికి రెండు కోరికలున్నట్లు కనిపిస్తుంది. ఒకటి కొండవీటి ప్రాభవాన్ని చెప్పటంతో పాటు శ్రీనాథుని వైభవాన్ని వర్ణించటం. కేవలం మొదటి అంశమే అయితే వట్టి చరిత్ర అయి ఉండేది. కానీ రెండవ అంశం కూడా ఉండటం వల్ల పసిడికి పరిమళం పట్టించినట్లయింది. ఇంతకు ముందు ఇటువంటి గ్రంథాలు కొన్ని రాకపోలేదు. ఆ వచ్చిన వాటిలో ఇది మేలిరకమని అనిపిస్తుంది.

కొండవీటి రాజ్యానికి ముందు యావదాంధ్ర దేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంతో పరిపాలించిన కాకతీయ రాజ్య విశేషాలతో ప్రారంభించి, అది విచ్ఛిన్నమైన తర్వాత ఆ రాజ్య సేనాపతులు, మంత్రులు ఏవిధంగా వివిధ రాజ్యాలు స్థాపించి ముస్లిం దండయాత్రలను ఎదుర్కొంటానికి ప్రయత్నించింది, ఆ ప్రయత్నాలు ఏ రకంగా కొండవీటి రాజ్య స్థాపనకు దారి తీసింది చారిత్రకాంశాలు చాలా స్పష్టంగా కన్నులకు కట్టినట్లుగా రచయిత ప్రదర్శించారు. రాజుల మధ్య రాజ్య విస్తరణకు, సుస్థిరతకు యుద్ధాలు, పెండ్లిండ్లు, సంధులు, ఇచ్చిపుచ్చుకోటాలు ఇవన్నీ రాజనీతి ప్రదర్శన చిహ్నాలుగా గమనించవచ్చు.

ఈ నేపథ్యంలో శ్రీనాథుని పాత్ర చాలా విశిష్టమైనది. విలక్షణమైనది. తిక్కన గణపతీ దేవ చక్రవర్తిని మెప్పించి మనుమసిద్ధి రాజ్య పునస్థాపన ఏ విధంగా చేయించగలిగాడో అదే విధంగా కవిసార్వభౌముడైన శ్రీనాథుడు కూడా తన సమకాలీన ఘట్టాలతో సాహిత్య దౌత్యం నెరపి తన పోషకులైన రాజులకు సహాయం చేశాడు.

గ్రీకు తాత్వికుడు ప్లేటో కవులను కళాకారులను గూర్చి ప్రస్తావిస్తూ రాజ్యాంగపరమైన ఉన్నత స్థానాలలో పాలకులుగా ఉండదగరని వ్రాశాడు. బహుశా ఊహాలోకాలలో విహరిస్తూ మామూలు ప్రపంచానికి అతీతంగా వారి మనస్సులు ఎక్కడో వాస్తవాలకు దూరంగా ఉంటవని, అందువల్ల నిత్య వ్యవహారాలలో వారు సరిగా వ్యవహరించలేరనే భావన అతనికున్నట్లు కనిపిస్తుంది. భారతీయుల జీవన తత్వాన్ని తెలిసి ఉంటే అతడలా వ్రాసి ఉండేవాడు కాదేమో.

ఇక్కడ మహర్షులు మొదటి కవులు. వారు రాజులకు ధర్మబోధ చేస్తూ నీతి వ్యవహారాలలో సలహాలిస్తూ పరోక్షంగా రాజ్యాలు సక్రమంగా నడవటానికి దోహదపడేవారు. తరువాతి కాలంలోని కవులు కూడా కొందరు ఆ స్థాయిలో ఉండేవారు. మన ఆంధ్ర సాహిత్య విషయానికి వస్తే తిక్కన, శ్రీనాథులు ఆ ఉన్నత శ్రేణికి చెందినవారు. కృష్ణరాయలు, రఘునాథ నాయకుడు, నన్నెచోడుడు మొదలైనవారు కవి రాజులుగా ప్రసిద్ధి చెందిన సంగతి అందరికి తెలిసినదే.

ఇక శ్రీనాథుడు కవిత్వ సహాయంతో తన ప్రభువులకు చేసిన సహాయం సామాన్యమైనది కాదు. తమ్మపడిగంలో రెడ్డిరాజు బొమ్మలేయించి రోజా దానిపై ఉమ్మి వేయటం వంటి అసభ్యమైన పని మాన్పించగలిగాడు. నందికంత పోతురాజు కటారిని వెలమల నుండి తీసుకొని తన ప్రభువుకు అప్పగించగలిగాడు. సర్వజ్ఞ నామధేయము - వంటి పద్యాలతో ఇరుపక్షాలను మెప్పించగలిగాడు. ఇది సామాన్యుడైన కవిమాత్రుడు సాధించగలిగింది గాదు. "కవిర్మనీషీ సంభూః స్వయంభూః" అన్న వాక్యానికి అర్హతగలవాడు చేయగలిగింది. శ్రీనాథుడు నిస్సంశయంగా అంత అర్హత గలవాడే.

శ్రీనాథుని చాటువులు, సమస్యా పూరణలు చేర్చటం వల్ల ఈ గ్రంథానికి సాహిత్యపు విలువ పెరిగింది. అనుబంధాలు మరికొన్ని అదనపు విశేషాలనందించినవి. అన్ని విధాలా ఇది ఎంతో విలువైన గ్రంథం. అయితే నావంటివాడు ఏకీభవించలేని వాక్యాలు కూడా కొన్ని ఉన్నవి.

"నన్నయ భట్టారకుడు సంస్కృత పద భూయిష్ఠమైన తెలుగును వ్రాసి అసలు తెలుగు నడుం విరగ్గొట్టాడు. పురాణాలు, ఇతిహాసాలు సంస్కృతం నుండి తెలుగులోనికి అనువదించి, సహజ పరిణామం లేకుండా ఛాందసాన్ని నెత్తిన మోపారు. తెలుగుదనం మసిబార్చారు" - వీటిని ఎందుకు అంగీకరించనో చెప్పాలంటే పెద్ద వ్యాసం వ్రాయాలి. ఇక్కడ అలా వ్రాయటం పద్ధతి కాదు. నా అనంగీకారాన్ని కోటేశ్వరరావుగారు సహృదయతతో స్వీకరిస్తారని ఆశిస్తూ అనేక విశేషాలతో అలరే మంచి గ్రంథం వ్రాసినందుకు వారిని అభినందిస్తున్నాను.

ది. 31-3-97

డా॥ ప్రసాదరాయ కులపతి

శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు

ప్రిన్సిపల్, హిందూ కాలేజి, గుంటూరు

# కొండపల్లి రామ్ రెడ్డి గారి జీవిత విశేషాలు

అమెరికా మిత్రుడు రమేష్ కె.గుడెగారు, నేను కలసి హైద్రాబాద్ వెళ్లాము. ఒక రోజు "మా పెద్దాయన"ను చూసొద్దాం రండి అని తీసుకువెళ్లారు.

ఒక విశాలమైన గదిలో కూర్చొని టి.వి.చూస్తున్న రామ్‌రెడ్డిగారిని పరిచయం చేశారు. వయస్సు మళ్లినా చురుకుగా వున్న ఆయన ముఖంలో వర్చస్సు వుంది. కళ్లలో తేజస్సు వుంది.

రామ్ రెడ్డి గారి కుమారులిద్దరు రమేష్‌కు మంచి స్నేహితులు. వారిది బాల్య స్నేహం.

మా సంభాషణలు అనేక విషయాల మీదకు మళ్లాయి. "మీ యింటి పేరు కొండపల్లి గదా! ఈ పేరెలా వచ్చింది" అని అడిగాను.

రామ్ రెడ్డి గారు చిరునవ్వుతో, "చాలా చరిత్ర వుందండి" అంటూ ప్రారంభించారు.

"మా పూర్వీకులు కొండపల్లి కోటలో వుండేవారు. షుమారు నాలుగు వందల సంవత్సరాలనాడు, ఏమి జరిగిందో తెలియదుగాని, కావలి ప్రాంతం వెళ్లిపోయారు. ఎందరు వెళ్లారో, ఎలా వెళ్లారో చెప్పేందుకు ఆధారాలు లేవు.

అక్కడ రెండు వందల సంవత్సరాలకు పైగా నివసించారు. వ్యవసాయాన్ని జీవనాధారం చేసుకున్నారు. ఒకప్పుడు మేడివదలి, కత్తిపట్టి యుద్ధాలు చేసి రాజ్యాలు స్థాపించినవారు మరల పంటలు పండించే రైతులుగా మారిపోయారు.

నే నీ మాటలు చెప్పటానికి కారణం లేకపోలేదు. అద్దంకి, కొండవీడు, రాజ్మహేంద్రవరం పాలించిన పంటరెడ్ల వంశానికి సంబంధించిన వారమే మేము. ఆనాడు అనగా 1323లో ఓరుగల్లు పడిపోయాక, పంటకాపైన ప్రోలయ కుమారుడు వేమారెడ్డి అద్దంకిని రాజధానిగా చేసుకొని రాజ్యపాలన సాగించాడు. అది చాలా పెద్ద చరిత్ర. వేమారెడ్డి దేసటి వంశానికి చెందినవాడు. మాదీ ఆ దేసటి వంశమే. వారిదీ మాదీ వెల్లశేరి గోత్రమే" అన్నారు.

నేను వింటూ, చరిత్ర గతిని ఆలోచిస్తూ కూర్చున్నాను.

రామ్ రెడ్డి గారు మరల చెప్పారు. "కొండపల్లి నుండి వెళ్లిపోవటం వలన లేక కొండపల్లి పాలించటం వలన మా యింటిపేరు కొండపల్లి అయింది.

ఆ తరువాత ఏ కారణం వల్లనో 125 సంవత్సరాల క్రితం మా పూర్వీకులలో కొందరు గుడివాడ దగ్గరున్న జనార్ధన పురం వచ్చి స్థిరపడ్డారు. గురజ జమీందారులు యుద్ధవీరులుగా మా పూర్వీకులను ఆహ్వానించారు.

ఆ జనార్ధన పురాన్ని యిప్పుడు జొన్నపాడని పిలుస్తున్నారు.

శ్రీ కొండపల్లి రామ్ రెడ్డి

శ్రీమతి కొండపల్లి సుశీలా దేవి



సహృదయులు, ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగి వెళ్ళే దృఢ సంకల్పులు, స్నేహపాత్రులు అయిన శ్రీ కొండపల్లి రామ్ రెడ్డి గారికి నా రచన **"కొండవీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం"** సంతోషంగా అంకితమిస్తున్నాను.

పోలవరపు కోటేశ్వరరావు

మా ముత్తాత కొండపల్లి పరశురామ రెడ్డి గారు. వారి కుమారుడు, అనగా మా తాత తాతి రెడ్డి గారు.

తాతి రెడ్డి గారు సికిందరాబాద్ వెళ్లి సాంకేతిక విద్యలు నేర్చుకున్నారు.

గుడివాడ తిరిగి వచ్చి దంపుడు మిల్లు స్థాపించారు. తరువాత దానిని పెద్ద మిల్లుగా మార్చారు.

మా తాత తాతి రెడ్డి గారికి రెండు సంబంధాలు. మొదటి భార్య అక్కమ్మ. వీరికి గురుమూర్తి రెడ్డి జన్మించారు.

గురుమూర్తి రెడ్డి మా తండ్రి గారు. వారు గొప్ప వేదాంతి. రైస్‌మిల్లు కట్టి వ్యాపారం చేశారు. గుడివాడలో గౌరీశంకర్ టాకీసు నడిపారు.

మా తాతగారి రెండవ భార్య జ్ఞానమ్మ. వీరికి బ్రహ్మానంద రెడ్డి జన్మించారు.

బ్రహ్మానంద రెడ్డి గొప్ప వ్యాపార వేత్త. చాలా రైస్ మిల్లులు కట్టించి మంచి వ్యాపారం చేశారు. విరివిగా దానధర్మాలు చేసేవారు. పేదల యందు దయగా వుండేవారు. చాలా మందిని ప్రోత్సహించి, చదివించారు. ఒక ఆశ్రమానికి మహారాజ పోషకుడిగా జీవితాంతం ఉన్నారు. చైనాతో యుద్ధం వచ్చిన సందర్భంలో తన భార్య వంటిమీదనున్న నగలన్నీ యుద్ధ నిధికి యిచ్చారు.

బ్రహ్మానంద రెడ్డి విద్యాభిమాని. అందువలన తమ తండ్రి జ్ఞాపకార్థం "కొండపల్లి తాతి రెడ్డి ఉమెన్సు కాలేజి" 1968లో గుడివాడలో కట్టించారు. ఆ కళాశాల యిప్పటికీ చక్కగా నడుస్తోంది. నేను కమిటీ మెంబరుగా వుండి ఆ కాలేజీ నిర్మాణం జాగ్రత్తగా చేయించాను.

మా తల్లిగారి పేరు ఈశ్వరమ్మ. మా తల్లిగారి జన్మస్థలం కావలి దగ్గరున్న మన్నంగి దిన్నె. కావలి ప్రాంతానికి మాకు బంధుత్వాలు కొనసాగుతూనే వుండేవి.

నేను మన్నంగి దిన్నెలో 1925వ సంవత్సరం డిశంబరు 18న జన్మించాను. నా తొమ్మిదోయేట మా తల్లిగారు చనిపోయారు.

నా బాల్యం ఆనందంగా గడవలేదు. మా తండ్రిగారు తన మొదటి భార్య కోటమ్మ గారి ప్రభావానికి లోనై, తల్లి లేని నన్ను సరిగా ఆదరించలేదు.

నా పేరు రామ్ రెడ్డి. రామ రెడ్డి కాదు. ఆర్.ఏ.యమ్.రామ్ రెడ్డి" అన్నారు నవ్వుతూ.

ఆ మాటకు నవ్వుకున్నాం.

"నాకు పట్టుదల చాలా ఎక్కువ. మీరు మంకు పట్టుగా అర్థం చేసుకోవద్దు. ఒక విధంగా వుడుంపట్టు అన్నా నాకు అభ్యంతరం లేదు."

ఆ మాటలకు మరోమారు నవ్వులు విరిశాయి.

"పాతికేళ్ల వయసులో నాకు వివాహం చేయాలని నిర్ణయించారు. మా బంధువుల

అమ్మాయి సుశీలాదేవి పచ్చగా అందంగా వుండేది. కమ్మగా పాటలు పాడేది. ప్రముఖ విప్లవకారుడు కొండపల్లి సీతారామయ్య గారు ప్రోత్సహించి, వెంట తీసుకువెళ్లి. పార్టీ పాటలు పాడించేవారు.

అప్పటికి సుశీలాదేవికి పన్నెండేళ్లు.

నాకు, సుశీలాదేవికి 1950 మే పదవ తేదీన శాస్త్రయుక్తంగా వివాహం చేశారు."

రామ్ రెడ్డి గారు సుశీలాదేవి వంక చూస్తూ చిరునవ్వుతో చెప్పసాగారు.

"నేను బొద్దుగా, నల్లగా, బలంగా వుండేవాడిని. అందంగా వున్న సుశీలను వివాహం చేసుకున్నందుకు ఆనందంగానే వుంది. కాని ఆమె ఏమనుకుంటుందో? కలసి మెలసి కష్ట సుఖాల్లో పాలు పంచుకొని అన్యోన్యంగా జీవితాన్ని గడపగలిగితేనే గొప్పతనం. లేకుంటే అది దాంపత్యమే కాదు. నా లాగానే సుశీల కూడా అనురక్తత కలిగి వుండాలిగదా! మరి, ఆమె మనసెలా వుందో? ఏమి భావిస్తోందో?"

" మీకు వివరించి చెప్పాలంటే యిబ్బందిగానే వుంది" అంటూ చిరునవ్వుతో "నేను సుశీలతో నా మనసులోని మాట చెప్పాను" అని తానన్న మాట చెప్పారు.

'సుశీలా! మన వివాహం పెద్దలు నిర్ణయించి చేశారు. నీతో పోలిస్తే నేను మొరటుగా వున్నాను. మనం సంసార జీవితంలో అన్యోన్యంగా, కలసి మెలసి జీవించాలి. అందువలన, నేను నీకు నచ్చకపోతే, నిన్ను తాకను. నీవు ఆలోచించుకో. నిర్ణయించుకో' అన్నాను.

"సుశీల నా జీవితంలో భాగస్వామిగానేకాక, స్నేహితురాలిగా, సేవలందించింది. అన్ని విధాలా తోడునీడై నిలిచింది" అన్నారు.

వారి మాటలు వింటూ కూర్చున్న నాకు ఆ దంపతులు వాగర్థాలవంటి వారనిపించింది.

రామ్ రెడ్డి గారు మరల చెప్పారు. "ధైర్యంగా పట్టుదలగా మనం కృషి చేస్తే, భగవంతుడు కూడా సహకరిస్తాడు. అందువలన ఏదైనా సాధించవచ్చు. ఈ ఆలోచన తోటే అడుగు ముందుకు వేసేవాడిని" అన్నారు.

సుశీలాదేవి కల్పించుకుంటూ "రెడ్డి గారన్నది నిజమే. పట్టుదల ఒక్కటేకాదు. మాట యిస్తే, నిలబెట్టు కోవటంలో ఏ మాత్రం వెనుకాడరు. పైగా జాలి గుండెల వారు. మా యిద్దరి మనసులలో ఒకరికి తెలియని రహస్యం మరొకరిలో లేదు" అన్నారు.

రామ్ రెడ్డి గారు "మీకు మరో విషయం చెప్పాలి. నాకు చిన్నతనం నుండి చదువుకోవాలని వుండేది. ఆ అవకాశం దొరక లేదు. అందుకని, 1963లో అనగా నా ముప్పది ఎనిమిదవ సంవత్సరంలో ఆంధ్రా మెట్రిక్ పాసయ్యాను. ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకొని, పేపరు చదవటం అలవాటు చేసుకున్నాను. ఆంగ్లంలో బాగా మాట్లాడటం ప్రాక్టీసు చేశాను. ఇదంతా స్వయం కృషితో సాధించిందే" అన్నారు.

# శ్రీ కొండపల్లి రామ్ రెడ్డి
# శ్రీమతి కొండపల్లి సుశీలా దేవి



| | |
|---|---|
| పెద్ద కుమారుడు | శ్రీ కొండపల్లి యోగీశ్వర రెడ్డి |
| మనుమడు | ధనుంజయ్ |
| చిన్న కుమారుడు | శ్రీ కొండపల్లి ఉదయానంద రెడ్డి |
| మనుమరాలు | స్రవంతి |
| మనుమడు | సత్యశీల్ |

"నేను 1965 నుండి వ్యాపారం కొరకు తరచు హైదరాబాద్ వెళ్ళే వాడిని. ఇళ్ల స్థలాల వ్యాపారంలో ప్రవేశించాను. స్థలాలు కొనటం, ప్లాట్లు వేసి అమ్మటం చేసేవాడిని. మాట మీద నిలవటం వలన మంచిపేరు కూడా వచ్చింది. ఆ తరువాత 1981లో హైదరాబాద్ వచ్చి ఇక్కడే వుంటున్నాము" అన్నారు.

'1957 జనవరి 27న మా పెద్దబ్బాయి యోగీశ్వర రెడ్డి జన్మించాడు. బందరులో బి.కాం. చదివాడు.'

వారు చెప్పటం ఆపి "చాలా ఆలస్యమయింది. లోనికి వెళ్లి భోజనం చేసి రండి" అన్నారు.

భోజనాలయ్యాక మళ్ళీ కూర్చున్నాం.

"మా చిన్నబ్బాయి ఉదయానందరెడ్డి 1958వ సంవత్సరంలో క్రిస్టమస్ రోజున జన్మించాడు. తుంకూరులో కెమికల్ ఇంజనీరింగ్ చేశాడు. మా అబ్బాయి లిద్దరి కొరకు, ఒక పరిశ్రమ కొన్నాను. దానిపేరు సాగర్ ఎలెక్ట్రికల్ అండ్ జనరల్ ఇండస్ట్రీస్. ఈ పరిశ్రమకున్న ప్రత్యేకత థర్మిట్ వెల్డింగ్. 1984 నుండి యీ పరిశ్రమ అభివృద్ధి కొరకు మా బిడ్డలిద్దరూ పని చేశారు.

పరిశ్రమ అమ్మిన వ్యక్తి సాంకేతిక వివరాలు చెప్పకుండా చనిపోయాడు. ఉదయానంద్ ఆ సాంకేతిక విషయాన్ని కనుగొన్నాడు. స్వయం కృషితో అది సాధించగలిగాడు.

1989లో రైల్వేలో కొత్త టెక్నాలజీ వచ్చింది. దానిలో కూడా పేరు సంపాదించాము.

ఈ థర్మిట్ వెల్డింగ్ వల్ల రైలు పట్టాలు అతుక్కొని, రైళ్లు వేగంగా పయనించటానికి అనుకూలంగా వుంటుంది. భారత దేశంలో మా సంస్థ, మరో సంస్థ యీ రంగంలో గుర్తింపు పొందాయి. ఈ మధ్య ఇంకొకరు వచ్చారు".

ఉదయానంద్ కలుగజేసుకొని చెప్పారు. "కొంకణ రైల్వే కార్పొరేషన్ బొంబాయి నుండి మెంగుళూరు వరకు పడమటి కనుమల గుండా 760 కిలోమీటర్ల పొడవు రైల్వే లైను నిర్మించింది. మేము 120 కిలోమీటర్ల ట్రాక్ వేశాము. సివిల్ పనులు కూడా చేశాము.

ఆ నిర్మాణంలో పాల్గొన్నందుకు సంతోషంగా వుంది. మేం ట్రాక్ వేసింది ఛత్రపతి శివాజి పాలించిన ప్రాంతం. ఆ ప్రాచీన గిరి దుర్గాలున్న చోటు కావటం వలన, అడుగడుగునా ఉత్సాహంగా వుండేది.

కొత్తలో మాకు చాలా నష్టం వచ్చింది. మా నాన్న గారు వర్కు చూడటానికి వచ్చారు. మామూలుగా ప్రతి విషయాన్నీ లోతుగా పరిశీలించటం వారికి అలవాటు. మా కంపెనీకి నష్టాలొస్తున్నట్లు వారు గమనించారు. మా ఛీఫ్ యింజనీరును ప్రశ్నించి, కొంత సమాచారం సేకరించారు. అందరి ముందు నావంక చూస్తూ తన చొక్కా కాలరు చేతితో పట్టుకొని 'అవసరమైతే

దీన్ని కూడా అమ్మి పనులు పూర్తిచేయి. నష్టం వస్తుందని పారిపోవద్దు. పని వదలిపెట్టి తలవంపులు తేవద్దు' అన్నారు. మా ఛీప్ యింజనీరు ఆశ్చర్యపోవటమే కాదు, ఆయనకు కనులు చెమర్చాయి. మానాన్నగారి మాటలు తరచు గుర్తు చేస్తూ, ఎంతో గౌరవాన్ని ప్రదర్శించే వారు" అన్నారు.

"ఆ నిర్మాణంలో పాల్గొన్నందుకు అన్నయ్య, నేను గర్విస్తున్నాము. భారతీయ రైల్వేలో అదో అపూర్వ నిర్మాణమేకాదు, గొప్ప యింజనీరింగ్ ఫీట్" అన్నారు.

"జపాన్, చైనాలు గ్యాస్ ప్రెషర్ వెల్డింగ్ నూతనంగా ప్రారంభించారు. నూట అరవై లక్షలు పెట్టి రైల్వేవారు ఆ మిషన్ దిగుమతి చేసుకున్నారు. నేను స్వయంగా డిజైన్ చేసి నలభై లక్షల్లో మిషన్ తయారు చేశాను. రైల్వేవారు టెస్టు చేసి, అప్రూవ్ చేశారు. ఆర్డర్లు వచ్చాయి. గుడివాడ ప్రాంతంలో పని ప్రారంభించబోతున్నాను. మా జన్మ స్థలంగదా! సంతోషంగా వుంది" అన్నారు.

ఉదయానంద్ యింకా అనేక విషయాలు చెప్పారు. "అన్నయ్య యోగీశ్వర రెడ్డి అనేక యితర వ్యాపారాలు చేస్తున్నారు. నేను రైల్వే పనులు సాగిస్తున్నాను." అన్నారు.

కళా రంగానుభవాన్ని యోగీశ్వర్ వివరించారు. "నాకు, తమ్మునికి కళాభిరుచి వుంది. ఒక టి.వి. సీరియల్‌లో యిద్దరం నటించాము. నాకైతే, భవిష్యత్తులో యీ రంగంలో బాగా కృషి చేయాలని వుంది" అన్నారు.

యోగీశ్వర్ తండ్రి వంక చూస్తూ "నాన్నగారికి తనను గూర్చి చెప్పుకోవటం యిష్టముండదు. తాను కట్టు బట్టలతో బయటికి వచ్చి, స్వయం కృషితో ఇంతవారయ్యారు. మా పూర్వీకుల మాదిరిగానే అనేక గుప్తదానాలు చేసారు. ఎందరినో ప్రోత్సహించి చదివించారు. ఒక శివాలయ నిర్మాణానికి ధన సహాయం చేశారు. తనవద్ద పని చేసే అనేక మందికి చేయూతనిచ్చారు." అన్నారు.

సుశీలాదేవి కలుగజేసుకొని "మా అందరికీ స్ఫూర్తి రామ్ రెడ్డి గారే. కష్టపడి పనిచేస్తే భగవంతుడు కూడా సహకరిస్తాడని వారి నమ్మకం. నిజాయితీ, మాటమీద నిలవటం, మానవతతో జీవించటం వారు కోరుకుంటారు. కష్టాలకు క్రుంగిపోరాదని, సుఖాలను పొంగిపోరాదని చెపుతారు. వారి ధర్మపత్నిగా నేను రాం రెడ్డి గారి అడుగు జాడల్లో పయనిస్తున్నాను. నాకు రామ్ రెడ్డి గారే సర్వస్వం" అన్నారు.

"రామ్ రెడ్డి గారు అదృష్ట వంతులు" అన్నాను.

ఆ మాటకు వారు నవ్వుతూ "సుశీల అదృష్టవంతురా లనండి" అన్నారు.

అందరం ఆనందంగా నవ్వుకున్నాం.

★ ★ ★



**1951లో విజయవాడ యస్.ఆర్.ఆర్.& సి.వి.ఆర్. కాలేజీలో బి.కాం. చదివిన విద్యార్థులు**

ముందువరుసలో కూర్చున్నవారిలో కుడివైపునుండి ఆరవ వ్యక్తి శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి

పైనుండి రెండవ వరుసలో కుడినుండి ఏడవ వ్యక్తి శ్రీ పోలవరపు కోటేశ్వరరావు

# కొండవీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం

## మొదటి ప్రకరణము

### బీజాంకురం

అది 1951వ సంవత్సరం యస్.ఆర్.ఆర్ అండ్ సి.వి.ఆర్ కళాశాలలో, బి.కాం చదివే కొంతమందిమి కొండవీడు చూడాలనుకున్నాము. దాదాపు వందమందిమి బయలు దేరాము. మాతో కొందరు లెక్చరర్సు కూడావచ్చారు. వారిలో జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారొకరు.

సత్యన్నారాయణమూర్తిగారు ఇంగ్లీషు హెడ్డాఫ్‌ది డిపార్టుమెంటుగా మంచిపేరు తెచ్చుకున్నారు. వారికి చరిత్ర, సంస్కృతి, వేదాంతం, తెలుగుభాష అంటే బాగా అభిమానం. చక్కగా విడమర్చి గంభీరమైన స్వరంతో బోధించేవారు. విద్యార్థులందరికీ వారంటే బాగా అభిమానం.

ఆరోజులలో మచిలీపట్నం - మార్కాగోవా మీటరుగేజి రైలుమార్గం ఉండేది. దానిలో మేమంతా ఉదయానికల్లా ఫిరంగిపురంలో దిగాము. షుమారు మూడుమైళ్ళు కాలినడకను ప్రయాణం చేసి కొండవీటి కొండల దగ్గరకు చేరాము.

పూడిపోయిన అగడ్త, పడిపోయిన కోటగోడలు దాటాము. విశాలమైన మెట్లమీదుగా పైకి ఎక్కి, కోటదర్వాజా చేరాము.

అక్కడనుండి చూస్తుంటే చుట్టూ ఎత్తయిన కొండలమధ్య కొండవీడు కన్పించింది. అక్కడ చిట్టడవి, కొలనులు , శిథిల భవనాలు కన్పించాయి. వందలకొలది రాళ్ల రోళ్లగామలచిన ప్రాంతం, గుర్తుపట్టటానికి వీలులేని బురుజులు చూశాము. వెదుళ్ల చెరువుకు వెళ్లే దారిలో లోతైన నూయి కనిపించింది.

రాజభవనాల ప్రాంతంలో చెట్లక్రింద వంట ప్రారంభించారు. మాతో వచ్చిన వైశ్యమిత్రులు వంటవాళ్లను, సామగ్రి, పాత్రలను తీసుకొచ్చారు.

జొన్నలగడ్డవారు అన్నివైపులా చూస్తూ, ఆనంద విచారాలు ముప్పిరిగొన్న స్వరంతో, అనేక విషయాలు చెప్పారు. ఆ సందర్భంలో శ్రీనాథ కవిసార్వభౌముల ప్రతిభావిశేషాలను వివరిస్తూ, కొండవీటి పాలకులను గూర్చి వివరించారు. వారు గంభీర స్వరంతో " నేనోపద్యం చదువుతా. వినండి. ఇది శ్రీనాథ కవిసార్వభౌముల వారి చాటుపద్యం. కొండవీటి గొప్పతనాన్ని నింపుకున్న సీసపద్యం" అన్నారు.

అందరం ఆనందంగా చెవులప్పజెప్పి కూర్చున్నాము. వారు గంభీరస్వరంతో

శ్రీనాథులవారి చాటుపద్యం చదివారు.

పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల కొనగొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించు గురుతైన ఉరిత్రాడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు పుట్టించు కొమరు మీరిన వీడు కొండవీడు
చటుల విక్రమ కళా సాహసం బొనరించు కుటిలాత్ములకు గాడు కొండవీడు
జవన ఘోటక సామంత సరస వీర
భట పటానేక హాటక ప్రకట గంధ
సింధురారవ మోహన శ్రీల దనరు
కూర్మినమరావతికి జోడు కొండవీడు



వారు పద్యాన్ని వివరించి చెప్పారు. అందరం వారిచుట్టూ మూగి అనేక విషయాలు తెలుసుకున్నాము. ఈ సీసపద్యం 'కొండవీడు సామ్రాజ్యము' అనే పుస్తకంలో ఉంది. ఈ పుస్తకాన్ని ముద్దులపల్లి గురుబ్రహ్మ శర్మ గారు వ్రాసి 1920లొ ముద్రించారు. కైఫీయతులనుండి ఈపద్యాన్ని తీసుకున్నట్లుంది" అన్నారు.

పల్నాటి వీరచరిత్రకు 1911లో వ్రాసిన 80పేజీల ముందు మాటలో, పండిత ఉమాకాన్త విద్యాశేఖరులు " పరరాజ గిరిదుర్గ వర వైభవశ్రీల" పద్యాన్ని ఉల్లేఖించారు. అ పద్య పాదాలు వేరుగా ఉన్నాయి. "శ్రీనాథుల వారొచ్చారు" అనే నాటికలో నేను దానిని ఉదహరించాను.

మరల యాత్ర సంగతి చెబుతాను. అలుపెరుగని నవయౌవనం మా అందరికీ ఉత్సాహాన్ని ప్రోదిచేసింది. కాలికొందికీ తిరిగిచూశాము.

కొండదిగి, తిరిగివస్తూ, అక్కడే వున్న గోపీనాథస్వామి దేవాలయం, అక్కడ గతంలో ఉందని చెప్పిన కత్తులబావి, ఇంకా చాలా విశేషాలు చుశాం. ఆవివరాలు చెప్పించుకుంటూ కలయతిరిగాము.

మనం విన్న కత్తుల బావి కథ చెప్పుకుందాం.

కృష్ణదేవరాయల తరువాత వారి సవతి తమ్ముడు అచ్యుతరాయలు(1530-1542) హంపీవిజయనగరాన్ని పాలించాడు. కొండవీటిరాజ్యానికి రాయని భాస్కరుడు మండలాధిపతిగా ఉండేవాడు.

ఈయన నందవరీక బ్రాహ్మణుడు. కార్యవాదము,ఖడ్గవాదము నేర్చిన ఉపాయశాలి.

ఈయన కొండవీటికోటకు వాడిన రాళ్లను ఉపయోగించి, కొండదిగువ భాగాన కోటకట్టించాడు. అందులో గోపీనాథపురమని ఒక పేట కట్టించాడు. ఆపేటలో అందమైన

గోపీనాథదేవాలయం నిర్మించాడు.

అచ్యుతరాయల పాలనలో కొండవీటి ప్రాంతపు పాలెగాళ్లు 72 మంది ఎవరినీ లెక్కచేయకుండా ప్రవర్తించ సాగారు. వారి ఘోరాలకు అంతులేక పోయింది. రాయని భాస్కరుడు ఎంతచెప్పినా వాళ్లు ప్రవర్తన మార్చుకోలేదు. చివరకు ఆయన ఒక యుక్తిపన్నాడు. గోపినాథస్వామిగుడిలో గర్భాలయములో ఒక లోతైన బావిని తీయించాడు. దానిలో చికిలి కత్తులతో కట్టించాడు. ఎవరైనాసరే గుడిలో ప్రవేశించిన తరువాత, కాలిక్రింద బండతొలగిపోయేరీతిలో ఏర్పాటు చేయించాడు.

స్వామికి బ్రహ్మోత్సవం చేయిస్తున్నాము రమ్మని పాలెగాండ్రు 72 మందిని ఆహ్వానించాడు. దేవాలయంలో గోపీనాథస్వామి వేణువు వాయిస్తున్నట్లు ఏర్పాటు చేశాడు..

పాలెగాళ్ళు సకుటుంబంగా వచ్చారు. ఒకరి తర్వాత ఒకరు దేవాలయంలోకి వెళ్లారు. స్వామి దర్శనం చేసుకుంటూ అడుగు ముందుకు వేసి, అగాథంలో పడిపోయారు. ఇలా 68 మంది ఆ బావిలో పడి విచ్చుకత్తుల వలన ముక్కలు ముక్కలుగా నరుకబడ్డారు.

మిగతా నలుగురు ఆలోచనలో పడ్డారు. దేవాలయంలోనికి వెళ్ళిన వారిలో ఒక్కరూ తిరిగి రాలేదు. గర్భగుడిలో అంతమంది పట్టరు. ఏదో మోసం జరిగిందని సంశయించారు. పారిపోయారు.

మేమంతా ఆ కథ విని, ఆ గుడి చూశాము. గోపీనాథదేవాలయంలో విగ్రహంలేదు. గర్భగుడి చాలా చిన్నది. తలుపులు లేవు. ఇసుకతో నేల నిండి ఉంది.

ఆ బావి గుడి లోపలగాక, వెలుపల దక్షిణ ద్వారం దగ్గర ఉందని కొండవీటి దండకవిలెలో వ్రాయబడింది. ఆ కోట సింహద్వారం దగ్గర గోడలోని రాతిమీద ఈ క్రింది పద్యం చెక్కి ఉంది.

నిర్మించె నే మంత్రి నిరుపమ ప్రాకార నవకంబుగా గోపినాథపురము
గెలిచినా డే మంత్రి లలిత విక్రమమున ప్రబలుడై యవనుల బలము నెల్ల
నిలిపినా డే మంత్రి నియత వైభవముల గోపికావల్లభు కూర్మివెలయ
పాలించె నే మంత్రి ప్రకట ధర్మ ఖ్యాతి మహిమ మీఱగ నాంధ్ర మండలంబు
అతడు భూపాల మంత్రీంద్ర సతత వినుత ధీవిశారదు డచ్యుత దేవరాయ
మాన్య హితవర్తనుడు శౌర్య మహితయశుడు భాను తేజుండు రాయని భాస్కరుండు

సాయంకాలం వెనుదిరిగి, ఫిరంగి పురం చేరాము. రైల్లో విజయవాడ వచ్చాము.

ఆనాటి నుండి కొండవీటి పాలకులను గూర్చి శ్రీనాథ కవి సార్వభౌములను గురించి తెలుసుకోవాలనే కుతూహలం నాలో పెరుగ సాగింది. అందువలన వారిని గూర్చి అధ్యయనం చేయాలనుకున్నాను.

సంవత్సరాలు దొర్లిపోయాయి. అప్పుడప్పుడు వ్రాసుకున్న నోట్సు, విన్న పద్యాలు, చదివిన పుస్తకాలు, చూసిన ప్రదేశాలు శ్రీనాథ కవిరాజును మరింతగా అభిమానింప జేశాయి.

ఈ అనుభవాలను వ్రాయాలనుకున్నాను. ఐతే, యీ కథ ఎక్కడ ప్రారంభించాలి అనే ప్రశ్న ఎదురయింది.

## రెండవ ప్రకరణము

ఓరుగల్లు పతనంతో, చనిపోగా మిగిలిన సామంతులు, ప్రముఖులు ఏకమై ముసునూరి ప్రోలయ నాయకుని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. రెడ్డి వేమయ అద్దంకిలో రాజ్యం ప్రారంభించాడు. మరో పదమూడేళ్లకు 1336లో విజయనగరం పునాది పడి సంగమ వంశంవారు తల లేపారు. ఆపైన మరో 11 సంవత్సరాలైనాక 1347లో బహ్మనీ సుల్తాన్ గుల్బర్గానుండి పాలన ప్రారంభించాడు. ఓరుగంటి అధిపతియైన కాపయనాయకుని కాలములో రాచకొండ నుండి రేచెర్ల వెలమలు రాజ్య పాలన ప్రారంభించారు. వీరందరూ పెరిగారు. కత్తులు దూసుకున్నారు. కుత్తుకలు కోసుకున్నారు. చరిత్రలోకి జారిపోయారు.

నేను ప్రధానంగా శ్రీనాథులవారి నాధారం చేసుకొని వ్రాయాలనుకున్నాను. ఆయనను కొండవీటి రెడ్డి రాజుల నుండి విడదీయటం ఎవరివల్లా కాదు. అందువలన కొండవీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం అని వ్రాద్దామనుకున్నాను.



అనుకోవటమేగాని ఆరంభించలేదు. జీవితం పరుగుతీస్తున్నపుడు, ఆర్థిక స్తోమత చేతి కందాలనుకున్నపుడు, లలిత కళలు దూరంగా తొలగి నిలుస్తాయి. వాటిని సాదరంగా చూడక పోతే, అవి మన వంకే చూడవు.

1963లో వరంగల్ వద్ద ఇండియన్ ఆయిల్ కార్పోరేషన్ వారి డిపో నిర్మించ వలసి వచ్చింది. అప్పుడు ఓరుగల్లు కోట, వేయిస్తంభాల గుడి ఇంకా అనేక చారిత్రక ప్రదేశాలు చూశాను. ముఖ్యంగా ఓరుగల్లు కోట నన్నాకర్షించింది. నేలమీద పడిఉన్న శిలా తోరణాలు చూస్తున్నపుడు మనసు ద్రవించింది. కనులు చెమర్చాయి.

ఇప్పుడు యీ రచన చేస్తూ, ఆదృశ్యాన్ని స్మరిస్తున్నపుడు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి కీర్తి తోరణము లోని పద్యం గుర్తు వచ్చింది.

"కనులం బండువురా కళాశిఖర సాక్షాత్కార మీ కీర్తి తో
రణ శోభల్ కనుగొమ్ము - శ్రీగణపతీంద్ర స్ఫార బాహాగ్ర సం
జనితా ఖండ రమావిలాస దరహాసమ్ముల్ మహాంధ్రావనీ
జన రాసిక్య పతాకలై యెగురు ; నాచంద్రార్క మీ గడ్డ పై (3వ పుట)

ఎన్నో పర్యాయాలు మనసులో పరుగులు తీసిన యీ పద్యం నాలో ఒక ప్రశ్నను నిలిపింది. ఎవరీ గణపతింద్రుడు? కాకతీయులెవరు? ఈ ప్రశ్నకు సరియైన సమాధానం రాలేదు. ఇందుకు కారణం లేక పోలేదు. వెలమలు, రెడ్లు, కమ్మవారు కాకతీయులకు తామే వారసులమని, ఆ సామ్రాజ్యం నిలవటానికి తాము చాలా చేశామని అనటం చాలా పర్యాయాలు విన్నాను. ఆలోచించాను. చదివాను. తర్కించాను . ఎక్కడో పొరపాటు అంచనా ఉందనిపించింది.

ఐతే, నేను చేయాలనుకున్న రచనకు యీ విషయం ప్రధానాంశంకాదు. అందువలన కాకతీయుల కులం విషయం వదలి వేస్తున్నాను.

## ఓరుగంటి ఓటమి

కాని, ఓరుగల్లు సామ్రాజ్య సుస్థిరతకు, విస్తరణకు యీ మూడు కులాల వారు పూర్తిగా సహకరించారు. చివరకు రెండవ ప్రతాపరుద్రుని కాలం నాటికి వెలమలు, రెడ్లు తమలో తాము కలహించుకోవటం వలన తీరని నష్టం జరిగింది.

ఆంధ్ర దేశాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యం క్రింద పాలించిన వారు కాకతీయులు. క్రీ.శ. 900- 912 కు మూడు తరాల ముందు ప్రారంభమయినా, ముమ్మడి గుండన కాలంలో చరిత్రలోకి వచ్చారు. క్రీ.శ, 1200 తరువాత మహాసామ్రాజ్యంగా విస్తరించారు. క్రీ.శ. 1323లో రెండవ ప్రతాపరుద్రుడు ఉల్లూఖాన్ చేతిలో ఓడిపోయాడు. బందీగా చిక్కాడు. అంతటితో యీ పాలన అంతరించింది. అంతకుముందు 1309లో మాలిక్ కాఫర్ వరంగల్లును ముట్టడించాడు. ఆయనతో వచ్చిన అమీర్ ఖుస్రో "మట్టితో కట్టిన ఓరుగల్లు కోటలో బల్లెందిగదు. తుపాకిగుండు తూలిపోతుంది. " అన్నాడు.

ఇంతటి పటిష్ఠమైన కోట ఉండి రెండవ ప్రతాపరుద్రుడు ఎందువలన ఓడిపోయాడు? ఈ విషయం తెలుసుకోవటం అవసరం.

## పద్మనాయకులు

పలనాటిలో శీలం బ్రహ్మనాయడు అన్ని కులాలవారిని కలిపి "చాపకూడు" తినిపించి, సమానత్వం కల్పించాడు. వీర వైష్ణవం ప్రచారం చేశాడు. ఈ వివరాలన్నీ పల్నాటి వీరచరిత్రలో ఉన్నాయి.

కులవ్యవస్థకు వ్యతిరేకంగా వచ్చిన యీ ఉద్యమం, లేక సంస్కరణ వలన కలసి పోయిన వారిలో యోధులను ఎంపిక చేసి బ్రహ్మనాయడు సైన్యాన్ని నిర్మించాడు. ఆ సైన్యానికి మాల కన్నమదాసు సైన్యాధిపతిగా పనిచేశాడు. వీరందరూ వీర వైష్ణవులుగా, వీరులుగా చరిత్రలో పేరు తెచ్చుకున్నారు..

బ్రహ్మనాయని కాలంలోనే వెలమలున్నారు. రేచెర్ల దొడ్డనాయనికి, శీలమ్మకు కలిగిన బ్రహ్మన్న వెలమ వంశోద్భవుడు. పల్నాటి వీరచరిత్రలో బాల చంద్రుని మిత్రులు కుమ్మరివారి కుర్రవాడు, కంసాలి చందన్న, వెలమల దోర్నీడు, మంగలి మాధవుడు, చాకలిచందు, బ్రాహ్మణ అనపోతు, మొదలగు వారున్నారు. బాలచంద్రుడు తన తల్లికి

"సరవి నాలవజాతి జననంబు మాకు
వెలమల మైతిమి వీర జీవనత" (60పేజీ)

అని చెప్పటం చాలా ప్రాధాన్యతగల విషయం.

బ్రహ్మన్న యిలా వీర జీవనంలో ఉన్న వారందరికీ పద్మనాయకులని పేరుపెట్టినట్లు కన్పిస్తున్నది.

పల్నాటి యుద్ధానంతరం మరల కులవ్యవస్థ పుంజుకుంది. ఈ వీరులందరు పద్మనాయకులుగా మెలగవలసి వచ్చింది. అనగా అదోకులమయింది.

ప్రతాపరుద్రుడని పేరు పొందిన రుద్రుడు (1159-1195) ప్రోలయరాజు కొడుకు. ఈ రుద్రదేవుడు పద్మనాయకులను చేరదీశాడు. వారంతా విశ్వాసంతో పనిచేశారు. చివరకు ఒక కులంగా నిలచి పోయారు.

రుద్రుని పుత్రుడు కాకతి మహాదేవుడు (1195-1198) కొద్ది కాలమే పాలించాడు. దేవగిరి యాదవులతో పోరాడి చనిపోయి ఉండవచ్చును.

ఆ తరువాత గణపతిదేవుడు (1198 - 1262) పాలించినపుడు, వెలమలు సైన్యాధిపతులుగా ఉండి యుద్ధాలలో బాగా తోడ్పడ్డారు. రుద్రమదేవికి నమ్మిన బంట్లయినారు. ఆమె మనుమడు రెండవ ప్రతాపరుద్రుని కాలానికి ఆత్మీయులయ్యారు.

## రుద్రమదేవి

ఇక్కడో చిన్నవిషయం చెప్పుకుందాము. కాకతి గణపతిదేవుని కుమార్తె రుద్రమదేవి (1262-1291) సింహాసనాన్ని అధిష్ఠించినపుడు, ఆడది గద్దె నెక్కటమేమిటని కొందరు సామంతులు, సైన్యాధిపతులు ఎదిరించారు. చివరకు రుద్రమదేవి భర్త వీరభద్రుడు కూడా తిరగబడ్డాడు.

ఈ వీరభద్రుడు పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు పాలించే ఇందుశేఖరుని (1238-1255) రెండో కుమారుడు.

## రేచెర్ల వారు

ఆ కష్టకాలంలో రేచెర్ల ప్రసాదిత్య నాయడు రుద్రమదేవి పక్షాన నిలచి పోరాడాడు. అందువలన ప్రసాదిత్యునికి "కాకతిరాయ రాజ్యస్థాపనాచార్య" "రాయపితామహాంక"

బిరుదులు రుద్రమదేవి యిచ్చినట్లు "వెలుగోటి వారి వంశావళి చరిత్ర" తెల్పుతున్నది.

రుద్రమదేవి తరువాత రెండవ ప్రతాపరుద్రుడు (1291-1323) పాలించాడు. కాకతీయులలో చివరి రాజు ఈయనే.

ప్రసాదిత్యనాయని కుమారులు వెన్నమనాయడు, సబ్బినాయడు ప్రసిద్ధులుకారు. వెన్నమనాయని కుమారులు ఎఱ్ఱదాచానాయడు, నల్లదాచానాయడు.

ఆతరువాత దాచానాయనికి సింగమనీడు, వెన్నమనీడు, యాచమనీడు అను ముగ్గురు పుత్రులు కలిగారు. వీరిలో సింగమనీడు రెండవ ప్రతాప రుద్రుని వలన ఎనుబది వరాలను పొంది "అశీతి వరాల సింగమనాయడు" అనే పేరు పొందాడు.

ప్రతాపరుద్ర మహారాజు 1316లో కంచిని జయించాడు. అప్పుడు దాచానేడు శౌర్య పరాక్రమాలను చూపించినందున మహారాజు "పంచపాండ్య దళ విభాళ" అనే బిరుదునిచ్చి గౌరవించాడు. అప్పటినుండి రాచకొండవారు "పంచపాండ్య దళ విభాళ" బిరుదాన్ని వంశ పారంపర్యంగా వాడుకున్నారు. ఆ దండయాత్రలోనే రెడ్లు కూడా పాల్గొన్నారు.

ఈ వెలమలను కూడా పూర్వం రెడ్లు అనేవారు. కాని ప్రతాపరుద్ర మహారాజు వలన నాయకులుగా మారినట్లు వచన సోమదేవరాజీయములో ఉంది.

## రెడ్లు - నాయకులు

ఒకనాడు ప్రతాపరుద్ర మహారాజు, కొలువు కూటంలో సభా సదులతో ఇలా అన్నారు. "గణపతిదేవ మహారాజు నానా వర్ణాల వారికి నాయకత్వం యిచ్చారు. బహునాయకత్వం వలన అనాయకత్వంగా ఉంది. మానధనులును, అతి వివేక సంపన్నులును, గాంభీర్య సముద్రులును, మంత్ర వివేక దక్షులును, పాపభీరువులును, స్వామి హితానుచరులును, సచ్ఛూద్రులును నైన పద్మజులు నాయకత్వంబునకు దగుదురు" అనగా, సభాసదులు దేవర వారి సమ్మతం అన్నారు.

ప్రతాపరుద్రుడు పద్మజుల బిలిపించి, ఒక్కొక్క గోత్రమునకు ఒక్కొక్కని నేర్పరచాడు. ఇలా 77 గోత్రాల వారిని ఏకశిలానగర ప్రాకారంలోని 77 కోట బురుజులకు నాయకులను చేశాడు. వారి బంధువులకు నాయకత్వం యిచ్చి, పుట్టకోట బురుజులకు నియమించాడు. వారి తరువాత నాయకులకు, భూమి కోట బురుజుల మీద పదవులిచ్చాడు.

ఇతర జాతి నాయకులను త్యజించి వెలిపాళెంలో ఉండమన్నాడు.

ఈ వివరాలు, వచన సోమదేవరాజీయములో ఉన్నాయి.

ప్రతాపరుద్ర మహారాజు తన రాజ్యాన్ని 77 భాగాలుగా చేసి 77 మందిని పాలించేందుకు నియమించాడు. వీరిలో బ్రాహ్మణులు, రెడ్లు, వెలమలు, కోమట్లు, కమ్మవారు, క్షత్రియులు, కాయస్థులు మొదలగు అనేక కులాల వారున్నారు.

ఇక్కడ వెలమల సంగతి ఆపి రెడ్ల సంగతి చెప్పుకుందాం.

## రెడ్లు ఎవరు?

క్రీస్తు శకం ఏడవ శతాబ్దంలో ప్రతి ఊళ్లోను 'రట్టగుళ్లు' అనే వారుండేవారని శాసనాలు చెపుతున్నాయి. ఈ 'రట్టగుళ్లు' పదం రెడ్లుగా పరిణామం చెందింది. ఒక విధంగా గ్రామంలో పెత్తనం చేసేవారిని 'రెడ్డి' అని పిలిచినట్లు అనిపిస్తున్నది. ఇప్పటికీ 'రెడ్డరికం' చేస్తారనే మాట వాడుకలోఉంది. రెడ్డిగం వేసుకొని కూర్చున్నాడనేమాటా ఉంది.

క్రీస్తుశకం 632లో వేయించిన ప్రథమ విష్ణువర్ధనుని శాసనం చీపురు పల్లిలో ఉంది. అందులో "రాష్ట్రకూట ప్రముఖాన్ కుటింబినః" అనే ప్రసక్తి మొదటి సారిగా కన్పిస్తుంది. ఈ రాష్ట్రకూట ప్రముఖులనే 'రట్టగుళ్ళు' అనే వారు. 'కుటుంబినః' అనే పదానికి సేద్యం చేసేవాళ్ళు అని అర్థం చెపుతున్నారు.

అతి ప్రాచీన కాలంనుండి నాగలిపన్ని వ్యవసాయం చేసి జీవిస్తూ ఉండే కొందరిని పంట కాపులని పిలుస్తారు. వీరిలో కొందరు పంటలు పండించే రెడ్లుగా తరువాత పేరుపొంది పంటరెడ్లయినారు.

కాలంతో పాటు పంట రెడ్లలో కొందరు కాకతీయుల కాలానికి కత్తిపట్టి కదన రంగంలో దూకే దశకు చేరుకున్నారు. కొందరు సైన్యాధిపతులుగా, సామంతులుగా అనాటి చరిత్రలో నిలిచారు.

## స్పర్థలు

రెండవ ప్రతాపరుద్రుని కాలానికి వెలమలకు రెడ్లకు కక్షలు బాగా పెరిగాయి. ఉల్లూఖాన్ 1323లో ఓరుగల్లు మీద దాడి చేసినపుడు అనూహ్యామైన రీతిలో, ఆత్మ హత్యా సదృశంగా యీ కక్షలు బయటపడినాయి. ఏకాంబర్‌నాథ్ వ్రాసిన ప్రతాపరుద్ర చరిత్ర ప్రకారం భోజిరెడ్డి అనే వ్యక్తి పద్దెనిమిది లక్షలు తీసుకొని పార్శ్వ భంగం చేశాడు. గోన గన్నయ సేనాపతి నగరాధ్యక్షుడుగా ఉంటూ, ఆ క్లిష్టసమయంలో కోట ప్రధాన ద్వారం తెరిచాడు.

రెండవ ప్రతాపరుద్రుని వద్ద మంత్రిగా చేసిన గన్నయ నాయడు సకుటుంబంగా మహమ్మదీయులలో కలిసి, ఆమతం స్వీకరించాడు. ఓరుగంటికి వ్యతిరేకంగా పోరాడాడు. (కమ్మవారి చరిత్ర పుట151)

అనుకోని రీతిలో జరిగిన ఈ సంఘటనల వలన కాకతీయ సామ్రాజ్యం కుప్పకూలి పోయింది. ప్రతాపరుద్ర మహారాజు తురకల చేతిలో బందీ అయినాడు. ఇలాంటి సంఘటనే జరిగి కృష్ణదేవరాయల తరువాత తళ్లికోట యుద్ధంలో ముస్లిం సైన్యాధిపతుల విద్రోహం

వలన విజయనగరం ఓడిపోయింది. ముస్లింపాలకులచే విధ్వంసం చేయబడింది.

ప్రతాపరుద్రుని ఢిల్లీ తీసుక వెళ్తుండగా, నేటి హోషంగాబాద్ ప్రాంతంలో నర్మదానదిని దాటుతూ, అందులో దూకి ఆత్మ హత్య చేసుకున్నాడని చెపుతారు. కాదు, హత్య వలననో లేక ఆత్మ హత్య వలననో కత్తికి బలియైనాడనే మాట కూడా ఉంది.

ఇలా ముగిసింది కాకతీయ పాలన.

ఓరుగంటి మీద అనేక పర్యాయాలు తురకలు దండునడిపారు. ఎన్నిపర్యాయాలు వాళ్ళు వచ్చారనేది చరిత్రలో సరిగా లేదు.

1. ఖిల్జీ వంశపు అల్లా ఉద్దీన్ 1294లో దేవగిరిని జయించాడు. 1302 - 1303లో ఉలూక్ ఖాన్ అనే తన సైన్యాధిపతిని ఓరుగల్లు మీదకు పంపించాడు. రెండవ ప్రతాపరుద్రుడు వాళ్ళను ఓడించాడు.

2. 1309లో అల్లా ఉద్దీన్ మరల తన సైన్యాధిపతి మాలిక్కాఫర్‌ని పంపించాడు. అతను ఓరుగంటిని ముట్టడించాడు. లాభంలేదని సంధిచేసుకున్నాడు.

3. అల్లాఉద్దీన్ చనిపోయాక ఢిల్లీని కుతుబుద్దీన్ ముబారక్ షా పాలించాడు. 1318లో తనసేనాని ఖుస్రూఖాన్‌ను ఓరుగంటిమీదకు పంపించాడు. రెండవ ప్రతాపరుద్రుడు సంధి చేసుకున్నాడు. కాకతీయులకు స్వేచ్ఛాభంగం కాలేదు.

4. ముబారక్ షా తర్వాత ఘియాసుద్దీన్ తుఘ్లక్ ఢిల్లీ పాలించాడు. ఇతను తన కుమారుడు ఉల్లూఖాన్‌ను 1321 లో ఓరుగంటి మీదకు పంపించాడు. కాకతీయ సామ్రాట్ రెండవ ప్రతాపరుద్రుడు లొంగలేదు.

ఈ దండయాత్రలో తురకలలో అంతః కలహాలు ప్రారంభమయ్యాయి. ఉల్లూఖాన్ త్వరిత గతిని ఢిల్లీకి తిరిగి పోయాడు.

5. మరల ఉల్లూఖాన్ 1323లో ముట్టడించాడు. అంతఃకలహాలు, స్వామి ద్రోహాలవలన ఓరుగల్లు ఓడిపోయింది. కాకతీయ సామ్రాజ్యం కూలిపోయింది. ఓరుగల్లు సుల్తాన్‌పూర్ అయింది.

ఆపైన ముస్లిం సేనావాహిని దక్షిణ దేశాన్ని వశపరచుకొని, ఢిల్లీకి తిరిగి పోయింది.

6. మరల దండయాత్ర జరిపి కంపిలి, ద్వారసముద్రాలను ముట్టడించి, కంపిలిని స్వాధీనం చేసుకొని, పాలించాడు. తుగ్లక్ కొంతకాలం ఉండి, ఢిల్లీ తిరిగి పోయాడు.

7.తుగ్లక్ మరల దండుతో వచ్చాడు. దక్కన్ లోని స్వతంత్ర రాజ్యాలను అణగదొక్కాలనుకున్నాడు. కాని ఓరుగంటిలో ఉండగా మహామారి వ్యాధికి గురియై, చాలా భాగం సైన్యాలను, మంత్రులను, ఉద్యోగులను పోగొట్టుకున్నాడు. తాను కూడా వ్యాధిపీడితుడై తిరిగి పోయాడు.

ఇవి ప్రధాన దండయాత్రలు.

మనం ఓరుగల్లు పడిపోవటం చెప్పుకున్నాంగదా! ఇప్పుడు రేఖామాత్రంగా సాంఘిక చరిత్ర యితర విషయాలు ముచ్చటించుకుందాం. కొండవీడు, రాచకొండ మొదలైన రాజ్యాలను, వాటిమధ్య రగిలిన ద్వేషాలనేగాక మహనీయులైన ఎఱ్ఱన, శ్రీనాథ, పోతన మొదలైనవారి పలుకుబడులు, పర్యటనలను చెప్పుకోవాలి. ఆ పాలకులు, ఆ కవులు ఓరుగంటి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న వారే.

## స్త్రీల స్థానం

కాకతీయుల పాలనలో తొలిన్నాటి నుండి స్త్రీలకు మంచి స్థానం ఉంది. మిరియాల కామసాని పట్టుదలతో కాకతీయరాజ్యం నిలిపింది. మరో మహిళ రుద్రమదేవి, విశాల కాకతీయ సామ్రాజ్యాన్ని సమర్థంగా పాలించింది. శత్రువుల నెదుర్కొని వీరనారిగా పేరు తెచ్చుకుంది..

మనువు తర్వాత మొట్టమొదటగా స్త్రీకి ఆస్తిహక్కును గుర్తించింది కాకతీయుల కాలంలోనే.

## సాహిత్యం

కాకతీయుల పాలనలో సాహిత్యం సమగ్రతను సాధించింది. తిక్కనలాంటి మహనీయుడు ఆ కాలంనాటి వాడు కావటం, 15 పర్వాల భారతాన్ని నాటకీయంగా వ్రాయటం ఆంధ్రుల అదృష్టం.

జాయప, గణపతి దేవుని గజ సైన్యాధ్యక్షుడుగా ఉంటూ బావగారి పేర నృత్తరత్నావళి వ్రాశాడు. మరి రెండు గ్రంథాలు వాద్య రత్నావళి; గీతరత్నావళి వ్రాశాడని అనటమేగాని అవి యింతవరకు లభించలేదు.

## వీరశైవ కవులు

శ్రీపతి, శివలెంక మంచన, మల్లికార్జున పండితారాధ్యుడు అను ముగ్గురు ప్రతిభా మూర్తులు శైవమత పునరుద్ధరణ గావించారు. వీరిలో మల్లికార్జున పండితారాధ్యుడు అసమాన ప్రజ్ఞాశాలి. వీరి రచనలు వీరశైవానికి ప్రాణం వంటివి.

సంస్కృత పదాలను, సమాసాలను నింపుకొని ఛందోబద్ధంగా తెలుగు కవిత్వం బిర్రబిగుసుక పోసాగింది. మరోవైపు జాను తెనుగులో, పాండిత్య ప్రకర్ష సాముగరిడీలు లేకుండా, తన సహజ సౌందర్యాన్ని విన్యసిస్తూ తెలుగు కవిత వెలువడింది. దీనికి వీరశైవమతం దోహదం చేసింది.

## గోన బుద్ధరాజు

ద్విపద, శతకం, గేయం, యక్షగానం వంటి నూతన రూపాలు బాగా వృద్ధి చెందాయి. మొదటిసారిగా "ఉడతా భక్తి"ని గ్రంథస్థం చేసిన వాడు గోన బుద్ధరాజని ఆరుద్ర "ఉడతా భక్తి" పదాన్ని నొక్కిచెప్పారు. గోనబుద్ధరాజు పాడుకోటానికి వీలుగా ద్విపదలో రామకథ చెప్పాడు. దీనినే రంగనాథ రామాయణమని ప్రజలు పిలుస్తారు.

"గోన గృహనామము గలవారికి సంబంధించిన పశువుల గోత్రముల బిరుదులను బట్టి, గోనవారికి మల్యాలవారికి, విరియాల వారికి బంధుత్వమున్నట్లు తెలిపే శాసనాలు ఉన్నాయి. ఇందువలన గోన బుద్ధ భూపతి ప్రభృతులు పద్మనాయకులు మాత్రమేనని చెప్పవచ్చు. వీరు రెడ్లు అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాశారు. అది నిజం కాదని వినయంగా భావిస్తున్నాను" అంటారు మిత్రులు కోటగిరి విశ్వనాథరావు గారు.

గోన బుద్ధ భూపతి, ఆయన కొడుకులు కాచ భూపతి, విఠల భూపతి వ్రాసిన రంగనాథ రామాయణం సామాన్యుల కొరకు రచించబడింది. ద్విపదలో తీయ తీయగా రచన చేయబడింది.

## తెనుగు నుడికారం

అంకితం పుచ్చుకోవటం కాకతీయుల కాలంలోనే ప్రారంభమయింది. కవులు తమ కావ్యాలను కన్యకలుగా భావించి, అంకితం యిచ్చి, వారివద్ద నుండి అనేక విధాల లాభాలు పొందుతుండేవారు.

కాకతీయ యుగానికి సంబంధించిన మూల ఘటిక కేతన తెలుగు భాషను గూర్చి చెప్పిన పద్యాన్ని మనమందరం గుర్తుంచుకోవాలి. తెలుగు భాషా పరిణామాన్ని ఈ పద్యం వివరిస్తుంది.

తల్లి సంస్కృతంబు యెల్ల భాషలకును - దాని వలన కొంత కానబడియె
కొంత తానగలిగె, నంతయు నేకమై - తెనుగు బాసనంగ వినుతికెక్కె. ( 14 )

కేతన వ్రాసిన ఆంధ్ర భాషా భూషణంలో యీ పద్యం ఉంది. "కేతన వ్రాయటానికి ముందు తెనుగు భాషకు వ్యాకరణం తెనుగు లో గాని, సంస్కృతం లో గాని లేదనే చెప్పాలి" అంటారు ఆరుద్రగారు తమ సమగ్రాంధ్ర సాహిత్యం - రెండవ సంపుటి - పుట 156లో. కాని నన్నయగారు తెనుగు వ్యాకరణాన్ని సంస్కృతంలో వ్రాశారనే మాట బహుళ ప్రచారంలో ఉంది.

ఇంకా చాలామంది ప్రముఖ రచయితలున్నారు. ఇక్కడ వారందరినీ చెప్పటం కుదరదు.

## శిల్ప సౌందర్యాలు

ఆనాటి శిల్పానికి ప్రతీక రామప్ప దేవాలయం. వరంగల్లు లోని వేయిస్తంభాల మండపం, కీర్తితోరణాలు, నందులు అని చెప్పవచ్చును. నల్లగొండ దగ్గరున్న ఛాయాసోమేశ్వరాలయం సాంకేతికంగా చాలా గొప్పది. ఆకాశంలో వెలుతురున్నపుడు శివలింగానికి వెనుక గోడమీద నిలువెత్తు నీడ కదలకుండా, సూర్యగమనంతో చెదరకుండా ఉండటం మన శిల్పుల ప్రతిభకు ప్రతీక. ఇలాగే ఆ ప్రాంతంలోని పచ్చల సోమేశ్వరాలయం అందంగా ఉంటుంది.

## జైన, బౌద్ధాలు

బౌద్ధం పేరుకు మాత్రమే మిగిలింది. జైనం కూడా దాదాపు బౌద్ధం మాదిరిగానే ఉంది. తిక్కన గారైతే హనుమకొండలో బౌద్ధులతోను, జైనులతోను వాదించారు. వారిని ఓడించారు. బౌద్ధ, జైనుల వసతుల్ని కూలగొట్టించారు. వాళ్లను వెళ్లగొట్టించారు. ముప్పై ఆరు జైనమునుల వసతులను కూల ద్రోయించి, ఆ జైనులందరిని నరికించి, చంపి, చెండాడి తిక్కన గారు తృప్తిపడ్డారు.

## వీరశైవం

వీరశైవం విజృంభించింది. వీరశైవంలో కులభేదాలు లేవు. అందరూ సమానులే. కలిమిలేముల పట్టింపులేదు. పురిటిమైల, చావు మైల పాటించరు. శివ భక్తుడైతే చాలు అన్ని విధాలా ఆరాధ్యుడే.

విపరీతమైన వీర మతావేశంలో, తమ వాదనను కాదన్న వారిని నిలువునా చంపటమే గాక, రాతి గానుగలలో వేసి ఆడించారు. నానా హింసలు పెట్టారు. ముస్లింల జెహాద్‌ను మించిన విపరీత చర్యలు చేశారు.

శివ ప్రీతికొరకు తమ అంగాలను తెగనరికి అర్పించేవారు. చివరకు శిరస్సు కూడా నరుక్కునేవారు.

శివభక్తుల వీర కృత్యాలను తెలిపే వీరశిలలు, వీరగల్లులు ఆంధ్ర దేశంలో అక్కడక్కడా కన్పిస్తాయి.

శత్రు దండయాత్రల నెదిరించి, పోరాడి అశువులర్పించిన స్త్రీ, పురుష వీరుల పేరునకూడా కొన్ని వీరగల్లులున్నాయి. ఇవి మత సంబంధమైనవి కావు.

పరమత హింస, పరమత అసహనం దారుణంగా వీరశైవులు అమలు పర్చారు. ఈ ద్విపద పాదాలు చూడండి.

"జన సమయ మతస్థ శిరముల కోసి - మును విష్ణు సమయుల ముక్కులు కోసి
అద్వైతులను హతా హతముగా ద్రోలి - విద్వేష వాదుల విటతాట మార్చి
చార్వాక వాదుల గర్వం బడంచి - సర్వేశు భక్తియే యుర్వి నిష్ఠించి"
( బసవ పురాణం వావిళ్ల వారి ప్రచురణ. 1952 )

ఇలా సాగింది వీరశైవ మతం.

అహింసను బోధించే మతాలను కూడా సహించలేక పోయిన వీరశైవం, తమను కాదన్న వారందరినీ హింసించి, నాశనం చేసింది. మిండజంగాల ప్రవర్తన, మితిమీరి వెర్రితలలు వేసిన శివ భక్తి ఉన్నా, వీరశైవం చతుర్వర్ణ వ్యవస్థను పెను తుఫానులా గజగజలాడించింది. చివరకు తుఫానులా తొలగిపోయింది.

ఇంత చేసినా శివకేశవుల అభేదరూపాన్ని ఆరాధించేవారు ఉండటం విశేషం. తిక్కన కూడా శివకేశవ రూపాన్ని ఆరాధించిన భక్తుడు.

## పాలన - నీతి శాస్త్ర గ్రంథాలు

కాకతీయులు తమ రాజ్యాన్ని నాడులుగా విభజించి పాలించారు. వేగినాడు, వెలనాడు, కమ్మనాడు, పాకనాడు, రేనాడు, ములికినాడు, ఏరువనాడు, పూంగినాడు మొదలైన నాడులుండేవి.

ఈ యుగంలో అనేక నీతి శాస్త్ర గ్రంథాలు వెలిశాయి. ప్రతాపరుద్రుని నీతి సారం, బద్దెన వ్రాసిన నీతి శాస్త్ర ముక్తావళి, కేతన రచన విజ్ఞానేశ్వరీయం యిలా చాలా వచ్చాయి.

యాజ్ఞవల్క్య మహర్షి మూడు కాండలతో ఒక ధర్మ శాస్త్రం వ్రాశాడు. దీనిని యాజ్ఞవల్క్య స్మృతి అని పిలుస్తారు. విజ్ఞానేశ్వరుడు దీనికి మితాక్షరి అనే పేరుతో వ్యాఖ్యానాన్ని వ్రాశాడు. దీనిని మూలఘటిక కేతన తెలుగులో వ్రాశాడు.

ఈ ధర్మశాస్త్రం వలన ఆనాటి సాంఘిక చరిత్ర తెలుస్తున్నది. హిందూధర్మ శాస్త్రానికి సాధికార గ్రంథంగా అంతర్జాతీయ న్యాయశాస్త్రవేత్తలు మితాక్షరిని పరిగణిస్తారు.

## నృత్యాలు - జాయప

శిల్పాలకు, నృత్యాలకు ఈ యుగం మంచి ప్రోత్సాహాన్నిచ్చింది.

కాకతీయులకు దీటైన రాజులు దేవగిరిని పాలించిన యాదవులు. యాదవరాజైన సింఘణ దేవుని (1210-1247) కొలువులో ఉన్న శార్ఙ్గదేవుడు రాజు ప్రోత్సాహంతో సంగీత రత్నాకరము వ్రాశాడు. ఈ రచన లో ఏడవ అధ్యాయము నృత్యాధ్యాయము.

సింఘణదేవుని సమకాలీనుడైన గణపతిదేవ సార్వభౌముడు (1198 - 1262) తన బావమరిది ఐన అయ్యకులస్థుడు జాయపను ప్రోత్సహించి 'నృత్తరత్నావళి' వ్రాయించాడు.

జాయపను గూర్చి ఇంద్రగంటి వారు తమ కీర్తి తోరణములో మంచి పద్యం వ్రాశారు. చూడండి.

సరస హృదంతరుండు గజసాహిణి జాయప యుద్ధ యాత్రలో
చరచర నేస్తులన్ బరప జాలుటె గాదు - మనోజ్ఞసుందరీ
చరణ సరోజ రాగ పరిచాలన ఖేలన నాట్య మాధురీ
గురుడయి కాకతీయ సభకున్ మణి భూషణమై యెసంగెడిన్ ( పుట ౧2 )

జాయప వ్రాసిన నృత్తరత్నావళి వలన కాకతీయుల కాలంలోని అనేక నృత్త, నృత్య వివరాలు, నటీనటుల ఆహార్యాలు, రంగాలంకరణలు, ఆటతీరులు, తెరలు, ఆంగికాభినయాలు చాలా వివరంగా తెలుస్తున్నాయి.

దేశి నృత్యాలలో ఆయన ఛండాలిక నృత్యాన్ని నర్ణించటం, వీరశైవ ప్రభావం వలన నే జరిగిందని భావిస్తున్నాను.

దేశి నృత్యాలలో పుష్పాంజలి మొదలు పేరణి, ప్రేక్కణ, రాసకము, చర్చరి, నాట్య రాసకము, దండ రాసకము, శివ ప్రియము, చింతు, కందుక నృత్తము, భాండికము, ఘటిసణీ నృత్తము, చారణ, బహురూపము, కొల్లాట మొదలగు నృత్తాలను వివరించాడు.

ఈ వివరాలు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ప్రచురించిన నృత్తరత్నావళిలోని 7వ అధ్యాయంలో ఉన్నాయి.

జాయప నృత్త రత్నావళిలో "దానిని మేము గీత రత్నావళి యందు వివరించితి" మన్నందున, గీతరత్నావళి వ్రాశాడని తెలుస్తున్నది. (పుట 287)

ఇలాగే వాద్యరత్నావళి కూడా రచించాడని చెపుతారు. కాని, యీ రెండు గ్రంథాలు యింతవరకు లభించలేదు.

నాట్య గ్రంథాలేగాక, విద్యానాథుని "ప్రతాపరుద్ర యశోభూషణం" యీనాటికీ ప్రామాణిక అలంకార శాస్త్రం. ఇది రెండవ ప్రతాపరుద్రుని నాయకునిగా జేసి చెప్పిన సాహిత్య లక్షణ గ్రంథం.

## ప్రజలు

సాంఘికంగా స్త్రీ, పురుషులు సమాన స్థాయిలో ఉండేవారు. చక్కగా అలంకరించుకొని, తనివితీర జీవితాన్ని అనుభవించారు.

భోగులు పుష్పాలు ధరించేవారు. సుగంధ ద్రవ్యాలు వాడేవారు. తాంబూలం సేవించేవారు.

అప్పన మంత్రి తాను వ్రాసిన చారుచర్యలో ఈ విషయాన్ని వివరిస్తూ చక్కని పద్యం చెప్పాడు.

గేదగి పువ్వు దాలిచి సుఖింతురు మేలు జవాది పూసి హృ
న్మోదముగాగ గన్నెరులు, మొల్లలతో వకుళ ప్రసూనముల్
జాదులు పాటలంబులును సంపెగలున్ శతపత్రకంబులున్
శ్రీ దనరారు భోగులు ధరింతురు కస్తురి గూర్చి వేడుకన్. (12వ పద్యం)

"భోగ పురుషులు గేదగి పూలు, గన్నేరు పూలు, మొల్లలు, వకుళాలు, జాజిపూలు, సంపెంగలు, పద్మాలు, కస్తూరి వాటితో కలిపి అలంకరించుకునేవారు.

వేసవి రాత్రులలో జాణలు ఎలాంటిపూలు ధరించి, సువాసనా జలాలను చల్లుకొని, ఆనందించేవారో ఆయనే వివరించాడు.

శీతాకాలంలో వెచ్చదనాన్నిచ్చే పూలను అలంకరించుకునేవారు.

ఇలాంటి సుఖమయ జీవితమంతా సంఘంలోని పైతరగతుల వారిదేననే మాట మనం మరచిపోరాదు.

## కుల వ్యవస్థ

కులవ్యవస్థ బిగుసుకుపోవటం యీ యుగంలో ప్రారంభమయింది. ఐతే, అనేక కులాలవారు రాజ్యపాలన చేశారు. అలాంటివారు బ్రాహ్మణులకు విరివిగా దానాలిచ్చి పోషించేవారు. అందుకు తమ కృతజ్ఞత తెలుపుకోను ఆ పురోహితులు ఆ ప్రభువులకు క్షత్రియకులం యిచ్చి అసత్యపు వంశ వృక్షాలను తయారు చేసేవారు.

ఐనా పాత వాసనలు పోయేవికావు. సంవత్సరంలో ఒకమారు వెనుకటి బలి పూజలు, త్రాగుడు, విందులు, విలాసాలు అనుమతించేవారు. ఈ ఆచారం యీ మధ్యకాలం వరకు ఉంది.

## న్యాయస్థానాలు

కులాన్ని బట్టి శిక్ష విధించేవారు. తెల్లవాళ్ల పాలన వచ్చేదాకా యీ దారుణకాండ సాగుతూనే ఉంది. ముస్లిం పాలనలో యిది తగ్గింది.

ఏ విధమైన పత్రము, సాక్ష్యము లేనపుడు తీర్పు చెప్పేచోట విచిత్రమైన పరీక్షలు పెట్టేవారు. ఈ పరీక్షలు ఐదురకాలుగా ఉండేవి. తుల, అగ్ని, జల, విష, కోశం అనే పద్ధతుల నమలుపర్చేవారు.

బ్రాహ్మణులకు తులాపరీక్ష, క్షత్రియులకు అగ్నిపరీక్ష, వైశ్యులకు జలపరీక్ష, శూద్రులకు విషపరీక్ష ఉండేవి. ధర్మం పేర యింతటి అన్యాయం జరిగేది.

మరికొంత వివరిస్తేగాని దీని లోతుపాతులు తెలియవు.

నేరం చేసినవాడు బ్రాహ్మణుడైనపుడు త్రాసులో ఎక్కించి, ఇటుకలతో బరువు

తీసుకుంటారు. కొన్ని రోజులు గడచిన తర్వాత, గడువురోజున, మరల తూస్తారు. అలా తూకం వేస్తూ "దేవతలారా! ఇతడు శుద్ధుడైతే ఎత్తండి; హీనుడైతే దించండి" అంటారు. ఆ తూకాన్ని బట్టి న్యాయం నిర్ణయిస్తారు.

శూద్రునికి విషపరీక్ష పెడతారని చెప్పానుగదా! ఆ విషయం కూడా వివరంగా చెప్పుకుందాం.

క్రొత్త కుండలోన క్రూర సర్పము నిడి - యర్చితముగ జేసి యందులోన
నిమ్మపండు వేసి నెమ్మితో తివియంగ - శోధ్యుడైన వాడు శుద్ధుడయ్యె

(కేతన విజ్ఞానేశ్వరీయం 3-121)

కొత్తకుండలో క్రూర సర్పాన్ని ఉంచి, నిమ్మకాయ కుండలో వేస్తారు. నిందితుడైన శూద్రుడు దాన్ని తీయాలి. అలా తీస్తే శుద్ధుడవుతాడు. పాముకరిస్తే చనిపోతాడు.

కేతన తన విజ్ఞానేశ్వరీయంలో మరో శిక్షను గూర్చి చెప్పాడు.

ఎవరైనా సరే తన కులంవాడి భార్యను చెరిస్తే వేయి ఫణాలు జరిమానా కట్టాలి. తన కులం కన్న తక్కువ కులం వాడి భార్యను చెరిస్తే ఐదువందల ఫణాల శిక్షతో సరిపోతుంది. ఇదీ ఆనాటి సాంఘిక న్యాయం.

## ఓటమికి కారణాలు

ఇంతటి వ్యత్యాసమున్న హిందూ సమాజంలో, కుల వ్యవస్థ లేని ఇస్లాం నవాబులు దండెత్తి ఇక్కడి రాచరికాలను కూలద్రోసి తమ పాలనతోపాటు మత వ్యాప్తి చేసుకోవటం చాలా తేలికయింది. భారతదేశంలో హిందూరాజులు అధిక సైన్యం కలిగినా ఓడిపోవటానికి యీ వర్ణ వ్యవస్థ ఒక ప్రధాన కారణం. రెండవది సరియైన ఫిరంగి సైన్యం లేక పోవటం. మూడవది హిందూ రాజులు స్వాభిమానాన్ని వదలి నవాబులతో కలసి తమవారినే ఓడించటం.

ఇలా అని నేను భావిస్తున్నాను.

## వీర శైవ ఉద్యమం

కుల వ్యవస్థ పైన వచ్చిన ఏ ఉద్యమము కూడా తాత్కాలిక విజయాలను మాత్రమే సాధించింది గాని సమూలంగా దాన్ని మార్చలేకపోయింది.

వీరశైవాన్ని ప్రచారం చేసిన పండితారాధ్యుడంతటి మహనీయుడు కూడా "భక్తి మీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు, బాయలేను నేను బసవలింగ" అన్నాడు.

బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర, వృషాధిప శతకము రచించి, వీరశైవాన్ని ప్రచారం చేసిన పాల్కురికి సోమన మహాకవి ప్రజలకనుకూలంగా ఉండాలని జాను

తెనుగులో ద్విపద నాధారం చేసుకొని, రచనలు చేశాడు. అన్యమతాలమీద దూకుడు సాగించాడు.

ప్రజల అజ్ఞానం, రాచరిక దోపిడి, హిందూ గురువుల చాతుర్వర్ణ్య ప్రచారం, నరనరాన జీర్ణించుకున్న మూఢ నమ్మకాలు, తాత్కాలికంగా కంపించినా, వీరశైవుల సర్వకుల సమానత్వం నిలబడలేకపోయింది. అంతకంతకు కులాలలో శాఖలు ఏర్పడి, అనూహ్యమైన రీతిలో సమాజం చీలికలు, పీలికలయిపోయింది.

వీర వైష్ణవం, వీర శైవం ప్రభావితం చేసి, పద్మ నాయకులను, జంగాలను, దాసరులను తయారు చేసింది.

## మరికొన్ని సంగతులు

ఈ కాలంలోనే దేవాలయాల మీద బూతు బొమ్మలు చెక్కించటం ప్రారంభమయింది. గ్రామ దేవతలను కొలవటం, తామస పూజలు విరివిగా ఉండేవి.

వ్యభిచారానికి రాజపోషణ ఉంది. ఉన్నత కులాలవారు పోషించి, అనుభవించి, ఆనందించారు. దేవాలయాలలో దేవదాసీల పద్ధతులు ప్రారంభమయ్యాయి.

మరోవైపు "శత్రువుల రక్తంతోను, వారి భార్యల కన్నీళ్లతోను నేల తడవకపోతే రాజుకు గొప్పేముంది? ప్రతిష్ఠేముంది?" అనే ఆలోచన బలంగా ఉండేది. బద్దెన తన నీతిసార ముక్తావళిలో యీ మాటే వ్రాశాడు.

"పరాజయాన్ని మించిన దుఃఖం, విజయాన్ని మించిన ఆనందం ఉండదు. కాబట్టి లక్ష్యసాధనకు ఏ మార్గాన్నైనా అవలంబించవచ్చును. యుద్ధంలో విజయం పొందటంతో పాపాలన్నీ పరిహారమయిపోతాయ"ని కామందక నీతిసారం చెపుతుంది.

## వ్యవసాయాభివృద్ధి

వ్యవసాయానికి ఉత్తర దేశ బ్రాహ్మణులు అధిక సంఖ్యలో కోస్తా ఆంధ్ర ప్రాంతానికి వలస వచ్చారు.

గణపతి దేవుని ముఖ్యమంత్రి అయిన బియ్యాన నాయకుని కుమారుడు జగదల ముమ్మడి పాకాల చెరువు నిర్మించాడు. రెండు కొండల్ని కలుపుతూ రెండువేల గజాల పొడవున కట్ట పోసి, పాకాల వాగును అడ్డగించి యీ చెరువు నేర్పరచాడు.

రుద్రారెడ్డి రామప్ప చెరువును నిర్మించాడు. బయ్యారం చెరువు కాకతీయ రాజ కుటుంబానికి చెందిన మైలమ్మ నిర్మించింది. వరంగల్లు జిల్లాలోని లక్నవరం మరొకరు నిర్మించారు.

పెద్ద పెద్ద చెరువులే గాక తటాకాలు, నూతులు, కాలువలు త్రవ్వించారు.

## కట్టుబాట్లు

వ్యవసాయపు కట్టుబాట్లు చక్కగా ఉండేవి. నిర్లక్ష్యంగా పశువులను ఎవరి చేలోనైనా తోలితే నష్టపరిహారం చెల్లించాలి. ఏడాది మధ్యలో పాలేరు మానేస్తే తీసుకున్న బయానా తిరిగి యిచ్చివేయాలి. యజమాని మాన్పిస్తే చేసిన రోజులకు జీతం యివ్వాలి. చేనుకు, యింటికి, కోటకి, ఊరికి, గాదెలకు, గోభూమికి నిప్పు పెట్టినవానిని చంపివేయాలి.

కాకతీయుల కాలంలో తలపన్ను ఉండేది. దానినే బుర్రసుంకం అనేవారు.

## స్త్రీ ధనం

విజ్ఞానేశ్వరీయం స్త్రీ ధనాన్ని గూర్చి స్పష్టంగా నిర్వచించింది. "తండ్రి దివాలా తీస్తే కూతుళ్లకి కనీసం తల్లి ఆస్తిని యివ్వాలి. "స్త్రీ ధనం కేవలం కూతుళ్లకు, మనుమరాళ్లకు మాత్రమే.సంక్రమిస్తుంది." "పెనుగాలులు, రోగాలు, ఆపదలు వస్తేను, ప్రభుత్వావసరం వస్తేను తప్ప స్త్రీ ధనాన్ని భర్తకూడా ముట్టరాదు."

చాలా చెప్పానుగాని, చెప్పవలసినది ఎంతో ఉంది. నా ప్రధానోద్దేశం కాకతీయ యుగం తర్వాత వచ్చిన వారికి అందించిన సాంఘిక జీవనం, కళలను గూర్చి చెప్పటమే. మరో మాట చెప్పాక ముందుకు కదులుదాము.

## విదేశీ వ్యాపారం

తూర్పు తీరంలో మోటుపల్లి గొప్ప ఓడరేవు. దీనిని 'దేశీయక్కొండ పట్టణం' అనేవారు. గణపతి దేవుడు అభయ శాసనం వేయించి, నౌకా వ్యాపారాన్ని బాగా ప్రోత్సహించాడు. "నా ప్రాణంకన్నా నా ప్రజల రక్షణ నాకు ముఖ్యం. సముద్ర వ్యాపారుల మీద దయకొద్దీ కొత్త పన్నులన్నీ తీసివేశాము." అన్నాడు గణపతి దేవుడు.

గణపతి దేవుని కాలంలో పెదగంజాం గ్రామానికి వాయవ్యంగా మూడు కిలోమీటర్ల దూరంలో నాలుగు కుంచాల మేర చదరంలో ఫరంగీలు యిళ్ళు కట్టుకున్నారు. వ్యాపారం చేశారు. బాగా బలపడ్డారు. మెకంజీ కైఫీయతు వల్ల యీ విషయాలు తెలిశాయి. క్రీ.శ.1224లో స్వభాను సంవత్సరం, అశ్వయుజ బహుళ తదియ మంగళవారం నాడు వచ్చిన ఉప్పెనలో ఆ గ్రామం తుడుచుకపోయింది. కొద్ది యిళ్లు దేవాలయం తప్ప ఏమీ మిగలలేదు.

ఇలా విదేశీయులు వచ్చి వ్యాపారాలు చేసేవారు. బర్మా, సింహళం, చైనా, తూర్పు యిండియా దీవులు, అరేబియా, పెర్షియా, ఈజిప్టులతో నౌకా వ్యాపార సంబంధాలుండేవి.

## కాకతీయుల తరువాత

కాకతీయుల కథ చెప్పుకున్నాము. ఆ అల్లకల్లోల పరిస్థితులలో కమ్మనాయకులు,

రెడ్డి ప్రభువులు ఏమి చేశారో చెప్పుకుందాము.

ఢిల్లీని ఘియాజుద్దీన్ తుగ్లక్ పాలిస్తున్నపుడు అతని కుమారుడు ఉలుఘ్‌ఖాను కాకతీయుల రాజధానిని ముట్టడించి 1323లో స్వాధీనం చేసుకోవటం జరిగింది. ఆ తర్వాత తుగ్లక్ కొండపల్లి, నెల్లూరు, కొండవీడు, కొలనువీడు, నిడదవోలు, రాజమహేంద్ర వరము స్వాధీనం చేసుకున్నాడు. క్విలన్, మలబార్ ప్రాంతాలను, తమిళ దేశంలోని మధురను వశపరచుకున్నాడు. మధుర రాజధానిగా జలాలుద్దీన్ హసన్ షాను నియమించి తుగ్లక్ వెనుదిరిగాడు. ఓరుగంటి నగరానికి "సుల్తాన్ పూర"ని పేరు పెట్టాడు.

తన తండ్రి ఘియాజుద్దీన్ బంగాళ దేశం మీద దండెత్తి వెళ్తూ, తనను రమ్మన్నందున ఉల్లూఖాన్ ఢిల్లీ వెళ్లాడు. ఈ విషయం కొంతవరకు చెప్పుకొని ఉన్నాము.

1324-25 సంవత్సరాలలో తెలుగు నాయకులంతా ఒకరి నాయకత్వాన నిలబడి తురకలతో పోరాడాలనుకున్నారు.

## అధ్యక్షుడు ప్రోలయ

ఆంధ్రదేశంలో తుగ్లక్ పాలనయే మొదటి ముస్లిం పాలన కావటం వలన జన జీవనంలో ఎన్నో కొత్త యిబ్బందులు కలిగాయి.

ఓరుగల్లు యుద్ధములో ప్రతాపరుద్రుని సేనానులు, రాజకీయోద్యోగులు, దాదాపు అందరూ మరణించారు. కాని ప్రధానంగా ముగ్గురు ప్రముఖులు మిగిలియున్నట్లుగా శాసనాల వలన, సాహిత్యం వలన తెలుస్తున్నది. వారు బెండపూడి అన్నమంత్రి, కొలని రుద్రదేవుడను ప్రతాపరుద్రుడు, రేచెర్ల సింగమనేడు.

బెండపూడి అన్నమంత్రి రెండవ ప్రతాపరుద్రుని గజసాహిణి.

ఆంధ్రదేశం నుండి తురకలను పారద్రోలి, పూర్వ వైభవాన్ని సంపాదించి, నిలబెట్టాలని ప్రముఖులందరు ఆలోచించారు.

బెండపూడి అన్నమంత్రి, కొలని రుద్రదేవుడు, ప్రోలయ వేమారెడ్డి, మంచికంటి గణపతి దేవుడు, రేచెర్ల సింగమనీడు, ఇంకా అనేక మంది తెలుగు నాయకులు ఏకమై, ఒక్క త్రాటిమీద నిలచి, ముసునూరి ప్రోలయనాయకుని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఆయన నాయకత్వంలో తురకలను పారద్రోలి హిందూ ధర్మాన్ని నిలబెట్టాలని నిశ్చయించుకున్నారు.

## కమ్మ ప్రోలయ (1325-1333)

ముసునూరి వంశంలో జన్మించిన పోతా నాయకునికి (1) పోచా నాయకుడు (2) దేవ నాయకుడు (3) కామ నాయకుడు (4) రాజ నాయకుడు అనే నలుగురు పుత్రులు కలిగారు.

పోచానాయకునికి ప్రోలయ నాయకుడు, ఎఱ పోతానాయకుడు అనే ఇరువురు కుమారులున్నారు.

ఈ ముసునూరి ప్రోలయ నాయకుడే, స్వాతంత్ర్యోద్యమానికి అధ్యక్షుడయ్యాడు.

దేవనాయకునికి కాపయ నాయకుడు, ముమ్మడి నాయకుడు అనే యిద్దరు పుత్రులు కలిగారు.

ముసునూరి ప్రోలయ నాయకునికి, అతని పినతండ్రి కుమారుడైన కాపయ కుడిభుజంగా పనిచేశాడు.

కామ నాయకునికి దేవ నాయకుడనే కుమారుడున్నాడు. నాలుగవ వాడైన రాజ నాయకునకు అనపోత నాయకుడనే పుత్రుడు కలిగాడు.

ఇలా మూడవ తరంలో పెద్దవాడైన ప్రోలయ నాయకునికి పినతండ్రుల బిడ్డలైన (1) కాపయ నాయకుడు (2) ముమ్మడి నాయకుడు (3) దేవ నాయకుడు (4) అనపోత నాయకుడు (5) స్వంత తమ్ముడైన ఎఱపోతా నాయకుడు స్వాతంత్ర్యోద్యమంలో అపూర్వంగా సహకరించారు.

## ఇతర పాలకులు

ఏలూరు నుండి సింహాచలం వరకు ఉన్న ప్రాంతం ఇందులూరి రుద్రదేవుని పాలనలో ఉంది. ఈయన క్రింద పిఠాపురం రాజధానిగా కొప్పులవారు, కొఠాము, తత్పరిసర ప్రాంతాలను పాలిస్తున్నారు. కోరుకొండ రాజధానిగా ముమ్మడి నాయకుడు, తొయ్యేరు ముఖ్య నగరంగా ముసునూరి కాపయ నాయకుని సోదరపుత్రుడు అనపోతరెడ్డి పాలించారు. రేకపల్లి కేంద్రంగా యిప్పటి భద్రాచలం, పాలవంచ ప్రాంతాలు ముసునూరి ప్రోలయనాయకుడు పాలించాడు. ఆమనగల్లు రాజధానిగా కాపయ నాయకుడు నాయకత్వం వహించాడు.

కమ్మనాటిలో చెఱకు వంశపు రెడ్లును, పల్నాటి సీమయందు దేవరినాయకుడును తంగెడయందు శ్రీగిరినాయడును, వెలనాటి యందు సోమయాజుల రుద్రసేనానియు, వర్ధమానపురము నుండి గోన వంశపు రెడ్లును, పాకనాటిలో ముప్పిడి నాయకుడును, ములికినాడు, రేనాడు, పెన్నాతవాడి, సకలి, ఏఱువ, పొత్తపినాడు, మార్జవాడి మొదలైన దక్షిణాంధ్ర భూములను జుట్ల యల్లంక, గొంకారెడ్డి గారలును, ఇంకను అనేకమైన నాయకులును కాకతీయ రాజ్యమందలి ఇతర భాగాలను తమ తమ స్వాధీనాలలో ఉంచుకున్నారు. ఓరుగల్లు దుర్గం తురకల వశమైనా యితర సామ్రాజ్య భూములు వారి స్వాధీనం కాలేదు. వారి పాలన పల్లె సీమలకు పాకలేదు. ఎక్కడికక్కడ చిన్న రాజ్యాలు తలచూపాయి. ప్రోలయ క్రింద పని చేశాయి.

కోనసీమలోని సారవంతమైన విలస గ్రామాన్ని ప్రోలవరమని పేరు పెట్టి వెన్నయకు అగ్రహారంగా ప్రోలయ యిచ్చాడు.

1324 నుండి ప్రారంభమైన స్వాతంత్ర్య పోరాటం 1325కు ఒక రూపు సంతరించుకుంది. 1325లో ప్రోలయ రేకపల్లి నుండి పోరాటాన్ని తీవ్రం చేసి, కొలది కాలంలోనే సముద్రతీరాంధ్ర దేశాన్ని విముక్తి గావించాడు.

ఈ విషయాలు అద్దంకి నుండి పాలిస్తున్న ప్రోలయ వేమారెడ్డి వేయించిన మల్లవరం శాసనం వలన తెలుస్తున్నది. ఈ శాసనం 1325 అక్టోబరు 7న వేశారు.

ఇది ఇలా ఉండగా, ఢిల్లీని పాలిస్తున్న ఘియాజుద్దీన్ తుఘ్లుక్ 1325 ఫిబ్రవరి-మార్చిలో చనిపోయాడు. అతని కుమారుడు అప్పటికే దేవగిరి, ఓరుగల్లు ప్రాంతాలను పాలించేందుకు ప్రతినిధులను నిల్పి, ఢిల్లీ వెళ్లిపోయాడు. తండ్రి తర్వాత ఉలుఘ్‌ఖాను - మనం యితనిని ఉల్లూఖానని పిలుస్తున్నాము - ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ అనే పేరుతో సింహాసనమెక్కాడు. ఇతనినే చరిత్రలో పిచ్చి తుగ్లక్ అని పిలిచారు.

**సదవకాశం**

తుగ్లక్ తిరిగి పోవటం ఆంధ్ర దేశంలోని స్వాతంత్ర్య వీరులకు సదవకాశమయింది.

ముసునూరి ప్రోలయ నాయకుని అధ్యక్షుని గావించటంలో ప్రధానపాత్ర వహించిన బెండపూడి అన్నమంత్రికి, ప్రోలయ "ఆంధ్ర భూమండలాధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనాచార్య" అనే బిరుదునిచ్చి సత్కరించాడు.

శ్రీనాథ కవి సార్వభౌములు అన్నమంత్రి మీద భీమేశ్వర పురాణంలో చక్కని పద్యం చెప్పారు.

**కాకతిక్ష్మాపాల గంధ దంతావళ ధ్వజినీ మహాధురంధరు డనంగ**
**నవలక్ష కోదండనాథ రాజ్యాంభోధి సంపూర్ణ పూర్ణిమాచంద్రు డనగ**
**నంధ్ర భూమండలాధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనాచార్యు డనగ**
**వీర రుద్రాశేష విశ్వంభరాధీశ పృథుల దక్షిణ భుజా పీఠ మనగ**
**యవన సంహార విలయ కాలాగ్ని యనగ - ధాటి విఘటిత కుమ్మ రోధ్యాను డనగ**
**విశ్వలోక ప్రశస్తుడై వినుతి కెక్కె - నతుల బలసీరి పోలయ యన్న శౌరి**

( భీమ 1-49 )

సముద్ర తీరాన్ని వశపరచు కున్నాక, కొలని ప్రతాపరుద్రుడు అన్నమంత్రికి పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకాలో ఆ రేడు గ్రామాలు అగ్రహారంగా యిచ్చాడు.

**కొలను ప్రతాపరుద్ర నవకుంజరు చేత నరేంద్ర సారణీ**
**సలిల వివర్ధమాన బహు సస్య సమాకుల మగ్రహారమై**

వెలయ విభాకరగ్రహణ వేళ దగంగ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్న విభుతో సరియెట్లు ప్రధాను లెల్లరున్ ( భీమ 1-50 )

## ఎవరీ అన్నమంత్రి?

కాకతీయ చక్రవర్తి మొదటి రుద్రుని కాలంనుండి ప్రఖ్యాతి గాంచిన బ్రాహ్మణ వంశం కొలని మంత్రులది. ఈ వంశంలోని నానగౌర్యునికి కుమారులైన పెదమల్లన - చినమల్లనలు మొదటి ప్రతాపరుద్రుని వద్ద మంత్రులుగా పని చేశారు.

పెదమల్లన కుమారుడు సోమ మంత్రి. గణపతి దేవుని కాలంలో సోమ మంత్రి కళింగ విజయ యాత్రలన్నిటిలో పాల్గొని అనేక విజయాలు సాధించి పెట్టాడు. ఈ సోమ మంత్రి సోదరుని కుమారుడే అన్నమంత్రి.

అన్న మంత్రి గొప్ప ధీశాలి. రుద్రమదేవి వద్ద మంత్రిగ, దండాధీశ్వరుడుగా పనిచేశాడు. మహారాణి రుద్రమదేవి మెప్పు సంపాదించాడు.

రుద్రమదేవి తన రెండవ కుమార్తె 'రుయ్యమ'ను అన్నమంత్రికిచ్చి వివాహం చేసి, బంధుత్వం కలుపుకుంది.

అన్నమంత్రికి ముగ్గురు భార్యలున్నారు. అద్రిజ, లకుమాంబ, రుద్రమదేవి కూతురు రుయ్యమ.

అన్నమంత్రి సోదరుని కుమారుడు కొలని రుద్రుడు. ఈయన కొలనివీడు (ఏలూరు కావచ్చు లేక కొల్లేటికోట కావచ్చు) కేంద్రంగా పాలన చేశాడు.

## కొలని రుద్రదేవుడు

అన్నగారైన అన్న మంత్రితో కలసి తూర్పు దేశంలోని అనేక ప్రాంతాలను జయించాడు. కొలని గణపతి దేవుని "శివయోగ" సారములో ఈయన శైవ, వైష్ణవ సిద్ధాంతాలను బాగా తెలుసుకున్నవాడని, దర్శన, ఆగమాలను బాగా అర్థం చేసుకున్నవాడని వ్రాసి ఉంది.

ఈ అన్నదమ్ములిరువురు ప్రోలయను ప్రోత్సహించి స్వాతంత్ర్య పోరాటాన్ని నడిపింప చేశారు.

ఇలా యీ పోరాటం కుల ప్రాతిపదికను గాక, స్వాతంత్ర్య సముపార్జనా భావ తీవ్రతతో కలసి పనిచేసేలా చేసింది. అందరూ ప్రోలయ నాయకత్వాన్ని మనసారా అంగీకరించారు.

ఇలా అంగీకరించిన ప్రముఖులలో ప్రోలయ వేమారెడ్డి ఒకరు.

# మూడవ ప్రకరణము

## రెడ్డిరాజ్య స్థాపన : దేసటి వంశం

పంట రెడ్లలోని దేసటి వారిలో వేమయ కత్తిపట్టి కాకతి రుద్రమదేవి వద్ద సైన్యాధిపతిగా ఉన్నాడు. ఈయన కుమారుడు ప్రోలయ, ప్రతాపరుద్రుని వద్ద ఏదో ఒక పదవిలో సైన్యాలకు నాయకత్వం వహించి ఉంటాడని ఊహిస్తున్నాను.

ప్రతాపరుద్రుడు కంజీవరం మీద దండయాత్ర చేసినపుడు ప్రోలయ కూడా పాల్గొని ఉంటాడు. ఈ ఊహకు కారణం చెపుతాను. ఆలకించండి.

ప్రోలయ కుమారుడైన వేమారెడ్డి బిరుదులలో **"పాండ్యరాయ గజసింహ", "అప్పయ గోపయ దిశాపట్ట సంగ్రామ", "అలగియ వరద శిరః ఖండన", "పల్లవాదిత్య"** అనేవి ఉన్నాయి.

ఈ బిరుదులన్నీ తనకు అనువంశకంగా సంక్రమించినవే గాని, తానుగా ప్రోలయ వేమారెడ్డి సంపాదించుకున్నవి కావు.

ఓరుగల్లు ఓడిపోయాక, ఆ అరాచక, అస్తవ్యస్త పరిస్థితులలో ప్రోలయ కుమారుడు వేమారెడ్డి 1324-1325 ప్రాంతంలో, ముసునూరి ప్రోలయ నాయకుని ఎంపికలో పాల్గొని ఉంటాడు. అదే సందర్భంలో తన సోదరుల సాయంతో అద్దంకిని రాజధానిగా చేసుకొని రెడ్డి రాజ్య స్థాపన గావించాడు.

ఐతే, ప్రోలయ వేమారెడ్డి ముసునూరి ప్రోలయ నాయకునికి విధేయ సామంతుడుగా రాజ్యపాలన చేశాడని మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు - తెలుగు భాషా సమితి వారి తెలుగు సంస్కృతి 3వ భాగంలో వివరించారు.

## మరో దండయాత్ర

తుగ్లక్ తమ్ముని కొడుకు బహదుద్దీన్ గర్షస్ప తిరుగుబాటు చేసినపుడు తుగ్లక్ సైన్యాలను పంపించి, అతన్ని బంధించి ఢిల్లీ తీసుకురమ్మన్నాడు. గర్షస్ప ఓడిపోయి, పారిపోయి, కంపిలిని పాలించే రాజును శరణుజొచ్చాడు. తుగ్లక్ సైన్యాలు కంపిలిని ముట్టడించాయి. కంపిలి ఓడిపోయింది (1327-28) రాజు చనిపోయాడు.

బహదుద్దీన్‌ను ద్వార సముద్రపు రాజైన మూడవ బల్లాలుని వద్దకు కంపిలి రాయడు పంపించటం వలన, వాళ్లు ఆశ్రయమిచ్చారు. తుగ్లక్ సైన్యాలు ద్వార సముద్రాన్ని ముట్టడించాయి. మూడవ బల్లాలుడు బహదుద్దీన్ను అప్పగించాడు.

ఢిల్లీ సుల్తాన్ తుగ్లక్ తన తమ్ముని కొడుకని కూడా దయదలచక, బ్రతికుండగానే చర్మం వలిపించాడు.

రెండవ దండయాత్రలో కంపిలిని స్వాధీనం చేసుకొని, హరిహర, బుక్కరాయలనే

సోదరులను బందీలుగా పట్టుకుని, ఢిల్లీ తీసుకపోయాడు. ఆ సోదరులు ఇస్లాం స్వీకరించి, తుగ్లక్ వద్ద విశ్వాసపాత్రులుగా సేవలందించారు.

కంపిలి ప్రాంతంలో తిరుగుబాట్లు జరిగాయి. అక్కడున్న ముస్లిం పాలకుడు, స్థానికుని నెవరినైనా ఆ ప్రాంత పాలకునిగా నియమించటం వల్ల ప్రజలు శాంతిస్తారని ఢిల్లీకి తెలియజేశాడు. తుగ్లక్, హరిహర బుక్కరాయలను ఆ ప్రాంతాన్ని పాలించేందుకు పంపించాడు.

## విజయనగర స్థాపన 1336

విద్యారణ్య స్వామి హరిహర బుక్కరాయలను హిందూమతంలో చేర్పించారు. వారిని ప్రోత్సహించి, విద్యానగరాన్ని నిర్మింపజేశారు.

ఆ అన్నదమ్ములలో హరిహర రాయలు విద్యారణ్య స్వామి ఆశీస్సులతో విద్యానగర పాలన ప్రారంభించాడు. ఇలా సంగమ వంశంవారు అధికారంలోకి వచ్చారు. .

## ముసునూరి కాపయ నాయకుడు (1332 - 1367,68)

ప్రోలయ నాయకుడు వయో భారం వలన తన ఉద్యమాన్ని విస్తృత పరచి, తెలంగాణాను ముస్లిం పాలన నుండి విముక్తి చేసి, ఓరుగల్లును తిరిగి స్వాధీనం చేసుకోలేక పోయాడు.

ముసునూరి ప్రోలయనాయకునికి సంతానం లేదు. అందువలన తన పినతండ్రి దేవనాయకుని కుమారుడైన కాపయనాయకునికి, రాజ్య భారాన్ని అప్పజెప్పాడు.

కాపయ తన శాసనాలలో తాను "భావ ప్రభావోదయుడనని, శ్లాఘ్య ప్రస్ఫుట ధర్మ కర్మ చతురుడనని, కాశీ విశ్వపతి ప్రసాదమహిమా ప్రాప్తాఖిల ప్రాభవుడనని, ప్రతాపరుద్ర ప్రతిభా ప్రభావుడనని" వేయించుకున్నాడు.

కాపయ తెలంగాణాలో తిరుగుబాటుకు ప్రయత్నాలు సాగించాడు.

ఇదే కాలంలో దక్షిణాదిన మధురను పాలిస్తున్న, తుగ్లక్ నియమించిన జలాలుద్దీన్ హసన్‌షా, స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నాడు. సుల్తాన్ జలాలుద్దీన్ హసన్‌షాగా 1334-35 ప్రాంతంలో నాణెములను కూడా ముద్రించాడు.

## మూడవ దండయాత్ర

తుగ్లక్ యిది సహించలేక సైన్యాలతో వచ్చి ఓరుగంటిలో దిగాడు. ఓరుగంటి ప్రాంతంలో మహామారి అనే అంటువ్యాధి ప్రబలటం వలన చాలామంది సైనికులు, ముఖ్యులు చనిపోయారు. తుగ్లక్ కూడా యీ వ్యాధి వలన మంచం పట్టాడు. చివరకు,

చావగా మిగిలిన వారిని వెంట తీసుకొని, దేవగిరి చేరి, కొద్ది కాలముండి ఢిల్లీ వెళ్లిపోయాడు.

## ఓరుగల్లు స్వాధీనం

ఈ అవకాశాన్ని కాపయ నాయకుడు సద్వినియోగం చేసుకున్నాడు. సైన్య సమేతంగా వెళ్లి ఓరుగల్లును ముట్టడించాడు. 1336లో స్వాధీనం చేసుకున్నాడు. కోటమీద నందికేతనం రెపరెపలాడింది.

ఇంద్రగంటివారు మంచి పద్యం వ్రాశారు. చూడండి.

**ఆంధ్ర భూమీ సురత్రాణు డనుపమాన - శౌర్య కలితుండు కాపయ శౌరి - అన్న**
**కొసగు వాగ్దానమును దీర్చి యోరుగంటి - సింహ పీఠి నలంకరించెను - జయోస్తు.**

( 126 పేజీ )

ఇలా ముసునూరి కాపయ నాయకుడు దక్షిణ భారత దేశంలో నూతన యుగానికి విజయోత్సవం జరిపించాడు. "**ఆంధ్ర దేశాధీశ్వర**", "**ఆంధ్ర సురత్రాణ**" బిరుదులు దాల్చి ఓరుగల్లును పాలించాడు.

## ఆనాటి ప్రముఖులు

ముసునూరి కాపయ నాయకుని 75 మంది నాయకులు సేవించారని, కాదు 72 మంది అని, కాదు 77 మంది అని చరిత్ర రచయితలు వాదించుకోవటానికి కారణాలున్నాయి. ప్రతాపరుద్ర చరిత్రలోను, వెలుగోటి వారి వంశావళిలోను యీ నాయకుల సంఖ్య 77 అని ఉంది. శివయోగసార పీఠికలో డెబ్బది ఇద్దరు అని వ్రాసి ఉంది.

**ఐతే, కాకతీయ సామ్రాజ్య పతనానంతరం, వంద సంవత్సరాల తరువాత, కాటయ వేమారెడ్డి కుమార్తె, వీరభద్రారెడ్డి భార్య అయిన అనితల్లి వేయించిన కలువచేఱు శాసనంలో "కాపానాయకుడు విశ్వేశ్వరుని అనుగ్రహముచే డెబ్బది ఐదుగురు నాయకులచే సేవింపబడుచు, భూమిని పాలించెను. తురుష్కులచే ఆక్రమింపబడిన అగ్రహారములను బ్రాహ్మణులకు పునర్దత్తము చేసియు దానము చేసెను. మరికొన్ని క్రొత్త అగ్రహారములను గూడా అతడు భూదేవికలంకారముగా నిచ్చెను : కాపానాయకుడు విశ్వేశ్వరుని పదముల గొల్చుటకై కైలాసమున కేగిన పిమ్మట ఆ (డెబ్బది ఐదుగురు) నాయకులు శత్రునాశనమగుటచే తమ తమ నగరములకేగి పరిపాలనమెనర్చిరి. వారలలో పంట వంశోద్భవుడగు వేమ నరేశ్వరుడొకడు" అని ఉంది.**

( రెడ్డి సంచిక పుట-6 )

వెలుగోటి వారి వంశావళి వ్రాత ప్రతిలో 72 మంది నాయకుల పేర్లున్నాయని, వాటి పట్టికను వడ్డాది అప్పారావుగారు రెడ్డి సంచికలో యిచ్చారు.

## 72 మంది నాయకులు

1.రేచెర్ల ప్రసాదిత్యుడు
2. మల్దేవ పాత్రుడు.
3 అనాచి మల్దేవుండు
4. అల్లు రుద్రదేవుండు
5.మురారి మల్దేవుండు
6. సంగరాజు
7.మేదుకూరి రామనాథుండు
8. అమ్మనబోలి రుద్రదేవుండు.
9.సోమరాజు రుద్రయ
10. నాచిరాజు భీమయ
11.సందాయ దేవుండు
12. పోతికంటి మైలు
13.ఇందుమౌళి
14.కొండపర్తి గణపతిదేవుండు
15.దాదినాగదేవుని సమాదేవుండు
16.మహాదేవనాయని సమాదేవుండు
17.మల్లికార్జున నేండు
18.కొలిపాక నాగిరెడ్డి
19.తాడిపర్తి గన్నారెడ్డి
20. చంద మల్లారెడ్డి
21.బాచి బూచారెడ్డి
22.గడ్డి మన్నారెడ్డి
23.బాచిపెంచల మల్లారెడ్డి
24.బెడదకోట భైరవ దేవుండు
25.కోవూరి నాచిదేవుండు
26.కాల్గయ ముగ్గండు
27.కొఅవి నిశ్శంగుండు
28.మగదల గణపతి దేవుండు
29.గుండయ నాయుండు
30.చెఱకుతోట చెన్ను
31.సట్లవారి బాలయ
32.కుమార గణపయ
33.యత్తడి బాలయ
34.గోన కోటారెడ్డి
35.మల్లాది పోతయ
36.మారయ సాహిని
37.రుద్రదేవుండు
38.ఎఱ్ఱి సాహిని
39.మచ్చ రుద్రదేవుండు
40.వీర భల్లుండు
41.శ్రీకంఠుండు
42.పెదకూచి రుద్రదేవుండు
43.చినకూచి రుద్రదేవుండు
44.ఇందులూరి అన్నమదేవుండు
45.అప్పక మల్దేవుండు
46.చోక (చోడ) దేవుండు
47.కరిదేవుండు
48.దేవరాజు
49.వీరన్న
50.విస్సన్న
51.విశాలాక్షుండు
52.వీణె కొమ్మయ
53 వెంకటేశ్వరుండు
54.మల్లు
55.కరణ కుమారుండు
56.గోవుల పోచినేడు
57.నాగ నాథుండు
58.రాణిక్య దేవుండు

59.గుండ యంగండు
60.సామిరాజు యేలు
61.అభంగ రాహుత్త రాయడు
62.అన్నమదేవుని వెంక
63.ఝుంట వెంక
64.గోవు వెంక
65. - - - - - - - -
66. - - - - - - - -
67.మాచెర్ల నాగువెంక
68.కాటమల్లు వెంక
69.మంకుగన్న వెంక
70.పారువార బ్రహ్మ వెంక
71.ఉండవిల్లు వెంక
72.ధిట్టకాము వెంక

ఈ పట్టికలోని వారు అనేక జాతుల వారు కావటం ఒక విశేషం. వీరిలో బ్రాహ్మణులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు, కాయస్థులు, క్షత్రియులు ఉన్నట్లుగా మనం గ్రహించవచ్చును. కొందరిని గూర్చి శాసనాల ద్వారా, సాహిత్యం ద్వారా తెలుసుకోవచ్చును. కాని కొందరు చరిత్రలో కలసి పోయారు. వారిని గూర్చి వివరాలు తెలియటం లేదు.

ఇలా అన్ని కులాల నాయకులు ఏకమై ముస్లింలపై ధ్వజమెత్తి, ముసునూరి నాయకత్వాన పని చేయటం అద్వితీయమైన స్వర్ణ సంఘటన.

## మరల చీలికలు

శత్రుభయం పోయింది. హైందవ పాలకులు, ముస్లిం దండయాత్రల పీడకలలు చెరపి వేసుకున్నారు. కాని ప్రశాంతంగా ఆంధ్రదేశం ఉండలేక పోయింది.

1336 తర్వాత విద్యానగరంలో సంగమవంశ యాదవులు, అద్దంకిలో దేసటి రెడ్లు, కోరుకొండలో మంచికొండ నాయకులు, పిఠాపురంలో కొప్పుల వారు స్వతంత్ర పాలన సాగించారు.

వీరంతా ప్రారంభంలో ముసునూరి ప్రోలయ నాయకునికి, తరువాత కాపయ నాయకునికి అనుకూలంగా ఉన్నారు. తుగ్లక్ భయం వలన సూత్ర ప్రాయంగా ఒకే త్రాటి మీద నడిచారు. కాని పరిస్థితులు మారి పోయాయి. ప్రభువులు రాజ్య విస్తరణకు పాల్పడ్డారు.

## పంటరెడ్లు

భీమేశ్వర పురాణంలో శ్రీనాథులవారు వ్రాసిన వచనంలో మనకు కొంత సమాచారం లభిస్తున్నది.

"పంట మహాన్వయంబు పాకనాటి దేశంబున భద్ర పీఠంబు నధివసించి, సింహ విక్రమనగర దువ్వూరు గండవరాది పట్టంబులు నిజ నివాసంబులుగా, భూలతాదిష్టాష్టాదశ ద్వీపాంతరాళులగు భూపాల గ్రామణులం త్రిలింగ భూమండలా ఖండులురను బ్రోలయ వేమాన్నపోతాన్నవేమ కుమార గిర్యాదులం బూజ్య సామ్రాజ్య పీఠస్థులం గాంచె...."

( భీమ - 1 . 32 )

ఇలా పాకనాటి నుండి ఉత్తర దిశగా వ్యాప్తి చెందిన పంటరెడ్లు, ఆంధ్రదేశంలో ఒక క్లిష్టదశలో రాజ్యాన్ని స్థాపించి, వ్యాప్తిచేసి, కవితా పోషణ కావించి శాశ్వత కీర్తి పొందారు. చరిత్రలో నిలచిపోయారు.

## చాటువు

పంట వంశంలో పదునాల్గు ప్రధాన శాఖలున్నాయి. ఈ విషయం ఒక చాటు పద్యం వలన తెలుస్తున్నది.

**పంటాన్వయమునకు బదునాల్గు శాఖలు చక్కగా వివరింతు సత్యమరసి**
**మోటాడి, వెల్నాటి, మొరస, నేరె, డయోధ్య, పంట, పొంగలినాటి, పాకనాటి,**
**భూమంచి, కురిచేటి, మున్నూటి, దేసటి యొనర గండియకోట, యోరుగంటి**
**యన బరగుచునుండు నంధ్రావనీ స్థలి గౌరవాధిష్ఠిత కాపుకులము**
**పంట పదునాల్గు కులము లంచంట జగతి**
**తర తరంబుల నుండియు వరలెడి నుడి**
**వీని కుపజాతులున్నవి వివిధములుగ**
**భుజబలాటోప! పిన్నమ భుక్క భూప!**

ఈ పిన్నమ భుక్క భూపాలుడు పదిహేనవ శతాబ్దానికి చెందినవాడు. ఇందువలన ఈ చాటువు కూడా పురాతనమైనదే.

ప్రోలయ వేమాదులు వెల్లశేరి పురాధీశ్వరులగుటచే వీరి గోత్రము వెల్లశేరి గోత్రమయింది.

మనం ప్రోలయ వేమారెడ్డిని గూర్చి కొంత తెలుసుకుందాం.

## ప్రోలయ వేమారెడ్డి (1324-1353)



"మొదటి వేమన కుమారుడగు ప్రోలయకే కోమటి ప్రోలయ యను నామాంతరముంది. ఇతని భార్య అన్నమ్మ లేక అన్నమాంబ. ఈ దంపతులకు మాచయ, వేమయ, దొడ్డయ, అన్నయ, మల్లయ యని ఐదుగురు పుత్రులు జన్మించారు. కొన్ని శాసనములు మల్లయను విడిచి నలుగురినే పేర్కొంటున్నవి. ప్రోలయ తరువాత అతని రెండవ పుత్రుడు వేమయ రాజ్యమునకు వచ్చెను." అని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తన శృంగార శ్రీనాథంలో వ్రాశారు.

బహుశ మల్లయ చిన్న వయసులోనే మరణించి ఉండవచ్చును. అందువలననే

మల్లయను విడిచి మిగతా నలుగురి పేర్లను కొన్ని శాసనాలలో పేర్కొనటం జరిగిందని నేను భావిస్తున్నాను.

మొదటి వేమన కుమారుడు ప్రోలయ యని ప్రభాకర శాస్త్రిగారు వ్రాశారు. కాని మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు కామారెడ్డి కుమారుడు ప్రోలయ యని వ్రాశారు.

రెడ్డి రాజ్య పాలకులలో ఎక్కువమంది వేమన, కోమటి పేరుగల వారుండటం వలన, తండ్రి పేరుతో కలిపి కుమారుని పేరు చెప్పటం ఆచారంగా వస్తోంది. దీనిని పాఠకులు గమనించ గలరని భావిస్తున్నాను.

ప్రోలయరెడ్డి రెండవ ప్రతాపరుద్రుని వద్ద సైన్యాలలో పనిచేసినట్లు చాలామంది ఊహిస్తున్నారు. వీరి పూర్వీకులు మేడివదలి కత్తి చేబూని, నాయకులయ్యారు. ఉల్లూఖాన్ తో 1323లో జరిగిన యుద్ధంలో ప్రతాపరుద్ర సార్వభౌమునికి అండగా నిలిచారు. ఆ తరువాత ముసునూరి ప్రోలయ నాయకునితో కలసి పనిచేశారు.

## కొండవీటి కథ

కొండవీటి దండకవిలెలో ఒక కథ ఉంది. ఇదే ఐతిహ్యము, కొండవీటి కైఫీయత్‌లోనూ ఉంది. మనం ఆ కథ చెప్పుకుందాం.

పూర్వం దొంతి అల్లాడ రెడ్డి అనే రైతు ఉండేవాడు. ఒక రోజున వేమన అనే పేరుగల కోమటి ఒకరు వారింటికి అతిథిగా వచ్చాడు. ఆవచ్చిన వ్యక్తి సామాన్యుడు కాదు. సిద్ధులతోను, యోగులతోను సాంగత్యం గలవాడు. వారి సేవలు చేసి చాలా తెలుసుకున్నవాడు.



కల్నల్ గోర్డెన్ మెకంజి

ఆయన వద్ద పరుసవేది ఉంది. అందువలన అల్పలోహాలను కూడా బంగారంగా మార్చగలిగేవాడు.

ఈ విషయం అల్లాడ రెడ్డి గ్రహించాడు. ఏవిధంగానైనా ఆ పరుసవేదిని సంపాదించాలని అల్లాడ రెడ్డి నిర్ణయించుకున్నాడు.

వేమనకు ఒక కుటీరం యిచ్చి అందులో అన్ని వసతులు కల్పించాడు. ఒకరోజు వేమన లేనప్పుడు ఆ పరుసవేది కాజేసి, కుటీరానికి నిప్పంటించాడు.

ఆ యోగి వేమన తిరిగివచ్చి తన పరుస వేదిని గూర్చి అడిగాడు. అల్లాడరెడ్డి తనకా సంగతి తెలియదని, బహుశ అగ్నిలో అదీ దహనమైపోయి ఉంటుందని అన్నాడు. ఆ యోగి నిరాశపడిపోయాడు. తన జీవితమంతా శ్రమించి సంపాదించినది కాలిపోవటం

భరించలేక తాను కూడా మండుతున్న మంటలలో దూకి కాలిపోయాడు.

తరువాత ఆ యోగివేమన దొంతి అల్లాడ రెడ్డికి కలలో కన్పించి, అల్లాడ రెడ్డి వంశంలో వారికి కోమటి, వేమన అనే పదాలను చేర్చి పేర్లు పెట్టమని లేకుంటే ఆ వంశం నాశనమవుతుందని చెప్పాడట. అందువలననే ఆ పేర్లు పెట్టుకున్నారని ప్రజలీనాటికి చెప్పుకుంటారు.

ఐతే యీ దొంతి వంశానికి, కొండవీటిని పాలించిన దేసటి వంశానికి ఎక్కడా సంబంధం ఉన్నట్లు కన్పించదు. కాని ప్రోలయ వేమారెడ్డి వేయించిన మంచాళ్ల తామ్ర శాసనంలో యిలా ఉంది. "స్వర్ణకర ప్రసిద్ధిం లబ్ధ్వా" అనగా బంగారం చేయటంలో ప్రసిద్ధి పొందినాడని అర్థం.

హరివంశం ఉత్తరభాగంలోని పద్యం చూడండి.

"పరుసవేది సోకుటయును బరుస లోహ మధిక శుద్ధ సువర్ణమ యైన పోల్కి"

అని ఉంది. అలాగే వేమన ఆటవెలదిలో పరుసవేది విషయం చెప్పాడు.

భాగ్య హీనునకును, పరుసవేది దొరుక - నదియు నిలువ దెపుడు వదలు గాక
వాన తోడ వచ్చు వడగండ్లు నిల్చునా - విశ్వదాభిరామ వినుర వేమ

## బిరుదులు

అద్దంకిని రాజధానిగా చేసుకొని స్వతంత్ర రాజ్యం స్థాపించింది ఏ సంవత్సరమో సరిగా చెప్పలేము. బహుశ 1324గాని 1325గాని కావచ్చును. ముసునూరి ప్రోలయ 1325లో స్వతంత్ర్య పోరాటం ప్రారంభించాడుగదా! కొద్ది నెలలు అటు, యిటుగా పంటరెడ్ల పాలన ప్రారంభమై ఉంటుంది. ఐతే ముసునూరి వారి పాలనకు లోబడే యీ రాజ్య స్థాపన జరిగింది. కప్పం చెల్లించినట్లుగా గాని, యితర లాంఛనాలు ఉన్నట్లుగాని చరిత్రలో యింతవరకు సాక్ష్యాధారాలు లభించలేదు.

ప్రోలయ వేమారెడ్డి 1325లో వేయించిన మల్లవరం శాసనంలో "మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవ" అని ఉంది. కాబట్టి కమ్మనాయకుడైన ప్రోలయతో కలసి ప్రోలయ వేమారెడ్డి గెరిల్లా పోరాట పద్ధతిలో ముస్లింల మీద దాడిచేసి, పారద్రోలి ఉండవచ్చును. అందువలన ఈ బిరుదు వచ్చి ఉండవచ్చును.

ప్రోలయ వేమారెడ్డికి "గుజ్జర ధట్టు విభాళ" అని మరో బిరుదు ఉంది.

ఢిల్లీ సుల్తాను మహమ్మద్ బిన్ తుగ్లక్ కంపెలీ మీదకు ఘూర్జర దేశ సైన్యాలను పంపించాడు. ఘూర్జర దేశాన్ని 'గుజ్జర' దేశం అని వాడటం ఉంది. వేమారెడ్డి కంపెలి రాయనికి సాహాయ్యంగా సైన్య సమేతంగా వెళ్లి, ఆ సైన్యంతో పోరాడాడు. ఘూర్జర సైన్యం ఓడిపోయింది. అందువలన "గుజ్జర ధట్టు విభాళ" అనే బిరుదు దాల్చాడు.

ఇలాగే "ఆనెయ మండలి కరగండ" అని "రాచూరి దుర్గ విభాళ" అని బిరుదులున్నాయి. ఆనెగొంది సమరంలో కంపిలి రాయనికి సహకరించి పోరాడటం వలన, రాయచూరు దుర్గాన్ని పట్టుకొన్నపుడు కలసి పోరాడటం వలన ఈ బిరుదులొచ్చాయి.

ఆనెగొంది లేక కంపిలి రాజ్యం మీద తుగ్లక్ సైన్యాలు రెండు పర్యాయాలు దాడిచేసి జయించలేక పోయాయి. మూడవ పర్యాయం విజయాన్ని సాధించాయి. ఆ యుద్ధాలలో ప్రోలయ వేమారెడ్డి ఆనెగొంది వైపున పోరాడినట్లు యీ బిరుదుల వలన తెలుస్తున్నది.

హరివంశ ప్రథమాశ్వాసంలో ప్రోలయ వేమారెడ్డిని గూర్చి యిలా ఉంది.

"రాజ శబ్దంబునకు భాజనం బగుచు దేజో విలాసైకనిత్యుండం పల్లవాదిత్యుండనియును నుదాత్త పౌరుషోద్ధతుండు జగనొబ్బగండం డనియును సంగతానేక నరపాలన పరిపాలన శీలుం డంగరక్షా పాలుం డనియును సకలకళాధికృత విస్మృమరకేలీ విధేయుండు కేళాధిరాయుండనియును నసుభూతాద్భుత నమర విజయుండు సంగ్రామధనంజయుం డనియును అఖిల శత్రు విదారణ ప్రతిజ్ఞా పూరణోద్ధాముండు భుజ బల భీముండనియును, నసాధ్య సాధక వీరవ్రత నిర్వహణ వరాయణుండు వీరనారాయణుండనియును దురవగాహ రిపు వ్యూహవ్యపోహాభీలుండు గుజ్జరి దళ విపాలుండనియు నాశ్రిత రక్షణ వ్యవసిత దయాలోలుండు జగద్రక్షపాలుండనియును జతుర్విధ దుర్గధారణ విహారోదారుండు చుంచుమలచూఱకారుండనియును బ్రతిభట వేదండ ఖండన ప్రచండుండు మండవీ కరగండండనియును బహు ప్రకారంబు వ్యవహారంబులవలన నిశ్శంకంబులై బిరుదాంకంబులు ప్రవర్తిల్ల విలసిల్లు వేమ జనేశ్వరుండు". (హరి 1 - 11)

## రాజ్య విస్తరణ

తుగ్లక్ రెండవ దండయాత్ర నాటికి (1327-28) ప్రోలయ వేమారెడ్డి కాలూనినట్లు కన్పిస్తున్నది. ఈయన రాజ్యం తూర్పున బంగాళాఖాతము, పశ్చిమాన శ్రీ పర్వత పూర్వపాదం (శ్రీశైలంకు తూర్పున ఆనుకొన్న ప్రాంతం), దక్షిణాన గుండ్లకమ్మ కుడివైపు వరకు, ఉత్తరాన కృష్ణానది సరిహద్దుల మధ్య విస్తరించింది.

## దేవాలయాల ధ్వంసం

అప్పటికి ముస్లిం దండయాత్రల వలన రాజమంద్రి లోని తూర్పు చాళుక్యులు నిర్మించిన వేణుగోపాల స్వామి దేవాలయం పడగొట్టబడింది. ఢిల్లీ పాలకుడు ఘియాసుద్దీన్ తుగ్లక్ పేర మసీదు నిర్మించబడింది. ఇలాగే చాళుక్యులు కాకతీయులు నిర్మించిన అనేక దేవాలయాలకు యిదేగతి పట్టింది. ఏలూరు, బిక్కవోలు మసీదులు యిలా నిర్మించినవే.

బోధన్‌లోని మసీదు ఇలా నిర్మించినదేనని యాజ్దానీ వ్రాశాడు. మహమ్మద్ బిన్ తుగ్లక్ నిర్మించిన దీనిని యిప్పటికి "దేనల్ మస్జిద్" అని పిలుస్తారు.

## విలస శాసనం

పిఠాపురం సమీపంలోని కందరాడలో ముసునూరి ప్రోలయ నాయకుని విలస శాసనం దొరికింది. వేసవి ఎండల బాధకు చల్లని చెరువు నీరులా ప్రోలయ నాయకుని రక్షణ దొరికిందని, ఆయన ఆశ్రయంతో ప్రజలు తమని హింసించిన తురుష్కుల్ని చంపివేశారని, సంక్షోభ కాలంలో ధ్వంసం అయిన ధర్మాన్ని ప్రోలయ నాయకుడు పునరుద్ధరించాడని విలస శాసనం వర్ణిస్తున్నది.

దైవభక్తి, బ్రాహ్మణ భక్తి అధికంగా గల వేమారెడ్డి హిందూ ధర్మాన్ని కాపాడేందుకు చాలాకృషి చేశాడు. విలస శాసనంలో ప్రోలయ నాయకుని మాదిరిగా, అతనికి అనుకూలంగా ఉంటూ ముస్లిం పాలననుండి గుండ్లకమ్మ ప్రాంతాన్ని విముక్తి చేసి, పెరుగుతూ తానూ చాలాచేశాడు. చాలా యజ్ఞాలు చేసి, **"అనవరత పురోహిత కృత సోమపాన"** అనే బిరుదును పొందాడు. ఇదిగాక **"నిస్సీమ భూదాన పరశురామ"** అని **"అపరిమిత భూదాన పరశురామ"** అని బిరుదులు పొందాడు. ఈ బిరుదుల వలన ఆయన బ్రాహ్మణులకు అపరిమితంగా భూదానాలు చేసి ఉంటాడనే మాట నిజం.

## రాజ్య రక్షణ

ప్రోలయ వేమారెడ్డి 84 దుర్గాలు నిర్మించాడు. రాజ్యరక్షణ కొరకు చాలా జాగ్రతలు తీసుకున్నాడు. ముఖ్యంగా ధరణికోట, చందవోలు, బెల్లంకొండ, వినుకొండ, కొండవీడు మొదలగు దుర్గాలను - బలోపేతంగా తయారు చేశాడు. ఆ దుర్గాలకు "అనుజ, తనుజ, బాంధవ, మిత్ర జనుల" ను అధిపతులను చేశాడు. పాలించమన్నాడు.

ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన హరివంశంలో ఉన్న పద్యం గమనించండి.

> **తనకు నద్దంకి తగు రాజధానిగా బ - రాక్రమంబున బహుభూము లాక్రమించి**
> **యనుజ, తనుజ, బాంధవ మిత్ర జనులకిచ్చె - నెదురె యెవ్వారు వేమ మహీశ్వరునకు**
> ( హరి - 22 )

వేమారెడ్డికి అద్దంకి రాజధాని అని ఎఱ్ఱనగారు పై పద్యంలో చెప్పాడు. చందవోలు కూడా వారికి ప్రధానమైన నగరమే.

## మాచారెడ్డి

వేమారెడ్డి అన్నగారైన మాచారెడ్డి ధనదపురీప్రభృతి శాఖా నగరాధిపతిగా ఉన్నాడని

వామన భట్టబాణుడు వేమ భూపాల చరితములో వర్ణించాడు. ధనదపురి అనగా చందవోలు. వేమారెడ్డి అన్నగారిని చందవోలు పాలించమని, తాను అద్దంకిలో ఉండి రాజ్యపాలన చేశాడని భావిస్తున్నాను.

వేమారెడ్డి సోదరుడైన మల్లారెడ్డి కందుకూరు దుర్గానికి అధిపతిగా ఉండేవాడు.

ప్రోలయ వేమారెడ్డి, ఆ తరువాత వచ్చిన అనవేమారెడ్డి తమ శాసనాల చివరలో "పల్లవ త్రినేత్ర" అని వ్రాలు చేసి ఉండటం వలన వీరు పల్లవుల సంతతివారు కావచ్చుననే అనుమానం, కొందరు సాహిత్య, చరిత్ర పరిశోధకులు వెల్లబుచ్చారు. కాని ఆకరాలు లేకుండా ఏమాట చెప్పలేముగదా!

## వంశపారంపర్య బిరుదులు

వంశ పారంపర్యంగా వచ్చే బిరుదులు కొన్ని ఉన్నాయి. (1) అప్పయ గొప్పయ దిశాపట్ట (2) జగనొబ్బగండ (3) దండెన గోప (4) పాండ్యరాయ గజకేసరి అనే వారసత్వ బిరుదులు. ఇవిగాక యింతకు ముందు చెప్పిన (5) గుజ్జరి భట్టు విభాళ (6 రాచూరి దుర్గ విభాళ (7) ఆనెయ మండలి కరగండ (8) చెంచుమల చూరకార (9 అఱిగియ వరద శిరఃఖండన అనే బిరుదులు కూడా ఉన్నాయి.

ఇంకా చాలా బిరుదులున్నాయి. 'చెంచుమల' అనగా అహోబిలం కావచ్చును చెంచులుండే పర్వతం అనే అర్థంలో శ్రీశైలం కూడా కావచ్చును. కాని చెంచువాళ్ళ అమ్మాయి చెంచులక్ష్మిని నరసింహుడు వివాహం చేసుకొని అహోబిలంలో నిలచిపోయినందు అహోబిలం అవటానికే అవకాశం ఉంది.

## విజయాలు

త్రిపురాంతక ప్రాంతాన్ని చోళవంశస్థులు పాలించేవారు. అనవోతారెడ్డి, వేమారె సోదరుడు అన్నచమూపతి, దండెత్తి వెళ్లి చోళులను జయించారు. త్రిపురాంతక ప్రాంతాన్ని శ్రీశైల ప్రాంతాన్ని ఆక్రమించి రాజ్యంలో కల్పుకున్నారు. 'చెంచుమల చూరకార' అ బిరుదు యిందువలన వచ్చి ఉంటుంది.

త్రిపురాంతకం వద్ద 1346, 1347లో శాసనాలు వేయించాడు.

విజయనగర పాలన ప్రారంభమైన మూడేళ్లకు 1339లో అటకలగుండ వద్ద తరువా 1340లో ఆకుమళ్లలో, మొదటి హరిహర రాయలు వేయించిన శాసనాలలో ఆయనక పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వర బిరుదు ఉంది. ఇందువలన విజయనగర సామ్రాజ్య తూర్పున బంగాళాఖాతం వరకు పశ్చిమాన అరేబియా సముద్రం వరకు అచిరకాలంలో వ్యాపించిదనుకోవాలి. కాని బంగాళాఖాతం వరకు పెరిగిన సామ్రాజ్యానికి రెడ్డిరాజు

రాజ్యం కొంతవరకు అడ్డు వస్తుంది. నెల్లూరు పైగా విజయనగరంవారు బంగాళాఖాతాన్ని చేరి ఉంటారు.

## దక్షిణ సరిహద్దు

వేమారెడ్డి మాతామహుడు దొడ్డారెడ్డి. ఈయన విక్రమ సింహపురి నివాసి (నెల్లూరు). పాకనాడు రెడ్డి కుటుంబీకులకు కేంద్రం. వేమారెడ్డి కాలంలో చిటి పెద్దన నెల్లూరు పాలిస్తుండేవాడు. కందుకూరుకు దక్షిణాన ప్రోలయ వేమారెడ్డి శాసనాలు కన్పించటంలేదు. ఈ కారణం వలన రెడ్డి రాజ్యానికి దక్షిణ సరిహద్దు ఎక్కడ అనేది చెప్పటానికి వీలు లేకుండా ఉంది.

## ఎఱ్ఱా ప్రెగ్గడ



వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి సమర్థుడేగాక సరస కవితా సారం తెలిసిన సాహితీ ప్రియుడు. ఈయనగారి కవి మిత్రుడు కవిత్రయంలోని ఎఱ్ఱన (1280-1360).

## అరణ్యం మధ్యలో



నన్నయ గారు అరణ్య పర్వంలో మూడాశ్వాసాలు పూర్తిగా చెప్పారు. నాలుగవ ఆశ్వాసం వ్రాస్తూ 142 పద్యాలు పూర్తి చేశారు. రచన ఆగిపోయింది. ఎందువలన ఆగిందో ఊహకందని విషయం.

వారు చెప్పిన ఆఖరు పద్యం చూడండి.

శారద రాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులం
జారు తరంబులయ్యె వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరములం బరిపూరి తంబులై

( అరణ్య 4 -142 )



తిక్కన గారు, నన్నయ వదలిన దగ్గరనుండి రచన చేయకుండా అరణ్య పర్వశేషాన్ని వదలి విరాట్పర్వంలో తన రచన ప్రారంభించారు.

ఎఱ్ఱనగారు మొదటి భాగంలో నన్నయగారి అఖ్యాన పద్ధతిని, రెండవ భాగంలో తిక్కనగారి నాటకీయ శిల్పాన్ని, తన కవనంలో చెప్పి భారతాన్ని పూరించారు. తాను ఇరువురు

మహారచయితలకు వారధి నిర్మించలేదు. పూలమాలలోని రెండు భాగాలను అందంగా అతికి మధ్యలో సుందరంగా తన చాతుర్యాన్ని చూపుకున్నారు. ఈ విశేషాలు ప్రస్తుతం మనం వదలి వేద్దాం.

ఈ రచన ఉద్దేశం ప్రధానంగా శ్రీనాథ కవిసార్వభౌములను, అయనను పోషించిన పంటరెడ్లను, శ్రీనాథులవారి ఇతర మిత్రులను గూర్చి చెప్పుకోవటం. ఆపైన శ్రీనాథులవారి చాణక్యతను గూర్చి అంచనా వేసుకోవటం. కాబట్టి మనం ఎఱ్ఱనగారిని గూర్చి రేఖా మాత్రంగా చెప్పుకొని ముందుకు కదులుదాము.

ఎఱ్ఱన గారిని రామాయణం వ్రాయమని వేమారెడ్డి కోరినట్లుగా హరివంశంలోని (1-39) పద్యం వలన మనం అర్థం చేసుకోవచ్చును.

**నా తమ్ముండు, ఘనుండు, మల్ల రథినీనాథుండు నిన్నాతత**
**శ్రీతోడన్ సముపేతు జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం**
**జేతో మోదమొనర్ప రామకథ మున్ జెప్పించి, యత్యుత్తమ**
**ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ కావ్యామృతా స్వాదనన్** (హరి 1 - 39)

ఎఱ్ఱన గారికి మల్లారెడ్డి మీద చాలా స్నేహాభిమానాలున్నట్లు కన్పిస్తోంది. అశ్వాసాల ముగింపులలో చాలాచోట్ల మల్లచమూపతిని గూర్చి చెప్పటం ప్రశంసించటం ఇందుకు నిదర్శనంగా భావించవచ్చును. భవిష్యత్తులో శ్రీనాథులవారు కూడ, వేమారెడ్డి, వీరభద్రారెడ్డి సోదరుల అన్యోన్యతను ఎఱ్ఱనగారు పొగడిన రీతిలోనే చెప్పారు.

నిండు సభలో ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱన గారిని సత్కరించి, యిలా అడిగారు.

**భారత పరాంశమని యిం - పారగ జెప్పుదురు బుధులు హరివంశము నీ**
**వారమ్య కథ దెనుంగున - ధీరోదాత్తమ! నిర్వహించి తెలుపుము మాకున్**
( హరి 1-41 )

అప్పుడు ఎఱ్ఱన గారు "వేడుకతో వినుము" అంటూ చక్కని పద్యం చెప్పారు.

**నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనం**
**బెన్న పరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయ మాది దేవుడౌ**
**వెన్నుని వృత్తమీవు కడు వేడుకతో విను నాయకుండ వి**
**ట్లెన్నియొ సంఘటించె మదభీప్సిత సిద్ధికి రాజపుంగవా!** ( హరి 1 - 42 )

"భూవినుత గుణాభిరామ! ప్రోలయ వేమా!", "కల్యాణ వహ మహనీయ రచన హరివంశము" చెపుతాను "సద్భావమున అవధరింపుము" అన్నారు. హరివంశం చెప్పారు.

## మల్లన - ఎఱ్ఱన

అంతటి మహారచయితను మల్లారెడ్డి ఆదరించాక ఎఱ్ఱనగారు మన్నేరు ప్రక్కనున్న గుడ్లూరు వదలిపెట్టారు. గుండ్లకమ్మ తీరాన ఉన్న చదలవాడ వెళ్లి స్థిరపడ్డారు. మల్లారెడ్డి వలన మడి మాన్యాలు పొందారు.

మల్లారెడ్డి రామభక్తుడు. చదలవాడ దగ్గర రామాలయం కట్టించాడు. విగ్రహ ప్రతిష్ఠ చేయించాడు. 1325లో ప్రోలయ వేమారెడ్డి స్వయంగా చదలవాడ వెళ్లి తమ్ముడు కట్టించిన ఆలయానికి దేవభోగంగా ఒక అగ్రహారం యిచ్చాడు. ఒక చంద్రగ్రహణం నాడు గుండ్లకమ్మనదిలో యిసుక తిన్నెమీద కూర్చొని వేమారెడ్డి ఈ అగ్రహారాన్నిచ్చినట్లు ఒక శాసనం వలన తెలుస్తోంది.

ఈ అగ్రహారానికి తన తమ్ముడు మల్లారెడ్డి పేర 'మల్లవరం' అని పేరుపెట్టాడు. మల్లవరం నేటికీ చదలవాడకు ఒక కిలోమీటరు దూరంలో ఉంది. అక్కడ రామాలయం ఉంది.

ఇక్కడ కొంచెం ఆగి ఆలోచిద్దాం. ఓరుగల్లు పతన కాలం 1323. కాని 1325లో ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱనగారికి అగ్రహారం యిచ్చాడు. ఒకవైపున తుగ్లక్ దేవాలయాలు పడగొడుతూ రాచరికాలను కాలరాస్తున్నాడు. మరోవైపు ధైర్యంగా వేమారెడ్డి ఈ పనులు చేశాడు. బహుశా ముస్లింలు ప్రధాన పట్టణాలను వశపరచుకుని ఉంటారు. దండుమార్గాల పరిసర గ్రామాలను ధ్వంసం చేసి ఉంటారు. కాని గ్రామసీమలన్నీ వారి పెత్తనం క్రిందకు వెళ్లి ఉండవు.

ఎర్రనగారు వ్రాసిన రామాయణం నష్టమై పోయింది. కాని 1756 ప్రాంతంలో జీవించిన కూచి మంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహంలో ఎర్రనగారి రామాయణం నుండి పద్యాలను ఉదహరించాడు. ఎప్పటికైనా ఆ రామాయణం లభిస్తే తెలుగు వారి అదృష్టంగా భావించవలసిందే.

హరి వంశాన్ని గూర్చి వేలూరి శివరామ శాస్త్రిగారు యిలా అన్నారు "హరి వంశము భారతమునకు ఖిలము. ఖిలమనగా పరిశిష్టము. ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వరకు గల గ్రంథమును మహాభారతమనియు నందురు."

హరివంశ రచన 1335కు ముందే జరిగింది. ఈ రచనలో ఎఱ్ఱనగారు ప్రోలయ వేమా రెడ్డి మీద చెప్పిన పద్యంలో ఆయన శ్రీ శైలంలోను, అహోబిలంలోను కట్టించి సోపానాలను గూర్చి చెప్పకుండా, వేరే విషయాలు ప్రస్తావించారు.

ఆ పద్యం చూడండడి.

అగ్రహారములు విద్యా తపో వృద్ధ విప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ బనిచె
కొమరార చెరువులు, గుళ్ళు ప్రతిష్ఠించి లోక సంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లను నిలిపె తోటలు సత్రములు చలిపందిళ్లు వెలయ బెట్టె
హేమాద్రి పరికీర్తి తామిత వ్రతదాన నివహంబులన్నియు నిర్వహించె
జేసె, జేయుచున్నాడు, సేయనున్న - వాడు, పునరుక్త కృతి శుభావళుల నెల్ల
ననగ శ్రీ వేమ విభునకు నలరు పేర్మి - వశమె వర్ణింప దద్భాగ్య వైభవంబు
(హరి 1-18)

ఈ పద్యాన్ని గమనిస్తే, ఆ సంక్లిష్ట పరిస్థితులలో కూడా ప్రోలయ వేమారెడ్డి ప్రజాహితం కొరకు చేసిన పనులు మన మనసులను కదిలిస్తాయి. ఎంతో దీక్ష, పట్టుదల, అంకిత భావం ఉంటే తప్ప అలా చేయలేరు.

ఇక్కడో మాట గుర్తు పెట్టుకోవాలి. "చేసె, చేయుచున్నాడు, చేయగలడు." అనటం, చాలా గొప్పగా చెప్పటం; ఎఱ్ఱన గారికే చెల్లింది.

ఎఱ్ఱనగారు హరివంశంలో (2-102) ఒక చోట "మన భూమి బోలు భూమి ఎందును బుట్టదు" అన్నారు. మానవునికి సాదా సీదాగా జీవితం గడుస్తున్నపుడు జన్మభూమి మీది ప్రేమ తెలియదు. అదే ఏదైనా క్లిష్ట పరిస్థితి వచ్చినపుడు, ఆ తీయందన మేమిటో తలపుకొస్తుంది. బహుశ తురకల ధాటి వలన గ్రామాలకు గ్రామాలు రూపు చెడుతున్నపుడు, ప్రజలు ప్రాణాలు దక్కించుకోను పారిపోతున్నపుడు, ఆ తీపి తెలిసి ఉంటుంది. ఆ అనుబంధం గుండెల్లో మెదలినట్లయింది. ఆ ఆప్యాయత, ఆ తల్లి వొడిలోని అమృత భావన మనసును పులకింప చేస్తాయి.

ఎఱ్ఱనగారు వ్రాసిన, అనుపలబ్ధమైన రామాయణాన్ని, లభించిన హరివంశాన్ని అంకితం తీసుకొని ప్రోలయ వేమారెడ్డి ధన్యుడయ్యాడు.

ఒక వైపున తురకల విధ్వంసం కళ్లారా కనిపిస్తుండగా ప్రోలయ వేమ భూపతిని ఎఱ్ఱనగారంతటివారు పొగడిన తీరు ఎబ్బెట్టుగా ఉంది. ఉదాహరణకు యీ పద్యం చూడండి.

కాంతారంబులు దూరి శైలములు ప్రాకన్ బాఱి యంభోధి తో
యాంతర్ద్వీపముల దాటి యెన్నడును భీత్యంతం బెదం గాన క
త్యంత క్లేశము నొందు చుండుదురు వేమాధీశు ధాటిం బరి
భ్రాంతిత్యక్త కళత్ర పుత్ర సుహృదాప్త శ్రీ కులై శాత్రువుల్ (హరి 1-1-15)

ఐనా ఆ చీకటి కాలంలో, ముసునూరి ప్రోలయకు అండగా నిలబడి, తురక మిడతల బెడదను తరుముకుంటూ, తన ప్రత్యేకతను ప్రోలయ వేమారెడ్డి నిలుపుకొని, చైతన్య

వంతంగా, సమయానుకూలంగా, నడుంకట్టి నిలచాడు. కత్తిపట్టి రాజ్య స్థాపన చేశాడు.

మరో పద్యంలో యవనుల గుర్రపుదాడి అనే మహాసముద్రంలో మునిగియున్న భూమిని విజయధాటిచే లేవనెత్తి, తన భుజంమీద నిలుపుకొని ఉద్ధరించాడని ప్రోలయ వేమారెడ్డిని గూర్చి మాలిని వృత్తంలో చెప్పారు. ( హరి. పూ. 5 - 260 )

అనుపతిితి శాసనంలో ఉన్న శ్లోకం ఇదే భావాన్ని వ్యక్తీకరిస్తోంది.

## ఘోడెరాయ గురువు

ఎఱ్ఱన గారు హరివంశంలో వేమక్షితీశుని గురువైన ఘోడెరాయ బిరుదు గలిగిన శ్రీ శైల మల్లికార్జున స్వామి వారి భక్తుని గూర్చి ఒక పద్యం చెప్పారు.

**శ్రీ పర్వతేశ భక్తి - ఖ్యాపితగుణ ఘోడెరాయ గంగ గురు కృపా**
**స్థాపిత సామ్రాజ్య సము - ద్దీపితి ! వేమక్షితీశ! దీప్తి నరేంద్రా !** (హరి ఉ. 4 - 1)

రెడ్డిరాజ్య స్థాపనాచార్యులుగా యీ శైవాచార్యులు ప్రోలయ వేముని కాలంనుండి తరువాత రాజులకు కూడా క్రమానుగతంగా గురువుగానే ఉన్నారు. కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరంలో రాజ్య స్థాపన చేసినప్పుడు యీ గురువు గారిని పట్టెసమునకు తీసుకు వెళ్లాడు. ఇలా యీ శైవ గురువు వీరందరికి ఆరాధ్యుడయినాడు.

## ఎఱ్ఱనగారి బిరుదులు

ఎఱ్ఱనగారు శివభక్తి పరుడు. అందుకే మత విశ్వాసరీత్యా "శంభుదాసు" అనిపేరు పొందారు. కవితా శక్తి వలన " ప్రబంధ పరమేశ్వరుడు" అని బిరుదు సంపాదించారు.

ఎఱ్ఱనగారు గాక మరోకవి, వేమారెడ్డి వద్ద ఉండేవాడు. ఆయన పేరు మహాదేవ కవి. ఈ మహా దేవకవికి ఏడవ తరం వాడైన లొల్ల లక్ష్మీధరుడు గజపతివద్ద, ఆ తర్వాత కృష్ణదేవరాయలవద్ద ఉన్నాడు. అది మరోకథ.

## సోపాన నిర్మాణం

ప్రోలయ వేమారెడ్డి శ్రీ శైల క్షేత్రంలో పాతాళగంగ వరకు మెట్లు కట్టించాడు. ఇలాగే అహోబిల నారసింహ క్షేత్రంలో కూడా సోపానాలు నిర్మించాడు. కావ్యాలలో, శిలా శాసనాలలో యీ విషయాలను ఉదహరించి వేమారెడ్డికి శాశ్వత కీర్తి నిలబెట్టారు.

**"శ్రీ వేమ పృధ్వీపతిః, యేన, శ్రీ గిరి రమ్యహో**
**బలగిరి స్సోపాన మార్గౌ జితౌ**
**విఖ్యాతౌ రచితౌ సనాతన యశస్సంభావలం భూతయే)"**

(మద్రాసు మ్యూజియం శాసనం)

కాటయ వేముని తొత్తరమూడి శాసన శ్లోకార్థం శ్రీ శైల సోపాన నిర్మాణ విషయాన్ని

యిలా వివరిస్తుంది. "చతురమతియగు వేమ భూపాలుడు పాతాళ గంగా తీరంలో శ్రీశైలానికి నిర్మించిన సోపానాలు మేరుపర్వత శిఖరాల నెక్కటానికి, ఆకాశగంగలో స్నానం చేయటానికి దేవాంగనాసౌధాల నధిరోహించటానికి సోపానాలవటం చిత్రం "

## మోటుపల్లి రేవు

ఆ కాలంలో ప్రఖ్యాతి వహించిన మోటుపల్లిని తురకలు విధ్వంసం చేశారు. మల్లారెడ్డి "ప్రతీప ధరణీ పాలావలిం దోలి" మోటుపల్లిని స్వాధీనం చేసుకున్నాడని హరివంశంలో ఎఱ్ఱనగారు వ్రాశారు.

బాహాదర్పమునం బ్రతీప ధరణీపాలా వళిం ద్రోలి యు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతుగావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్ (హరి 1-1-28)

పాడుబడిన రేవు స్వాధీనమయిన తరువాత, కొంతబాగు చేయించి మల్లారెడ్డి నౌకా వ్యాపారం ప్రారంభించేలా చేశాడు.

## కలువపాముల శాసనం

మల్లారెడ్డి, అన్నగారి యందు భక్తి ప్రపత్తులు కలిగి ఉండటమేగాక, కలువ పాముల శాసనం ప్రకారం, తురకలను తరిమికొట్టి విజయాలు సాధించినట్లు శ్లోక ప్రమాణం ఉంది.

వేమానుజస్యా వరజోపి మల్ల - భూవల్లభోసౌ జగదేకమల్ల :
అల్లావదీనాది తురుష్కమల్లాన్ - సముల్ల సద్భృంగ గణాన్ విజిగ్యే.

## అన్నయరెడ్డి

ఈయన ప్రోలయ వేమారెడ్డి తరువాతవాడు. మల్లారెడ్డి కన్నా పెద్దవాడు.

ఎఱ్ఱనగారు అన్నయ రెడ్డిని గూర్చి చెప్పిన పద్యాలలో " సకలార్థ సమన్వితుడు, అన్న దాన సంపన్నుడు, బాహుబల రాసి" అంటూ చాలా వర్ణించాడు.

1377 వ సంవత్సరంలో మల్లికార్జున స్వామి దేవాలయంలో నంది మండపానికి దగ్గరలో వీరశిరోమండపం నిర్మించారు. ఈ మండపంలో వీరభక్తితో శైవులు తలలు, నాలుకలు, గండకత్తెరతో భేదించుకొనే వారని ఆశాసనంలో వుంది.

అనవేమారెడ్డి కాలంలో యీ శాసనం వేయించారు. తన తండ్రి అన్నయరెడ్డి పుణ్యార్థం యీ మండపం కట్టించినట్లుంది.

## వ్యాపారం

ప్రోలయ వేమారెడ్డి రాజ్య ప్రారంభ కాలానికి తూర్పు సముద్రతీరంలోని మోటుపల్లి

ఓడరేవు పాడు బడింది. ఇలాగే నెల్లూరు జిల్లాలోని కృష్ణాపట్టణం ఓడరేవు కూడా ఉండేది. కాకతి గణపతి దేవుడు మోటుపల్లిలో నౌకావ్యాపారాభివృద్ధికి 1244లో "అభయ శాసనం" వేయించాడు. ఓడల కెక్కించే వస్తువుల పట్టీ ఆ శాసనంలో ఉంది. పాతపన్నుల వివరాలున్నాయి.

చందనం, హారతి కర్పూరం, ముత్యాలు, మిరియాలు, పోకలు, దంతం, పునుగు, కర్పూరతైలం, పగడాలు, అత్తరులు, ఇనుము కాని లోహాలు ఎగుమతి చేసేవారు. దిగుమతులలో సిల్కులు, సిల్కువస్తువులు, చైనా కర్పూరం, గులాబి అత్తరులు ఉన్నాయి.

ప్రతి సంవత్సరం అరబ్ దేశాలనుండి గుర్రాలు దిగుమతి చేసుకునే వారు. కాని అభయ శాసనంలో వాటిని చెప్పలేదు.

ప్రోలయ వేమారెడ్డి నౌకా వ్యాపారం వృద్ధిచేసి, ఆదాయాన్ని పెంచాలనుకున్నాడు. ఏర్పాట్లు చేయించాడు.

## అవచివారు

ఆనాడు ఆంధ్ర కోస్తాలోని యీ ఓడరేవును ప్రోలయ వేమారెడ్డి కోర్కె మేరకు బాగా ఉపయోగించి, వ్యాపారాభివృద్ధి చేసిన వ్యక్తి అవచి దేవయ శెట్టి.

శ్రీనాథులవారు తన హరవిలాసాన్ని, అవచి దేవయసెట్టి కుమారుడు అవచి తిప్పయసెట్టి కంకితమిచ్చాడు. ఆ రచనలో "శ్రీ పర్వత సోపాన స్థాపకుడగు రెడ్డివేమ జగతీపతికిన్ బ్రాపైన యవచి దేవయ" అన్నారు. ఇంకా "శ్రీ పర్వత సోపాన స్థాపక వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ వ్యాపారి ముఖ్య" అనీ అన్నారు.

ఇలా అవచివారి సాయంతో విదేశీ వ్యాపారం విరివిగా సాగించారు.

వీరి విశేషాలు హరవిలాస అంకిత సమయంలో చెప్పుకుందాం.

## వేమారెడ్డి సంతానం

"ప్రోలయ వేమారెడ్డి కుమారులు ముప్పురిలో అనపోతారెడ్డి జ్యేష్ఠుడు. అనమాచారెడ్డి అకాలమరణం చెందినట్లు కనపడును. తాను జీవించి యుండగానే ప్రోలయ వేమారె( తనకుమారుడు అనపోతారెడ్డిని యువరాజు పదవినం దుంచి పరిపాలనా విధానమున అతనికి గొప్ప శిక్షణ నిచ్చెను. అతడు ఉబ్బసపు వ్యాధి పీడితుడై తాను స్వయంగా పరిపాలించలేక రాజ్యభారమును తనపుత్రునిపై మోపి విశ్రాంతి గైకొనినట్లు మెకంజీ వృత్తాంతమువలన తెలియుచున్నది. వేమారెడ్డి ఎప్పుడు మృతి నొంది నదియు తెలియదు. కాని అతని శాసనములు 1553 పిదప కానరావు" అని మల్లంపల్లి వారు వ్రాశారు.

కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు మరో అభిప్రాయం వెలిబుచ్చారు.

"ప్రోలయ వేమారెడ్డికి పురుష సంతానము లేనందున సోదరుడైన అన్నారెడ్డి కుమారులు అనపోతారెడ్డిని, అనవేమారెడ్డిని తనపుత్రులుగా చేసికొన్నారు."అన్నారు. ఇందుకు ఉదాహరణగా 1960 అక్టోబరు భారతి సంచికలో ప్రకటించిన అన్నవరం శాసనాన్ని చెప్పారు.

శ్రీ శైలంలో అనవేమారెడ్డి తన తండ్రి అన్నయరెడ్డిని ఉదహరిస్తూ వేసిన శాసనం, వీరశిరోమండప నిర్మాణాన్ని వివరిస్తుంది. దానివలన కూడా అనవేమారెడ్డి ప్రోలయ వేముని పెంపుడు కుమారుడని నిర్ణయించవచ్చును.

ప్రోలయ వేమారెడ్డికి యిద్దరు కుమార్తె లున్నారు. ఒకామె పేరు దొడ్డాంబిక. రెండవ ఆమె పేరు హేమాంబిక.

కాటయ రెడ్డి కుమారుడైన మారయరెడ్డికి ఇమ్మడి కాటయరెడ్డి అనే పుత్రు డున్నాడు. అతనికి దొడ్డాంబిక నిచ్చారు.

రెండవ కూతురు హేమాంబను తెలుగు చోడ వంశానికి చెందిన భక్తిరాజు కుమారుడు లింగ చోడున కిచ్చి వివాహంచేశారు.

ఈ దంపతులకు వేమాంబ అనే ఆడపిల్ల కలిగింది. వేమాంబను అల్లాడరెడ్డి పరిణయమాడాడు. ఈ అల్లాడరెడ్డి తండ్రి దొడ్డారెడ్డి. తాత దువ్వూరి పెరుమాండిరెడ్డి.

ఇమ్మడి కాటయ రెడ్డికి దొడ్డాంబకు వేమారెడ్డి కలిగాడు. ఇతన్ని తండ్రి పేరుతో కలిపి కాటయ వేమారెడ్డి అనిపిలుస్తారు.

మనం పంటరెడ్ల పాలనలోని తొలి దశ లోని వారందరినీ పరిశీలించి ఒక విధంగా ఒడ్డోలగం చేశాము. ఇక్కడ ఆగి 1353 వరకు ఆంధ్రదేశంలో జరిగిన రాజకీయ పరిణామాలను రేఖామాత్రంగా చూద్దాం. అప్పుడు రెడ్డి రాజుల రాజకీయం అంచనావేసుకోగలుగుతాము.

## విజయనగర సామ్రాజ్యం

సంగమవంశంలో హరిహరరాయలు 1336లో విద్యానగరాన్ని పాలించటం ప్రారంభించాడని యింతకు ముందే చెప్పుకున్నాము. విద్యారణ్యస్వామి ఆశీస్సులతో శాలివాహన శకం 1258 (క్రీ.శ.1336) ధాతృనామ సంవత్సరం వైశాఖ మాసం శుక్ల సప్తమినాడు, పుష్యమీ నక్షత్రంలో, సింహలగ్న మందు విద్యానగరానికి పునాదిరాయి వేద్దామనుకున్నారు. కాని అలా జరగలేదు.

నక్షత్రగమనాన్ని చూస్తూ, నకాలంలో శంఖాన్ని పూరించమని కాశీపండితుని కొండమీద నిలబెట్టారు. ఆయన శంఖధ్వని చేయక ముందే, ఒక బిచ్చగాడు తన శంఖాన్ని ఊదాడు. ఆధ్వని విని పునాదిరాయి వేశారు. తర్వాత కాశీ పండితుడు చేసిన శంఖ ధ్వని వినవచ్చింది. పొరపాటు తెల్సింది. విద్యారణ్యులవారు పునాదిలో ఉంచేందుకు కరిగించిన

లోహంతో తయారయిన అచ్చు రెండుంబాతిక చీలికగా చీలిందని, విజయనగరం 225 సంవత్సరాలకన్నా ఎక్కువకాలం ఉండదని అయన చెప్పాడని జనం చెప్పుకుంటారు.

ఇలా ప్రారంభమైన విద్యానగరం, దిన దిన ప్రవర్థమానమైంది. దీనినే విజయనగరమని కూడా పిలుస్తారు.

## హరిహర రాయలు (1336 - 1343)

విజయనగర పాలకులు కర్ణాట యాదవులు. వీరు ఓరుగల్లు పాలించిన కాకతీయుల జండానేవాడుకున్నారు. అది వరాహకేతనము.

హరిహర రాయలు విజయనగరంలోని హంపీలో విరూపాక్ష దేవాలయం నిర్మించాడు. హంపీలో ఉండటం వలన హంపీ విరూపాక్షుడని, విజయనగరాన్ని హంపీ విజయనగర మని పిలుస్తారు.

హరిహర రాయల తండ్రి సంగముడు. తల్లి మేళాంబిక. సంగముని వలన ఆ వంశానికి సంగమవంశం అని పేరు వచ్చింది.

హరిహర రాయల అన్నదమ్ములు ఐదుగురు. వీరు హరిహర రాయలు, కంప రాయలు, బుక్క రాయలు, మారప్ప, ముద్దప్ప.

హరిహర రాయుల పాలనలో అతని సోదరులు కోశాధికారులుగాను, దండనాయకులుగాను, మంత్రులుగాను ఉన్నారు..

## బుక్కరాయలు(1343 - 1377)

హరహర రాయల తరువాత అతని తమ్ముడు బుక్క రాయలు పాలించాడు. కాని ఈయన అధికారానికి వచ్చిన సంవత్సరాన్ని గూర్చి కొన్ని సందేహాలున్నాయి.

నెల్లూరులో దొరికిన శాసనం ప్రకారం, బుక్కరాయలకన్నా పెద్దవాడయిన కంప రాయలు హరిహరుని తర్వాత రాజ్యాని కొచ్చాడు. ఆ తరువాత కంప రాయల కొడుకు రెండవ సంగ రాయలు పాలించాడు. అతడు 1356లో కొందరు బ్రాహ్మణులకు ఒక గ్రామం దానం యిచ్చినట్లు దాన శాసనం వలన తెలుస్తున్నది.

రెండవ సంగ రాయలను తొలగించి, బుక్క రాయలు అధికారానికొచ్చాడు. కాని హరిహర రాయల తరువాత తానే రాజ్య పాలన చేసినట్లుగా చెప్పుకున్నాడు.

ఈ విధంగా యీ పదమూడు సంవత్సరాలు విజయనగర చరిత్రలో గందరగోళాన్ని సృష్టించాయి.

ఈయన కాలంలోనే బహమనీల పాలన సాగింది.

అప్పటికి అద్దంకిలో రెడ్డిరాజులు, ఓరుగంటిలో కమ్మనాయకుడు కాపయ,

హంపీవిజయ నగరంలో సంగమనాయకులు కాలూని, నిలదొక్కు కున్నారు.

## బహమనీ రాజ్య స్థాపన 1347

మహమ్మద్ బిన్ తుగ్లక్ పాలనలో దౌలతాబాద్ రాష్ట్రంలోని అనేకమంది అమీరులు గ్రామాలలో పన్నులు వసూలు చేసి ప్రభుత్వానికి చెల్లించలేదు. మరికొందరు పన్నులే వసూలు చేయలేదు. ఆ అమీరులను బంధించి, భరుకచ్ఛం తీసుకురమ్మని సుల్తాన్ సైన్యాలను పంపించాడు. అంతకుముందు మాల్వాలో యిలాగే బంధించి, చివరకు వారిని చంపించాడు. అందువలన చావు తప్పదని భావించి, దారిలో అమీరులు తిరుగుబాటు చేసి, విముక్తులై, దౌలతాబాద్ తిరిగి వచ్చారు. తమలో ఒకడైన ఇస్మాయిల్ షాను దక్కను ప్రభువుగా ప్రకటించారు. రాష్ట్రపాలకుని బంధించారు.

1346లో అలా జరిగింది. ఐతే ఢిల్లీ సుల్తాన్ వచ్చి తిరుగుబాటును అణచివేశాడు. కాని కొందరు తప్పించుకొని జాపర్ ఖాన్ అనే అల్లాఉద్దీన్ హసన్‌షా నాయకత్వాన గుల్బర్గా చేరుకున్నారు. 1347లో దక్కను పాలకుడుగా హసన్‌షా ప్రకటించుకున్నాడు. బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు.

బహమన్ షాను నిలబెట్టేందుకు ఓరుగంటి కాపయనాయకుడు, విజయనగర పాలకులు సైన్యాలను పంపించి సహాయం చేశారు. ఇది దక్కన్ చరిత్రలో గొప్ప మలుపు.

బహమనీ రాజ్యస్థాపన నాటికి ముసునూరి ప్రోలయ నాయకుడు రేకపల్లిని కేంద్రంగా చేసుకొని (1325) తన పాలన ప్రారంభించి 22 సంవత్సరాలయింది.

ముసునూరి కాపయ నాయకుడు కాకతీయుల విశాల సామ్రాజ్యంలోని చాలా భాగాలను తన క్రిందకు తెచ్చు కొని ఓరుగల్లును స్వాధీనం చేసుకొని (1336) తన నంది కేతనాన్ని ఆకాశంలో రెపరెపలాడించి, ఆంధ్రసామ్రాజ్య పాలన సాగించి పదకొండు సంవత్సరాలైంది. ప్రోలయ వేమారెడ్డి చందవోలులో రెడ్డి రాజ్యం ప్రారంభించి (1324,25) బహమనీ రాజ్యస్థాపన నాటికి 22, 23 సంవత్సరాలైంది. విద్యానగరంలో సంగమవంశపు హరిహర రాయలు రాజ్యపాలన (1336) ప్రారంభించి పదకొండేళ్లయింది.

ఇలా ఈ ముగ్గురు హిందూ రాజులు బలపడిన దశలో, అప్పుడే కళ్లుతెరచిన బహమన్ రాజ్యం, శీఘ్రగతిని పెరిగింది. పెరగటానికి విజయనగరం వారు, ఓరుగంటి వారు సహాయం చేశారు. ఆ సహాయం తీసుకొని, భస్మాసుర హస్తం మాదిరిగా బహమనీలు ఎలా ప్రవర్తించారో, మిగతా హిందూ రాజ్యాలేమయ్యాయో, మనం తెలుసుకోవటానికి శిలాశాసనాలు, తామ్ర శాసనాలు, కవుల రచనలు, విదేశీయుల వ్రాతలు, ముస్లిం చరిత్రకారుల గ్రంథాలు తోడ్పడతాయి. అవన్నీ పరిశీలిద్దాం.

## బహమనీ రాజ్య విస్తరణ

అల్లాఉద్దీన్ హసన్ గంగు తాను ప్రాచీన పారసీక ప్రభువైన బహ్మాన్ శాహు వంశం వాడినని చెప్పుకున్నాడు. ఇందువలన అతని సంతతి వారు బహ్మానీలయ్యారు. అతని రాజ్యం బహమనీ రాజ్యమయింది.

ఇంచుమించు, కొద్ది సంవత్సరాల తేడాలో, తల ఎత్తిన విజయనగరం, బహమనీ రాజ్యాలు తమ రాజ్య విస్తరణ కొరకు నిరంతరం యుద్ధాలు చేశాయి "వాని పోటీ ప్రధానంగా రాయచూరుదోఆబ్ అనగా కృష్ణ తుంగ భద్రల మధ్యనున్న ముక్కోణపు ప్రాంతం కోసం జరిగింది. . "12,13 శతాబ్దాల ప్రాంతంలో, ఈ ప్రాంతం కోసం చోళులు, పశ్చిమ చాళుక్యులు కలహించుకున్నారు. ఆనాడు యిరుపక్షాల వారూ హిందువులే. ఈనాడు భిన్న మతాల వారయ్యారు. అంతేతేడా. గతంలో వలెనే ఇప్పుడు కూడా ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలే కలహాలకు కారణమయ్యాయి. మతవైషమ్యాలు కక్షలకు మరింత కసిని సమకూర్చాయేతప్ప కారణం మాత్రం కాదు." అంటారు కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) గారు.

## బహమనీల పెరుగుదల

బహమన్ షా ఓరుగంటి మీద దండెత్తాడు. తనను నిలపటానికి కాపయనాయకుడు చేసిన సాయం మరచిపోయాడు. ఆ యుద్ధంలో కాపయ ఓడిపోయాడు. చివరకు కౌలస దుర్గాన్ని, దాని క్రింద ఉన్న ప్రాంతాన్ని యిచ్చుకుని సంధి చేసుకున్నాడు.

ఈ దశలో ఢిల్లీ నవాబు ముహమ్మద్ బిన్ తుగ్లక్ 1351లో చనిపోయాడు. అందువలన బహమన్‌షాకు ఢిల్లీ భయంలేకుండా పోయింది. పైగా అతనికి, పూర్వం ఢిల్లీనవాబు క్రిందనున్న రాజ్యమంతా జయించి సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేయాలనే కోరిక కలిగింది.

1355 చివరి భాగంలో మరల ఓరుగంటి మీద దండెత్తాడు. భువనగిరి కోట పట్టుకున్నాడు. తెలంగాణాలో సంవత్సరం ఉండి బీభత్సం చేశాడు. దేవాలయాలు పడగొట్టి మసీదులు కట్టించాడు. చివరకు తిరిగి గుల్బర్గాచేరి 1358లో చనిపోయాడు. అతని కుమారుడు ఒకటవ మహమ్మద్ షా (1358 - 1375) రాజ్యాని కొచ్చాడు.

## వినాయక దేవుడు

కాపయ నాయకుడు తన కుమారుడు వినాయక దేవుని నాయకత్వాన సైన్యాన్నిచ్చి, తాను పోగొట్టుకున్న, కౌలస పట్టణాన్ని పట్టుకోమని పంపించాడు. ఇతనికి సహాయంగా మొదటి బుక్కరాయలు ఇరవై వేల గుఱ్ఱపు దళాన్ని పంపించాడు.

మహమ్మద్‌షా విజయనగరం వారి అశ్వికదళాన్ని ఓడించి, చాలా గుఱ్ఱాలను స్వాధీనం చేసుకున్నాడు. దేశాన్ని దోచుకొని గుల్బర్గాకు వెళ్లిపోయాడు.

వినాయక దేవుడు భువనగిరిని స్వాధీనం చేసుకున్నాడు. ఆ తరువాత బహమన్ రాజ్యంలో ముందుకు వెళ్లాడు. ఓడిపోయి వేలం పట్టణంలో తల దాచుకున్నాడు. కాపయ నాయకుడు సంధి చేసుకున్నాడు.

మరల మహమ్మద్‌షా వినాయక దేవుని మీదకు దండెత్తి వెళ్లాడు. వేలం పట్టణాన్ని ముట్టడించాడు. వినాయక దేవుడు బందీగా దొరికాడు. నిండు కొలువులో తనను దూషించాడని మహమ్మద్‌షా, వినాయక దేవుని నాలుక కోయించాడు. కోట బురుజు మీద ఫిరంగికి కట్టి, క్రింద మంటలలో త్రోయించి చంపించాడు.

## గెరిల్లా పోరు

మహమ్మద్ షా తిరిగి పోతున్నపుడు, దారిలో గెరిల్లా పోరాట పద్ధతిని, రాత్రివేళ మహమ్మదీయ సైన్యం మీదపడి తెలుగువారు ఛిన్నాభిన్నం చేశారు. మహమ్మద్ షా విలువైన వానిని తీసుకొని, మిగతావానిని తగలబెట్టించి పారిపోయాడు. తిరుగు ప్రయాణంలో మూడవ వంతు సైనికులను మాత్రమే దక్కించుకోగలిగాడు. కొలసకోట చేరేసరికి అతనికి భుజంమీద బలమైన గాయమయింది.

## కాపయ ఓటమి

1363లో కాపయ నాయకుడు, విజయనగర పాలకుడు కలసి ఢిల్లీ పాలిస్తున్న ఫిరోజ్ షా తుగ్లక్ ను బహమనీ రాజ్యంపై దండెత్తి రమ్మని, అలావస్తే సహాయం చేస్తామని వ్రాశారు. ఇది తెలిసి మరల మహమ్మద్‌షా దండయాత్ర చేశాడు. విజయ నగరాధీశ్వరుడయిన బుక్కరాయలు ప్రాగ్దేశ దండయాత్రలో రెడ్డి ప్రభువులతో యుద్ధాలు చేస్తుండటంవలన, కాపయకు సహాయం పంపించలేక పోయాడు.

మహమ్మద్ షా తెలంగాణాలో రెండేళ్ళుండి విధ్వంసం చేశాడు. 1364-65లలో సంధి జరిగింది. యుద్ధ నష్ట పరిహారంగా కాపయనాయకుడు 33 లక్షల వాణాలిచ్చి గోలుకొండను శాశ్వతంగా వదులుకున్నాడు. మూడువందల ఏనుగులను, యాభై గుర్రాలను యిచ్చాడు. వైఢూర్య స్థగితమగు బంగారు సింహాసనం కూడా యిచ్చాడు.

ఆ తరువాత బహమనీలు సరిహద్దు నతిక్రమించలేదు. ఉభయులు ప్రశాంతంగా ఉన్నారు.

## పిచ్చి పనులు

ఒకటవ బుక్కరాయలు ముద్గల్ కోట పట్టుకొని, కోటలోని స్త్రీ పురుష, బాల, వృద్ధులందరినీ చంపించాడు. ఈ వార్త తెలపటానికి ఒక్కడిని మాత్రం చంపలేదని ఫెరిష్టా వ్రాశాడు.

దీనికి ప్రతిక్రియగా లక్షమంది హిందువులను చంపుతానని మహమ్మద్ షా సైన్యంతో బయలుదేరాడు. ముద్గల్ స్వాధీనపరచుకున్నాడు. విజయ నగరాన్ని ముట్టడించాడు.

ఇలా యిరువురూ హత్యాకాండ సాగించారు. 5 లక్షల హిందువులను మొత్తంమీద చంపారని, ఫలితంగా కర్ణాటక రాష్ట్రం అపారంగా నష్ట పోయిందని, ఎంతో కాలానికి గాని కోలుకోలేదని ఫెరిష్టా వ్రాశాడు.

మహమ్మద్ షా అనంతరం అతని కుమారుడు ముజహిద్ షా (1375-1378) పాలించాడు.

## చరిత్ర మరో మలుపు తిరిగింది

ముసునూరి ప్రోలయ నాయకునకు, ప్రోలయ వేమారెడ్డికి ఉన్న అనుబంధం, దీక్ష, ధ్యేయం తరువాతవారికి లేకపోయింది. కాపయనాయకుడు అనవోతారెడ్డి పాలనలో శత్రువులైన తురుష్కులను పారద్రోలటంగాక, స్వరాజ్యాన్ని పెంచుకోవటం ధ్యేయమయింది. అందువలన ముసునూరివారికి, రెడ్డి ప్రభువులకు, వెలమలకు, విజయనగరంవారికి తీవ్ర యుద్ధాలు జరిగాయి. రాజ్యపుటెల్లలు తరచు మారాయి. ప్రజలు పలు బాధలకు లోనయ్యారు. బహమనీలు వీరిమధ్య చొరబడి, కోతి, పిల్లి, రొట్టె ముక్క సామెతగా విస్తరించారు.

# నాలుగవ ప్రకరణము

## అనవోతా రెడ్డి

మరల మనం రెడ్డి ప్రభువుల దగ్గరకొద్దాము. ప్రోలయ వేమారెడ్డి 1353లో చనిపోయాక అనవోతారెడ్డి (1353-1364) రాజ్యానికొచ్చాడు.

ఎఱ్ఱనగారు హరివంశం వ్రాస్తున్న కాలానికి ప్రోలయ వేమారెడ్డి పెంచుకున్న అనవోతారెడ్డి యువరాజుగా ఉన్నాడు. ఎఱ్ఱనగారు వ్రాసిన హరివంశం లోని ఈ పద్యం చూడండి.

**వితత యువరాజ విభవో - న్నత పోతయ సైన్యనాథ నయమార్గ సమీ**
**హిత సంతత సేవా విల - సిత పుత్ర శ్రీ సమృద్ధ! శివమతి సిద్ధా!!** ( 2-9-260 )

అనవోతారెడ్డి సైన్యనాధుడు కావటమేగాక, కళింగులతో యుద్ధం చేసి విజయాన్ని సాధించాడు.

అదే కాలంలో రాజమహేంద్రవర ప్రాంతాన్ని ముసునూరి కాపయ నాయకుని పక్షాన తొయ్యేటి అనవోతరాజు పాలిస్తుండేవాడు. ఇతనిని చోడ భక్తిరాజు సంహరించాడు. కాపయ నాయకుడు బహమనీలతో పోరాటంలో మునిగి ఉండటం వలన, యీ విషయంలో

కల్పించుకొని చోడ భక్తి రాజును శిక్షించలేక పోయాడు.

## కళింగుల దండయాత్ర

కళింగ రాజు మూడవ నరసింహదేవుడు దండెత్తి వచ్చాడు. అతని సేనానాయకులు కాళిదాస సేనాపతి, గోవింద సేనాపతి కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళందాకా దండునడిపారు. దారిలో వారికి ఎదురు లేకపోయింది. నరసింహదేవుని శాసనం 1353 నాటిది శ్రీకాకుళంలో ఆంధ్రదేవుని గుడిలో ఉంది.

అనవోతారెడ్డి సైన్యాలను సమాయత్త పరచుకొని పోరాడాడు. ఆపైన మూడవ నరసింహ దేవుని సైన్యాలను కళింగ రాజ్య సరిహద్దువరకు పారద్రోలాడు.

కళింగ రాజులకు రెడ్డి ప్రభువులకు జరిగిన మొదటి యుద్ధం యిదే.

## బలపడిన రెడ్డి రాజ్యం

ఈ యుద్ధానంతరం రెడ్డి రాజులు తమ రాజ్య సరిహద్దును గోదావరి నదివరకు పెంచుకోవటమేగాక, వీలున్నపుడు సింహాచలంవరకు విస్తరించటం జరిగింది.

ఈ యుద్ధంలో అనవోతారెడ్డి ముందుగా దివితాలూకాలోని తలగడ దీవి పట్టుకున్నాడు. అందువలన "ద్వీప జేతా" అనే బిరుదును పొందాడు.

కళింగులపై సాగిన దండయాత్రలో చాలా కోటలను పట్టుకోవటం వలన కావచ్చు"వీరన్న వోత భూపతి" అనే బిరుదు కలిగినట్లు కన్పిస్తున్నదని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాశారు.

అనవోతారెడ్డి ఏఱువ భక్తిరాజు సాయంతో రాజమహేంద్రవరంలోని ఖమ్మడి నాయకుని, కోరుకొండ దుర్గ పాలకుని, పిఠాపురంలోని కొప్పుల నాయకులనూ తేలికగా లోబరుచుకున్నట్లనిపిస్తున్నది.

అనవోతారెడ్డి శాసనాలు 1353, 1356 నాటివి కోరుకొండలోను, ద్రాక్షారామంలోను కన్పించాయి. పూర్వ దిగ్విజయము 1353 నుండి 1356 వరకు జరిగి ఉండవచ్చును.

అనవోతారెడ్డి కాపయనాయకుని రాజ్య భాగమైన తీరాంధ్ర భూమిని స్వాధీనం చేసుకున్నాడు. కాపయనాయకునికి, రెడ్డిరాజులకు ఉన్న సంబంధాలు తెలియజేసే చరిత్ర సామగ్రి యింతవరకు లభించలేదు. కాని, అనితల్లి కలువ చేరు శాసనంలో రెడ్డిరాజులు కాపయకు అత్యంత విధేయులని ఉంది.

ఏ కారణం వలననో అనవోతారెడ్డి చోడులతో యుద్ధం చేయవలసి వచ్చింది. వీగిపోయి, మరల రాజీ పడ్డాడు.

## మోటుపల్లి

అనవోతారెడ్డి విదేశీ వ్యాపారాన్ని బాగా అభివృద్ధి చేస్తేగాని బొక్కసానికి పుష్కలంగా ధనం లభించదని భావించి మోటుపల్లిని అభివృద్ధి చేశాడు. 1358లో ఈయన వేయించిన శాసనం ద్వారా మనకు ఆనాటి పన్నులు, వసతులు, వ్యాపార సరుకుల విశేషాలు తెలుస్తాయి. ఈ శాసనం వలన విదేశీ వ్యాపారుల మీద విధించిన 'అపుత్రిక దండము' 'కడ్డాయము' తొలగి పోయాయి. బంగారం మీద, వెండిమీద ఉన్న పన్నులను పూర్తిగా తీసివేశాడు. గంధము మీద వరుబడి సుంకాన్ని పూర్వ మర్యాదలో మూడోవంతుకు తగ్గించాడు. ఇలా పన్నులను వసూలు చేసే పద్ధతిని వ్యాపారులకు ప్రోత్సాహము కలిగే విధంగా వ్రాయించాడు. ఈ శిలా శాసనం తెలుగులోను, తమిళంలోను మోటుపల్లిలోని వీరభద్ర స్వామి ఆలయ మంటప స్తంభముల మీద 1358లో వేయించాడు. ఇందువలన తమిళులు కూడా మోటుపల్లి ద్వారా విరివిగా నౌకా వ్యాపారం చేస్తుండేవారని గ్రహించగలము. ఈ శాసనాలు సంస్కృతంలో కూడా ఉన్నాయి.

ప్రధానమైన ఎగుమతి సరుకు నూలు బట్టలు. 'దేశి, పరదేశి, నానాదేశి' అని పిలువబడే 'చాలు మూల సమస్త పెక్కండ్రు బేహారులు' మొటుపల్లికి వచ్చి వ్యాపారం విరివిగా సాగించేవారు. ఇందువలన తీరాంధ్రదేశం సిరిసంపదలతో తులతూగింది.

## రాచకొండ - దేవరకొండ

ఇక్కడ కొద్దిసేపు ఆగి కదన రంగంలో వీర విహారం చేస్తున్న రేచెర్ల వెలమ వారి సంగతి చెప్పుకుందాం.

రేచెర్ల దాచానాయని ముగ్గురు కుమారులలో అశీతి వరాల సింగమనాయడు ప్రసిద్ధుడని ఇంతకుముందు చెప్పుకున్నాము. 1336లో ఆంధ్ర నాయకులతోపాటు సింగమ నేడు కూడా ముసునూరి ప్రోలయ నాయకుని నాయకత్వాన మహమ్మదీయులపై తిరుగుబాటు చేశాడు.

ఆ సందర్భాన్ని ఇంద్రగంటివారు చక్కని పద్యాల్లో చెప్పారు.

కాకతి రాజ్య పాతమును గాంచి కృశించియు జావలేని ప్రో
ణాకులమూర్తి బెండపుడి యన్నయ మంత్రియు కొల్ని రుద్రుడున్
కాకలదేఱు రేచెరల గండడు సింగమనీడు వృద్ధ సిం
హాకృతి -- పావక త్రితయమై యవనాటవి గాల్ప సిద్ధమై (పేజీ 119)

ఒక్కటే త్రాట - నొక మాట, యొక్క చేత
యనగ స్వాతంత్ర్య దీక్షకై యనువు వఱచి

ఘనుడు ముసునూరి ప్రోలు విక్రమము నెంచి
నాయకుని జేసి యతని యాజ్ఞలను జనిరి (పేజి 119)

మలక సంద్రపు కుంభ సంభవుడు - వేమ రెడ్డి, కొప్పుల ప్రోలయ, దొడ్డ వేంగ
భూపతియు సింగనీడును, పొసగ-మంచి కొండ గణపతి వీరుడు, కూడి రవుడు
(పేజి 120)

ఓరుగల్లు పట్టుకొని కమ్మనాయకుడు కాపయ పాలన చేస్తూ ముస్లింలతో పోరాటాలు చేస్తూ ఉన్నాడు. కాపయకు లోబడి ఉండటానికి సింగమనీడు అంగీకరించలేదు.

కాపయ బహ్మన్ షా తో యుద్ధం చేస్తున్నపుడు, సింగమనీడు ఓరుగల్లుకు దక్షిణదిశగా, కృష్ణానదికి ఎడమవైపున ఉన్న చిన్న చిన్న రాజ్యాలను జయించి విస్తరించాడు. కృష్ణా తుంగభద్రల మధ్య కొంతభాగము, నల్లగొండ జిల్లాలోని ఏలేశ్వరము స్వాధీనం చేసుకున్నాడు.

## జల్లిపల్లి కోట

సింగమనీడు రాజ్య విస్తరణలో భాగంగా జల్లిపల్లి కోటను ముట్టడించాడు. దాని పాలకులు సోమ వంశ క్షత్రియులు. కోటలోనివారు తమ్మళ బ్రహ్మాజీ అనే మోసకారిని నియోగించారు. అతను సింగమనీడును మాయోపాయంతో బాకుతో పొడిచి పారిపోయాడు. సింగమనీడు చనిపోయాడు.

అసమాన్య పరాక్రమ వంతుడైన సింగమనీని మీద చాటుధారతో ఉన్న పద్యాలు అతని విశేషాలను వివరిస్తాయి.

లాలిత శౌర్య కీర్తి నవ లక్ష తెనుంగు దళంబు నాజిలో
దోలిన పాండ్య భూ విభుని తోడి పెనంకువ కోర్చి సన్నుతిన్
వ్రాలి ప్రతాపరుద్ర సభ వర్ణన కెక్కిన యెఱ్ఱదాచ భూ
పాల సుతుండు సింగని కభంగుని కే బిరుదైన చెల్లదే.

( వెలుగోటి వారి వంశ చరిత్ర - పుట 27 )

సింగమనేని కి అనపోతానేడు మాదానేడు అనే కుమారులున్నారు. తండ్రి మరణవార్త విన్న వెంటనే వారుభయులు దండెత్తి వెళ్లి 1361 లో జల్లిపల్లికోటలోని సోమవంశ క్షత్రియులను, వారికి తోడ్పడిన వారిని చంపివేశారు. శత్రురక్తంతో పితృతర్పణ చేశారు.

## కక్షలు రగిలాయి

కాని ఈ యుద్ధంలో జల్లిపల్లి సోమవంశ క్షత్రియులకు రెడ్డి రాజుల తరపున కొందరు, కమ్మనాయకులు కొందరు సహాయం చేశారు. వెలుగోటివారి వంశ చరిత్రలో యిలా

ఉంది " వారలకు సహాయులై వచ్చిన గోన మల్లారెడ్డి, మంగపూడి యిమ్మడి రెడ్డి, రావు వరపు మల్లారెడ్డి, పోతులూరి పోలారెడ్డి, బండి కోటారెడ్డి, వినుకొండ మారారెడ్డి, కుంట్లూరు మారారెడ్డి, అరవపల్లి గౌరిరెడ్డి, కొత్తపల్లి కొండారెడ్డి, గౌరగిరి నారారెడ్డి, కొలనుచెలమ కొండమాచారెడ్డి, రామగిరి పట్టణాధీశ్వరులు, ద్విశతదుర్గాధీశ్వరులు అను పంట ముమ్మడి, పంటమైలారు రాజులు మొదలగువారును, కమ్మనాయకులును యుద్ధ సన్నద్ధులై రాగా అనపోతానాయుడును, మాదానాయుడు ప్రచండ తర బాహాదండ విరాజమాన మండలాగ్రమ్ములు గలవారై మొగులూరి దుర్గము సమీపమున జెంజెర్ల భూమి ప్రాంతమున వారలతో ఘోరమైన యుద్ధము సల్పి వారలను బరిమార్చి వారి రక్తముతో బితృ తర్పణమ్ము గావించి పగడీర్చుకొనిరి."

కాని కమ్మ నాయకుని మీద, రెడ్డి అనవోతా రెడ్డి మీద వారి పగ అంతటితో తీరలేదు.

రెండవ ప్రతాపరుద్రుని కాలంలో వెలమలు మంచి స్థానాలలో ఉన్నారు. ప్రోలయ వారికి ప్రత్యేక స్థానాలు కల్పించలేదు. అందరినీ కలుపు కొచ్చాడు. అంతవరకే జరిగింది.

ముసునూరి ప్రోలయ, బెండపూడి అన్నమంత్రికి "ఆంధ్ర భూమండలాధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనాచార్య" బిరుదు ప్రసాదించాడు. రుద్రమదేవి రేచెర్ల ప్రసాదిత్య నాయకునికి " కాకతిరాయ రాజ్యస్థాపనాచార్య" బిరుదు యిచ్చింది. కాని ప్రోలయ కాలంలో అన్నమంత్రి స్థాయి వారికి లభించలేదు.

కాపయ "ఆంధ్రదేశాధీశ్వర," ఆంధ్రసురత్రాణ" బిరుదులు దాల్చాడు.

ఓరుగల్లులో పోరాడి, రెండవ ప్రతాపరుద్రుని రక్షించుకోవాలని, వెలమలు ప్రయత్నించినపుడు, ఎక్కువ సంఖ్యలో వారు వీర మరణం చెందారు. ఉన్నవారు తమకో ప్రత్యేక రాజ్యం కావాలను కోవటం వలన, కాపయ నాయకునితో సంఘర్షణ ప్రారంభమయింది. ఆరాజ్యం కూడా తెలంగాణాలో ఓరుగంటికి దగ్గరగా ఉండటం కూడ తలనొప్పి అయింది.

## రాచకొండ

ఆ తరువాత అనవోతానీడు రాచకొండ దుర్గాన్ని అభివృద్ధిపరచి, రాచకొండ నుండి పాలించాడు. అతని తమ్ముడు మాదానేడు దేవర కొండ నుండి రాజ్యం చేశాడు.

సింగ భూపాలీయంలో రాచకొండ వీరి సనాతన రాజధాని యని ఉన్నది.

శ్లో॥ రాజా స రాజాచల నామధేయా మధ్యాస్త వంశక్రమ రాజధానీమ్ ॥

(ఆ రాజు తమ వంశ పరంపరగ రాజధానియగు రాచకొండయను రాజధాని నధివసించెను.)

## కాపయ మరణం

1368 లో ఈ అన్నదమ్ములిద్దరూ వరంగల్లు మీదకు వెళ్లారు. బహుమనీలతో పోరాడి కాపయ అలసి ఉన్నాడు. సైన్యాలు సిద్ధంగా లేవు. పోరు జరిగింది. ముసునూరి కాపయ నాయకుడు యీ యుద్ధంలో చనిపోయాడు. కమ్మవారి రాజ్యపాలన ఓరుగంటి నుండి యిలా ముగిసింది.

ఓరుగల్లు రేచెర్ల వారి స్వాధీనమయింది. అదే కాలంలో నేడు భువనగిరి అని పిలుస్తున్న త్రిభువనగిరి దుర్గాన్ని కూడా రేచెర్ల వారు జయించారు.

ఓరుగల్లును జయించినా, రేచెర్లవారు దానిని తమ రాజధానిగా చేసుకోలేదు. రాచకొండ, దేవరకొండల నుండే రాజ్యపాలన చేశారు.



## చరిత్రలో ముసునూరి పాలకులు

ముసునూరి వారి పాలనపై, మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అభిప్రాయాలు విందాం.

"ముసునూరి వారు పూర్తిగా అర్ధ శతాబ్దము కాలమైనను తెలుగు దేశమును పరిపాలించలేదు. ఈ వంశములో పరిపాలనను నెరపినవారు ప్రోలయ నాయక, కాపయ నాయకులు యిద్దరు తప్ప మరెవ్వరును లేరు. అయినను తెలుగుదేశ చరిత్రలో వారు నిర్వహించిన పాత్ర అనుపమానమైనది.

వింధ్యకు దక్షిణమునందుండిన గొప్ప హిందూ రాజ్యములన్నియు ఢిల్లీ సుల్తాను ముహమ్మదు బిన్ తుఘ్లకు పాదాక్రాంతములై, ఆచక్రవర్తి మగటిమిని, సామ్రాజ్య బలమును, తలెత్తి ఎదిరింపలేని కాలమున, పూర్వపు సూర్యవంశ, చంద్రవంశజులైన క్షత్రియుల రాజ్యములన్నియు క్రుంగి, కూలారిపోయిన కాలమున, అంతటి మహాబలవంతుడైన ఢిల్లీ చక్రవర్తి పై కత్తి కట్టి అధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యోద్యమమును లేవదీసి, దానిని విజయవంతముగ నడిపిన కీర్తి ప్రతిష్ఠలు తెలుగు ప్రజానీకమువి; తెలుగు నాయకులవి; అందును ముఖ్యముగ ముసునూరి ప్రోలయ, కావయ నాయకులవి. వీరు హిందూ రాజ్య పునరుద్ధరణమునకు దీక్షా కంకణములు కట్టి యవనుల యధీనమైన తెలుగు భూమిని ఉద్ధరించిన పిదపనే దక్షిణ దేశమునందుండిన ఇతర రాజ్యములకు ధైర్యముకలిగి ఢిల్లీ సుల్తానుపై తిరుగుబాటు గావించి, విజయలక్ష్మీ సంపన్నములైనవి. హిందూదేశ చరిత్రలో తెలుగు నాయకుని ఆధిపత్యమున తమకు తామై ప్రజలే తమ శ్రేయోభాగ్యముల కొరకు

అపూర్వ ధైర్యోత్సాహములతో విమత బలములను ఎదురించి పోరాడి స్వరాజ్యమును స్థాపించుకొనిన అపూర్వ అద్భుత ప్రకరణ మిది; ప్రాచీన చరిత్రలో అశ్రుతపూర్వమైనది.

ముసునూరి నాయకులకు విజయమే లభించి యుండక పోయినచో మన తెలుగు దేశ చరిత్ర మరొక తెన్నున నడచి యుండెడిది. అందువలన ముసునూరి నాయకుల పరిపాలన కాలము కొద్ది దైనను అది మహా సంఘటనా కలితమైనది. ముసునూరివారి స్వాతంత్ర్య విజయముతో తెలుగు దేశములో నూతన యుగము ఆరంభమైనది. తెలుగు దేశ చరిత్ర ఉత్తర, మధ్య యుగములలో పడినది". (విజ్ఞాన సర్వస్వం, 3వ సంపుటి, పేజి 292, 293)

మనం యిక్కడ ఆగి రెడ్ల పాలన పరిశీలిద్దాం.

## రెడ్డి రాజ్యం పై దండ యాత్రలు

బహమనీ సుల్తాన్ మొదటి అహమ్మదు షా సింహాసన మెక్కిన తొలి సంవత్సరంలోనే కాపయ నాయకుని ఓరుగంటి మీద దండయాత్ర చేశాడని చదివారుగదా! అతనంతటితో ఆగలేదు. కృష్ణానది దాటి రెడ్డి రాజ్యం మీద పడ్డాడు. తెలంగాణాలోని సూర్యాపేట దగ్గరున్న పిల్లల మర్రి దేవాలయాన్ని నాశనం చేసినట్లే, అమరావతిలోని అమరేశ్వరాలయాన్ని అపవిత్రం చేశాడు.

అనపోతారెడ్డికి ప్రధానియైన మల్లయమంత్రి కుమారుడు వేమసేనాధిపతి బహమనీల అశ్విక దళాన్ని ఎదుర్కొని భయంకర యుద్ధం చేశాడు. శత్రువుల నోడించి పారద్రోలాడు.

తరువాత మల్లయ వేమ సేనాపతి - ఈయనను కూడా తండ్రి పేరు కలిపి పిలిచేవారు - అమరేశ్వరాలయాన్ని బాగు చేయించాడు. 1361వ సంవత్సరంలో, శ్రావణ మాసంలో బహుళ పంచమి గురువారం నాడు "అనపోత రెడ్డిం గారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిన్ని, ధనకనక వస్తు వాహన సమృద్ధిన్ని, పుత్ర పౌత్రాభివృద్ధిన్ని, అవునట్లు గా పంచారామంబులకుం బ్రథమారామంబైన అమరారామంబను శ్రీ ధాన్యవాటి పురంబునకు నధీశ్వరుండైన అమరేశ్వర శ్రీ మన్మహాదేవరను" పునః ప్రతిష్ఠచేశాడు.

## రేచెర్ల వారి దండయాత్ర

జల్లిపల్లి కోట జయించాక, రెడ్డి రాజుల సైన్యాల వెంటబడి, రేచెర్ల వెలమనాయకులు యుద్ధంచేసి ఉంటారని భావిస్తున్నాను. కృష్ణానది దాటి, ధరణి కోటవరకు వచ్చారు. ధరణి కోట వద్ద యుద్ధం జరిగింది. వెలుగోటి వారి వంశావళిలో రేచెర్ల వారికి జయంకలిగినట్లు వ్రాశారు.

అనపోత, మాదా నీడుల పినతండ్రియైన కతారి నాయకుడు ధన్నాల కోటవద్ద రెండు పర్యాయాలు రెడ్లను ఎదిర్చి, అనపోతారెడ్డికి 'వెనుడాగు' పెట్టి విడిచాడని వెలుగోటి

వారి వంశావళి చరిత్ర చెపుతోంది.

అనవోతా రెడ్డెదిరిన - ఘనుడై దన్నాల కోట కాడను మున్నే
వెనుడాగు పెట్టి విడిచెను - వినుతింప గఠారినాగ విభుడు ధరిత్రిన్

"దన్నాల కోట యొద్ద ననపోతారెడ్డి మానంబు సిగ్గును బోనాడి రయంబునన్ బఱవ" అని ఉంది. వెలుగోటి వారి వంశావళి పుటలు (15,31,36,51,86,99)

ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వర దేవుడు చూడ కృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రాహుతు గేస భూవిభున్
గానకు దోలి వెన్నడచి కాచిన వేమయ యన్నపోత భూ
జానికి సత్త్రుబంధము లొసంగిన వెన్నెలకంటి వారిలోన్ (విష్ణుపురాణం)

ఘన శౌర్యండగు మాధవాధిపుని డాకన్ భీతి విభ్రష్ట సా
ధనుడై దన్నల కోట యొద్ద ననపోతారెడ్డి మానంబు, సి
గ్గును బోనాడి రయంబునన్ బఱవగా క్షోణీ స్థలిన్ జూడ నే
డును నచ్చో నడియాలమై కసవుపాటున్ లేదు త్రోవౌటచేన్

(వెలుగోటి వారి వంశ చరిత్ర 51 పుట)
(వెల్లా సదా శివ శాస్త్రి, అవధానము శేషశాస్త్రి)

ఆ సమయంలో శ్రీ శైలప్రాంతం రాచకొండ వారి వశమయింది. వారు శ్రీ శైలానికి సోపాన పంక్తులు కట్టించారు.

అనపోతా రెడ్డి మీద తాత్కాలిక విజయాన్ని సాధించాక, రేచెర్ల వారు "జగనొబ్బ గండ", "రాయవేశ్యాభుజంగ" మొదలగు రెడ్డి రాజుల బిరుదులను తామూ ధరించారు.

ఇంతచరిత్ర ఆ గ్రంథంలో వ్రాసినా, దన్నాల కోట రేచెర్ల వారి క్రిందకు వెళ్లలేదు. ఆ ప్రాంతం ప్రోలయ వేమారెడ్డి కాలంనుండి రెడ్డి రాజుల క్రిందనే ఉంది.

## విజయనగరం వారి దండయాత్ర

అనపోతారెడ్డి యిలా పోరాటాల్లో ఉన్న సమయంలో విజయనగర పాలకులు తమ అధికారాన్ని తూర్పు సముద్ర ప్రాంతానికి వ్యాప్తి చేసుకున్నారు. దండును పంపించి, కర్నూలు జిల్లాలోని తూర్పు ప్రాంతాన్ని, నెల్లూరు జిల్లాలోని పాదిలి, దర్శి ప్రాంతాలను కైవసం చేసుకున్నారు. 1364లో దూపాడు ఆక్రమించినట్లు దూపాడు కైఫీయత్ వలన తెలుస్తోంది

మొదటి బుక్కరాయలు రేచెర్ల వారిని ఓడించి, శ్రీశైల ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

## రాజధాని మార్పు (1364)

మైదాన ప్రాంతంలోని అద్దంకి బలమైన స్థావరం కాదు. తరచు శత్రువులతో పోరాటాలు జరుగుతున్నాయి. గిరిదుర్గమైన కొండవీడు శత్రు దుర్భేద్యంగా ఉన్నందున రాజధాని కనువుగా ఉంది. ఆనాటి వరకు గిరి దుర్గంగా పరిగణింపబడిన కొండవీడును రాజధానిగా చేసి, అనపోతారెడ్డి దాన్ని అభివృద్ధి చేశాడు. 1364 నుండి కొండవీడు రెడ్డిరాజుల రాజధాని అయింది.

కాటయవేముని అన్నవర దాన శాసనంలో యీ విషయాన్ని గూర్చిన శ్లోకం ఉంది.

## కవులు - దేవాలయాలు

అనపోతారెడ్డి ఆస్థానంలో ఎఱ్ఱన గారు దానాలు పొందినట్లు భావించటానికి వీలుగా కొల్లూరు గ్రామం దాన మిచ్చిన విషయం వలన తెలుస్తోంది. ఎఱ్ఱన గారికి "తాడి నగరపు పొలమున ఇరుపుట్టి 57, వేమూరి పొలమున 57 బెరసి కేసరిపాటి 53 ఖండ్రిక " యిచ్చినట్లుంది. శాసనకాలం 1364వ సంవత్సరం.

బహుశ కొండవీటిని రాజధానిగా చేసిన సందర్భంలో ఎఱ్ఱన గారికి భక్తి పూర్వకముగా యీ దానం చేసి ఉండవచ్చును.

ప్రోలయ వేమారెడ్డి కాలంల్లో మల్లారెడ్డి ద్వారా రాజాదరణ పొంది అనపోతారెడ్డి పాలనలో తన జీవితాంతం ఎఱ్ఱనగారు ఆస్థానంలోనే ఉన్నారు.

అనపోతారెడ్డి బాలసరస్వతి అనే మరొకరిని గూడా అదరించాడు. వెన్నెల కంటి సూరన కవి నుండి కృతుల నందుకొన్నట్లు విష్ణుపురాణంలో ఉంది "...వేమయ యన్నపోత భూజానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటి వారికిన్" అని ఉండటం ఆధారంగా భావించవచ్చును.

## కొడుకు చిన్నవాడు

అనపోతారెడ్డికి అనేక బిరుదులున్నాయి. "పల్లవాదిత్య", "పల్లవ త్రినేత్ర", "జగనొబ్బగండ", "వీరనారాయణ" "రాయచేగోలుగండ" అనేవి ప్రధానమైన బిరుదులు.

అనవోతారెడ్డికి ఆలస్యంగా సంతానం కలిగినట్లుంది. ఒక పుత్రిక, పుత్రుడు ఉన్నారు. పుత్రిక పేరు అన్యమాంబ. పుత్రుని పేరు కుమారగిరిరెడ్డి.

అనవోతారెడ్డి త్రిపురాంతక దేవుని భక్తుడు. ఆయనను పూజించి, ఆ దేవదేవుని అనుగ్రహంవలన కుమారుని కన్నట్లుగా తోస్తున్నది. త్రిపురాంతక దేవుడు నెలకొన్న 'కుమారగిరి' పేరు తన కొడుకుకు పెట్టుకున్నట్లుంది. ఇది ఊహమాత్రమే.

అనవోతారెడ్డి చనిపోయే నాటికి కుమారగిరి రెడ్డి చిన్నవాడు. అందువలన రాజ్యపాలన

అనపోతారెడ్డి తమ్ముడు అనవేమారెడ్డికి లభించింది.

అనపోతారెడ్డి ఎప్పుడు చనిపోయాడో తెలుసుకునేందుకు ఆధారాలు లేవు. కాని ఆయన తర్వాత పాలించిన అనవేమారెడ్డి తొలి శాసనం 1364లో ఉంది. కాబట్టి అదే ఆయన చివరి సంవత్సరంగా భావించుకుందాము.

# ఐదవ ప్రకరణము

## అనవేమారెడ్డి నాటి రాజ్యాలు

మనం రెడ్డి రాజుల పాలనలో మూడవ పాలకుడైన అనవేమారెడ్డి ప్రాభవాన్ని యికపైన పరిశీలించవలసి ఉంది.

రెడ్డి రాజులందరిలోకి అనవేమారెడ్డి అదృష్టవంతుడుగా భావిస్తున్నాను. ముందు ముందు మీరే గమనించగలరు.

కొండవీటి సింహాసనాన్ని అనవేమారెడ్డి అధిష్ఠించింది 1364 అని చెప్పుకున్నాం. ఆనాటి దేశ రాజకీయాలు రేఖా మాత్రంగా పరిశీలిద్దాం.

ఓరుగల్లును కమ్మనాయకుడు కాపయ పాలిస్తున్నా బహమనీలతో యుద్ధాలలో మునిగి ఉన్నాడు. రేచెర్ల వారు స్వంత పాలన సాగిస్తూ రాజ్యాన్ని విస్తరించుకొంటున్నారు. మరో నాలుగేళ్ళలో (1368) వీరు ఓరుగల్లు నాక్రమిస్తారు.

బహమన్ పాలనలో రెండవ పాలకుడైన మహమ్మద్‌షా విజయనగరం వారి తోను, ఓరుగల్లు వారితోను యుద్ధాలలో ఉన్నాడు.

విజయనగర సంగమ వంశంవారు దక్షిణానికి రాజ్యాన్ని విస్తరించుకుంటూ, కొండవీటివారిని కబళించాలనుకుంటున్నారు.

ఈ దశలో అనవేమారెడ్డి సింహాసనాన్ని అధిష్ఠించాడు.

## అనవేమారెడ్డి (1364-1386)

అనవేమారెడ్డి తన శాసనాలలో తాను " రాజ్యశ్రీ రమణీ స్వయంవర పతి" అని వ్రాయించుకున్నాడు. అనగా తాను రాజ్యలక్ష్మి చేత పతిగా వరించబడిన వాడనని అర్థం.

కుమారగిరి రెడ్డి పసివాడుగా ఉన్నాడు. కళింగ, విజయనగర, రాచకొండ, బహమన్ శత్రువులు కొండవీటి నాక్రమించుకోవాలని చూస్తున్నారు. అందువలన ప్రధానమంత్రి, దండనాయకులు, సామంతులు, కుటుంబసభ్యులు బహుశ ఏకగ్రీవంగా అనవేమా రెడ్డిని రాజ్యధిపతిగా నిర్ణయించి ఉండవచ్చును. అందువలననే ఆయన రాజ్యశ్రీ రమణీ స్వయంవరపతి అయ్యాడు.

## దండయాత్రలు

అన్నగారు చివరి దశలో పోగొట్టుకున్న రాజ్యాలను మరల జయించాలని అనవేమారెడ్డి సైన్యాలను సిద్ధం చేసుకున్నాడు. దండయాత్రకు బయలు దేరాడు. కృష్ణ - గోదావరి నదుల మధ్యగల వేంగి దేశాన్ని జయించాడు. ఉండి పురము రాజధానిగా గల సూర్యవంశ క్షత్రియులను, కామవరపు కోట రాజధానిగా గల చోడవంశజులను జయించాడు. నిరవద్యప్రోలు - అనగా నిడదవోలు - రాజధానిగా గల చంద్రవంశ చాళుక్యరాజులను అతిక్రమించాడు.

ఆదండయాత్ర నాటికి కామవరపు కోటపాలించే చోడభక్తిరాజు చనిపోయాడు. అతనికి యిద్దరు భార్యలున్నారు. పెద్ద భార్య కుమారుడు భీమలింగ చోడుడు. ఇతన్ని భీమచోడుడని కూడా పిలుస్తారు. రెండవ భార్య కొడుకు అన్నదేవ చోడుడు.

భక్తిరాజు చనిపోయాక పెద్ద వాడైన భీమలింగ చోడుని సింహాసనం ఎక్కనీయకుండా అన్నదేవచోడుడు తానే సింహాసనాన్ని అధిష్ఠించాడు. 1367లో పట్టాభిషేకం చేసుకున్నాడు.

భీమలింగ చోడుడు ప్రోలయ వేమారెడ్డి రెండవ కుమార్తె హేమాంబను వివాహం చేసుకున్నాడు. ఇలా భీమలింగచోడుడు అనవేమారెడ్డికి బావగారవుతాడు.

అనవేమారెడ్డి అన్నదేవచోడుని ఓడించి, భీమలింగ చోడుని కామవరపుకోటకు అధిపతిని చేశాడు.

## గోదావరినది దాటి

కోనసీమను వశపరచుకొని, గోదావరి నుత్తరించి, రాణ్మహేంద్రవరాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

కోరుకొండను పాలించే ముమ్మడి నాయకుడు కాపయ నాయకుని బంధువు. ఇతడు అనపోతారెడ్డి కాలంలో మాదిరిగానే విధేయుడుగా ఉండేందుకు అంగీకరించాడు.

1374 నాటి నడుపూరు తామ్రశాసనము, 1377 నాటి వలివెల శిలాశాసనము, 1381 నాటి ద్రాక్షారామ శిలాశాసనము, అదే కాలంనాటి వానపల్లి రాగి శాసనము ఈ విజయ యాత్రలను తెలియ పరుస్తున్నాయి.

అనవేమారెడ్డి ముందుకు కదిలి పిఠాపురంలోని కొప్పుల వారి నోడించాడు. ఈ విజయాలను తెలియపరచే " రాజమహేంద్ర నిరవద్య నగరాది బహువిధ స్థల దుర్గ వర్గ విదాళన బలరామ" అని " సాగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గ రఘురామ" అని బిరుదులను దాల్చాడు.

ఈ విజయ యాత్రలో బావమరది అయిన కాటయరెడ్డి, సోదరుడు మారయరెడ్డి,

బంధువులయిన నూంకయ, నల్ల నూంకయ, దువ్వూరి దొడ్డారెడ్డి, అతని సోదరులు సహకరించారు.

కాటయరెడ్డికి "జలదుర్గమల్ల" అనే బిరుదు, ఈ విజయ యాత్రలలో జలదుర్గాలను జయించటం వలన వచ్చింది.

## వలసలు

రెడ్డిరాజ్య ప్రారంభంనుండి, దువ్వూరు రెడ్లు, కాటయరెడ్డి కుటుంబాల వారు రాజమహేంద్ర వరంలోను, ఆప్రాంత గ్రామాలలోను స్థిరపడసాగారు.

కాటయ వేమారెడ్డి తండ్రి రెండవ కాటయరెడ్డికి ప్రోలయవేమారెడ్డి కూతురు దొడ్డాంబికనిచ్చారు. వీరిపుత్రుడు కాటయ వేమారెడ్డి అనవోతారెడ్డి కుమార్తెను పెళ్లాడాడు. దువ్వూరు రెడ్లలో అల్లాడ రెడ్డికి ప్రోలయ వేమారెడ్డి పౌత్రియు, చోడ భీమలింగ దేవుని పుత్రికయు అయిన వేమాంబనిచ్చారు.

ఈ బంధువులందరూ అనవేమారెడ్డికి అండగా నిలిచారు. రాజ్యవిస్తరణలో భాగంగా అనవేమారెడ్డి రెడ్ల కుటుంబాలను గోదావరి మండలంలో స్థిరపరచాడు. పిఠాపురం ప్రాంతంలో యిలా వలసవచ్చిన పంటరెడ్ల గ్రామాలు యిప్పటికీ ద్వీపాల్లాగా కన్పిస్తాయి.

అనవేమారెడ్డి యలమంచిలి పాలించే చాళుక్య రాజైన నాల్గవ ఉపేంద్రుని జయించాడు. ఆ ప్రాంతంలో కూడా రెడ్ల కుటుంబాలను స్థిరపరచినట్లు కన్పిస్తోంది. ఆరుద్రగారు దివ్వెల గ్రామం దిమిలి గా మారిందని, ఆ ఊరులో పంటరెడ్ల ప్రముఖులైన నగిరెడ్డి, సిగిరెడ్డి జనపరెడ్డి, కసిరెడ్డి, సాతిరెడ్డి అనే కుటుంబాలున్నాయని వ్రాశాడు. ఇలాంటి వారంతా వలస వెళ్ళినవారే.

## సింహాచలం చేరి

ఆపైన వడ్డాది మత్స్య వంశులను లొంగదీశాడు. సింహాచలం వెళ్లి నరసింహస్వామికి 1375 ఏప్రిల్ 4న కొన్ని కైంకర్యాలకు నిబంధనలు చేశాడు. అనేక దానాలిచ్చాడు.

సింహాచలం మొదలైన ప్రాంతాలలో కీర్తి స్తంభాలను నాటాడు. "సింహాచలాది వింధ్య పాద ప్రతిస్థాపిత కీర్తి స్తంభ" అనే బిరుదు వహించాడు. 1375లో పూర్వ దేశ దండయాత్ర పూర్తి అయింది.

## తెలంగాణా వైపు

అన వేమారెడ్డి వేయించిన శిలా శాసనం 1377 నాటిది మిర్యాలగుడ దగ్గరలో ఉన్న వాడపల్లిలో ఉంది. ఇదే సంవత్సరానికి చెందిన మహాదేసటి వంశ అన్నమ నాయకుని

శాసనం బూరుగుగడ్డలో ఉంది. అన్నమ నాయకుడు అనవేమారెడ్డికి సామంతుడైనచో నల్లగొండ జిల్లాలో మరికొంత ప్రాంతం కూడా - బహుశ కృష్ణానది దిగువ ప్రాంతం - వీరి పాలనలో ఉండితీరాలి.

వెలుగోటి వారి వంశావళి చరిత్రలో దేవరకొండ ప్రభువైన సింగయ మాధవుని చేతిలో అనమేమారెడ్డి ఓటమి చెంది పారిపోయినట్లుంది.

"సింగయ మాధవు చేరిన యనవేము డోడిపాఱు కొరంత చూడవైతి"

( వె.వం.పుట 39 )

వెలుగోటివారి వంశ చరిత్రలోని ఈ పద్యం పరిశీలించదగినదిగా ఉంది.

దన్నడకోట ముంగల నుదగ్ర బలోన్నతి గంగదాటి సం
పన్నబలుండు సింగ జనపాలుని మాదడు రెడ్డి పోతనిన్
బన్నిన సేనలం దునిమి పాఱగ దోలె విరాటు వీట న
త్యున్నత విక్రమంబున సుయోధను దోలు కిరీటి కైవడిన్

దన్నడకోట అనగా ధరణికోట.

ఆ తరువాత పడమరగా కదలి శ్రీశైలాన్ని జయించి శ్రీశైలంలో 1378 జనవరి 6న శాసనం వేయించాడు.

అనవేమారెడ్డి 1382లో మన్యమాపురంలో వేయించిన శాసనం వలన ఆనాటికి కొండవీటి రాజ్యం సింహాచలంనుండి కందుకూరువరకు, శ్రీశైలం నుండి తూర్పు సముద్రం వరకు వ్యాపించింధి.

## శివ భక్తుడు

అనవేముడు మహా శివ భక్తుడని అయన మీద చెప్పిన చాటువు వలన తెలుస్తున్నది.

అరుణోదయ తపనోదయ సంగమ మధ్యాహ్న సాయ మర్ధనిశాః
శివ పూజా సమయా ష్షట్ప్రతిదిన అనవేమ పార్థి వేంద్రస్య ॥

( శృంగార శ్రీనాథం పుట 55 )

1377వ సంవత్సరంలో ఈయన శ్రీశైలం వెళ్లాడు. భ్రమరాంబను, మల్లికార్జున స్వామిని దర్శించుకున్నాడు. ప్రోలయ వేమారెడ్డి నిర్మించిన సోపానాలు చూశాడు. తాను శ్రీశైలం శివాలయంలో "వీర శిరోమండపం" నిర్మించాడు.

వీరశైవమతంలో భక్తులు పరమేశ్వరుని మెప్పించేందుకు తమ అంగాలను ఖండించుకొని సమర్పించుకునేవారు. ఆవేశంతో, భక్తి పారవశ్యంతో తమ శిరస్సులు కూడా ఖండించుకోవటం జరిగేది. వీర శిరోమండపం ఈ వీరశివారాధకులకు బాగా

ఉపయోగపడేది.

దైవ ప్రీతికొరకు స్త్రీ పురుషులు ఆత్మహత్యలు చేసుకునే గుడి (చంపుడు గుడి) ఒకటి ఉన్నట్లు "సింహాసన ద్వాత్రింశిక" లో కొరవి గోపరాజు వ్రాశాడు. ఎనిమిది దిక్కులలోను ఎనిమిది మంది భైరవులు తమ ఎనిమిది శరీరాంగాలను కోసుకొని, రక్త తర్పణం చేసి, చివరకు తల నరుక్కున్న ఆరాధకులను ఆయన పేర్కొన్నాడు. ఇలాగే వీర శిరోమండపంలో ఎందరో భక్తులు నాలుకలు కోసుకొని, శిరస్సులు నరుక్కొని, సాయుజ్యం పొందారని ఒక శిలాశాసనం చెపుతోంది.

## దానాలు, నిర్మాణాలు

అనవేమారెడ్డి కులదైవం త్రిపురాంతక దేవుడు. కుల దేవత మూల గూరమ్మ. 1376లో ఈయన మూలగూరమ్మకు అంగరంగ భోగాలకై కోటభూమిలోని (1) పడిదరము (2) మూలగూరము (3) పలకలూరు దానమిచ్చాడు. గుంటూరు జిల్లాలో అమీనాబాద్‌లో మూలగూరమ్మ గుడి ఉంది. ఆ కొండమీద చెక్కిన శాసనం వలన మనకీ విషయం తెలుస్తున్నది.

విశ్వోత్తరుండైన వేమ భూపాలుండు తన కులస్వామికి అమృత కిరణ
రేఖావతంసకు శ్రీ ముల్లగూరమ్మ కఖిల జగన్మాత కంగరంగ
భోగసంసిద్ధికై ధార.వోసి యిచ్చు - గ్రామములు మూడు శ్రీ కోట భూమియందు
పడిదరము ముల్లగూరును పల్కలూరు - దాన ఖచరేంద్రు డాచంద్ర తారకముగ॥

"....భువన మోహనముగాగ
సమధికోన్నతి నభ్రంక షంబులైన
గుడియు బ్రాకారవలయంబు గోపురము' కట్టించాడు.

యాబలూరులోని జలధారేశ్వర స్వామికి, గోపాల స్వామికి ఆలయాలు కట్టించాడు.

ద్రాక్షారామంలో భీమేశ్వరాలయానికి "తిరుచుట్టు మాలియ దివ్యలింగంబుల గుళ్లు, వజ్రంపు రాకోట, గోపురములు, పాతాళ గేహములు, సోపాన భాండాగార వివిధ ధాన్యాలయములు, వంట యిండ్లు, చతుర్ద్వార కవాటములు" నిర్మించాడు.

"ధాన్యవాటిలో అమరేశ్వరుని పునఃప్రతిష్ఠించెను" ప్రజలకు "మధురాన్నము, మృదులాంబరము, మృగమదము, చామీకరము" ప్రసాదించాడని ఒక చాటు శ్లోకం చెపుతోంది.

శ్రీశైల దిగ్విజయ యాత్ర ముగిసిన కొద్దికాలానికి రాచకొండవారు మొదటి అనపోతానేని నాయకత్వాన సింహాచలం వరకు జయించారు. కళింగాన్ని ఆక్రమించారు. కళింగ ప్రభువైన నాల్గవ నరసింహ దేవుడు ఓడిపోయాడు. సంధి జరిగింది. బహుశ ఈ

సందర్భంలోనే కావచ్చు అనపోతానేని ధర్మపత్ని కనకలక్ష్మీదేవి సింహాచల స్వామిని దర్శించి కానుకలర్పించి 1380లో శాసనం వేయించింది.

అనవేమారెడ్డి ఈ సందర్భంలో ఏమి చేశాడో తెలియటంలేదు. కాని 1381 నాటి మాన్యమాపుర, వానపల్లి, ద్రాక్షారామంలోని అనవేమారెడ్డి శాసనాల వలన, రాచకొండవారు మెరుపు దాడి మాత్రమే చేసి ఉంటారని తేరాల సత్యనారాయణ శర్మగారు తమ రెడ్డి రాజ్య చరిత్రలో వ్రాశారు.

అనవేముని బిరుదుల వలన మనకు చాలా విషయాలు తెలుస్తున్నాయి. (1) పరచితానేక గతి విశేష వారణ మారణోపాయ (2) ప్రజా పరిచిత చతుర్విధోపాయ (3) క్షురికా సహాయ (4) కరవాల వైన తేయ (5) ఖండిత విమత వ్యాళ (6) విక్రమ పంజర నిగృహీత రిపురాజ సింహ (7) విజయ కుంజరాలాన నిజభుజస్తంభ సంభృత యశోమండన ఇలా చాలా ఉన్నాయి.

దిగ్విజయ యాత్రల వివరాలు ఈయన వేయించిన అనేక శాసనాల వలన తెలుస్తున్నాయి. ధృజవరము, ఇప్పుగల్లు, పచ్చని తాండిపట్టు, కొల్లూరు (1364), నడుపూరు, వానపల్లి(1381), మాన్యమాపురం(1382), పెద చెఱుకూరులలో దొరికిన ఎనిమిది రాగిరేకుల శాసనాలు గాక 1378లో శ్రీశైలంలో వేయించిన శాసనం అతి ముఖ్యమైనది.

దిగ్విజయములనంతరం పంచారామాలలో గజగంటలను సమర్పించుకొని "మహనీయాంధ్రదేశ పట్టాభిషేక సంవృత మహాభాగ్య" బిరుదాన్ని దాల్చాడు.

## విదేశీ వ్యాపారం

ఆనాడు కంజీవరం కేంద్రంగా అవచివారు గొప్పగా విదేశీ వ్యాపారం చేస్తున్నారు. నౌకా వ్యాపారంలో మంచి పేరు సంపాదించారు.

మనం శ్రీనాథులవారి కంజీవర ప్రయాణంలో ఈ వివరాలన్నీ ముచ్చటించు కుందాం. ప్రస్తుతం కొంత తెలుసుకుందాం.

అవచివారు సుమిత్రాద్వీపంలోని వన్సోర్, మలయా ద్వీపంలో ఆగ్నేయ పుటంచునున్న జలనోంగి, సింహళం, గోవా, జాఫ్నా, భూటాన్, చీనా దేశాలలో విరివిగ వ్యాపారం చేసేవారు. ఈ విషయాలను శ్రీనాథుల వారు వర్ణించారు.

రెడ్డి రాజుల రాజ్య సుస్థిరతకు, అవచి వారి వ్యాపారానికి అవినాభావ సంబంధం ఉంది. అవచివారు ఎంతో యుద్ధ సామగ్రి, పరిమళ ద్రవ్యాలు, గుఱ్ఱాలు దిగుమతి చేసి అందించేవారు. అరేబియా పర్షియాలనుండి ప్రతి సంవత్సరం దక్షిణ భారత దేశానికి పదివేల గుఱ్ఱాలు దిగుమతి అయ్యేవని విదేశీయుల వ్రాతల వలన తెలుస్తోంది.

నూలు వస్త్రాలు, అత్తర్లు, సుగంధ ద్రవ్యాలు, అన్ని రకాల రత్నాలు, ముత్యాలు,

మణులు, చందనం, ఎర్ర చందనం, అద్దకాలు, కలంకారీ వస్త్రాలు, మోటుపల్లి ద్వారా ఎగుమతి చేసేవారు.

రెడ్డిరాజులకు కప్పాల వలన చాలా ఆదాయం వచ్చేది. అవచివారి నౌకా వ్యాపారం వలన రాజ భాండాగారానికి విరివిగా సరుకులు లభించేవి.

రెడ్డి రాజుల ప్రాభవానికి, విదేశీ వ్యాపారానికి చాలా సంబంధం ఉంది.

## మంత్రులు

ఈయన మంత్రులు చరిత్ర ప్రసిద్ధులు. ఒకరు ఇమ్మడీశ్వరుడు. మరో మంత్రి మామిడి పెద్దన. ఇంకొకరు రాయని భాస్కరుడు. రాయని భాస్కరుని గూర్చి సునందా పరిణయంలో ఉన్న పద్యం చూడండి.

**అన్న వేమ మహీశ దత్తా గ్రహార - మదకరాందోళికాశ్వ సన్మణి విశేష**
**భూషణాద్యష్ట భూతి విభూషితుండు - భాను తేజుండు రాయని భాస్కరుండు.**

## దానాలు

అనవేమారెడ్డి చాలా దానాలు చేశాడు. ముఖ్యంగా హేమాద్రి దానకాండలో చెప్పిన 16 దానాలలో ముఖ్యమైన 4 దానాలు బ్రహ్మాండదానం, కల్పతరు దానం, కనక ధారా దానం, గోసహస్ర దానం చేశాడు. సత్రాలు కట్టించాడు. బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలిచ్చాడు. కవీశ్వరులకు వేల కొలది సువర్ణాలిచ్చి "బహు సహస్ర సువర్ణ దాన సంతోషిత మహా కవీశ్వర" బిరుదాన్ని పొందాడు.

అనేక మంది కవులను పోషించినా యీనాటి వరకు అనవేమారెడ్డికి అంకితమీయబడిన కృతి ఒక్కటి కూడా దొరకలేదు.

## ధర్మ వేమన

అనవేమారెడ్డి ప్రజారంజకంగా పాలించాడు. న్యాయ నిర్ణయంలో స్వపర భేదాలు చూడకుండా ఉండేవాడు. ధర్మాన్ని చెప్పటంలో నీతికి కట్టుబడేవాడు. ఇందువలన ఈయనను "ధర్మ వేమన" అని ప్రజలు పిలుచుకునేవారు.

వెన్నెలకంటి సూరనార్యుని విష్ణుపురాణంలోని ఒక పద్యం అనవేమ భూపాలుని కీర్తిస్తుంది.

**తన బ్రతుకు భూమి సురులకు - తన బిరుదులు పంట వంశ ధరణీశులకున్**
**తన దయను భూమి ప్రజలకు - అన వేమన యిచ్చె కీర్తి కభవుండగుచున్**

## వసంతోత్సవాలు

తొలిసారిగా కొండవీటిలో వసంతోత్సవాన్ని ప్రవేశ పెట్టింది అనవేమారెడ్డి. దీనిని

మదనోత్సవం అనికూడా పిలుస్తారు. ఉత్తర భారతదేశంలో హోలీ పండుగగా యీ ఉత్సవాన్ని అత్యుత్సాహంగా గ్రామ గ్రామాన చేస్తారు.

ఈ ఉత్సవ సమయంలో మంచి గంథం, కస్తూరితో పాటు కర్పూర ఖండాలను కూడా చూడవచ్చిన వారి మీద అనవేమారెడ్డి వెదజల్లేవాడు. ప్రతి సంవత్సరం ఈ ఉత్సవం చేయటం వలన " వసంత రాయడు" అని, కర్పూర కళికలు వెదజల్లటం చేత "కర్పూర వసంత రాయడని" పేరు పొందాడు.

తొమ్మిది రోజుల ఉత్సవంలో కొండవీడు సుగంధాలవీడై ఘుమఘుమలాడి పోయేది.

## కవి పండిత పోషణ

రెడ్డిరాజులందరూ కవి పండితులను ఘనంగా సన్మానించి పోషించారు. అనవేమారెడ్డి మహాదేవుని వంటి పండిత ప్రకాండుల్ని, బాలసరస్వతి, త్రిలోచనాచార్యవంటి కవులను ఆదరించాడు. కొన్ని రాగి శాసనాల వలన నృసింహభట్టు, వైకుంఠభట్టు, పెద్దిభట్టు, విశ్వేశ్వరభట్టు మొదలగు వారిని ఆదరించినట్లు తెలుస్తోంది. తెలుగు కవి ప్రకాశ భారతీయోగి కూడా వీరి ఆస్థానములో ఉన్నాడు.

అనవేమారెడ్డి సంస్కృతాంధ్రాలలో చాలా కావ్యాలు రచించాడట. కాని ఒక్కటీ యింతవరకు దొరక లేదు.

అనవేముని మీద ఎవరు చెప్పారో తెలియని చాటువు లభించింది.

**పంది కొమ్మెక్కి పెనుపాము పడగలెక్కి - మేటితామేటి వీపెక్కి మెట్టలెక్క**
**విసివి వేసారి అనవేమ విభుని చేరి - రాటి వాసంబు గతి మించె రత్న గర్భ.**

**(చా. ప. మ. మ. 80 )**

మరో చాటువు కూడా ఉంది.

**కవితా కన్యకు నలుగురు! - కవి జనకుడు భట్టు దాది గణుతింపంగా,**
**నవ రసికుడె నాథుండౌ - అవివేకియె తోడబుట్టు వన వేమ నృపా!**

**(చా. ప. మ. మ. 78 ,**

అనవేమ భూపతి కాలంలో జరిగినట్లు చెప్పబడే సిద్ధుడు గొల్లవాని కథ నేను వివరించదలచలేదు. కాని దండకవిలెలో ఉన్న ముగ్గురు నృత్య కళాకారిణులను గూర్చి చెప్పుకోవటం అవసరం. వారు ముగ్గురు సోదరీమణులు. వారిపేర్లు కంచి, పేరి, పొన్ని అని దండకవిలెలో ఉంది.

## కంచి - కంచికచెర్ల

ఈ ముగ్గురు తమ నృత్యకళతో అనవేమారెడ్డిని మెప్పించారు. ఆయన వీరికి అగ్రహారాలిచ్చాడు. ఈ అగ్రహారాలు నందిగామ తాలూకాలో ఉన్నాయి.

కంచికి యిచ్చిన గ్రామం కంచకచర్ల. ఆ గ్రామాభివృద్ధి కొరకు ఆమె చాలా పెద్ద చెరువును తవ్వించింది. ఆ చెరువుకు గండిపడింది. ఎన్ని పర్యాయాలు పూడ్చినా ఆగలేదు. చివరకు ఆమె సకలాభరణ భూషితురాలై, దైవ ప్రార్థన చేసి, ఆ గండిలో కూర్చుంది. మట్టిపోసి గండి పూడవమని చెప్పింది. ఆమె కోరిన విధంగా ప్రజలు తండోపతండాలుగా వచ్చి గండి పూడ్చారు.

ఆ తర్వాత గట్టుమీద ఆమె విగ్రహం నిలిపి గుడికట్టారు. కంచెలమ్మను పరాశక్తిగా ప్రజలు ఆరాధించారు. ఆ చెరువును కంచెలమ్మ చెరువని పిలుస్తున్నారు. దేవతగా కొలుస్తున్నారు.

## వరద పాయసం

వర్షాలు పడక వ్యవసాయానికి యిబ్బంది కలిగినపుడు గ్రామ ప్రజలు ముందుగా బొడ్రాయి కడిగి, పూజిస్తారు. అప్పుడూ వాన కురవకపోతే, వరదపాయసం అనే పూజ చేస్తారు. గ్రామ ప్రజలు పాయసం వండి ఆ గుడి మీద, విగ్రహంమీద ఒకరి తర్వాత ఒకరు ఆ పాయసాన్ని పోస్తారు. ఆ పాయసం వరదగా చెరువులోకి ప్రవహించేది. ఇలా చేయటం వలన తప్పక వాన వచ్చేదని ఆ గ్రామంలోనివారు నాతో చెప్పారు.

ఈ 'వరదపాయసం' ఆచారం పల్నాడులో కూడా ఉండేది.

## పేరి - పెరికలపాడు

పేరి తన పేరుమీద పెరికల పాడు అనే గ్రామాన్ని కట్టించింది. ఆ ఊరిలో ఆమె చెరువు నిర్మించింది. మధ్యలో రావూరి వెంకటేశ్వరస్వామిని ప్రతిష్ఠించింది. చెరువు కట్ట మీద శివాలయం కట్టించింది. పది శిలాశాసనాలు వేయించింది. 'పేరి'ని పేరకలమ్మగా పూజిస్తూ ప్రజలు చెరువు గట్టు మీద గుడి కట్టించారు. దేవతగా కొలుస్తున్నారు.

## పొన్ని -పొన్నవరం

తన సోదరీమణులిద్దరి మాదిరిగానే పొన్ని తానూ ఒక చెరువు త్రవ్వించింది. ఆ చెరువు ప్రక్కన ఆమె పేరుమీద 'పొన్నవరం' అనే గ్రామం వెలిసింది. ఆమె గుడి కట్టించింది. శాసనాలు వేయించే సమయంలో చక్రాంకితాలు వేయించుకుంది.

ఎవరైనా వైష్ణవుడుగా మారాలనుకుంటే ముందుగా కొన్ని పనులు చేయాలి. వాటిని పంచ సంస్కారాలంటారు. అవి 1. తప్త చక్రాంకనం 2. నొసట ఊర్ధ్వపుండ్రం 3. పేరు మార్పు 4. మంత్రజపం 5. యజనం.

కాల్చిన యిత్తడి శంఖ చక్రాలను భుజాలమీద వేయించుకుంటారు. చర్మంకాలి, టీకాల మాదిరిగా ఆగుర్తులు జీవితాంతం ఉంటాయి. దాని అర్థం యీ దేహం నాదికాదు, శ్రీ మహా విష్ణువుదని చెప్పటం. అలాగే యజనం చేయటమంటే దైవపూజ చేయటం.

పాన్ని యిలా వైష్ణవం తీసుకోవటమేగాక శాసనాలలో గూడా శంఖ చక్ర చిహ్నాలను ఏర్పాటు చేయించింది.

ఈ ముగ్గురి చరిత్ర చంద్ర దండకవిలెలో ఉంది. వీరికీయబడిన గ్రామాల సరిహద్దులు కూడా దండకవిలెలో వివరంగా ఉన్నాయి.

## స్వర్ణయుగం

అనవేమారెడ్డి 22 సంవత్సరాలు పాలించి, 1386లో చనిపోయాడు. అప్పటికి పంటరెడ్ల రాజ్యం సుస్థిరతను సంపాదించుకుంది.

రెడ్డిరాజుల పాలనలో అనవేమారెడ్డి కాలాన్ని స్వర్ణయుగంగా భావించవచ్చును. అంతః కలహాలు లేకుండా, కీర్తి ప్రతిష్ఠలతో, వసంతోత్సవాలతో, రాజ్యాన్ని విస్తరించుకొని, సంగ్రామ విజయాలు సాధించి ఆయన కన్నుమూశాడు. గొప్ప ఖ్యాతి గాంచాడు.

## ఇతర పాలకులు

మనం కొండవీటిలోనే ఉంటే మిగతా పాలకుల గొడవలు తెలియవు. ఒకమాటు రెడ్డి రాజులతోపాటు వారిని కూడా రేఖా మాత్రంగా తెలుసుకుందాము.

## హరిహరరాయలు

బుక్కరాయల తరువాత రెండవ హరిహర రాయలు (1377-1404) అధికారానికి వచ్చాడు. ఆయన తన తండ్రి సంపాదించిన విశాల భూభాగాలను కట్టుదిట్టం చేసుకున్నాడు. బహమనీల నోడించి గోవా రేవును, రాయచూరును, తుంగ భద్ర కృష్ణల మధ్యనున్న దోఅబ్ ప్రాంతాన్ని ఆక్రమించాడు. కాని మరో యుద్ధంలో వీటిని పోగొట్టుకున్నాడు.

ఒకటవ విరూపాక్షరాయలు తండ్రి తర్వాత రాజ్యానికొచ్చి 1404 నుండి 1405 వరకు పాలించాడు. అతన్ని పడదోసి ఆయన తమ్ముడు రెండవ బుక్కరాయలు 1405 నుండి 1406 వరకు పాలించాడు. అతన్ని తొలగించి ఒకటవ దేవరాయలు పాలన చేపట్టాడు.

## ఒకటవ దేవరాయలు (1406 -1422)

అధికారం చేపట్టాక కళ్ళు తలకెక్కినట్లుగా ఒకటవ దేవరాయలు ప్రవర్తించాడు. ముద్గల్లులోని ఒక స్వర్ణకారుని కూతురు అందంగా ఉంటుందని విని, ఆమెను తీసుకురమ్మని సైన్యాన్ని పంపించాడు. అది తెలిసి బహమన్ నవాబు ఫిరోజ్ షా సైన్యంతో వచ్చాడు. విజయనగరం ముట్టడించాడు. దేవరాయలు తన కూతురును ఫిరోజ్ షాకు యిచ్చి పెళ్ళిచేసి సంధిచేసుకున్నాడు.

ఆ తరువాత ఒకటవ విరూపాక్షరాయలు 1422 నుండి 1426 వరకు పాలించాడు ఆయనా బహమనీలతో పోరాడి ఓడిపోయాడు. సంధిచేసుకొని, ధనరాశులను అర్పించుకొని బయటపడ్డాడు.

## రెండవ దేవరాయలు (1426-1446)

విరూపాక్షరాయల కుమారుడు రెండవ దేవరాయలు. ఈయననే ప్రౌఢ దేవరాయలని పిలుస్తారు. విజయనగర సామ్రాజ్య చరిత్రలో రెండవ దేవరాయలు పలుకు గలిగిన పాలకుడు. ఒక విధంగా రాబోయే కాలంలో పాలించిన కృష్ణదేవరాయల కన్నా గొప్పవాడని చాలా మంది భావిస్తారు.

ఇక్కడోమాట చెప్పి హంపీ విజయనగరపాలకుల చరిత్రను ఆపి, మిగతా విషయాలు గమనిద్దాం.

విజయనగరరాజులలో "మహారాజాధిరాజ" బిరుదాన్ని ఉపయోగించుకున్న ప్రథముడు రెండవ హరిహర రాయలు. ఆ బిరుదు ఆ తరువాత కాలంలో భట్టుల స్తోత్రాలలో చేరిపోయింది.

## రేచెర్ల వెలమలు

రాచకొండ పాలించే రేచెర్ల వారిని గూర్చి 1370 వరకు తెలుసుకున్నాము. వారిని గూర్చి మరికొంత తెలుసుకుందాము.

అన పోతానేడు రాచకొండ నుండి పాలన సాగించాడు. తన తమ్ముడు మాదానేనిని దేవరకొండ అధిపతిని చేశాడు. దక్షిణ దిశ నుండి రెడ్డి రాజులు రాజ్యాన్ని విస్తరించకుండా చెలియలి కట్టలా మాదానేడు పాలన సాగించాడు.

మాదానేడు దేవరకొండకు దక్షిణంగా తనపేర మాధవపురము అనే నగరాన్ని నిర్మించి దానిలో నివసిస్తుండేవాడు.

అప్పటినుండి మాదానేని సంతతి వారు దేవరకొండలోను, అనపోతానేని సంతతివారు రాచకొండలోను రాజ్యపాలన సాగించారు.

మాదానేని మీద చక్కని చాటుపద్యం ఉంది.

లావున సింగయ మాధవు - వావిరి మార్కొన్న శత్రు వర్గంబునకున్
భావింపమూడుత్రోవలు - చావొండెను, బాఱుటొండె, శరణంబొండెన్

మరో చాటువు

జగమెల్ల నెఱుగ శ్రీ నగమున కేరాజు గోపుర సోపాన కోటి గూర్చె
ఉత్తర ద్వారమందొప్పుగ నే రా జు మా మహేశ్వరుల ధామం బొనర్చె
ఆంధ్ర భూమీశ్వర యవనులనే రాజు కడదోలి చెలియలి కట్టయయ్యె
ఏరాజు తండ్రికై యిందు వంశజుల రక్తములు నించి తిలోదకములు పోసె
అతని నుతియింప తరమె సభాంతరముల - సర్వ బిరుదుల కొమర వేశ్యాభుజంగ
చరణ నూపుర మూరురాయర విఫాళ - మహిత లక్షణు సింగయ మాధవేంద్రు

## బహమనీలు

బహమనీల సంగతి కూడా చెప్పుకుందాం.

ముజహిద్ షా (1375 - 1378) ను చంపించి, ఆయన పినతండ్రి దావూద్ ఖాన్ రాజ్యపాలన సాగించాడు. త్వరలో ఆయనా హత్య చేయబడ్డాడు. ముజహిద్ షా తమ్ముడు రెండవ మహమ్మద్ షా (1378 - 1397) అధికారంలోకి వచ్చాడు. ఇతను మంచి విద్యావంతుడు. శాంతి కాముడు.

హంపీ పాలకుడు రెండవ హరిహరరాయలు (1377-1404) కూడా శాంతి కాముడు. ఇందువలన యిరుపక్షాలు శాంతి వహించాయి. కాని 1387 నుండి 1395 వరకు మహా క్షామం వచ్చింది. సుల్తాన్ ధాన్యాలు తెప్పించి, ముస్లింలకు మాత్రమే అమ్మించాడు. హిందువులు మలమలమాడిపోయి మతం మార్చుకొని ఆహారాన్ని సంపాదించుకున్నారు.

ఆతరువాత 7 నెలలో ఆయన కొడుకు లిద్దరూ వరుసగా రాజ్యానికొచ్చారు. హత్య చేయబడ్డారు. చివరకు బహమనీరాజ్యం స్థాపించిన బహమన్ షా మనుమలలో ఒకరైన ఫిరోజ్ షా (1397 - 1422) రాజ్యానికొచ్చాడు.



"ఈయన గొప్ప పండితుడు. రాజనీతి కుశలుడు. యుద్ధ విద్యలో నిపుణుడు. గణిత శాస్త్రం, వృక్షశాస్త్రం, తర్క అలంకార శాస్త్రాలు మొదలైన వెన్నో నేర్చాడు. న్యాయశాస్త్రం, భాషా శాస్త్రం తెలుసు. దక్షిణాది భాషలెన్నో నేర్చుకున్నాడు. ఇంత సామర్థ్యం, పాండిత్యం ఉన్నా క్రౌర్యంలో ప్రతీకారచర్యలో ఎవ్వరికీ తీసిపోడు" అంటారు కంభంపాటి సత్యనారాయణ గారు (సీనియర్)

## సింహాసనం కొరకు పోటీ

అన వేమారెడ్డి మరణానంతరం కొండవీటి సింహాసనం కొరకు పోటీ వచ్చింది.

అనపోతారెడ్డి తరువాత అతని కుమారుడు కుమారగిరి రెడ్డి చిన్నవాడవటం వలన అనవేమారెడ్డి రాజ్యపాలన చేశాడని చెప్పుకున్నాం. అనవేమారెడ్డి పోయాక కుమారగిరి రెడ్డి సహజంగా సింహాసన మెక్క వలసి ఉంది. కాని ఆ సింహాసనం తనకు కావాలని, పెదకోమటి వేమారెడ్డి పోటీ పడ్డాడు. ఇతను చందోలును పాలిస్తూ, కొండవీటి క్రింద ఉండేవాడు.

ప్రోలయ వేమారెడ్డి అన్నగారైన మాచారెడ్డి ధనదపురిని (చందోలు) కేంద్రంగా చేసుకొని, తన తమ్ముడు ప్రోలయ ఆధిపత్యంలో కొంత రాజ్యాన్ని పాలించేవాడు.

మాచారెడ్డి కుమారుడు పెద కోమటిరెడ్డి. తండ్రి తరువాత అనపోతారెడ్డి కాలంలో శాఖారాజ్యంగా చందోలు నుండి అధికారం చెలాయించాడు. ఆ తరువాత ఆయన కొడుకు

వేమన రాజ్యానికొచ్చాడు. తండ్రి పేరుతో ఈయనను పెదకోమటి వేమారెడ్డి అనిపిలిచేవారు.

అనవేమారెడ్డి చనిపోయేనాటికి, (1386) కొండవీటి సింహాసనాన్ని అధిష్ఠించటానికి మూడవతరంలో ఇరువురు వ్యక్తులు సిద్ధంగా ఉన్నారు. ఒకరు ప్రోలయ వేమారెడ్డి పెంచుకున్న సోదరుని కుమారుడు అనపోతారెడ్డి పుత్రుడు. మరొకరు ప్రోలయ వేమారెడ్డి అన్నగారి మనుమడు.

అనపోతారెడ్డి అద్దంకిని పాలిస్తే, పెదకోమటి వేమారెడ్డి చందవోలును పాలించాడు. ఇద్దరికుదురు ఒక్కటే, కుటుంబం ఒక్కటే. రాజ్యాధికారాన్ని "అనుజ, తనుజ, బాంధవులే" చేస్తున్నారు.

ఈ తగాదా సామాన్య మైనది కాదు. సంఘర్షణ పాండవ కౌరవుల పోరువంటిది.

అనవేమారెడ్డికి, పెదకోమటి వేమారెడ్డికి చాలా మంచి సంబంధాలుండేవి. పెదకోమటి వేమారెడ్డికి అనవేమారెడ్డి "కూరిమి పినతండ్రి"

## స్నేహాలు - కక్షలు

మరో విషయం పరిశీలిద్దాం. కులదేవత మూలగూరమ్మకు మూడు గ్రామాలు దానమిచ్చినట్లు శాసన ప్రమాణాన్ని గూర్చి చెప్పిఉన్నాను.అదే శాసనంలో పెదకోమటి వేమారెడ్డి సర్వమాన్యత లొసగి మూలగూరమ్మకు గుడి, ప్రాకారము, గోపురము కట్టించినట్లుంది. 1377లో అనవేమారెడ్డి, పెదకోమటి వేమారెడ్డి కలిసి వేయించిన శాసనంలో ఆ వివరాలున్నాయి. అది గాక అదే సంవత్సరం అనవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతిగా ఉన్నాడు. పెదకోమటి వేమారెడ్డి "క్రమ పరిప్రాప్త సామ్రాజ్య సింహాసనాధ్యాయి" అని ఆ శాసనంలో ఉంది

"ప్రోలయ వేమారెడ్డి కాలమున మాచారెడ్డికి, అనపోతారెడ్డి కాలమున పెదకోమటీంద్రునకు గల శాఖా నగర రాజ్యము అనవేమారెడ్డి కాలమున పెదకోమటి వేమారెడ్డికి క్రమ పరిప్రాప్తమగుట సంభవము" అంటారు కొర్లపాటి శ్రీరామమూర్తి గారు.

పెదకోమటి వేమారెడ్డికి మాచారెడ్డి అనే సోదరుడున్నాడు. ఈయన అసమాన పరాక్రమశాలి. వర్ణవ్యవహార నిపుణుడు. సంగీత సాహిత్య జీవాతు విద్యాధిగా ప్రసిద్ధుడు. ఇలాఅని వేమ భూపాల చరితమనే గ్రంథములో వివరించబడింది. ఈ గ్రంథాన్ని వామన భట్ట బాణుడు వ్రాశాడు.

## కాటయ వేముడు

కుమారగిరి చెల్లెలు అన్యమాంబ; ఈమె భర్త కాటయవేముడు.

ప్రోలయ వేమారెడ్డి కుమార్తె దొడ్డాంబికను కాటయ రెడ్డి మనుమడు, మారయ

రెడ్డి పుత్రుడు అయిన ఇమ్మడి కాటయరెడ్డి వివాహంచేసుకున్నాడని చెప్పి ఉన్నాను. ఈ దంపతులకు వేమారెడ్డి కలిగాడు. ఇతన్ని తండ్రి పేరుతో 67కలిపి కాటయ వేమారెడ్డి అనిపిలుస్తారు.

బంధుత్వం వలన తన బావమరది కుమారగిరి రెడ్డిని కొండవీటి పాలకునిగా గద్దె నెక్కించాలని సర్వ సమర్ధుడైన కాటయ వేమారెడ్డి సర్వప్రయత్నాలూ చేస్తున్నాడు.

ఏమైనా సరే కొండవీటి రాజ్య సింహాసనాన్ని తానే అధిష్టించాలని పెదకోమటి వేమారెడ్డికి పట్టుదలగా ఉంది.

సంఘర్షణ తీవ్రంగా ఉంది. బహమనీలు, రాచకొండవారు, హంపీ విజయనగరాధీశులు ఆసక్తిగా గమనిస్తున్నారు. ఒకవేళ కురుక్షేత్ర సంగ్రామంలాగా పోరు సాగితే, అదను చూసి ఆక్రమించాలని సిద్ధంగా ఉన్నారు.

రాజనీతి కుశలురేం చేస్తారో తరువాత గమనిద్దాం. మనం కొంచెం ఆగి, మనకథా నాయకుడు శ్రీనాథుల వారె లా ఉన్నారో, ఏంచేస్తున్నారో తెలుసుకుందాం.

## ఆరవ ప్రకరణము

### తేజోమూర్తి

ఆంధ్ర కవితా జగత్తులో అద్భుత తేజో మూర్తులుగా, పుంభావ సరస్వతులుగా సర్వులూ మన్నించిన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల తరువాత దేదీప్యమానంగా విరాజిల్లిన కవితా మూర్తి, కవిరాజు, కవిసార్వ భౌముడు, అయిన శ్రీనాథుల వారి యుగంలో అడుగు పెడ్తున్నాము. కొండవీటిని, రాజమహేంద్రవరాన్ని పాలించిన పంటరెడ్ల ప్రాభవ చిహ్నంగా నిలచిన మహనీయుడు శ్రీనాథ కవి శేఖరులు. ప్రతి అణువును విశ్వాసంతో నింపుకొని, ప్రతిభతో ప్రకాశించి, ఆంధ్రుల ఆత్మ గౌరవ చిహ్నంగా అశేష ప్రజాపాలకుల మన్ననలందుకొని, దేశ దేశాలు పర్యటించి, తన ఆశుధారతో సాంఘిక జీవనాన్ని పద్యాలలో బంధించి, సామాన్యులను సైతం మురిపించి, మైమరపించి, ఉద్దండ పండితుల అహంకారాన్ని పగులగొట్టిన ఆంధ్ర కవితా కళాశీలి శ్రీనాథుల వారు. వారికి ముందుగా పాదాభివందనం చేసి వారి యుగంలో ప్రవేశిస్తున్నాను.

### తాత కమలనాభామాత్యుడు

ఇక శ్రీనాథుల వారిని గూర్చి చెప్పుకుందాం.

క్రీస్తు శకం 1386కు షుమారు మూడు తరాల ముందు 'కమలనాభా మాత్యుడు' అనే సరస సాహిత్య చక్రవర్తి ఒకరు ఉండేవారు. ఆయన కవితా విద్యాధరుడు. పద్మపురాణ సంగ్రహాన్ని స్వయంగా వ్రాశాడని కొందరంటారు. కాదు ఆ గ్రంథాన్ని కృతి పుచ్చుకున్నాడని

మరి కొందరు వాదిస్తారు. ఏది నిజమో యిప్పటి వరకు తేలనే లేదు.

భీమేశ్వర పురాణంలోను, కాశీ ఖండంలోనూ శ్రీ నాథుల వారి పద్యాలను గమనించటంవలన మనకీ విషయాలు తెలుస్తాయి.

కనకక్ష్మాధర ధీరు వారిధి తటీ కాల్పట్టణా ధీశ్వరున్
ఘనునిన్ పద్మపురాణ సంగ్రహకళా కావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌము కవితా విద్యాధరుంగొల్తు మా
యనుగుందాత బ్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్ (భీమే 1-10)

మత్పితామహు కవిపితామహుని దలతు - కలిత కావ్య కళా లాభు కమల నాభు
చంద్ర చందన మందార సదృశకీర్తి - సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి
(కాశీ ఖండ పీఠిక 20)

కమల నాభామాత్యుడు ఎక్కడుండేవాడో యింత వరకు నిర్ణయం కాలేదు. బంగాళాఖాతానికి ఆనుకొని ఉన్న 'కాల్పట్టణం' అనే ఒక కరపట్టణానికి అధికారిగా ఉండేవాడనేది నిజం. బహుశా ఈ కరపట్టణం మచిలీపట్నానికి దగ్గరలో ఉన్న కాళీపట్టణం .కావచ్చునని కొందరంటున్నారు. లేకుంటే దాని దగ్గరలో ఉన్న 'కలపటం' కావచ్చునంటారు. అదీ కాకపోతే వంగోలు దగ్గరలో తీరప్రాంతానికి ఆనుకొని ఉన్న కాల్స్థాన కోట గ్రామం కావచ్చునంటారు.

పట్టణం అనే మాట ఓడరేవులకే ఎక్కువగా ఆరోజులలో వాడినట్లు కన్పిస్తోంది. మచిలీపట్నం, విశాఖపట్నం, కళింగపట్నం, భీమునిపట్నం, నిజాంపట్నం, రామేపట్నం, కృష్ణపట్నం, కొత్తపట్నం, దుర్గరాజుపట్నం, చెన్నపట్నం ఇలా ఆంధ్రతీరంలో చాలా పట్నాలున్నాయి. తప్పనిసరిగా ఆ కాల్పట్టణం సముద్రతీరంలోనిది అయి ఉంటుంది.

శ్రీనాథులవారికి అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు ఎంతమంది ఉన్నారో, లేరో మనకు యింతవరకు తెలియలేదు. కాని, కమలనాభామాత్యుని కుమారుడు మారయ వీరి తండ్రి అని, తల్లిగారి పేరు భీమాంబిక అని తెలుస్తున్నది.

భారద్వాజ పవిత్ర గోత్రుని శుభాపస్తంబ సత్సూత్రు వి
ద్యా రాజీవ భవుండు మారయకు పుణ్యాచార భీమాంబకు
న్నారామైన తనూజు న న్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పగ గారవించి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్ ( నైష 1 - 12 )

## పుట్టిందెప్పుడు?

కందుకూరి వీరేశలింగం పంతులుగారు 1365వ సంవత్సరం అన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. 1385గా భావించారు. చిలుకూరి వీరభద్రరావుగారు 1385 అని

నిర్ణయించారు. బండారు తమ్మయగారు 1365 లేక 1370 అన్నారు. చాగంటి శేషయ్య గారైతే 1365 - 1380 మధ్యకాలం కావచ్చన్నారు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1378వ సంవత్సరమని స్థూలంగా చెప్పారు. కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు 1360వ ప్రాంతమవటానికి వీలుందన్నారు. ఆరుద్రగారైతే 1370కి ఐదారేళ్ళు అటూ యిటూగా జన్మించి ఉంటారన్నారు. ఎవరి దారి వారిదేగాని, అంతా ఏక నిర్ణయానికి రాలేకపోయారు.

## బాల్యం - చదువులు

బాల్యంనుండి చురుగ్గాఉండే బాల శ్రీనాథుడు అనేక భాషలు నేర్చుకున్నాడు. సంస్కృతం, ప్రాకృతం, మహారాష్ట్రి, శౌరసేని, మొదలగు భాషలను అధ్యయనం చేశాడు. ఆనాటి పరిస్థితులలో కవులకు, పండితులకు వివిధ భాషలు రావటం చాలా అవసరమని భావించే వారు. ప్రభాకర శాస్త్రిగారు " కృష్ణయజుర్వేదం, పదునెనిమిది పురాణాలు, స్మృతులు, శైవాగమాలు, పతంజలి ప్రణీతమగు వ్యాకరణ మహాభాష్యమును, న్యాయ వైశేషిక దర్శనములను, యోగ బౌద్ధాగమాలను, కాళిదాస భారవి శ్రీ హర్ష భవభూతి మురారి బాణ మయూరాది సంస్కృత కవుల రచనలు" శ్రీనాథులవారు పఠించారని వ్రాశారు. ఇన్ని చదివిన చదువరి వాత్స్యాయనుని కామసూత్రాలు, కొక్కోకం చదవకుండా ఉండిఉంటారని అనుకోలేము.

శ్రీనాథులవారి బావమరిది దగ్గుపల్లి దుగ్గన నాసికే తోపాఖ్యానమున వ్రాసిన పద్యం కొంత వివరిస్తుంది.

సంస్కృత, ప్రాకృత శౌర సేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా భాష్య విద్యా సమభ్యాస బలము
నక్ష పాద కణాద పక్షి లో దీరిత న్యాయకళా కౌశలాతి శయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వ కవి ముఖ్య విరచితాపూర్వ కావ్య - భావరస సుధా చర్వణ ప్రౌఢతయుః
గందళింపగ గాశికా ఖండ నైష - ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి

( 1 - 18 )

ఇలాగే ఆనాటికి ప్రసిద్ధి వహించిన మల్లియ రేచన, నన్నయ, నన్నెచోడుడు, బద్దెన, వేముల వాడ భీమకవి, మల్లికార్జున పండితారాధ్యుడు, తిక్కనగారి తాతగారైన మంత్రి భాస్కరుడు, తిక్కన సోమయాజి, శివదేవయ్య, మూలఘటిక కేతన, తన తాత గారైన కమల నాభామాత్యుడు, మంచెన, పాల్కురికి సోమన, కృష్ణమాచార్య, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచన సోముడు, గోన బుద్ధరాజు, కాచభూపతి విట్ఠలరాజు, మడికి సింగన - మొదలగు వారి రచనలు చిక్కగా పరిశీలించారు. ముఖ్యంగా హాలుని గాథా సప్తశతిని కూడా అధ్యయనం

చేశారు.

శ్రీనాథుల వారెక్కడ చదివి ఉంటారు? బహుశా తాతగారి కాల్పట్టణంలోగాని, ప్రోలయవేమారెడ్డి తొలినాటి రాజధాని అద్దంకిలో గాని లేక పెదకోమటి వేమారెడ్డి అధికార కేంద్ర మయిన చందవోలులో గాని విద్యాభ్యాసం చేసి ఉంటారు.

## మామిడి పెద్దన

కొండవీటిని పాలించే అనవేమారెడ్డికి, చందవోలు పాలించే పెదకోమటి వేమారెడ్డికి మంచి సంబంధాలున్నాయి. బంధువులు కావటమేగాక యిరువురూ సాహిత్య ప్రియులుకావటం, రాజ్యపాలకులుకావటం వలన అన్యోన్యత బాగా ఉంది.

అనవేమారెడ్డి వద్ద మామిడి పెద్దన మహా మంత్రిగా ఉండేవాడు.

మామిడి పెద్దన పూర్వీకులు పేరు ప్రఖ్యాతులు పొందినవారు. ఈ విషయం శృంగార నైషధంవలన తెలుస్తున్నది. కృతిపతి ప్రశంసలో శ్రీనాథులవారు పెద్దన మంత్రి వంశాన్ని గూర్చి వర్ణించారు.

పూర్వం భరద్వాజ వంశంలో జన్మించిన చిటి పెద్ద ప్రభువు నెల్లూరును పాలిస్తుండేవాడు. ఈయన పుత్రుడు మామిడన్న. మామిడన్న భార్య అక్కాంబ. ఈ దంపతులకు నలుగురు పుత్రులు కలిగారు. వారిని పెద్దన, వీరభద్రుడు, మారన, నామన అని పలిచేవారు.

ఏకారణం వల్లనో వీరు సింహపురిని (నెల్లూరు) వదలి కొండవీటి సీమకు వలస వచ్చారు. బలిజేపల్లి గ్రామంలో స్థిరపడ్డారు.

ఈ నలుగురు సోదరులలో పెద్దన అనవేమారెడ్డి కొలువులో మంత్రిగా ఉన్నాడు.

పెద్దనామాత్యుని భార్య తల్లమ్మ. ఈ దంపతులకు వేమన, ప్రెగడన్న, సింగన్న అనే ముగ్గురు పుత్రులు కలిగారు.

## పెద్దన కుటుంబం

పెద్దనామాత్యుడు తన ప్రభువు అనవేమారెడ్డి పేరును తన పెద్ద కుమారునికి పెట్టుకొని ఉంటాడని ఆరుద్ర గారంటారు. ఇది వారి ఊహ మాత్రమే. ఆధారాలు లేవు.

ఈ ముగ్గురు సోదరులు బాగా చదువుకున్నారు. మంచి సాహితీ ప్రియులేగాక రాచకార్యాలు చక్కబెట్టగల నేర్పరులు.

పెదకోమటి వేమారెడ్డి చందవోలు పాలిస్తుండేవాడు. ఈయన వద్ద మామిడి సింగన మంత్రిగా ఉండేవాడు. వేమన, ప్రెగడన్న వేరే ఉద్యోగాలు చేస్తుండేవారు.

ఇలా పెద్దన కొండవీటి రాజ్యానికి మంత్రిగా ఉండగా, శాఖా నగర పాలకుడైన

కోమటి వేమారెడ్డి వద్ద పెద్దన మూడవ కుమారుడు సింగన కూడా మంత్రిగా పనిచేయటం ఆ పాలకుల ఐకమత్యాన్ని మనం అర్థం చేసుకోవచ్చును.

## చిన్నప్పటి రచనలు

బాల్యంనుండే అనేకరచనలు చేసినట్లు శ్రీనాథుల వారి కాశీ ఖండంలోని పద్యంవలన తెలుస్తోంది.

**చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాడు రచయించితి మరుత్తరాట్చరిత్ర**
**నూనూగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్త శతి నొడివితి**
**సంతరించితి నిండు జవ్వనమునను శ్రీ హర్ష నైషధకావ్య మాంధ్ర భాష**
**ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున గొని యాడితి భీమ నాయకుని మహిమ**
**ప్రాయమెంతయు మిగుల గైవాలకుండ - కాశికా ఖండమను మహాగ్రంథమేను**
**తెనుగు జేసెద కర్ణాటదేశ కటక - పద్మ వనహేళి శ్రీనాథభట్ట సుకవి.**

( కాశీ ఖండం 1-7)

శ్రీ నాథుడు చిన్నవయసులో చేసిన రచన 'మరుత్త రాట్చరిత్ర'. ఈ గ్రంథం ఇంతవరకు దొరక లేదు.

నూనూగుమీసాల వయసులో హాల చక్రవర్తి సంకలనం చేసిన 'గాథా సప్త శతి' ని తెలుగు పద్యాలుగా వ్రాశారు.

## గాథలు -అనువాదాలు

ఆంధ్ర శాతవాహనులు ప్రతిష్ఠానపురాన్ని (పైఠాన్) రాజధానిగా చేసుకొని పాలించారు. హాల శాతవాహనుడు ఆవంశంలో 14వ వాడు. ఈయన క్రీస్తు శకం 19 నుండి 24 వరకు పాలించాడు.

రెండువేల సంవత్సరాలకు కొంచెం ముందు వెనుకలుగా ప్రాకృతంలో జనరంజక కవులు లేక ప్రజాకవులు పాటలు పాడినవి లేక వ్రాసినవి గాథలని పిలువబడినాయి.

గాథ అనేమాటకు గానం చేయదగినది అని అర్థం. ఈ గాథలను కోటి వరకు పోగుచేసి, హాలశాతవాహన చక్రవర్తి ఏడువందల గాథలను ఎంపికచేసి, ఒక గ్రంథంగా సంకలనం చేశాడు. ఆ గ్రంథాన్ని గాథా సప్తశతి అంటారు. ధ్వని, శృంగారాల ప్రాధాన్యతగల యీ సంకలనం అపూర్వమైనదిగా ప్రసిద్ధిగాంచింది.

శ్రీనాథులవారు ప్రాకృత గాథలను ఎన్నిటిని తెనిగించారో తెలియదు. తెనిగించిన పుస్తకం కూడా మనకు యింతవరకు లభించలేదు. కాని, శ్రీనాథులవారి తర్వాత వచ్చిన

కవులు వానిలో కొన్ని పద్యాలు ఉదహరించటంవలన వ్రేళ్లమీద లెక్కించ తగిన గాథలు దొరికాయి.

రసవత్తరమైన ఒక అనువాదాన్ని పరిశీలిద్దాం.

మాఘమాసంబు పులివలె మలయు చుండ
పచ్చడం బమ్మికొన్నాడు పసరమునకు (పణములకును)
ముదిత చన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొరగోయి కేలుండు సైరికుండు (క్రీడ. 262)

ఒరగోయక = సరకుగొనక. కేలుండు , కేలకుడు = కత్తి వాదర మొదలగువానిపై నాట్యము చేయువాడు. సైరికుండు = భూమి దున్నేవాడు.

సైనికుని వంటి రైతు తన భార్య చన్నులు పొగలేని కుమ్ముంవంటివని, చలికాలంలో వాటి వెచ్చదనం ఎలాగూ ఉంటుందని, కప్పుకునే పచ్చడాన్ని అమ్మి పశువును కొన్నాడని చమత్కారంగా, శృంగారంగా ఒక గాథాకారుడు పాడుకున్నాడు. మొరటుగా చెప్పినా ఆ రైతు పేదరికం కొట్ట వచ్చినట్లు ధ్వనిస్తోంది.

గాథలలో వర్షాకాలాన్ని విరహోద్రేక కాలంగా, శృంగారానికి అనుకూలమైన సమయంగా వర్ణించారు. శ్రీనాథులవారి మరో అనువాదం గమనించండి.

పటుఝంఝా పవనోత్తృణాలయములో భద్రంబుగం బట్టె కం
కటిపై ముచ్చముడింగి నిర్భర వియోగ గ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచునున్న పాంథవనితన్ గర్జావచః ప్రౌఢిమన్
దటి దుద్ద్యోతము చూపు నట్టనడు రే ధారాధర శ్రేణికిన్ (క్రీడా - 60)

నాయకుడు ఊళ్లో లేడు. వర్షాకాలం విరహాన్ని మరింతగా పెంచి ఉద్రేక పరుస్తుంది. నిర్భర వియోగ దుఃఖంతో నాయిక ఒక్కతే సొమ్మసిల్లి ముడుచుకొని పట్టె మంచం మీద పడుకొని నిద్రిస్తోంది. సాటి ఆడమనిషి యెవరయినా ఆమె అవస్థ గమనిస్తే గుండె కరిగి పోతుంది.



మబ్బుల మధ్య మెరిసే మెరపుకన్య తన వెలుగులో ఆమె దుస్థితిని మొయిలు రాయనికి చూపించి కనికరించమంది.

గాథాభావంలోకి సరళ సుందర సుకుమారాన్ని చెప్పటానికి శ్రీనాథులవారు ఇంత పెద్ద పద్యంలో సంస్కృత సమాసాల రొదతో అనువదించారు.

రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారి అనువాదం సున్నితంగా ఉంది. చూడండి.

పూరి కస్పోడు గాలి త్రోపునకు జెదర - నేల గతిలేక యేడ్పుచు కూలబడిన
వలస పోయిన యాతని చెలిని జూడు -మెరసె మేఘంబునకు జూపు కరణి మెరపు.
( గాథా సప్తశతీసారము 247 )

మరో పద్యం కూడా పరిశీలిద్దాం.

"కస్సవ ణహో ఇరసో" అనే గాథకు శ్రీనాథులవారి అనువాదమని శ్రీ దిగుమర్తి సీతారామ స్వామిగారు చెప్పారు. ఈ గాథ, గాథా సప్తశతియందు లేదు. సప్తశతి సారములో ఉంది.



వారణ సేయ దావగొనవా? నవ వారిజమందు దేటి క్రొ
వ్వారుచు నుంట నీ వెఱుగవా? ప్రియ! వా తెరగంటి
గంటి కె
వ్వారికి గెంపురాదె తగవా మగవారల దూర? నీ విభుం
డారసి నీనిజం బెఱుగునంతకు నోర్వు నెచ్చెలీ!

మానవల్లి రామకృష్ణ కవిగారు కుమార సంభవం పూర్వభాగం (1908) 4వ ఆశ్వాసం 568 పద్యానికి అధోజ్ఞాపికలో యీ పద్యం యిచ్చారు.



"ఐతే శ్రీనాథుడు గాథా సప్త శతిని అనువదించానని చెప్పుకున్నాడు. ఇప్పటికి లభించిన అతని కొన్ని అనువాద పద్యాలు మూలంలోని సంక్షిప్తత గంభీరత కోల్పోయి అతని కవితా ప్రాగల్భ్యాన్నే తెలియజేస్తున్నాయి" అంటారు తిరుమల రామచంద్ర గారు.

## ప్రాకృత కావ్యాలు

పెదకోమటి వేమారెడ్డి ప్రాకృతం చదువుకున్నాడు. ప్రాకృతంలో ప్రధాన కావ్యాలు

(1) 'సేతుబంధ' అనగా సేతుబంధం. శ్రీరాముడు సముద్రం మీద సేతువును నిర్మించిన కథ

(2) 'గౌడవహ' అనగా గౌడ వధను గురించిన కావ్యం. ఈ కావ్యం వ్రాసింది వాక్పతిరాజు. ఇతడు మాళవరాజైన యశోవర్మ ఆస్థాన కవి. క్రీస్తు శకం 750 ప్రాంతపువాడు. యశోవర్మ మగధరాజును వధించటం యిందులోని కథ.

(3) 'వజ్జాలగ్గ' వజ్జా అంటే పద్ధతి. లగ్గం అంటే కూర్పు లేక సంకలనం. వివిధ కవుల గాథలలో మంచి వానిని గ్రహించి జయవల్లభుడనే స్వేతాంబరజైన ముని గాథాసప్త శతి మాదిరిగా సంకలనం చేశాడు. ఇతను క్రీస్తు శకం 8వ శతాబ్దం ప్రారంభంలో

నివసించాడు. తాను ధర్మార్థ కామాలనే మూడింటిని గురించిన సుభాషితాలను సంకలనం చేశానన్నాడు.

(4) 'లీలావయీ' ఈ రచన మహారాష్ట్ర ప్రాకృతంలో వ్రాయబడిన శృంగార కావ్యం. ఇందులో 1800 అనుష్టుప్ శ్లోకాలున్నాయి.

(5) ప్రధానమయినది 'గాథాసప్తశతి'.

## సప్త శతీ సారటీక

పెదకోమటి వేమారెడ్డికి శృంగారమయమైన రసాత్మక గాథలంటే చాలా యిష్టం. ఆయన స్వయంగా 'సప్తశతీ సార టీక' అనే పేరుతో హాలుని సంకలన గాథలలో కొన్నిటికి, ఇతరుల గాథలు కొన్నిటికి సంస్కృతంలో వ్యాఖ్యానం వ్రాశాడు.

శ్రీనాథుని తెనుగుసేత రాజుకు తెలియకుండా ఉండదు. నూనూగు మీసాల శ్రీనాథుని ఆయన ఆదరించి ఉంటాడు.

శ్రీనాథుడు కూడా హాల సంకలనం లోనివిగాక, ఇతర గాథలు కొన్ని తెనుగు చేసినట్లు కన్పిస్తోంది.

## మామిడి వారి సాంగత్యం : వేమన

కొండవీటి వసంతోత్సవాలు చూడటానికి తండోప తండాలుగా జనం వెళ్లటం పరిపాటి. కవి పండిత నాయకాది ప్రముఖుల సంగతి చెప్పేపనే లేదు. శ్రీనాథుడు కూడా కుర్రవాడుగా వెళ్లివుంటాడు. మామిడివారి సాంగత్యం లభించి ఉంటుంది.

ఎలాగైనా గాని, శ్రీనాథునికి మామిడి పెద్దన కుమారులతో స్నేహం విస్తరించింది. అందువలననే శ్రీనాథులవారు తన నైషధ కావ్యంలో యిలా వర్ణించారు.

కాలకంఠ కఠోర కంఠ హుంకారంబు చెవుల సోకని నాటి చిత్త భవుడు
కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబు తనువు నాటని నాటి వనధిరాజు
క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య వికృతి క్రుంగని నాటి వింధ్య శిఖరి
వీర భద్రోదార ఘోర వీరావేశ విహృతి గందని నాటి తుహిన కరుడు
చక్కదనమున గాంభీర్య సారమునను - బ్రకట ధైర్యకళా కలాపముల యందు
దండనాయక చూడావతంసమైన - మంత్రి మామిడి వేమనామాత్యు డెలమి.

( నైష 1 - 35 )

చతుర్వర్ణ వ్యవస్థ ప్రాధాన్యత నొక్కి చెపుతున్నా బ్రాహ్మణులు పూర్వం నుండి యుద్ధరంగాలలో పాల్గొంటూనే ఉన్నారు. సైన్యాధిపతులుగా, దండ నాయకులుగా పేరు పొందుతూనే ఉన్నారు.

## ప్రగడన్న

ముగురన్నదమ్ములలో రెండవవాడైన ప్రగడన్న యుద్ధ విద్యలో ఆరితేరినవాడు. శత్రువుల కోటలను ఛేదించటంలోనూ, యుద్ధ దక్షతలోనూ ప్రెగడన్న దండనాథుడుగా ప్రసిద్ధి చెందాడు. శృంగార నైషధంలోని యీ పద్యం చూడండి.

తగు గైవార మొనర్ప విక్రమ కళా ధౌరేయతాశాలి శ్రీ
ప్రెగడన్న ధ్వజినీశు డంబునిధి గంభీరుండు శుంభద్విష
న్నగర ద్వార కవాట పాటవ విధాన ప్రౌఢ బాహార్గళా
యుగళుం డాహవ సవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కునన్. ( నైష 1 - 36 )

## సింగన్న

బహుశా వీరిద్దరూ అనవేమారెడ్డి వద్ద దండనాయకులుగా ఉండి ఉండవచ్చును. మూడవ సోదరుడు సింగన. శృంగార నైషధంలో సింగనామాత్యుని గుణగణాల వర్ణన ఉంది.

గగన కల్లోలినీ కల్లోల మాలికా హల్లీ సకములతో నవఘళించి
చరమ సంధ్యాకాల సంపుల్ల మల్లికా స్తబక పంక్తులతోడ సరసమాడి
శరదాగ మారంభ సంపూర్ణ పూర్ణిమా విమల చంద్రికలతో వియ్యమంది
బిసరు హాసన వధూ పృథు పయోధర భార హార వల్లరులతో నసగి పెనగి
వెలయు నెవ్వాని యభిరామ విమలకీర్తి - అతడు త్రిభువనరాయ వేశ్యా భుజంగ
కదన గాండీవి, జగనొబ్బగండ బిరుద - శాశ్వతుండొప్పు సింగన సచివ వరుడు.
( నైష 1 - 37 )

## అంకితం

ఇలా ముగ్గురు సోదరులను తనివితీర, మనసార అక్షర బద్ధం చేసిన శ్రీనాథులవారు వారికి తన కృతులను అంకితమిచ్చాడు. ఈ విషయం కూడా శృంగార నైషధం వలన తెలుస్తోంది.

సింగన మంత్రి తన అన్నల వలె తనకుకూడా ఒక గ్రంథాన్ని అంకితం చేయమని అడిగిన తీరు శృంగార నైషధంలో ఒక పద్యం వలన మనం తెలుసుకోవచ్చును.

జగము నుతింపగ జెప్పితి - ప్రెగడయ్యకు, నాయనుంగు పెద్దనకు కృతుల్
నిగమార్థసార సంగ్రహ - మగు నాయారాధ్య చరిత మాదిగ బెక్కుల్
( నైష 1 - 14 )

శ్రీనాథులవారు ప్రెగడయ్యకు, పెద్దనకు యిచ్చిన కృతుల వివరాలు లభించలేదు. కాని శృంగార నైషధానికి ముందు వ్రాసిన మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి యిత్యాది ఉన్నాయి. వీటిలో ఏదైనా కృతి యిచ్చి ఉండవచ్చును.

## కావలసిన కావ్యం

తన అన్నల సంగతి చెప్పిన సింగనామాత్యుడు తనకు కూడా "ఒక ప్రబంధంబు పుణ్యశ్లోక పురాతన రాజర్షి చరితానుబంధ బంధురంబుగా రచియింపు" మంటూ అడిగాడు.

ఇలా అడుగుతూనే తనకే కావ్యం కావాలో కూడా చెప్పాడు. "కవి శ్రేష్ఠుడు, మామల్ల దేవీ కుమారుడు, చింతామణీ మంత్ర సిద్ధుడు, ఇతరకవు లెవ్వరూ కనని నూతన మార్గముల కవనము చెప్పినవాడు, కాశ్మీర రాజు సభలో వెలింగినవాడు, ఖండన ఖండ ఖాద్యమను గ్రంథమును రచించినవాడు, తర్క శాస్త్రమందు అసమానుడు అయిన శ్రీహర్ష పండితుడు సంస్కృత భాషలో రచించిన నైషధ కావ్యమును మాకు నంకితముగా నాంధ్రీకరింపుము" అన్నాడు.

ఈ భావాలను నింపుకున్న పద్యం చూడండి.

కవిరాజ రాజిశేఖర హీరముకుటంబు శ్రీ హీరకుల వార్ధి శిశిరకరుడు
మామల్ల దేవీ కుమార రత్నంబు చింతామణీ మంత్ర చింతన ఫలంబు
కవికులా దృష్టాధ్వగమనాధ్వనీనుండు కాశ్మీర నృపసభా కమల హేళి
ఖండన గ్రంథ సంగ్రంథన కర్కశ బుద్ధి షట్తర్క మర్మైక చక్రవర్తి
భట్ట హర్షుండు ప్రౌఢ వాక్పాటవమున -నెద్ది రచియించి బుధలోక హితము పొందె
నట్టి నైషధ సత్కావ్య మాంధ్ర భాష - ననఘ యొనరింపు నా పేర నంకితముగ

( నైష 1 - 16 )

## శ్రీనాథుని పొగిడి అడిగాడు

ఇలా అడగటానికి ముందు సింగన మంత్రి శ్రీనాథుల వారిని ఎంతగానో పొగిడాడు. "ఓ శ్రీనాథ పండితుడా! నీవు సరస్వతి వలన వరాన్ని పొందావు. ప్రతిభగలవాడవు. శివార్చన కళా శీలుడవు. సకల పురాణాల సమూహాల సారమయిన బ్రహ్మజ్ఞానము వలన బ్రహ్మానందమనుభవించు చున్నావు. నీ అదృష్టము ఇతరులకు లేదు" అని కీర్తించాడు.

బ్రాహ్మీదత్త వరప్రసాదుడ వురుప్రజ్ఞా విశేషోదయా
జిహ్మ స్వాంతుడ వీశ్వరార్చన కళాశీలుండ వత్యర్థి త
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పంనిర్ధారిత
బహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే!

( 1 - 13 )

## లే జవరాలు చెక్కుగీటిన

ఇదే సదర్భంలో శ్రీనాథులవారి మరో పద్యం గమనించటం అవసరం.

పనివడి నారికేళ ఫల పాకమునం జవియైన భట్టి హ
ర్షుని కవితాను గుంభములు సోమరి పోతులు కొందఱయ్యు లొ
నని కొనియాడ నేర రది యట్టిద లేజవరాలు చెక్కు గీ
టిన వసవల్చు బాలకుడు డెందమునం గలగంగ నేర్చునే (1 - 17)

ఇలాంటి నారికేళ పాకంతో ఉండే గ్రంథాలను మానసికంగా సోమరిపోతులైన వాళ్లు హర్షించలేరని స్పష్టంగా చెప్పి మంచి ఉపమానమిచ్చారు. మాంచి వయసులో పైలా పచ్చీసుగా పిటపిటలాడే పిల్ల చెక్కిలిమీధ చిటిక వేస్తే యువకుల మనసులు ఊగిపోతాయి గాని చంటివాళ్లకేం చలనముంటుంది? అంటూ మామిడి సింగన శ్రీనాథులవారికి నైషధాన్ని అనువాదం చేయమని సగౌరవంగా కర్పూర తాంబూలమందించి సత్కరించాడు.

## ఎలా చెప్పాలో తానే చెప్పాడు

ఆ తరువాత శ్రీనాథులవారు రచన ప్రారంభించారు. ఎలా తెనుగులో చెప్పాలో తానే చెప్పుకున్నారు.

శ్రీనైషధ శృంగార కావ్యం బాంధ్ర భాషా విశేషంబున నశేషమనీః హృదయంగమంబుగా (1) శబ్దంబనుసరించియు (2) అభిప్రాయంబు గుఱించియు (3) భావంబుపలక్షించియు (4) రసంబు పోషించియు (5) అలంకారంబు భూషించియు (6) ఔచిత్యం బాదరించియు (7) అనౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున చెప్పబడిన యీ భాషానైషధ కావ్యంబు . . . . . విలసిల్లు నాచంద్ర తారార్కంబు
(నైష 8 - 202)

. శ్రీనాథులవారు తాను చెప్పిన రీతిలోనే శృంగార నైషధాన్ని విద్వదౌషధంగా రచించి తెలుగు కావ్యాలకు చేవ చేకూర్చారు. కాని సంస్కృత పద భూయిష్టమైన అనువాదాన్ని ఎద్దేవ చేసినవారు లేకపోలేదు. ఆ విషయం తరువాత చెప్పుకుందాం.

## సింగన బిరుదులు

పెదకోమటి వేమారెడ్డికి నమ్మిన మంత్రి అయిన సింగన తన రాజుగారి బిరుదులు చాలా తాను ధరించాడు.

సింగనామాత్యునకు 'కర్పూర వసంతరాయ' బిరుదు ఉంది. రాయ వేశ్యా భుజంగ, త్రిభువన రాయ వేశ్యా భుజంగ, అరివీర బసవ శంకర, వీర నారాయణ,

రాయనారాయణ, కదన గాండీవి, జగనొబ్బగండ, పాండ్యరాజ గజకేసరి, చెంచుమల చూరకార, కేళాదిరాయ మొదలగు బిరుదులు కూడా ఉన్నట్లు శృంగార నైషధంలో కన్పిస్తోంది. ఐతే యివన్నీ రెడ్డి రాజుల బిరుదులు కావటం మనం గమనించగలం. రాజుల బిరుదులు వారి మంత్రులు దండనాయకులు ధరించేవారు. ఇది ఆనాటి సాంప్రదాయంగా కన్పిస్తోంది. రాజులు కూడా తమ పూర్వీకుల బిరుదు నామాలనలంకరించుకోవటం కూడా ఉంది.

శ్రీనాథుని కావ్యాలలో యీ రెండు సంగతులు స్పష్టంగా కన్పిస్తాయి.

## సామ్రాజ్య సంభరణుడు సింగన

వేమారెడ్డి, సింగన మంత్రికి తన రాజ్యాన్ని కాపాడినందుకు అనేక బహుమానాలిచ్చినట్లు శృంగార నైషధంలోని పద్యం వివరిస్తుంది.

**అరుదార న్వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్ర చా**
**మర కల్యాణ కళాచి కాది బహుసమ్మానార్హ చిహ్నంబు లా**
**దరమొప్పారగ వేమ భూవరుని చేతం గాంచె సామ్రాజ్య సం**
**భరణ ప్రౌఢుడమాత్య సింగడు నయ ప్రాగల్భ్య గర్వోన్నతిన్**

( నైష 1 - 38 )

## అతి శయోక్తులు

ఐతే శ్రీనాథులవారు శృంగార నైషధం వ్రాసేనాటికి కొండవీటికి శాఖానగరాధ్యక్షుడుగా ఉన్న పెద కోమటి వేమారెడ్డికి సామ్రాజ్యం ఉందా? అసలు కొండవీడే చిన్నరాజ్యం. దానికే సామ్రాజ్యం లేదు. మరి శ్రీనాథులవారెందుకిలా వ్రాశారు. అది అతిశయోక్తి మాత్రమేనని భావిస్తున్నాను.

మరో విషయం గమనించాలి. ఆశ్వాసాంత పద్యంలో ( 144 ) "యవనాధీశ సభానిరంకుశ వచో వ్యాపార పారీయణా!" అని ఉంది. దీనితో "సమరార్జున" బిరుదు కలిపి ఆలోచించాలి.

ఈ పద్యం చూడండి.

**. . . .. శ్రీమహిత పెద్ద కోమటి**
**వేమక్షితి పాల రాజ్య విభవ కళార**
**క్షామణికిం, బాండ్యరాజ గజకేసరికిన్**

మరో పద్యం

**. . . . .శ్రీ వేమ మండలేశ్వరుని మంత్రి**
**యమిత దుర్మంత్రి వదన ముద్రావతార**

శాసనుడు రాయవేశ్యా భుజంగ బిరుద
మంత్రి పెద్దయ సింగయామాత్య వరుడు ( 9 ప్ర.ఆ.శృనై )

## సింగన యవనులను కలిశాడా?

వేమభూపాలుని వద్ద మంత్రిగా సింగన శక్తి సామర్థ్యాలను యీ పద్యాలు చెపుతున్నాయి. ఐతే, యవనాధీశ సభా నిరంకుశ వచో వ్యాపార పారీణా! అనటం వలన యవనుల సభకు యీ మంత్రివర్యుడు వెళ్లాడని అర్థం చేసుకోవాలి. అదికూడా నైషధ రచనా కాలానికి ముందుగాని, లేక రచనా కాలంలోగాని వెళ్లి ఉంటాడు.

యవనులంటే ఆనాటి బహమనీలు. సింగన మంత్రి బహమనీల వద్దకు ఎందుకు వెళ్లి ఉంటాడు? తర్వాత వివరిస్తాను.

## పంచాంగవేత్త

సింగన మంత్రి రాజకార్య నిర్వహణ ధురీణుడేకాదు. గొప్ప పంచాంగవేత్త.

**పంచాంగ స్థిర మంత్ర రక్షణ కళాప్రౌఢుండు, బాలా మనః**
**పాంచాలుండు, విరించి వంశ జలధి ప్రాలేయ భానుండు, దో**
**శ్చంచచ్చాప కృపాణ లబ్ధ విజయైశ్వర్యుండు, దిక్కామినీ**
**కాంచీ మౌక్తిక కీర్తి పెద్దవిభు సింగం డొక్కనా డిమ్ములన్** ( నైష. 1 - 10 )

ఈ పద్యం.వలన సింగన శక్తి తెలిసింది గదా!

పంచాంగం వ్రాయటం ఒక్కటే కాదని, "పంచాంగ స్థిర మంత్ర రక్షణ కళా ప్రౌఢుండు" అనే చరణాన్ని యింతకన్న గొప్పగా అన్వయించుకోవాలని కొర్లపాటి శ్రీరామమూర్తి గారంటారు.

సింగనామాత్యుడు సోమ సిద్ధాంతానికి గూఢార్థ దీపిక అనే వ్యాఖ్యానం వ్రాయటం వలన జ్యోతిష పాండిత్యం అపారంగా ఉందని భావించాలి.

## ఆంధ్రదేశ భాష

శ్రీనాథులవారు శృంగార నైషధంలో "చెప్పితి నాంధ్ర దేశ భాష" అనటం గుర్తించుకోవాలి. భవితలో "నిజము నాది కర్ణాట భాష" అన్న శ్రీనాథులవారి భావనలో ఆంధ్రదేశ భాష, కర్ణాట భాష పర్యాయపదాలుగా వాడినారనిపిస్తున్నది.

# ఏడవ ప్రకరణము

## సంధి కుదిరింది

అధికారం కొరకు కుమారగిరిరెడ్డికి, పెదకోమటి వేమారెడ్డికి తగవులు

ప్రారంభమైనాయని తెలుసుకున్నాము. ఈ పోటీ చివరకు ప్రశాంతంగా ముగిసింది. ఇరువురి మధ్య ఒక అంగీకారం కుదిరింది. దాని ప్రకారం కుమారగిరిరెడ్డి కొండవీటిని పాలించేటట్లు, అతని తరువాత ఆనాటికి ఉన్న రాజ్యానికి పెదకోమటి వేమారెడ్డి రాజయ్యేటట్లు సంధి కుదిరింది. దానితో రెడ్డిరాజుల కుటుంబ కలహాలు తాత్కాలికంగా సద్దు మణిగాయి.

67

ఈ అంగీకారానికి రావటానికి, ఏదోరీతిలో సింగన మంత్రి ప్రయత్నించి ఉంటాడని నేను భావిస్తున్నాను. మామిడివారికి కొండవీటి పాలకులకు అవినాభావ సంబంధం ఉండటం వలన ఈ సంధి వారి కుటుంబానికి కూడా క్షేమకరమే.

ఈ రాజకీయంలో యువ శ్రీనాథులవారు కూడా కొంత పాత్ర వహించి ఉండి ఉండవచ్చును. ఇలా భావించటానికి, భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు కూడా విశదీకరిస్తాయి. శాంతికాముకుడైన శ్రీనాథులవారి పాత్ర కొండవీటి రాజకీయాలలో చాలా ఉంది.

## కుమారగిరి రెడ్డి పాలన (1386 - 1402)

తాను కొండవీటి సింహాసనాన్ని అధిష్ఠించటంలో ఎంతో పట్టుదలగా కృషిచేసిన కాటయ వేమునికి కుమారగిరిరెడ్డి మంచి పదవులిచ్చాడు. ప్రధానమంత్రిగాను, సర్వ సైన్యాధిపతిగాను నియమించాడు. రెడ్డి ప్రభువులలో కుమారగిరి ఒక్కడే బ్రాహ్మణేతరుడైన కాటమ వేముని మంత్రిగా నిర్ణయించాడు. మిగతా ప్రభువు లందరు బ్రాహ్మణులనే మంత్రులుగా నియమించుకున్నారు.

కుమారగిరిరెడ్డి, కాటయ వేమారెడ్డి బాగా పరిచయమైనా శ్రీనాథులవారు మామిడి సింగనతో పాటు పెదకోమటి వేమారెడ్డి మనిషిగానే మిగిలిపోయారు.

## కాటయ వేమారెడ్డి

ఈయనకు తల్లాంబిక, దొడ్డాంబిక, మల్లాంబిక అనే భార్యలున్నారు. తల్లాంబికకు కుమారగిరి కుమారుడున్నాడని, దొడ్డాంబికకు అనితల్లి అనే కూతురు ఉందని వేటూరి వారు వ్రాశారు.

లలిత కళారాధకుడైన కుమారగిరి రెడ్డి రాజ్యపాలనా దక్షుడు కాదు. అందువలన రాజ్యపాలనాభారం పూర్తిగా కాటయవేముని మీద పడింది.

కుమారగిరి రెడ్డి సింహాసనమెక్కాక విజయనగర పాలకుడైన రెండవ హరిహర రాయలు 1385, 86లో యుద్ధానికొచ్చి శ్రీశైల ప్రాంతాన్ని ఆక్రమించి త్రిపురాంతకం వరకు వచ్చాడు. క్రీడాభిరామంలో 17వ పద్యం "వీర హరిహర రాయ పృథ్వీకళత్ర, రత్న భండార సాధికార ప్రగల్భు, మల్లికార్జున త్రిపురారి మంత్రివర్యుడు" శ్రుత పర్వత దుర్గాన్ని

జయించాడని ఉంది. శ్రుత పర్వతమంటే వినుకొండ. వినుకొండ కూడా విజయనగరం వారు జయించారు. అందువలన "శ్రుత పర్వత దుర్గ మహాప్రధాన రాఢ్గంధ గజంబు తిప్పన" అనటం జరిగింది. తిప్పన పాలనలో వినుకొండ ఉంది. ( శ్రీ - 20 )

కాటయ వేమారెడ్డి 67సైన్య సమేతంగా వెళ్ళి ఎదుర్కొన్నాడు. గొప్ప యుద్ధం జరిగింది. అంతకు ముందే విజయనగర సైన్యాలు రాచకొండవారితోనూ బహమనీలతోను యుద్ధం చేసి తెలంగాణాలోని కొత్తకొండ వద్ద దారుణంగా ఓడిపోయాయి.

విజయనగర పాలకుడు కొండవీటివారితో మైత్రి జరపటం మంచిదనుకున్నాడు. బహమనీలతోను, రాజకొండ వారితోనూ రాగల ముప్పునూహించి, హరిహరరాయలు సంధి చేసుకున్నాడు.

ఆ సంధి ప్రకారం త్రిపురాంతక ప్రాంతం వరకు కొండవీటివారి క్రింద ఉంటుంది. శ్రీశైల ప్రాంతం కర్ణాటకుల పాలనలో చేరుతుంది. వినుకొండ దుర్గం కుమారగిరి రెడ్డి క్రిందనే ఉంది.

## కాటయ వేమునికి మరో పెళ్లి

రెండవ హరిహరరాయలు తన కూతురు హరిహరాంబను సమర్థుడైన కాటయ వేమారెడ్డికిచ్చి వివాహం చేశాడు. బంధుత్వం కలిపి సంధి బిగించాడు. ఈ వివాహ విషయం, అల్లయ వేమారెడ్డి వేమవరం శాసనంలో ఉంది అని మల్లంపల్లివారు వ్రాశా

## కటకం వరకు జైత్రయాత్ర

ఆ తరువాత కాటయ వేమారెడ్డి సైన్యసమేతంగా కదలి కళింగ పాలకులను, వారి సామంతులను ఓడించాడు. సింహాచలం నుండి కటకం వరకు ఆక్రమించాడు. కాటయవేముని శాకుంతల వ్యాఖ్యానంలో ఆయన జయించిన రాజ్యాలమీద ఒక శ్లోకం ఉంది.

ధాటీ ఘోటీ ఖురాగ్ర త్రుటి తగిరితటే యత్ర మొల్లేటి దుర్గం?
దుర్గం కిమ్మూరు సజ్ఞం దలితరిపు బలే దుర్గమం బెండపూండిమ్
దుర్భేదం వజ్రకూటం, జితవతి రభసా రామగిర్యాఖ్య దుర్గమ్
విఖ్యాతం వీరఘోటం గళితమను హృదాం వీర సన్నాహ దౌర్గ్యమ్

ఈ శ్లోకంలో పేర్కొన్న దుర్గాలన్నీ వింధ్య పాదములకు చెందినవి. రాజ మహేంద్రవరానికి ఈశాన్యంగా ఉన్నాయి.

1. వజ్ర కూటం : నేటి పిఠాపురానికి వాయవ్యంగా ఇరువది నాల్గు కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ దుర్గం నేడు శిథిలమయింది.

2. బెండపూడి : పిఠాపురానికి ఉత్తరంగా అన్నవరానికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉంది. శిథిలమైన మట్టికోటగా ఉంది.

3. వీరఘోటము : శ్రీకాకుళం జిల్లా పాలకొండ తాలూకాలో ఉంది. దీనిని వీర ఘట్టమని పిలుస్తున్నారు. ఇక్కడకూడా శిథిల దుర్గం ఉంది.

4. కిమ్మూరు దుర్గము : తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం తాలూకాలో ఉంది. శిథిలమైన దుర్గంగా, వ్యవసాయ భూమిగా మిగిలి ఉంది.

5. మొల్లేటి దుర్గం : తూర్పు గోదావరి జిల్లా ఎల్లవరం తాలూకాలో ఉంది.

6. రామగిరి దుర్గం : రాజమహేంద్రవరానికి ఉత్తరంగా 32 కిలోమీటర్ల దూరంలో ఉంది. శిథిలమైన కోటగా మిగిలి ఉంది. పట్టిసమునకు ఈశాన్యంగా పదికిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ దుర్గంలో ప్రవేశించటం యీనాడు కూడా చాలా కష్టం.

## లోబడిన దుర్గాలు

కాటయ వేమునికి లోబడిన దుర్గాలు చాలా ఉన్నాయి. మొల్లేటి దుర్గము, కిమ్మూరు దుర్గము, బెండపూడి, వజ్రకూటము, రామగిరి, వీరకూటము, ఝుదేశవనము, సప్తమాడియములు, జంతరునాడు, బారహ దొంతి (పన్నెండు రాజ్యాలు), ఒడ్డాది, రంభ లొంగిపోయాయి.

వండువా సుల్తాన్‌ను కూడా జయించాడు. ఇలా కటకం వరకు జయించిన కాటయ వేమారెడ్డికి దువ్వూరి (రెండవ) అల్లాడ రెడ్డి, అతని కుమారులు వేమ, వీరభద్రారెడ్లు బాగా సహకరించారు.

ఈ విజయానంతరం కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరంలోని వేణుగోపాలస్వామికి 1390లో అనపర్తి గ్రామాన్ని దేవభోగంగా సమర్పించాడు.

## అహోబల దాన శాసనం

కాటయవేమారెడ్డికి కొమరగిరి రెడ్డి యెడల గల కృతజ్ఞతాభావం, యీ దాన శాసనంలో తెలుస్తున్నది. అహోబల దేవర నిత్య అవసరానకు కొమరగిరి రెడ్డి గార్కి సుకృతంగా కలువచేఱును కొమరగిరి పురమని ధారవోసి సమర్పణ చేశారు. ఇది 1410వ సంవత్సరంలో జరిగింది. ఇలా యిచ్చిన గ్రామాలు 47. ఇంకా కాటయవేముడు, అతని దేవేరులు యిచ్చిన గ్రామాలు మరో తొమ్మిది ఉన్నాయి.

కుమారగిరి తనకుమారుడు (రెండవ) అనవోతారెడ్డితో కలసి ద్రాక్షారామ భీమేశ్వరుని దర్శనం చేసుకున్నాడు. అక్కడ తులాపురుషాది మహాదానాలు కావించాడు.

## రాజకీయపుటెత్తులు

కుమారగిరి రెడ్డి తన తండ్రి పేరు పెట్టుకున్న (రెండవ) అనవోతారెడ్డిని తన ప్రతినిధిగా రాజ్మహేంద్రవరాన్ని పాలించేందుకు నియమించాడు. రెడ్డి ప్రభువులలో యింతకు ముందు లేని యీ ప్రత్యేక రాజ్య విభాగం రావటానికి కారణం లేకపోలేదు.

పెదకోమటి వేమారెడ్డితో కుదిరిన సంధిలో కుమారగిరి తర్వాత, ఆనాటికి మిగిలి ఉన్న కొండవీడు రాజ్యానికి, పెదకోమటి వేమారెడ్డి పాలకుడు కావలసి ఉంది.

అవకాశం దొరకపుచ్చుకొని, కొండవీడు చేజారినా రాజ్మహేంద్రవరం చేపట్టవచ్చునని ఆయన ఆలోచించి ఉంటాడని భావిస్తున్నాను.

## రెడ్ల గ్రామాలు

కాటయ వేమారెడ్డి తూర్పు దిగ్విజయ యాత్ర కాలంలో కూడా పాకనాటి ప్రాంతం నుండి రెడ్డి కుటుంబాలవారిని తెచ్చి, విజయవాటిక ప్రాంతాలలోను, రాజ్మహేంద్రవరం వెళ్లే మార్గంలోను, తూర్పు గోదావరి జిల్లాలోను రెడ్ల గ్రామాల నేర్పరచాడు. ఈ వలసలు సుదూర ప్రాంతాలకు కూడా విస్తరించేలా చేశాడు.

అనపర్తి మొదలు ద్రాక్షారామం దగ్గర దాకా భూమంచి రెడ్డి శాఖకు చెందిన వారిని, మోటాడి రెడ్లను తీసుకొని వచ్చి గ్రామాలు కట్టించాడు.

తుల్యభాగానదీ తీరములోని సారవంతమైన భూములను, ముఖ్యంగా తాపేశ్వరము నుండి, అత్తమూరు, మావిడాడల వరకు, నదికి యిరువైపుల, భూమంచి రెడ్డి శాఖకు చెందినవారు, మోటాడి రెడ్డి శాఖకు చెందినవారు యిప్పటికీ నివసిస్తున్నారు.

తుల్యభాగ తీరాల వెంటనున్న ఈ రెడ్లను అహోబల ప్రాంతంనుండి తీసుకొని వచ్చారు. పాకనాటి రెడ్లు కూడా యిక్కడ ఉన్నారు.

ఈ ప్రాంతపు రెడ్ల యింటిపేర్లు, పెన్నానది తీరగ్రామాలలోని రెడ్ల యింటిపేర్లు ఒకటిగానే ఉన్నాయి. ఇలా కాటయ వేముడు తన వెంట పంటకులం వారిని తీసుకొచ్చి, రక్షణగా ఉండేందుకు గ్రామాలు కట్టించి, సారవంతమైన భూములిచ్చాడు.

ఇలాగే విజయవాడ దిగువను కృష్ణానదికిరువైపుల, విజయవాడ నుండి రాజ్మహేంద్రవరం వెళ్ళే దారిలో అక్కడక్కడా పూర్తి రెడ్ల గ్రామాలున్నాయి. ఇవన్నీ ఆ రాజుల ప్రోత్సాహంతో వివిధ కాలాల్లో నిర్మించారు.

కాటయ వేముని పూర్వ దిగ్విజయ యాత్ర 1382 - 1390 మధ్య జరిగిందని మల్లంపల్లి వారు భావించారు.

## రేచెర్ల వారు

1383-84లో రాచకొండకు రేచెర్ల అనపోతానేని పిదప, అతని కుమారుడు రెండవ సింగమనేడు రాజ్యానికొచ్చాడు. ఇతన్ని కుమారసింగ భూపాలుడని కూడా పిలుస్తారు. ఇతను 1399 వరకు పాలించాడు.

ఇతని ఆస్థాన కవీశ్వరులలో విశ్వేశ్వరకవి చమత్కార చంద్రిక వ్రాశాడు.

1387లో సింహాచలంలో రెండవ సింగమనేడు శాసనం వేయించాడు. అంతవరకు తాను జయించినట్లు ఆశాసనం వలన తెలుస్తున్నది. కాని తూర్పు కోస్తా వారి వశం కాలేదు. బహుశ యిది మెరుపుదాడి వంటిది మాత్రమేనని భావించవచ్చు.

ఆనాటి పరిస్థితులలో హంపీ విజయ నగర పాలకులు, కొండవీటి ప్రభువులు ఒకవైపున చేరారు. రాచకొండ రేచెర్లవారు, బహమనీలు మరోవైపున నిలచినట్లు కన్పిస్తున్నది

## రాజమండ్రికి రక్షణ వలయం

కాటయ వేమారెడ్డి లింగనమంత్రి సోదరుడైన అరియేటి అన్నమంత్రిని బెండపూడి దుర్గాధిపతిగా నియమించాడు. రాజ్మహేంద్రవరాన్ని అన్ని విధాలా కాపాడుకోవాలని భావించాడు. తూర్పు దిగ్విజయ యాత్రలో తన కుడి భుజంగా నిలిచిన అల్లాడ రెడ్డితో వియ్యమందాలని కాటయ వేమారెడ్డి నిర్ణయించుకున్నాడు.

ఇక్కడో చిన్న విషయం చెప్పుకుందాం.

అనపోతారెడ్డికి కుమారగిరి రెడ్డి, అన్యమాంబలు కవల పిల్లలుగా జన్మించారు. అనపోతారెడ్డి తన మేనల్లుడు కాటయ వేమారెడ్డికి అన్యమాంబనిచ్చి వివాహం చేశాడు. వీరి కుమార్తె అనితల్లి.

తూర్పు దండయాత్రలో తన వెంట ఉండి సహకరించిన సేనా నాయకుడు అల్లాడరెడ్డి కుమారులలో మొదటివాడైన వేమారెడ్డికి హరిహరాంబను, రెండవవాడైన వీరభద్రా రెడ్డికి అనితల్లిని యిచ్చి వివాహం చేశాడు.

కుమారగిరి వలన రాజ్య ప్రాప్తి పొందటం వలన, కుమారగిరి మేనగోడలు అనితల్లి కావటం వలన, కాటయ వేముని రాజ్యానికి అనితల్లి వారసురాలు అయింది. ఇందువలన అనితల్లి భర్త వీరభద్రారెడ్డి రాజ్య పాలన చేశాడు.

## రచనలు

కాటయ వేమారెడ్డి కాళిదాసు వ్రాసిన రూపకత్రయానికి (అభిజ్ఞాన శాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం) వ్యాఖ్యానం వ్రాసి 'కుమార గిరి రాజీయము' అని పేరుపెట్టాడు. ఈ వ్యాఖ్యానం సంస్కృతంలో ఉంది. అందులో ఒక శ్లోకం వలన కుమారగిరి

రెడ్డి వ్రాసిన సంస్కృత నాట్యశాస్త్ర గ్రంథం 'వసంత రాజీయం' విషయం తెలుస్తున్నది. ఆ రచన యింతవరకు దొరకలేదు.

మునీనాం భరతాదీనాం భోజాదీనాంచ భూ భుజాం
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్య వేదార్థ వేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరి భూ భుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్ ( శాకుంతల వ్యాఖ్య )

## కళాభిమాని కుమారగిరి రెడ్డి

ఈయన నృత్య ప్రియత్వం, వసంతోత్సవ వైభవం గూర్చి ముచ్చటలాడుకుందాం.

చైత్ర శుద్ధ పాడ్యమి మొదలుగా తొమ్మిది రోజులు యీ వసంతోత్సవాలు జరిగేవి. మన్మథపూజ జరిపేవారు. ఈ వేడుకలు కృష్ణదేవరాయల కాలంనాటివరకు సాగినట్లుంది. ముక్కు తిమ్మనగారు పారిజాతాపహరణంలో "ప్రతివర్ష వసంతోత్సవ......" అనే పద్యంలో యీ ఉత్సవాన్ని వివరించారు.

కుమారగిరి రెడ్డి మీద 'కర్పూర వసంతరాయలు' అనే పేరుతో సి.నారాయణ రెడ్డిగారు వ్రాసిన నవ్య ప్రబంధంలోని కొన్ని పాటలు చెప్పుకుందాం.

"కొమరగిరి చరితమ్ము కొండవీటను శిశిర
మును సైతము వసంతముగ రూపు గట్టించు
కొండవీటను పాదుకొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూర సౌరభమ్ములు వీచు"

(సి.నా.రె. కర్పూర వసంతరాయలు పుట 156 )

అలాంటి కొండవీటిలో, మాగధుల కైవారాలతో కుమారగిరి రెడ్డి ప్రవేశాన్ని చూడండి.

జయ జయ సమగ్రాంధ్ర సర్వం సహా భార - సంభరణ శేషాహిరూపా!
పరిపంథి నృపతి దోర్బలకంధి మంథనా! - పరమందరాద్రి స్వరూపా!
జయ జయ కళా దుగ్ధ సాగర మనో ముగ్ధ - సంపూర్ణ చంద్రమూర్తీ!
సురసరి న్మందార సుమగరున్నీహార - పరిహసన్మంజు కీర్తీ!
జయ నిత్య దాతృత్వ చణతా నతానంద - సౌరద్రుమాగ్ర శాఖా!
ప్రస్ఫురత్ బ్రహ్మతేజ స్ఫురత్ ఫాలతల - విస్ఫుర ద్రాజరేఖా!
జగనొబ్బగండ జయ! జగరక్షపాల! జయ - జయ చెంచుమల చూరకారా!
కవి గమకి వాది వైణవిక వైణిక జన - స్తవనీయ కవితా విచారా!
అనవోత భూనాథ తన యాగ్రణీ! - పంటకుల పద్మసంపద్ద్యోమణీ!

జయ కొమరగిరి ధరావరదా! - జయ జయ వసంతరాడ్బిరుదా!

ఈ గతిని వినవయ్యె మాగధుల కైవారముల్

కైవారములు గావు గానామృతాసారముల్

( క.వ.ఎమెస్కో పుట 31, 32 )

85 అంటూ నారాయణ రెడ్డిగారు వర్ణించి చెప్పారు.

## లకుమ

కుమారగిరి ప్రభువు వద్ద లకుమ అనే గొప్ప నర్తకి ఉండేది. ఆయన వ్రాసిన నాట్య శాస్త్రంలోని భావాలను ఆమె అభినయించేది. ఈ విషయాన్ని కాటయ వేమారెడ్డి తన రచన శాకుంతల వ్యాఖ్యానంలో ప్రారంభంలో వివరించాడు.

జయతి మహిమా లోకాతీత: కుమారగిరి ప్రభో:

సదసి లకుమాదేవీ యస్యశ్రియా సదృశీ ప్రియా

నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా

వితరతి బహూర్థాన నర్థి ప్రజాయ సహస్రశః ॥

( శాకుంతల వ్యాఖ్య - 3 )

భాగ్యం నామ సమగ్ర మీదృశ మతి స్నేహైక పాత్రం యతో

వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసేని యుజ్య స్వయమ్

నిత్యం నందతి నర్తనైరభి నవై: కాంతైర్వ సంతోత్స వై:

సంతానాభ్యుదయై: కుమారగిరి భూపాలో నృపాలోత్తమః ॥

( మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్య - 2 )

లకుమాదేవి పైన జ్ఞానపీఠపురస్కార గ్రహీత నారాయణరెడ్డిగారి అక్షర నృత్యాల నాలకిద్దాం.

ప్రతిసంధ్యామధురవేళ - లకుమ గజ్జె కదలించును

ప్రభువు శరీరము నాద - బ్రహ్మమ్మై పులకించును

అభినయ దుగ్ధాంభోనిధి - యందలి మీగడల బోలు

రస వన్నవ లాస్య భంగు - లను లకుమ ప్రదర్శించును.

భరతమునీంద్ర గ్రంథ - ప్రసవ మంజరీ ఘుమఘుమ

లెదలో జీర్ణించు కున్న - నృపతి వీణ సారించును.

ఆమె బొమలు కదలించును - అతడటులే చూచు చుండ

ఆమె గ్రీవమును ద్రిప్పును - అత డోహో యనుచునుండు.

(కర్పూర వసంతరాయలు. యెమెస్కో పుట 117)

ఇలా వర్ణించుకుంటూ వారు కలాన్ని కర్పూరంతో చిలికారు. పన్నీటితో పుటలు నింపారు.

మనంకూడా లకుమా నర్తనాభినయాలు చూసి పారవశ్యంలో నిలచి పోయాము, ఆగిపోతే ఎలా? ఇంకా చాలా దూరం ప్రయాణం చేయాలి. రాజదర్బారు దాటి, వసంతోత్సవాలలో తూలుదాం, రండి.

కపురవు టారతులు ద్రిప్పి - గందవొడిని పైన గుప్పి
కస్తూరిని కలయ హత్తి - కాలాగురుధూపమెత్తి
రాయడు పూవిల్తుని పూజించె - రాణి నీడవోలె అనుసరించె.
తనతోడ నడచువా - రిని జూచి, అల్లన శి
రమునూచి, మందహా - సము చేసి, నిండు దో
సిళ్ళతో మృగమద - శ్రీ చందన రజమ్ము
కుండికలతో అచ్చ - గొజ్జంగి నీరమ్ము
క్రుమ్మరించె వసంత నృపుడు - కుసుమించె జన చిత్త మపుడు

(పుట 38,39)

ఎటు చూచినను కపురమే, గంథమే - ఏదెసను ఆనందమే, అందమే.
కర్పూర కస్తూరి కా చందనములతో - నేలయే కాదు నింగియు పరిమళించినది.

జాదర జాదర జాదర యంచును 'చర్చరి' గీతులు పాడెడు వారలు
ద్రుత తాళమ్మున ధుంతక ధుంతక ధుంధుంకిట యని ఆడెడు వారలు
తుమ్మెద పదములు వెన్నెల పదములు కమ్మగ గానము చేసెడివారలు.
ఏలలు పాడుచు ఈలలు వేయుచు సోలుచు తూలుచు పోయెడి వారలు
దేశి మార్గముల నృత్త నృత్యముల తీరులు చూపుచు పోయెడి వారలు

(పుట 40)

ఈ రీతిగ తొమ్మిది దినములు సుమ
నారాచుని పండుగలే జరుగును. (పుట 41)

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఆ ఉత్సవాలను గూర్చి, వసంత రాయలను గూర్చి చెప్పినమాటలు చెప్పుకున్నాక ముందుకు వెళ్లాం.

"ఏటేట తప్పక కొండవీటి పురమున వసంతోత్సవమును మహావైభవముతో నిర్వర్తించువాడు. ఇతనికి కూడ వసంత రాయడని, కర్పూర వసంతరాయడని బిరుదు పేర్లు కలవు. వసంతోత్సవ సమయమున తన రాజ్యమునందలి కళాకుశలులను, కవులను,

పండితులను సత్కరించి కలాపోషణ, సాహిత్య పోషణ చేయుచు వచ్చెను. ఇతడు సంగీత నాట్య కళా పారంగతుడు. లకుమాదేవి ఈతని ఆస్థానము నలంకరించిన నట్టువరాలు. ఈమె ఒక్క భావమును వేయివిధముల నభినయించి చూపిన నాట్యకళా చతుర. ఒక్క సంగీత నాట్యములనే గాక ఇతర కళలందును కొమరగిరి భూపాలునికి అమిత ప్రీతి. ఇతడు కలాభిజ్ఞుడు. కలావంతుడు. వైరాజ, పుష్పక, కైలాస, మల్లిక, త్రివిష్టపములను అయిదు విధములైన సమున్నత ప్రాసాద జాతులలో ఇతడు కొండవీటి నగరమున పుష్పక జాతికి చెందిన గృహరాజ సౌధమును నిర్మించెను. ప్రియులతో విహరించుటకు కేళీరథములను, క్రీడించుటకు క్రీడాసరస్సులను నిర్మింపజేసెను" అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కొండవీటి రెడ్డి రాజ్యము అను తన వ్యాసంలో వివరించారు.

కొమరగిరి పరమ ధార్మికుడు. అన్నవర శాసనంలోని "కొమరగిరి నృపే.." అనేశ్లోకం వీరి వితరణ శీలాన్ని వివరిస్తుంది.

బెజవాడ పరిసరాలలోని కొత్తూరు కొండపై నున్న 'వసంతరాయ నృసింహస్వామి' కి కృష్ణాతీరంలోని అనేక గ్రామాలలోని భూములు వివిధోపచారాలనిమిత్తం దానం చేశాడు. చాలా శాసనాలలో 'హేమాద్రి దాన చింతామణి' అనే బిరుదు కన్పిస్తోంది. కుమారగిరి తనకుమారుని వడిలో కూర్చో బెట్టుకొని ద్రాక్షారామంలో తులాదానం చేశాడు.

## రాజమహేంద్రవర ప్రభువు కాటయ

కుమారగిరి రెడ్డి ఏకైక పుత్రుడు రెండవ అనపోతారెడ్డి అకాలమరణం చెందాడని ఋంతకు ముందు చెప్పుకున్నాం. ఆ తరువాత కుమారగిరి రెడ్డి దూరాలోచనతోను, మరాలోచనతోను రాజమహేంద్ర వర రాజ్యాన్ని కాటయ వేమునకిచ్చి వేశాడు.

తన తరువాత కొండవీటి రాజ్యంలో మిగిలినదంతా పెదకోమటి వేమారెడ్డికి చెందవలసిఉంది. కాబట్టి, తన చెల్లెలి భర్తగా, తనరాజ్యవిస్తరణ చేసిన యోధునిగా, తనను కొండవీటి సింహాసనం మీద నిలబెట్టిన రాజనీతి విశారదునిగా, విజయనగర పాలకుల బెడద తప్పించిన ప్రజ్ఞాశాలిగా, కాటయ వేమునకు రాజమహేంద్రవరాన్ని యిచ్చి వేశాడు. కాటయ వేమారెడ్డి తాను 1395లో వేయించిన గోపవరం శాసనంలో తన సేవలకు సంతుష్టుండై కుమారగిరి రెడ్డి ఆ రాజ్యాన్ని తనకిచ్చాడని చెప్పాడు.

కాటయ వేముడు తాను రచయిత కావటమేగాక అనేక మంది కవులను ప్రోత్సహించాడు. ఆయన మీద ఎవరో అజ్ఞాత కవి చెప్పిన చాటువు వినండి.

**వెలయాలు, శిశువు, అల్లుడు - ఇల ఏలిక, యాచకుండు, నేగురు ధరలో**
**కలిమియు లేమియు దలపరు - కలియుగమున కీర్తి కామ! కాటయ వేమా!**

( చా.ప.మ.మం. 91 )

# ఎనిమిదవ ప్రకరణము

పెదకోమటి వేగులు కొత్త కొత్త వార్తలు పట్టుకొస్తున్నారు. కాటయ వేముడు విజయనగరంతో బంధుత్వం పొందటం వలన కొండవీడు బలపడింది. రాజు కుమారగిరి అయినా రాజ్యపాలన కాటయ వేమారెడ్డిదిగానే ఉంది. బహమనీలతో కూడా రాయబారాలు సాగుతున్నాయి. ఆ దశలో పెదకోమటి వేమారెడ్డి తనపాలనకే ప్రమాదం రావచ్చునని భావించాడు. చందవోలు ముట్టడించి, శత్రువులు తనను హత మారిస్తే, కొండవీటి భవిష్యత్తుకు ఎదురు ఉండదు. ఆపని కుమాగిరి చేయలేడు. మిగతా రాజమిత్రులతో ఆపనిచేయించవచ్చును. కాబట్టి విజయనగర పాలకులతోనూ, రాచకొండ వారితోనూ మంతనాలు జరపాలి. బహమనీలతో మంచిగా ఉండాలి. కుటుంబ కలహాలలో వా జోక్యం చేసుకొనకుండా ఉండేలా చూడాలి. వారు తటస్థంగా ఉంటే, తన పదవికి ప్రమాడ ఉండదు. అలా ఉండేలా చేయాలి. భవిష్యత్తులో రాజ్యపాలన సుకరంగా చేతులు మారదు. యుద్ధం జరగక తప్పదు. పొరుగు రాజ్యాల తటస్థత చాలా అవసరం.

**అవచివారు**

కొండవీటి రెడ్డి రాజులకు, అవచివారికి అనేక సంబంధాలున్నాయి. రెడ్డిరాజ్య ప్రారంభంనుండి అవచి వారు రాజ్యరక్షణకు, వ్యాప్తికి, విదేశ వ్యాపారానికి ఎంతో సహకరించారు. 1323 నాటికే కాంచీ పురాన్ని కేంద్రంగా చేసుకొని, అవచి వారు వ్యాపారం చేస్తుండేవారు.

ఈ శ్రేష్ఠి కుటుంబం బాగా సంపన్నులు. నౌకావ్యాపారం చేసి, అనుభవం సంపాదించారు. దేశ విదేశాల రాజులతో మంచి సంబంధాలున్నాయి.

"సింహవిక్రమ పట్టణ శ్రేష్టుడైన సెట్టి, జగజెట్టి, పావాణి సెట్టి" కుమారుడైన అవచిదేవయ సెట్టికి, అద్దంకి లో 1324 - 25 లో పంటరెడ్ల రాజ్యాన్ని స్థాపించిన ప్రోలయ వేమారెడ్డితోను, అతని సోదరుడు మల్లారెడ్డితోను వ్యాపార సంబంధాలు బాగా ఉండేవి. అందుకే శ్రీనాథులవారు తన హరవిలాసంలో యిలా అన్నారు.

**శ్రీ పర్వత సోపాన - స్థాపకుడగు నట్టి వేమ జగతీ పతికిన్**
**బ్రాపైన యవచి దేవయ - యాపావాణికి జనించె నభ్యుదయము తోన్"**

(అవతారిక - 18)

**శ్రీ పర్వత సోపాన - స్థాపక వేమ క్షితీశ సామ్రాజ్య శ్రీ**
**వ్యాపారిముఖ్య! యన్వయ - దీపక! యలకాధిరాజ! దేవయ తిప్పా!'** (హర 3-1)

అవచితిప్పయ సెట్టి తాత పావాణసెట్టి నెల్లూరులో ఉండేవాడు. అదే కాలంలో

కాంచీపురంలో కూడా బాగా వ్యాపారం ఉన్నట్లు తోస్తున్నది.

దేవయసెట్టి కాలానికి వారి వ్యాపారం మూడు పూవులు ఆరుకాయలుగా పెంపొందింది.

మోటుపల్లి ఓడ రేవును బాగు చేయించి సముద్ర వ్యాపారాభివృద్ధి గావించిన సంగతి యింతకు ముందే చెప్పుకున్నాం.

అనపోతారెడ్డి మోటుపల్లిని మరింతగా అభివృద్ధి చేసి 1358వ సంవత్సరంలో అక్కడున్న వీరభద్రేశ్వరస్వామి అలయ మంటపస్తంభముల మీద అభయ శాసనం చెక్కించాడు. ఈ శాసనం సంస్కృతంలోనూ, తెలుగులోనూ, అరవంలోనూ ఉంది. ఈ వివరాలన్నీ ముందే చెప్పుకున్నాము.

గతంలో దేవయ సెట్టి అందించిన గజ., తురగాదులు, యుద్ధ సామగ్రి పంటరెడ్లు కాలు నిలుపుకోను ఎంతగానో ఉపయోగ పడినాయి. విదేశాలనుండి తెచ్చిన సుగంధ ద్రవ్యాలు, ఇతర సామగ్రి రాజ్య వైభవాన్ని పెంచాయి.

అందుకే శ్రీ నాథులవారు "ప్రాపైన అవచి దేవయ" అన్నారు. శ్రీనాథుని చిన్న తనం నుండి దేవయసెట్టి కుమారుడు తిప్పయసెట్టి మోటుపల్లి చందవోలు, అద్దంకి, కొండవీడు వస్తూపోతూ ఉండేవాడు.

## తిప్పయసెట్టి

వసంతరాయ బిరుదుతో వసంతోత్సవాలు చేస్తూ, కర్పూర వసంతరాయలని పిలుపు నందుకున్న కుమారగిరి రెడ్డికి యీ పేరు తేవటానికి అవచి తిప్పయ సెట్టి అందించిన సుగంధ ద్రవ్యాలే కారణం. ఈయన కుమారగిరి రెడ్డి సుగంధ శాలకు అధ్యక్షుడుగా ఉన్నాడు. ఆ రాజువలన ఆందోళిక, ఛత్ర, చామరాలు, తురంగాలు, మొదలగు రాజ్య చిహ్నాలను పొందాడు. వీరమాహేశ్వరాచార వ్రతుడు. (హర. అవతారిక -7)

అవచి తిప్పయసెట్టి తమ్ముడు వసంతోత్సవాలు నిర్వహించటంలో గొప్ప నిపుణుడు. విజయ నగర సామ్రాజ్యాధీశ్వరుడయిన హరిహరరాయలు, బహమనీ రాజ్యాధిపతి ఫిరోజి షాలతో మెప్పు కూడా పొందాడు. వారితో కూడా అవచి వారికి చాలా మంచి సంబంధాలున్నాయి.

## నైషధ రచన

పెదకోమటి వేమారెడ్డి మంత్రి శ్రీనాథులవారితో శృంగార నైషధాన్ని రసవత్తరంగా రచింప జేస్తున్నాడు.ఆపద్యాల పొందిక, అందం పెదకోమటి వేమారెడ్డికీ తెలుసు. సాహితీ పారంగతులకూ తెలుసు.

ఐతే చిన్నతనం నుండి, ఎదుటి వారి శక్తి సామర్థ్యాల నంచనావేయటంలోను, ప్రభువుల దగ్గర ప్రాపు నంపాదించేందుకు సుకరమైన మార్గాన్ని పొందటంలోను శ్రీనాథులవారు అందె వేసిన ఘనుడు.

నైషధంలో కృతిపతియైన మామిడి సింగనను ప్రశంసించేందుకు ప్రారంభించిన ఎత్తు గీతిలో శ్రీనాథులవారి పోకడ చూడండి.

తన కృపాణము సముద్ధత వైరిశుద్ధాంత తాటంకముల కెగ్గు దలచు చుండ,
తన బాహు పీఠంబు ధరణీ భృత్కమఠాహి సామజంబులకు విశ్రాంతి యొసగ
తనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ భవన భూముల గొండ్లి బరిఢ వింప
తన దాన మహిమ సంతాన చింతారత్న జీమూత సురభుల సిగ్గు పఱుప
బరగు శ్రీవేమ మండలేశ్వరుని...
ఇదంతా పెదకోమటి వేమారెడ్డి ప్రశంశ. ఆ పైన న మంత్రిగారి మాట
శ్రీ వేమ మండలేశ్వరుని మంత్రి - యహిత దుర్మంత్రి వదన ముద్రావతార
శాసనుడు, రాయవేశ్యాభుజంగ బిరుద - మంత్రి పెద్దయ సింగనామాత్య వరుడు.
( నైష 1 - 9 )

ఇలా కృతి భర్త సింగనను చెపుతూ, తాను ఆశ్రయం పొందాలనుకునే పెదకోమటి వేమారెడ్డిని రంజింపచేసే ప్రయత్నం సాగించారు. ఈ పద్ధతి సింగభూపాలుని వద్ద, భీమేశ్వరపురాణంలోను, హరవిలాసంలోను స్పష్టంగా కన్పిస్తుంది.

కృత్యాదినే గాక, షష్ట్యంతములందు, ఆశ్వాసాద్యంతములందు, పద్యాల్లో, చాల పర్యాయాలు ఈ క్రమాన్ని (టెక్నిక్‌ను) ప్రదర్శించారు.

హర్షనైషధానికి 46 వ్యాఖ్యానాలున్నాయి. వీనిలో చాందు పండితుని వ్యాఖ్యానం ప్రాచీన మయినది. నారాయణ పండితుడు, మల్లినాధసూరి వ్యాఖ్యానాలు బాగా ప్రసిద్ధి గాంచాయి.



శ్రీహర్షుని రచన 22 సర్గలతో 2800 శ్లోకాలతో నిండిఉంది. శ్రీనాథులవారు నైషధాన్ని శృంగార నైషధం అని పేరుపెట్టి 8 ఆశ్వాసాలతో, 1280 గద్య పద్యాలతో అందంగా వ్రాశారు.

శృంగార నైషధాన్ని గూర్చి ఆచార్య పింగళి లక్ష్మీ కాంతం గారిలా అన్నారు.

"నైషదాంధ్రీకరణ మతి సాహసము. కీర్తియే ప్రాణమనుకొనెడి ఈనాటి కవి యెవ్వడును సాహసింపడు. నేటికిని నైషధమును తెనిగింపగల కవి మరియొకడు కానరాడు."

## ప్రయాణం

ఇలా రచన చేస్తూ, రాజుకు, మంత్రికి అంతరంగికుడయినారు శ్రీనాథులవారు. ఈ రచన సాగుతూ ఉండగా పెదకోమటి వేగులు తెస్తున్న వార్తలను బట్టి శ్రీనాథులవారిని కాంచీ పురానికి పంపించి, తిప్పయ సెట్టి ద్వారా రాజకీయం నడపాలను కున్నారు. రాజు, మంత్రి కాంచీ పురంలో చేయ వలసిన పనులను చెప్పి శ్రీనాథులవారి నందుకు ఒప్పించారు.

తన రచన శృంగార నైషథం ఇంకా పూర్తికాక పోయినా దాన్ని వెంటతీసుకొని, తన మిత్రుడు, సాహితీ ప్రియుడు అయిన అవచితిప్పయను చూసి రావటానికి రాజలాంఛనాలతో శ్రీనాథుడు బయలుదేరాడు.

అవచితిప్పయ సాహిత్యాభిమాని. వసంతోత్సవాలలో తిప్పయ అభిరుచులు శ్రీనాథుల వారికి తెలుసు. ఒకరి యందొకరికి గౌరవం ఉంది. అనవేమారెడ్డి, కుమారగిరిరెడ్డి, పెదకోమటి వేమారెడ్డి, కాటయ వేమారెడ్డి, మంత్రులు, దండనాయకులు అందరూ తిప్పయకు పరిచయస్తులే. పైగా యవన, విజయనగర, రాచకొండ వారితోనూ వర్తక సంబంధాలున్నాయి.

యువ కవిగా, కవితా ప్రపంచంలో విజృంభిస్తున్న శ్రీనాథుని శక్తి సామర్థ్యాలు నలు దెసలా వ్యాపిస్తున్నాయి. గతంలో తిప్పయసెట్టి ఆహ్వానాలందినా శ్రీనాథుల వారు కంజీవరం వెళ్లలేదు. ఈనాడు కంచివెళ్లి, అవచి తిప్పయను మెప్పించి, అతనికున్న వ్యాపార సంబంధాల ద్వారా అన్యరాజులు రెడ్డిరాజుల కుటుంబ కలహాలలో తల దూర్చకుండా చేయవలసిన బాధ్యత శ్రీనాథులవారి భుజాలపై పడింది. ఆయన తన రాజకీయ చాతుర్యాన్ని ఉపయోగించి అవలీలగా యీపని సాధించుకురాగలడని సింగనమంత్రి, పెదకోమటి వేమారెడ్డి భావించారు.

అంతవరకు సలహాలివ్వటమే తప్ప. స్వయంగా యిలాంటి వ్యవహారాలు శ్రీనాథుల వారు చేపట్టలేదు. రాచకార్యంతో పాటు దేశ సంచారం చేస్తూ వెళ్లి రావచ్చు. కవితా యాత్రగా నలుగురకు తెలిసేలా ఆయన బయలు దేరారు.

ఐతే, యింతటి బృహత్కార్యాన్ని శ్రీనాథులవారెందుకు అంగీకరించినట్లు? కొండవీటి పాలకుల మధ్య అగ్నిరగిలి అందరినీ నాశనం చేయటం ఆయనకు యిష్టంలేదు. యుద్ధాలు జరగకుండా అనుకున్న మాట ప్రకారం సంధి షరతులు నెరవేరితే, దేశం శాంతిగా సుభిక్షంగా ఉంటుంది. లేకుంటే ఆంధ్రదేశం శత్రురాజుల పాలబడుతుంది.

## కంచిలో

వయసు పైబడుతున్న తిప్పయ సెట్టికి తనకవి మిత్రుని కవితా స్ఫూర్తి తెలుస్తూనే

ఉంది. తన కవిమిత్రుడు ఎంతగానో పెరిగిపోయి ఎన్నో కీర్తి కిరీటాలందుకుంటున్నాడని వార్తలొస్తూనే ఉన్నాయి. ఆనందాలందిస్తూనే ఉన్నాయి.

శ్రీనాథులవారు ప్రయాసకోర్చి స్వయంగా తనను చూసేందుకు కంచికి రావటం తిప్పయసెట్టికి సంతోషంగా ఉంది. మనసారా ఎదురేగి, ఆహ్వానించి, మర్యాదలు జరిపాడు. బాల సఖుని బాగా ఆదరించాడు.

శ్రీనాథులవారు తిప్పయ సెట్టికి తన శృంగార నైషధాన్ని విన్పించారు. సింగన మంత్రికి అంకితమిచ్చిన తీరు వివరించారు. సావధానంగా కొండవీటి రాచకీయాలు చెప్పారు.

అప్పటికే తిప్పయకు అన్నివిషయాలు తెలుసు. శ్రీనాథులవారి ముఖతఃవిని మరింత ఆందోళన చెందాడు. తమ తండ్రి దగ్గరనుంచి ఆరాజ్యపాలకులతో ఆత్మీయ సంబంధాలు ఉన్నాయి. రెడ్డి రాజ్య సుస్థిరతకు తామెంతో సహకరించారు. ఈనాడు కత్తులుదూసుకొని, తలలు నరుకుకుంటే తామింత వరకు చేసిన సాయం బూడిదలో పన్నీరేనా?

వ్యవహార దక్షుడైన తిప్పయ విషయాలనవగతం చేసుకున్నా, ఏమీ అనలేదు. ఆలోచనతో సతమతమవుతున్నాడు.

## హరవిలాసం

మరోవైపు యువ శ్రీనాథులవారు కవితా సుధారసా న్నందిస్తూ మైమరపించసాగారు. ఆ రచనాసంవిధానం, ఆ పోకడ తిప్పయను సమ్మోహపరచింది. శ్రీ నాథులవారి నడిగి యేదైనా కావ్యాన్ని అంకితం తీసుకుంటే బాగుంటుందనుకున్నాడు. కాని, త్వరపడట వ్యాపారి లక్షణం కాదు. అస్తి నాస్తి విచికిత్సతో ఆయన సమయం కొరకు నిరీక్షించాడ హరవిలాస పీఠికలో చెప్పిన దాని ప్రకారం, చివరకొకనాడు అంధ్రభాషా నైషధాబ్జ భవునితో.

ఉభయ భాషా కవిత్వ ప్రయోగ కుశలు, - బాల సఖు గారవించి, తాత్పర్య మొప్ప
నవచి దేవయ త్రిపురారి యక్షరాజు - హిత మితోక్తులు వెలయగ నిట్టులనియె
(హర అవతారిక -8)

ఏమన్నాడో గమనించండి.

ఆగమ జ్ఞాన నిధివి తత్వార్థ ఘనివి - బహు పురాణజ్ఞుడవు శుభ భవ్యమతివి
బాల సఖుడవు శైవ ప్రబంధ మొకటి - యవధరింపుము నా పేర నంకితముగ
(హర. అవతారిక. 12)

ఊహించిన మాటే ఉప్పొంగి వచ్చింది. శ్రీనాథులవారు అంగీకరించారు. తానూ ఈశ్వరార్చన కళానిధి గనుక పరమేశ్వర విలాసాన్ని వ్రాసి అంకిత మివ్వటం బాగుంటుందనుకున్నారు. హరవిలాసం అనే ఏడు ఆశ్వాసాల ప్రబంధాన్ని అద్భుతంగా చెప్పారు.

ఈ గ్రంథంవలన ఆనాటి సాంఘిక, రాజకీయ వ్యాపార విషయాలనేకం తెలుస్తున్నాయి.

**వ్యాపార విశేషాలు**

పంజార (బ) కర్పూర పాదపంబులు తెచ్చె
జలనోగి బంగారు (పన్నీరు) మొలక తెచ్చె
సింహళంబున గంధ సింధురంబుల తెచ్చె
హురుముంజి బలుతేజి హరులు తెచ్చె
గోవ సంశుద్ధ సంకుమద ద్రవము తెచ్చె
యావన నాణి(యాంపగట్టాణి) ముత్యాలు తెచ్చె
భోటకస్తూరి కాటంకంబులందెచ్చె
చీని చీనాంబర శ్రేణి తెచ్చె
జగదగోపాల రాయ వేశ్యా భుజంగ, - పల్లవాదిత్య, భూదాన పరశురామ,
కొమరగిరి రాజ దేవేంద్రు కూర్మిహితుడు, - జాణజగజెట్టి దేవయ చామిశెట్టి

(హర. అవతారిక. 26)

హరవిలాసంలోని ఈ పద్యం వలన ఏయేదేశాలనుండి ఏరకమైన సరకులు తెప్పించి, యీవ్యాపార కుటుంబం అందించేదో తెలుస్తోంది.

**అవచి వారి కుటుంబ వివరాలు**

హరవిలాసంలో అవచివారి కుటుంబ వివరాలు తెలుసుకోవచ్చును. అవచి దేవయ భార్య మాచమ్మ. ఈ దంపతులకు తిప్పయసెట్టి, చామసెట్టి, తిరుమలనాథసెట్టి అనే పుత్రులు కలిగారు. తిప్పయ సెట్టికి త్రిపురాంతకుడనే మరో పేరు ఉంది.

తండ్రి తరువాత తిప్పయ సెట్టి వ్యాపారాన్ని బాగా అభివృద్ధి పరచాడు. దేశ విదేశాలలో విస్తరించాడు. హరవిలాసంలోని పద్యాలవలన మనకు వివరాలు తెలుస్తున్నాయి.

తమ్ములిద్దరు తన యాజ్ఞ దల ధరించి - యన్ని దీవుల దెచ్చు లాభార్థ కోటి
యర్థులకు నిచ్చి కీర్తి బేహార మాడు - నవచి త్రిపురాంతకుండు వంశాబ్ధి విధుడు

(హర. అవతారిక 27)

అవచి తిప్పయ భార్య అన్నమదేవి. వీరికి మాచన, విశ్వనాథుడు, చినమల్లన అనే కుమారులున్నారు.

కుటుంబంలోని పురుషులందరూ వ్యాపారంలో పాల్గొన్నట్లు తోస్తున్నది. తిప్పయసెట్టి చేసే దిగుమతుల వివరాలు చూడండి.

తరుణా చీని తవాయి గోవ రమణాస్థానంబులన్ జందనా
గరు కర్పూర హిమాంబు కుంకుమ రజః కస్తూరికా ద్రవ్యముల్
శరధిన్ గప్పలి, జోగులన్ విరివిగా సామాన్లు తెప్పించు నే
ర్పరియౌ వైశ్య కులోత్తము ఒడవచి తిప్పండల్పుడే యిమ్మహిన్
(హర. అవతారిక 28)

కప్పలి, జోగు అనేవి ఆనాటి ఓడలలో పెద్దవని వేరే చెప్పనవసరంలేదు. వాటి పరిమాణమును బట్టి ఈ పేర్లతో పిలిచేవారు.

## పూర్వీకుల గొప్పతనాలు

హరవిలాసంలో శ్రీనాథులవారు తిప్పయను, అతని కుమారులను, సోదరులను, - ఒకరేమిటి! వారి పూర్వీకులను శాశ్వతంగా ఉండేలా గ్రంథస్థంచేశారు.

**కట్టించెనొక తాత కంచి హర్మ్యంబులు హరిణాంక మౌళి కేకామ్ర పతికి**
**బాలార్గమనియెడి పద్మరాగముడాచె నొక తాత కంచి నాయకుని నాభి**
**నొక తాత కట్టించె యోజన త్రయ దీర్ఘతర తటాకాంభోధి తిరువళూర**
**కావేరి కట్టించె గార్పాసరాశుల నుబ్బి చోడడు మెచ్చ నొక్కతాత**
**ప్రతి దినమ్ము గపురపు దీపములు వేయు - వ్రతముగా నొక్క తాత ఈశ్వరున కొసగె**
**నిఖిల లోక ప్రసిద్ధ వాణిజ్య వంశ - ధరులు మాతాత లుభయ గోత్రముల వారు**
(హర అవతారిక 10)

తిప్పయసెట్టి చెప్పినట్లు హరవిలాసంలో ఉన్న యీపద్యం వారి పెద్దల కీర్తికి శాశ్వతత్వాన్ని ప్రసాదించింది.

పండువా, ఢిల్లీ, రాఠౌరు మొదలైన పట్టణాలను పాలించే ప్రభువులు ఆనాడు ముసల్మానులు. అవచి తిప్పయ ద్వీపాంతరాల నుండి తెప్పించి అందించే రత్నాలను వారు శిరములందు ధరించేవారు.

పండువా ఢిల్లి రాఢాది పట్టణముల - యధిపతులు మౌళి దాల్పు రత్నాంకురంబు
లవచి త్రిపురాంతకానీత యాన పాత్ర - సింహళద్వీప మండల క్షేత్రజములు
(హర. అవతారిక 29)

తిప్పయ సెట్టిగొప్పతనం కూడా ఎవరికీ తీసిపోదని శ్రీనాథులవారు చెప్పారు.

**ఖుసిమీఅన్ సురథాణి నిండు కొలువై కూర్చున్నచో నీ కరా**
**భ్యసనప్రౌఢి నుతించురా యవచి తిప్పా! చంద్ర సారంగ నా**
**భి సముత్పాదిత తాళవృంత పవన ప్రేంఖోల్లన ప్రక్రియా**
**వసరో దంచిత సార సౌరభ రసవ్యాలోల రోలంబముల్** (అవతారిక 22)

ఈ పద్యంలోని సురధాణి - ఫిరోజిషా. ఇతను (1397-1422) వరకు పాలించాడు. బహమనీ పాలకుడైన ఫిరోజిషా కొలువు కూటంలో కూడా తిప్పయసెట్టి సుగంధ ద్రవ్యాల సువాసనలు పేరు పొంది, సెట్టిగారికి మంచి గౌరవాన్ని సమకూర్చాయి.

## సాహిత్యపు ముసుగు

కొండవీడు పాలకుడు కర్పూర సంతరాయలని పిలుబడే కుమారిగిరి ప్రభువు వద్ద యీకుటుంబానికి ఎనలేని గౌరవముంది. శ్రీనాథులవారు తన కావ్యంలో సందర్భాన్నిమించి, శయ్యాపాకాన్నధిగమించి కుమారగిరిని పొగడినాడని నేను భావిస్తున్నాను. ఇది ఒక విధంగా తనరాకలోని రహస్యాన్ని కాపాడేందుకు వాడిన సాహిత్యపు ముసుగు కావచ్చును.

హరవిలాస పీఠికలోని సుదీర్ఘ వచనంలో

"కొండవీడు పురంబు రాజధానిగా కీర్తిలతాధిష్ఠితాష్టాదశ ద్వీపాంతరాళుండునగు కొమర గిరి వసంతనృపాలుని గూర్చి" చాలా చాలా చెప్పారు.

ఇంతగా పొగడటం అవసరమా? కృతిభర్త తిప్పయకు, కుమారగిరి ప్రభువుకు ఉన్న సంబంధాన్ని, తిప్పయ పొందిన గౌరవాన్ని యిలా వర్ణించారు.

"ఆందోళికా ఛత్ర చామర తురంగాది రాజ్య చిహ్నములు వడసిన తిప్పయ అమ్మహారాజునకుం బ్రతి సంవత్సరోత్సవమునకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబు కాలాగరు గంధసార ప్రభృతి సుగంధ ద్రవ్యంబు లొన గూర్చియు" అంటూ చాలా చెప్పారు.

ఆశ్వాసాంతాలలో చెప్పిన పద్యాలలో కూడా ఇదే ధోరణి కన్పిస్తుంది.

## సుగంధిశాలాధ్యక్షుడు

తిప్పయసెట్టి, కుమారగిరి రెడ్డి వసంతోత్సవాలకు కావలసిన సుగంధ సామాగ్రి అందించటమే కాదు. సుగంధిశాలలకు అధ్యక్షుడుగా ఉండేవాడు.

కొమరగిరి నృప వసంతా - గమ కేళీ గంధసార కస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంభ - స్సముదంచిత బహు సుగంధి శాలాధ్యక్షా! (హర 1-30)

కొమరగిరి క్షమారమణ కుంజర చారు వసంత వైభవ
క్రమ సముపార్జితాభినవ గంధ హిమాంబు కురంగనాభి కుం
కుమ ఘనసార సంకుమద కుంభ మనోహర గంధశాలికా
సముదయ సార్వభౌమ! కవిసంఘ మనోభవ కల్పక ద్రుమా (హర 4-103)

కుమారగిరి ప్రభువు జరిపించే వసంతోత్సవానికి సమకూర్చుకున్న అభినవగంధ, హిమాంబు, కురంగనాభి, కుంకుమ, ఘనసార, సంకుమదముల పోగులను పాత్రలలో

నింపుకుని మోసే స్త్రీజనానికి తిప్పయ సార్వభౌముడు. అనగా సుగంధ శాలాధ్యక్షుని మరో అందమైన భావంతో అల్లిన కవితా చమత్కారం.

## తిరుమలనాథ సెట్టి

అవచితిప్పయ సోదరుడు తిరుమలనాథ సెట్టి కూడా కుమారగిరి కొలువులో వసంతోత్సవాలల్లో ప్రధాన పాత్ర నిర్వహిస్తుండేవాడు. శ్రీనాథులవారు ఆయనను వర్ణిస్తూ సమకాలీనులైన ముగ్గురు రాజులపేర్లను కూడా చెప్పారు.

**హరిహరరాయ, ఫేరొజసహా సురధాణ, గజాధిపాది భూ**
**వరులు నిజప్రభావ మభివర్ణనసేయ గుమారగిర్యధీ**
**శ్వరుని వసంత వైభవము సర్వము నొక్కడ నిర్వహించు మా**
**తిరుమలనాథ సెట్టికిని ధీ గుణ భట్టికి నెవ్వరీడగున్"** (హర. అరతారిక 24)

ఆనాడు రాజులకున్న బిరుదులు వారి మంత్రులు, దండనాథులు, తిప్పయవంటి వ్యాపారులు ధరించేవారు.

ఆ ఆచారాన్ని శ్రీనాథులవారు అమలు పరిచి తిప్పయ శ్రేష్ఠిని బిరుదులతో ముంచెత్తారు.

ఈ పుస్తకం పెరిగి పోతోందని నేను వివరాల జోలికి పోవటంలేదు.

## హరవిలాసం - శివలింగం

హర విలాసంలో శివుని పేరుమీద శ్రీనాథులవారు కొంత భాగంలో పచ్చిగా ఉండే కథను నడిపారు. బహుశా ఆనాటి ప్రముఖులు అలాంటి అశ్లీలాలను సాహిత్యంలో చెపితే విని ఆనందించి ఉంటారు. ఆరాధించక పోయినా, ఆనందాన్ని పొంది ఉంటారు.

శివుడు పార్వతిని పెళ్లాడిన కొత్తలో మామగారైన హిమవంతుని మీద కోపగించుకొని దారుకావనానికి వెళ్లిపోతాడు. అక్కడ ఋషుల భార్యలను చూసి కామోద్రేకంతో, వారి వెంట పడతాడు. ఋషులు ఎదిరించారు. శివునకు కోపం వచ్చింది. తన పురుషాంగాన్ని నిగిడ్చి దానితో ఋషులను కొట్టసాగాడు. అప్పుడు బ్రహ్మ విష్ణువు అక్కడకు వచ్చి శివుని ప్రార్థించారు. ఆయన ప్రసన్నుడైనాడు. తనను ఎదిరించినందుకు కలిగిన పాపాన్ని పరిహరించుకోను ప్రతిరోజూ తనలింగాన్ని పూజించు కోవలసిందిగా దేవతలకు, ఋషులకు మార్గాన్ని చూపించాడు.

ఇదంతా హరవిలాసంలో పచ్చిపచ్చిగా ఈశ్వరార్చన కళానిధి అయిన శ్రీనాథులవారు వర్ణించారు. కాని, ఆంధ్రసాహిత్య అకాడమీ వారు ప్రచురించిన హరవిలాసంలో యీభాగాన్ని ముద్రించలేదు. కావాలనే అలాచేశారు. సాహిత్యాన్ని అలా కత్తిరించటం తగిన పని కాదు.

## కవిత్వానికి పెద్ద పీట

శ్రీనాథులవారు హరవిలాసాన్ని కంజీవరంలోనే వ్రాశారు. త్వరితగతిని వ్రాసినట్లుగా అనిపిస్తుంది. అందువలన కథా గమనంలో సాంకేతికమయిన పొరపాట్లు దొర్లాయని పెద్దలు చెపుతున్నారు. పాండిత్య ప్రకర్షకన్నా కవిత్వం మిన్నగా ఉందని అంటారు.

శృంగార ప్రియులైన శ్రీనాథులవారు జీవితంలో ఆటవెలదులను, కవనంలో తేటగీతులను ఆరాధించారు. ఒక్క హరవిలాసంలోనే తేటగీతులు 166వ్రాస్తే, ఆటవెలదులు 5 మాత్రమే చెప్పారు. సీసాలయితే 92 ఉన్నాయి. ఈ లెక్కలు ఆరుద్రగారి సమగ్ర ఆంధ్ర సాహిత్యంనుండి తీసుకున్నాను. 92 సీసాలకు చివర అన్నీ తేట గీతులే చెప్పారన్నారు.

కృతి పూర్తయింది. వైభవోపేతంగా అంకితం జరిగింది. అవచితిప్పయ జన్మతరించి పోయిందని భావించాడు. తిప్పయ కుటుంబం కూడా మురిసి పోయింది.

## అసలు విషయం అడిగారు

ఆ ఆనంద సమయంలో ఆంతరంగిక సమాలోచనలలో శ్రీనాథులవారు మనసులోని మాట బయటపెట్టారు. హైందవ రాజుల మధ్య పోరువలన దేశం అల్ల కల్లోలమవుతుంది. ముఖ్యంగా రెడ్డి రాజుల జ్ఞాతి పోరాటం రగిలితే తీరాంధ్రభూమి పాడుపడుతుంది. సముద్రవ్యాపారం మూతబడుతుంది. దేశసంపదకు, శాంతికి, వాణిజ్యానికి దెబ్బరాకుండా ఉండేందుకు కుమారగిరికి పెదకోమటి వేమారెడ్డికి యుద్ధం జరుగకూడదు. ఒకవేళ జరిగితే పరరాజులు అందులో పాల్గొనకుండా ఉండటం వలన త్వరలోనే యుద్ధం సమసిపోతుంది. శాంతి నెలకొంటుంది. ఇందుకు ప్రధానంగా విజయనగర రాజులు తటస్థంగా ఉండటం అవసరం.

అవచి తిప్పయ తన బాల సఖుని భావాలను అర్థంచేసుకున్నాడు. యుద్ధమే జరిగితే, విజయనగరాధీశులో, కటకం గజపతులో, రాచకొండ రేచెర్లవారో, బహమనీలో కొండవీడు నాక్రమిస్తారు. ఆపైన ఎడతెగని పోరుఎన్నేళ్లయినా సాగవచ్చు. తన తండ్రి సహాయంతో నిలబడి, తనవారి పేరుతో ముడిపడి ఉన్న కొండవీడు ఆయనకు కన్పించింది. మనసులో ఎన్నో ఆలోచనలు.

శ్రీ పర్వత సోపాన - స్థాపక వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ
వ్యాపారి ముఖ్య ! యన్వయ - దీపక ! యలకాధిరాజ! దేవయ తిప్పా!

అన్న పద్యంగుర్తొచ్చింది. తనతండ్రి సామ్రాజ్య వ్యాపారి.

కొమరగిరి నృప వసంతా - గమకేళీ గంధసార కస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంభ - స్సము దంచిత బహు సుగంధి శాలాధ్యక్షా!

అన్న శ్రీనాథులవారి పద్యం గుర్తొచ్చింది. మరి తానూ ఆ బాటలోనే నడుస్తున్నాడు. తానో "కొమరగిరి క్షమారమణకుంజర చారు వసంత వైభవక్రమ సముపార్జితాభినవ గంధ హిమాంబు కురంగనాభికుంకుమ ఘనసార సంకుమద కుంభమనోహర గంధశాలికుల సముదయ సార్వభౌముడు"

భావాలన్నీ అతిశయోక్తులు కావు. తన బాల సఖుడు యదార్థాలే వ్రాశాడు. ఇంకా "కవి సంఘ మనోభవ కల్పక ద్రుమా" అని తనను అన్నాడు.

తిప్పయ నిర్ణయించుకున్నాడు. ఆ పైన ఎంతవరకు ఆచరించాడో మనకు తెలియదు. చివరకు శ్రీనాథుని కాంచీపురయాత్ర యీపని కొరకే ననేది కూడా మనకు లిఖితాధారాలు లేవు. ఊహమాత్రమే.

## స్పందించి చెప్పారు.

కాంచీపురంలో శృంగార శ్రీనాథులవారు ఎక్కువకాలం ఉండలేదు. కాని శ్రీరంగం కూడా వెళ్లి రంగనాథస్వామిని సేవించారనే మాట ఉంది.

కాంచీపురంలో తెలుగు వారితోపాటు అరవలు కూడా ఉండేవారు. ప్రధానంగా కంజీవరం, చెంగల్పట్టు ప్రాంతాలు తెలుగు నేలలు. అక్కడ చూసిన అరవల జీవన విధానాలను చాటుపద్య చక్రవర్తి శ్రీనాథులవారు చాలా పద్యాలలో చెప్పారు. తాను చూసిన అరవపిల్ల మీద చెప్పిన పద్యం గిలిగింతలు పెడుతుంది.

**మేత కరిపిల్ల పోరున మేక పిల్ల - పారుబోతు తనంబున పందిపిల్ల**
**ఎల్ల పనులను చెరపంగ పిల్లి పిల్ల - అందమున కోతి పిల్ల యీ అరవపిల్ల**

ఆంధ్ర కవితాలోకంలో అధిక భాగం అగ్రవర్ణం వారు కావటం వలన క్రింద సమాజాన్ని వారు పరిశీలించి అక్షరబద్ధం చేయలేక పోయారు. కాని శ్రీనాథ మహాకవి పరిశీలనకు అందని కోణం లేదు. తాను విస్తృతంగా పర్యటించారు. చూసిన దానిని పద్యంలో బిగించారు. చిన్న చిన్న వివరాలను కూడా వదలలేదు.

**ముడువంగ నేర్తురు ముడువదాపటికిరా జికుర బంధము లీగ జీరు వార**
**పొన్న పువ్వులబోలు పొక్కిళ్లు బయలుగా కట్టనేర్తురు చీర కటిభరమున**
**దొడుగంగ నేర్తురు నిడువ్రేలు జెవుల యందవతంసకంబుగా నల్లి పువ్వు**
**పచరింప నేర్తురు పదియారు వన్నియ పసిడి పాశము లోర పట్టు చెఱగు**
**పయ్యెద ముసుంగు బాలింఢ్ల బ్రాకనీరు -తరచు పూయుదు రొడల గంధంబు పసుపు**
**బందికత్తెలు సురత ప్రసంగవేళ - గంచి వ్రేతలు కుసుమాస్త్ర ఖడ్గలతలు**

( కాశీ ఖండం 3 - 109 )

కూడు తలప జోళ్లు, కూర కారామళ్లు, చెవులంత వ్రేలాళ్లు, చేలు మళ్లు,
దుత్తెడే నాగళ్లు, దున్నపోతుల యేళ్లు, కలవు మాపటి వేళ గంజి నీళ్లు,
మాట మాటకు ముళ్లు, మఱి దొంగ దేవళ్లు చేదైన పచ్చళ్లు, చెఱకు నీళ్లు,
వంట పిడ్కల దాళ్లు, వాడ నూతుల నీళ్లు, విన విరుద్ధపు బేళ్లు, వెడద నోళ్ళు,
సఖుల చన్నులు బైళ్లు, చల్లని మామిళ్లు, పరువైన వావిళ్లు, పచ్చ పళ్లు,
దళమయిన యట్టి కంబళ్లు, తలలు బోళ్లు,- పయిడికిని జూడ బయిడెత్తు ప్రత్తి విళ్లు,
చలముకొని వెదకిన లేవు చల్ల నీళ్లు, - చూడవలసెను ద్రావిళ్ల కీడు మేళ్లు.

( క్రీడాభిరామం. శ్రీనాథ చాటువు 120 )

తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపు జారు చెవులలో బొగ వెళ్లి చిమ్మిరేగ,
బలు తెరంగుల తోడ బచ్చళ్లు చవి గొన్న బ్రహ్మరంధ్రము దాక బారు నావ,
యవిసాకు వేచిన నార్నెల్లు నసి లేదు పరిమళ మెంచిన బండ్లు సొగసు,
వేపాకు నెండించి వేసిన పొళ్లను గంచాన కాంచిన గ్రక్కువచ్చు,
నఱవ వారింటి విందెల్ల నాగడంబు
చెప్పవత్తురు తమ తీరు సిగ్గులేక
. . . . . . . . . . . . . . . . . . . .

( శ్రీనాథుని చాటు పద్యాలు, క్రీడాభిరామం 121 )

తన కవితా శక్తివలన తిక్కనాదులను మించగలిగిన కవితామూర్తి శ్రీనాథులవారు. కాని రాచకార్యాలలో తలమునకలై కవిత మీద చూపవలసినంత శ్రద్ధ చూపలేదనిపిస్తుంది. ఐనప్పటికీ ప్రాచీన కవులలో ఎక్కువగా స్మరించేది శ్రీనాథుల వారినే. తన గ్రంథాలుగాక విస్తృతంగా పర్యటించి చాటువులలో శబ్ద చిత్రాలను చిత్రించిన మహనీయుడు శ్రీనాథులవారు. మాననీయుడు కవి సార్వభౌముడు.

శ్రీనాథులవారు 1400 ప్రాంతంలో హర విలాసం వ్రాసి, తన పని ముగించుకొని తిరిగి వచ్చారు.

చందవోలులో సింగన మంత్రి ఫిరోజి షా తో మంతనాలు జరిపి ఏదో నిర్ణయం చేసి ఉంటాడని భావించేందుకు కొన్ని ఆధారాలున్నాయి.

నవరత్నోపల దివ్యలింగ వరదాన ప్రీత దాక్షాయణీ
ధవ కర్పూరవసంతరాయ యనవద్య ద్వాదశీ వాసరో
త్సవ రుక్మాంగద వేమభూపతి మహా సామ్రాజ్య రక్షా మణీ!
యవనాధీశ సభా నిరంకుశ వచోవ్యాపార పారంగతా ! (నైష 2 - 144 )

ఇది శ్రీనాథులవారి పద్యం.

"యవనాధీశ సభా నిరంకుశ వచోవ్యాపార పారంగతా!" అని అనటం వలన సింగన తురకలతో మంతనాలు నెరపి ఉంటాడు. ఏకారణం వలననో గాని ఫిరోజి షా కొండవీటి మీదకు దండెత్తి వచ్చినట్లు కన్పిస్తోంది. విజయ నగరముపై దండెత్తి వెళ్లిన బహమనీ ఫిరోజ్ షా కొంత సైన్యాన్ని కొండవీటి మీదకు పంపించాడు. కొండవీటి సామంతుడైన గజరావు తిప్పానాయకుడు కొంతసేనతో వెళ్లి కంబముమెట్టు వద్ద ఎదుర్కొన్నాడు. తురుష్కులు ఓడిపోయారు.

ఇదే అదనుగా భావించి కళింగాధిపతి రాజమహేంద్రవరం పై యుద్ధానికొచ్చాడు. కాటయ వేమారెడ్డి గొగ్గయ దేవుడనే సేనానిని పంపించాడు. సింహాచలము (విహరణ గిరి) వద్ద యుద్ధం జరిగింది. 1399లో సర్పవరములో వేయించిన శాసనం వలన యీ విషయం తెలుస్తున్నది.

అదే సమయంలో విజయనగరాధీశ్వరులు శ్రీశైల ప్రాంతాన్ని, మరికొంత భూభాగాన్ని ఆక్రమించారు. అదే కాలంలో కందుకూరును పాలిస్తున్న మల్లారెడ్డి సంతతివాడైన కోమటిరెడ్డి కందుకూరు నుండి గుంటూరు జిల్లా తెనాలి తాలూకా వరకు గల సముద్ర తీర ప్రాంతాన్ని ఆక్రమించుకొన్నట్లు 1404 నాటి పెదపూడి రాగి శాసనం వలన తెలుస్తున్నదని మల్లంపల్లి వారు వ్రాశారు.

## కుమారగిరి చివరిదశ

బలవంతుడైన ఫిరోజ్ షా ప్రాబల్యం వలన కుమారగిరి పాలన చివరిదశలో కొండవీటికి కష్టాలు వచ్చాయి. కుమారగిరి పక్షమువారు క్రమేణా పెదకోమటి వేమారెడ్డి వైపుకు వెళ్లారు. కాటయ వేమారెడ్డి కూడా ఏమీ చేయలేక పోయాడు. చివరకు జ్ఞాతి పోరాటాలు పెరిగాయి.

గుంటూరు జిల్లా గుంటూరు, బాపట్ల, రేపల్లె, పలనాడు తాలూకాలలో రేచెర్ల పద్మనాయకుల శాసనాలు కొన్ని కన్పిస్తున్నాయి. 1387లో గజరావు తిప్పానాయనింగారి సామంతుడైన వెలుగోటి రాయపనాయనింగారి శాసనాలవలన యీ విషయం తెలుస్తోంది.

ఇతను కొండవీటికి సామంతుడయి ఉండి ఉండవచ్చును. శాసనాలలో గజరావు తిప్పానాయని పేరే ఉంది. కొప్పునూళ్ల వంశ ప్రశస్తి బిరుదావళిని బట్టి వీరు మొదట కొమరగిరి రెడ్డికి సామంతులై తరువాత పెదకోమటి వేమారెడ్డి వైపు తిరిగి, ప్రముఖ పాత్ర వహించి ఉంటారు.

ఇలా చాలామంది మారి ఉంటారు. కాటయ వేమారెడ్డి కూడా ఏమీ చేయలేక పోయాడు. చివరకు పోరాటాలు పెరిగాయి. గుండుకొలను, కోనూరుల వద్ద సంకుల సమరం జరిగింది. కొండవీడు పరాజయం చెందింది. కాటయ వేమారెడ్డితో కలసి

కుమారగిరి రెడ్డి రాజమహేంద్రవరానికి వెళ్లిపోయాడు.

ఇంతవరకు కుమారగిరి రెడ్డి శాసనాలలో 1400 నాటి కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాలోని కొత్తూరు శాసనమే చివరిది.

1402 ప్రాంతంలో కుమారగిరి రెడ్డి జబ్బుపడి, రాజమండ్రిలో చనిపోయాడు.

# తొమ్మిదవ ప్రకరణము

## పెదకోమటి వేమారెడ్డి (1402 - 1420)

కోమటి వేమారెడ్డి కలలు ఫలించాయి. కాని రాజ్యం శత్రుమయంగా ఉంది. ఐనా దక్షతతో దాన్ని నడుపుకురావాలి. ముందుగా సరిహద్దుల భద్రత, పూర్వరాజ్యంలో పోయిన భాగాల సంపాదన ముఖ్యం. ఇందుకుగాను అనేక యుద్ధాలు చేయక తప్పదు. తలమునకలుగా కార్యనిర్వహణ కొరకు మంత్రులు పని చేస్తున్నారు.

## విద్యాధికారి శ్రీనాథుడు

సాహిత్య ప్రియుడైన పెదకోమటి వేమారెడ్డి తన అధికార పోరాటంలో మనసారా సహకరించి, ఎంతో మేలు కూర్చిన శ్రీనాథులవారిని సర్వలాంఛనాలతో విద్యాధికారిగా నియమించాడు. ఇలా నియమించటం వలన సాహిత్యలోకంలో తెలుగుకు స్వయం ప్రకాశం లభించినట్లయింది.

పెదకోమటి వేమారెడ్డి పదునెనిమిదేడుల పాలనలో శ్రీనాథులవారు యీ పదవిలో రాజభోగాలనుభవించారు. ఆపైన రాచవేముని నాలుగేళ్లపాలనలో కూడా ఉండి ఉండవచ్చునని భావిస్తున్నాను.

ఈ కాలంలోనే శ్రీనాథులవారు వేమారెడ్డితో కలసి కాశీయాత్ర చేసి వచ్చారని పరిశోధకులు భావిస్తున్నారు. తరువాత కాలంలో శ్రీనాథులవారు వ్రాసిన భీమేశ్వర పురాణం, కాశీ ఖండం పరిశీలించి యీ నిర్ణయం చేశారు.

రాచకార్యాలు చక్క బెట్టటంలోను, శాసనాలు వ్రాసి చెక్కించటంలోను, కవులను పండితులను పరీక్షించి స్థాయి నిర్ణయించి, రాచ మర్యాదలు, సన్మానాలు చేయించటంలోను శ్రీనాథులవారు నిమగ్నులైపోయారు. ఇందువలన రచనల మీద శ్రద్ధ తగ్గినట్లు కన్పిస్తోంది.

## చాటు ధార

శ్రీనాథులవారికి చాటుధార జన్మతః వచ్చినది. "ఒక భోగిచేత సత్కరించబడినపుడో, ఒక లోభి చేత ఛీత్కరించబడినప్పుడో, అందమైన దృశ్యం కనబడినపుడో, డెందం గాయపడినపుడో, అనిష్టం తొంగి చూసినపుడో, హాస్యం లాస్యం చేసినపుడో అనేక సందర్భాల్లో చిత్రమైన చిత్త వృత్తుల్లో ఛందో రూపంలో జుమ్మని చిమ్ముకొని వచ్చే కవితారూపాలే ఈ

చాటు పద్యాలు అంటారు సి.నారాయణ రెడ్డిగారు.

శ్రీ పాణకా పెంచలు రెడ్డిగారు చాటు పద్య స్వభావాన్నీ ప్రయోజనాన్నీ చక్కగా వివరించారు." "చాటువులు కేవల కల్పనా కథాత్మకములును, అత్యంతాతిశయోక్తి మయములును గాక, విషయానుకూల స్వాభావిక వర్ణనాలంకృతములయి, సర్వజన హృదయంగమములయి, రసమొలుకు చుండును. అంతేగాక పూర్వరాజుల గుణ గణములను, అప్పటి దేశ స్థితిగతులను, నాటి యుద్ధములను, జయాపజయములను, పండితులను, వారి వారి వివాద సామర్థ్యములను, మరియు ననేక విషయములను దెలిపి ప్రకృత దేశ చరిత్ర కారులకును, కవులకును చేయూతనొసగ జాలియున్నవి" అని అన్నారు.

"నిర్భీకత, ఆశ్చర్యజనకత, ఉరవడి, ధారాశుద్ధి, అప్రయత్న సిద్ధత, నిజాయితీ వంటి కవితాలక్షణాల సమాహారమయిన భీమకవి 'ఉద్దండత' ఒక విధంగా ఉత్తమచాటు కవిత్వానికి ఆవశ్యక లక్షణం అనవచ్చు. తమ యథార్థ వ్యక్తిత్వాలను తమరచనల్లో నిస్సంకోచంగా ప్రకటించే నిర్భీకత, నిజాయితీ భీమకవినీ శ్రీనాథుణ్నీ ప్రజలకు ఆత్మీయుల్ని చేశాయి. వేమన వంటి ఒకరిద్దరిని మినహాయిస్తే తక్కిన తెలుగు కవుల్లో చాలా వరకు యీ లక్షణం విరళం అనవచ్చు" అంటారు బొమ్మకంటి శ్రీనివాసా చార్యులు, బాలాంత్రపు రజనీకాంతారావుగారు.



తాను విద్యాధికారిగా ఉన్న కొండవీటి రాజ్యానికి ముఖ్య పట్టణమైన కొండవీటిని గొప్పగా కీర్తిస్తూ చెప్పిన "పరరాజ పరదుర్గ" సీస పద్యాన్ని ఈ రచనలో ప్రారంభంలోనే యిచ్చాను.

కొండవీడు కవిపండితుల కల్పతరువు. కవితలల్లటం గొప్ప సరదాగా, వ్యసనంగా మారింది. ఎక్కడ చూసినా సరసతలేని కుకవుల కవితాగానా లెక్కువయినాయి. అందుకే ఓండ్ర పెడుతున్న గాడిదను చూసి శ్రీనాథులవారు ఎద్దేవగా ఒక పద్యం చెప్పారు.

**బూడిద బుంగవై యొడలు పోడిమ దక్కి మొగంబు వెల్లనై**
**వాడల వాడలం దిరిగి వారును వీరును జొచ్చొచోయనన్**
**గోడల గొందులందొదిగి కూయుచు నుండెదు కొండవీటిలో**
**గాడిద నీవునుం కవివి కాదుగదా? అనుమానమయ్యెడిన్.**

శ్రీనాథులవారు 'చొచ్చొచో' అనే పదం వాడారు. ఈనాటికీ కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఎడ్లను అదలిస్తూ రైతులు "చొచ్చొచో" అనటం ఆనవాయితీగా వస్తున్నది. అనగా యీ పదం బహు పురాతన కాలంనుండి వాడుకలో ఉంది.

పేరు తెలియని కవి ఎవరో పెదకోమటి వేమారెడ్డి మీద చెప్పిన చాటుపద్యంలోని

కల్పనా చాతుర్యం రసభరితంగా ఉంది.

ధరణియె బొమ్మరిల్లు, వసుధావర పంక్తులు బొమ్మ, లంబుధుల్
గురుగులు, చక్రవాళగిరి కోట, నభంబది సేనకోర, ని
ర్జరగిరి గద్దె పీట, యిన చంద్రులు మేటి నివాళి పళ్ళెముల్
గురుతర పుణ్యుడైన పెదకోమటి వేమన కీర్తి కాంతకున్

( చా.ప.మ.మం. - 86 )

మరో చాటు పద్యం గమనించండి.

కపట కంఠీరవాకార నారాయణ క్ష్వేళా నినాదంబు గేలి చేయు
కల్పాంత దుర్దాంత కాలభైరవ భేరి ఢమరు కోన్మాదం బడంగ జేయు
ప్రళయ కాలాభీల పటు ఘోర నిర్ఘాత పటుపుటారావంబు జటుల పఱచు
కుహనామహాకాల కోలాహలోత్తాల పాతాళ నినదంబు భంగపఱచు
గండు మెఱసిన రిపుకోటి గుండెలవియ - జండగతి మ్రోయు వీరణోద్దండ భేరి
జయరమాసంగ! రాయవేశ్యా భుజంగ! -అతుల బలధామ ! పెదకోమటన్న వేమ!

( చా.ప.మ.మం. - 84 )

## రాజకీయాలు

కాటయ వేమారెడ్డికి రాజకీయ బంధువైన రెండవ హరిహర రాయలు చౌండపామాత్యుని నాయకత్వంతో కొంత సైన్యాన్నిచ్చి కొండవీటి మీదకు దండు పంపించాడు. కాని, గజరావు తిప్పడు వీరిని ఓడించి తరిమి వేశాడు. ఈ చాటు పద్యపాదం గమనించండి.

"చౌండపామాత్యుని సాచి తాగొట్టడే
కొండవీడా పెద్ద కొండగడిని" (చా.ప.మ.మం. - 61 )

పెదకోమటి వేమారెడ్డికి **"యవనకుల కాలకూట కబళన మహాకాలుడు"** అని బిరుదు ఉన్నట్లు వేమ భూపాల చరితలో ఉంది.

యవనులనగా యిక్కడ బహమనులు. వారితో యుద్ధం ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు జరిగిందో తెలుసుకోవాలనుకున్నాను. వివరాలు లభించలేదు.

విజయనగర పాలకుడు రెండవ హరిహరరాయలు (1377 - 1404) చనిపోయాడు. రెండవ హరిహర రాయల ప్రథమ పుత్రుడయిన ఒకటవ దేవరాయలు ఉదయగిరిలో ఉన్న సైన్యంలో కొంతభాగాన్ని విజయనగరం పిలిపించాడు. తండ్రి తరువాత సింహాసనం ఆక్రమించుకోను బలగాలను కూడగట్టుకున్నాడు.

వెంటనే పెదకోమటి వేమారెడ్డి ఉదయగిరి దుర్గాన్ని స్వాధీనపరచుకున్నాడు. శ్రీశైల

ప్రాంతాన్ని చేజిక్కించుకున్నాడు. మల్లారెడ్డి సంతతివారు ఆక్రమించిన కోస్తా ప్రాంతాలను తన అధీనంలోకి తెచ్చుకున్నాడు.

కాటయవేమారెడ్డి కారణంగా రాజమహేంద్రవరం విడిపోవటాన్ని పెదకోమటి వేమారెడ్డి మరచిపోలేదు. రాజమహేంద్రవరాన్ని జయించితేగాని కంటికి నిద్రరాదు. అందుకుగాను యుద్ధం చేయక తప్పదు.

పెదకోమటి వేమారెడ్డి సైన్య సమేతంగా కదిలాడు. ఎడతెగని పోరు జరిగింది. అది ఒకనాటితో ఆగలేదు. పంట రెడ్ల రక్తాన్ని పలుమార్లు చిమ్మి చిమ్మి ధరణీ తలాన్ని రక్తరంజితం చేసింది.

ఈ కక్షల వలన ఉభయ రాజ్యాలు బలహీనపడినాయి.

## అన్నదేవ చోడుడు

ఇంతకు ముందు భక్తిరాజు రెండవ కుమారుడైన అన్నదేవ చోడుని గూర్చి చెప్పుకున్నాం. అతను రాచకొండ వారినాశ్రయించాడు. రాచకొండలోని రెండవ అనపోతానీడు, దేవరకొండలోని పెద వేదగిరినీడు సైన్య సహాయం చేశారు. వేములకొండ, బెండపూడి మొదలైన వానిని స్వాధీనం చేసుకున్నాడు. శ్రీకూర్మంలో 1405, 1407లో శాసనాలు వేయించాడు.

అన్నదేవచోడుడు 1408నాటికి గోదావరి ప్రాంతంలోని కొంత భూభాగాన్ని ఆక్రమించి పోలవరంలో శాసనం వేయించాడు.

ఈ శాసనంలో తాను రాజాధి రాజపరమేశ్వరుడననియు, పూర్వ సింహాసనాధీశ్వరుడ ననియు చెప్పుకున్నాడు. ఆనాటి రాజుల బిరుదులు పరిశీలించినపుడు పచ్చి పొగడ్తలని చాలా పర్యాయాలు అనిపిస్తుంది. చిన్న విజయాలను కూడా బిరుదుగా మార్చుకోవటం మానసిక బలహీనతగా కనిపిస్తోంది. లేక గొప్ప కీర్తి కండూతి కావచ్చును.

ఉభయ గోదావరులంత వైశాల్యం కలిగిన రాజ్యం కూడా లేని అన్నదేవ చోడుఁ తనకు తానుగా "రాజాధి రాజపరమేశ్వర" బిరుదు తగిలించుకోవటంలో ఉన్న ఔచిత్యం హాస్యాస్పదం.

## కాటయవేముని చివరి దశ

కాటయ వేమారెడ్డి మీద కక్షతో పెదకోమటి వేమారెడ్డి అన్నదేవచోడునితో సుముఖంగా ఉన్నాడనిపిస్తున్నది.

ఈ ఉపద్రవాన్ని ముందుగానే గుర్తించిన కాటయ వేమారెడ్డి దేవరాయలతో రాయబారం నడిపాడు. దేవరాయల సైన్యాలు 1411 నాటికి కొండవీటి రాజ్యంలో ప్రవేశించి

గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని ఇంకొల్లువరకు వచ్చాయి. దేవరాయల శాసనం యీ విషయాన్ని చెపుతుంది.

పెదకోమటి వేమారెడ్డి దేవరాయుల సైన్యాలను మళ్లించాడు. కాని రాణ్మహేంద్రవరాన్ని వదల దలచలేదు.

అన్న దేవచోడుడు, పెదకోమటి వేమారెడ్డి కలసి అత్తిలి, కాకరపర్తి, జగ్గవాగుల వద్ద కాటయ వేమారెడ్డితో తలపడ్డారు. విజయాన్ని సాధించారు.

కాకరపర్తి యుద్ధంవలన గోదావరి దక్షిణ ప్రాంతమంతా అన్న దేవచోడుని వశమయింది.

ఈ యుద్ధాలలో కాటయ వేమారెడ్డి మరణించాడు.

"గజరావు తిప్పానాయకుడు కొప్పునూళ్ల వంశజుడు. పెదకోమటి వేమనరేంద్రుని పక్షమున ఈ యుద్ధమున పాల్గొన్నవాడే. ఇతని చేతిలోనే కాటయ వేమారెడ్డి మృతినొందెనేమో తెలియదు" అంటారు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

కొప్పునూళ్లవారి బిరుదులలో "కాటయ వేముని తలగుండు కొండ" అనే బిరుదు ఉండుట వలన తిప్పానాయకుని చేతిలోనే కాటయ వేముడు చనిపోయి ఉంటాడు.

కాటయవేముని ప్రథమ పుత్రుడు కాటారెడ్డి తండ్రికన్నా ముందే చనిపోయాడు.

## అల్లాడ రెడ్డి

కాటయవేముని తర్వాత అతని రెండవ కుమారుడు రెండవ కుమారగిరి రెడ్డిని సింహాసనమెక్కించి అల్లాడరెడ్డి (1414 - 1420) రాణ్మహేంద్రవరం రాజ్యాన్ని కాపాడాడు.

కాటయ వేమారెడ్డి మరణించాక అన్న దేవ చోడుడు పెదకోమటి వేమారెడ్డితో కలసి రాణ్మహేంద్రవరం మీదకు వెళ్లాడు. అల్లాడరెడ్డి ఎదురొడ్డి, యుద్ధం చేశాడు. అన్నదేవచోడుడు ఈ యుద్ధంలో మరణించాడు. అతని కుమారుడు వీరభద్ర చోడుడు ఎక్కువ కాలం జీవించలేదు. ఆ తర్వాత అల్లాడరెడ్డితో జరిగిన యుద్ధాలలో చనిపోయి ఉంటాడు.

## తీరని దీక్ష

కోమటి వేమారెడ్డి బహమనీ సుల్తాన్ ఫిరోజ్ షా సహాయంతో మరల రాజమండ్రి కోటను ముట్టడించాడు.

విజయనగరం పాలిస్తున్న మొదటి దేవరాయలు అదే అదనుగా భావించి, పానుగంటి కోటనాధారం చేసుకొని ఆ పరిసరాలలో తెలంగాణాలోని బహమనీల దుర్గాలను ముట్టడించాడు. మరికొంత సైన్యాన్ని మోటుపల్లి పట్టుకోను పంపించాడు.

రాజమంద్రి కోట స్వాధీనం కాలేదు. 1417 ప్రాంతంలో పెదకోమటి వేమారెడ్డి వెనుదిరిగాడు. ఫిరోజి షా సైన్యం వెనుకకు వెళ్లి పానుగంటి కోటను ముట్టడించింది. అక్కడా పరాజయం పొంది, గుల్బర్గా తిరిగి పోయింది.

1417వ సంవత్సరంలో కృష్ణాజిల్లా వేదాద్రిలోను నల్లగొండ జిల్లా వాడపల్లి సంగమ ప్రదేశంలోను ఫిరోజి షా శాసనాలు కన్పిస్తున్నాయి. బహుశ సుల్తాన్ యీ ప్రదేశాలలో సైన్యాలను నిలిపి, కొద్దికాలం ఉండి, కదలి వెళ్లి ఉండవచ్చును.

పానుగంటి కోట ముట్టడిలో, ఫిరోజి షాకు సహాయంగా పెదకోమటి వేమారెడ్డి సోదరుడు సైన్యంతో వెళ్లాడు. అలవిగాక తిరిగి వచ్చాడు.

## పానుగల్లు పోరాటం - ఒక మలుపు

బహమనీలతో స్నేహంగా ఉంటూ, తమ ప్రత్యేకతను కాపాడుకుంటున్న రాచకొండ వారికి పానుగల్లు పోరాటంలో బహమనీలకు మనస్ఫూర్తిగా సహకరించలేక పోయారు. ఇందుకు కారణాలు తెలుసుకుందాము.

తమతో స్నేహంగా ఉంటూనే, తమ బద్ధ శత్రువైన పెదకోమటి వేమారెడ్డి తరపున రాణ్మహేంద్రవరం మీదకు ఫిరోజిషా సైన్యాలను పంపించి, అతనితో భుజం భుజం కలిపి పోరాడటం వారికి నచ్చలేదు. పైగా తమ భూభాగాలగుండా ప్రయాణం చేయటం, అక్కడక్కడా సైన్యాలను నిలపటం - యీ పనులన్నీ కొండవీటివారి కొరకు చేయటం వారు సహించలేక పోయారు.

కొంతకాలం క్రితం వరకు తమదిగా వున్న పానగల్లు మరల తాము విజయనగరము వారినుండి ఆక్రమించుకొనవచ్చును. కాని బహమనీలు, కొండవీటి రెడ్లు కలసి దానిని ముట్టడించటం వారికి మ్రింగుడు పడలేదు.

ఆ దుర్గాన్ని స్వాధీనం చేసుకోటానికి బహమనీలతో భుజం భుజం కలిపి పోరాడినా, అది తమకు దక్కదు. బహమనీల క్రిందకు పోతుంది. అందువలన బహమనీలకు తమ సరిహద్దులో స్థావరం ఏర్పడి శాశ్వతంగా ప్రక్కలో బల్లెమవుతుంది. విజయ నగరం వారికన్న రెడ్డి, బహమనీల పొత్తు తమను తుడిచి పెట్టటానికి, పానగల్లుతో కుట్ర ప్రారంభమై తమకే ముప్పు రావచ్చును.

బహమనీల చర్యలను విశ్లేషించుకుంటే, అతను కోస్తావరకు విస్తరించి మధ్యలో మరొకరిని మిగలనీయకుండా పెరిగిపోయేటట్లున్నాడు. అది చాలా ప్రమాదమయిన ఎత్తుగడగా రాచకొండవారు భావించారు.

ఈ దశలో విజయనగర పాలకుడు దేవరాయలు తెలంగాణా నుండి బహమనీలను పారద్రోలేందుకు తమతో కలసి రావలసినదిగా రాచకొండ రెండవ అనపోతా ప్రభువుకు

కబురు పెట్టాడు. దీనినంగీకరించి రాచకొండవారు, విజయనగరం వారితో కలసి సుల్తాన్ సైన్యాలను ముట్టడించారు.

ముస్లిం సైన్యాధిపతి మీర్ ఫజులుల్లా అంజు యుద్ధరంగంలో మరణించాడు. ఫిరోజి షా తీవ్రంగా గాయపడ్డాడు. చివరకు ఒక్క ముస్లిం సైనికుడు కూడా మిగలలేదు. ఫిరోజిషా పారిపోయాడు. అంతకు ముందే మాచారెడ్డి వెనుదిరిగి వెళ్లిపోయాడు.

హంపీ విజయనగరం వారు, రాచకొండవారు కలసి పోరాడటమనేది ఒక ప్రత్యేక దశను తెలుపుతోంది. చరిత్ర ఇలా మలుపు తిరిగింది.

ఈ యుద్ధాలు 1419లో గాని ఆగలేదు.

## అల్లాడ రెడ్డి

అల్లాడ రెడ్డి కాటయ వేమారెడ్డి కూతురు అనితల్లిని సింహాసనం ఎక్కించాడు.

1417 ప్రాంతంలో మోటుపల్లి విజయ నగరం వారి స్వాధీనమయింది.

అల్లాడరెడ్డికి నలుగురు పుత్రులు. వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డా రెడ్డి, అన్నారెడ్డి. వీరందరూ అన్యోన్యంగా రాజ్యపాలనలో పాల్గొన్నారు.

పెదకోమటి వేమారెడ్డి గత ప్రాభవాన్ని సంపాదించే ప్రయత్నం విడనాడలేదు. రాజమహేంద్రవరం తనకు రావాలి. కటకం వరకు విస్తరించాలి. అందుకొరకు మరోమారు తణుకు తాలూకా రామేశ్వరం వద్ద యుద్ధం చేశాడు. అల్లాడరెడ్డి చేతిలో ఓడిపోయాడు. సైన్యం వికావికలైంది. సంపదను సామగ్రిని పోగొట్టుకొని, పెదకోమటి వేమారెడ్డి పరాభవం పాలయ్యాడు. తల ఎత్తుకోలేని అపజయంతో కొండవీడు తిరిగి వెళ్లాడు.

అల్లాడ వేమారెడ్డి దండుతో వెడలి సప్త మాడియనృపులను, కళింగ రాజులను జయించి, సింహాచలంలోను కటకంలోను జయస్తంభాలు నిలిపాడు.

అల్లాడ వేమారెడ్డి భార్య జియ్యమల్ల సానమ్మ. ఈ దంపతులు శివభక్తులు. చళుక్య భీమవరంలోని చాళుక్య భీమేశ్వరునకు జియ్యమల్ల సానమ్మ, కొంత భూమిని దానం చేసింది. ఈ దేవాలయం పెద్దాపురం దగ్గరలో ఉంది. ఒకనాడు గొప్ప శైవ కేంద్రం.

## పాత కక్షలు

ఓరుగల్లు సామ్రాజ్యంలో వేళ్లూనిన వెలమ రెడ్ల తగాదాలు ఆరని చిచ్చులా రగులుతూనే ఉన్నాయి. పాత కావేషాలు కత్తులు నూరుతూనే ఉన్నాయి.

పెదకోమటి వేమారెడ్డి తన తమ్ముడు మాచారెడ్డిని కొండపల్లి పాలించేందుకు నియమించిన సంగతి చెప్పుకున్నాం. రేచెర్ల కుమార వేదగిరినీడు యుద్ధంలో మాచారెడ్డిని వధించి, అతని బొమ్మ పెట్టాడు. పెదకోమటి వేమారెడ్డి పగ తీర్చుకోను దండెత్తి వెళ్లి

కుమార వేదగిరినీడును ఓడించాడు. యుద్ధంలో కుమార వేదగిరినీడు చనిపోయాడు. పెదకోమటి వేమారెడ్డి అతని బొమ్మను తన తమ్మపడిగములో పెట్టుకున్నాడు.

ఓడిన వారి బొమ్మను ఎడమ కాలి తోడాలో పెట్టడం లేక తాంబూలం నమిలినపుడు ఉమ్మువేసే తమ్మ పడిగములో బొమ్మ పెట్టడం ఆనాటి రాజులకు ఆచారంగా ఉండేది.

పినవేదగిరినీడు తమ్ముడు లింగమనీడు పన్నెండేళ్ల బాలుడు. అతను సైన్యాలను కూడగట్టుకొని కొండవీటి మీదకు దండు నడిపాడు. పెదకోమటి వేమారెడ్డినోడించి కొండవీటి పాలకుల సింహలాంఛనం "నందికంత పోతురాజు కఠారి"ని విజయాంకముగా తీసుకు వెళ్లాడు.

లింగమనీడు పెదకోమటి వేమారెడ్డి బొమ్మ పెట్టటం గూర్చి వెలుగోటివారి వంశావళిలో యిలా ఉంది.

"వేదగిరినేని తమ్ముడు లింగమనేడు ద్వాదశ వర్షంబులవాడై యుండి, తన బంధువర్గముల, హిత పరిజనంబుల గూర్చికొని అమరులకు వెక్కసంబగు యుద్ధంబు జేసి యనవేమారెడ్డిని గొట్టి, తమ్మ పడిగాన పొదిగించి, సింహతలాట బిరుదును తనచేత శ్రీనాథుడడిగించు బోయిన నందికంత పోతురాజను కఠారిని బుచ్చుకొనెను"

అజ్ఞాత కవి చెప్పిన చాటువు చూడండి.

అంచిత రాయరావు బిరుదాంకము రాజుల కొట్టి అందె కీ
లించిన మాదభూవిభుని లింగనృపాలున కొప్పుగాక! గ
ర్వించిన నీకు చొప్పడునె వేమరు అల్లయ వేమరెడ్డి! పో!
కొంచపు తమ్మతిండి తిను కూళకు సింహతలాట మేటికిన్

## శ్రీనాథులవారి ప్రయాణం

శ్రీనాథులవారు రాజ గౌరవాన్ని కాపాడటానికి వెలమ రాజ్యానికి వెళ్లారు. లింగమనేనిని, సింగ భూపాలుని దర్శించారు. లింగమనేనికి ఎన్నెన్నో బిరుదులు తగిలించి, తన కార్య సాధనకు నేర్పుగా పొగిడిన చాటు పద్యం చూడండి.

జగనొబ్బగండాంక! సంగ్రామ నిశ్శంక! జగతీశ! రాయ వేశ్యాభుజంగ!
అఖిల కోటల గొంగ! అరిరాయ మదభంగ! మేలందు ధరణీశ! మీన జాల!
మూరు రాయరగండ! మురియు రాజుల మిండ!అభివృద్ధి మీరు చౌహత్త మల్ల!
ఘన గాయ గోవాళ! కామినీ పాంచాల! బ్రహ్మయు శశివంశ పరశురామ!
దండి బిరుదుల సురథాణి గుండె దిగుల - భళిర అల్లయ వేముని పగర మిండ!
రమణ మించిన మేదిని రావు బిరుద! - సంగరాటోప! మారయ లింగ భూప!

1423వ సంవత్సరంలో అల్లాడ వీరభద్రా రెడ్డి రాజ్యానికొచ్చాడు. అంతకు ఐదారు

సంవత్సరాల ముందు అనగా 1417 ప్రాంతంలో రాచకొండ, దేవరకొండ వెలమల తోట్టి యుద్ధంలో పాల్గొని ఓడిపోయి ఉంటాడు.

1418 ప్రాంతంలో చెప్పిన పద్యంలో "అల్లయ వేముని పగర మిండ" అనుట సంగతమేనంటారు కొర్లపాటి శ్రీరామమూర్తి గారు.

శ్రీనాథులవారు రెండు పర్యాయాలు వెలమ ప్రభువుల కొలువుకెళ్లారని తెలుస్తోంది. మొదటి పర్యాయము లింగమనేనిని మెప్పించి తెచ్చిన ఖడ్గాన్ని తన ప్రభువు పెదకోమటి వేమారెడ్డికిచ్చారు.

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "ఈ విషయము వెల్గోటివారి వంశ చరిత్రలేగాక నాగ్నజిత్తీయ పరిణయమను ప్రబంధము గూడ ప్రశంసించుచున్నది" అన్నారు. ఈ ప్రబంధాన్ని వల్లూరి నరసింహకవి రచించాడు.

అందులోని పద్యం చూడండి.

ధనరాజ్యంబులు మాని నెమ్మది బ్రమోదం బంది తన్గోరు న
ట్టి నృపాలాగ్రణి కోర్కి తీర్చుట కకుంఠీభూత చేతస్కుడై
చని సాధించిన సత్కవి ప్రవరు రాజ న్యాగ్రణీ మాన్యు నే
బ్రణుతింతున్ బహుశైవ సంగధిత శుంభద్గాథు శ్రీనాథునిన్

బొమ్మకంటి

ఇలా తెచ్చియిచ్చిన నందికంత పోతురాజు కఠారి తరువాత కాలంలో లింగమనేడు పెదకోమటి వేమారెడ్డిని సంహరించి తీసుకువెళ్లాడు. ఈ విషయం తరువాత వివరిస్తాను.

జగనొబ్బ గండాంక పద్యాన్ని విశ్లేషిస్తూ "ఏ పాదానికాపాదమే కాకుండా పాదార్ధానికీ, ప్రతి గణానికీ కూడా విరుగుతూ శ్రవణ శుభగమైన అంత్యానుప్రాసలతో సీస. పద్యానికి ప్రజా హృదయ రంజకమైన నూతన నేపథ్యాన్ని సంతరించిన వాడు శ్రీనాథుడు. సీసపద్యానికి భీమకవి యుగంలో లేని చాటుత్వం శ్రీనాథుడి నాటినుండి అలవడినట్టు కనిపిస్తుంది." అంటారు. బొమ్మకంటివారు, బాలాంత్రపువారు తమ తెలుగు చాటువు - పుట్టు పూర్వోత్తరాలు అనే గ్రంథంలో.

శ్రీనాథులవారు రెండు పర్యాయాలు దేవరకొండ రాచకొండ, వెలమనాయకుల దర్శనానికి వెళ్లారు. పెదకోమటి వేమారెడ్డి వద్ద విద్యాధికారిగా ఉండగా వెళ్లినపుడు చెప్పిన పద్యంలో "భళిర అల్లయ వేముని పగరమిండ" అని వాడగలిగారు. కాని అల్లాడ రెడ్డిని అంతమాటనటానికి రెండో పర్యాయం వెళ్లినపుడు వీలులేదు. వేమ, వీరభద్రారెడ్ల పనుపున విద్యానగర యాత్రకు వెళ్లి, తిరిగి వస్తూ, వెలమ రాజ్యం వెళ్లి రాజదర్శనంలో తమను పంపిన రాజుగారి తండ్రిని అలా నీచంగా పద్యంలో చెప్పగలరా? కాబట్టి శ్రీనాథులవారి

తొలి పర్యటనలోనే అది జరిగింది. ఆనాటికి రాణ్మహేంద్రవర రాజ్యపాలనా ప్రముఖులు ప్రథమ శత్రువులు.

## కవులు-కవితలు-దానాలు

పెదకోమటి వేమారెడ్డి గొప్ప పండితుడు. సంస్కృత, ప్రాకృతాలు చదువుకున్నాడు. 1402 వరకు అధ్యయనం చేయటానికి, వ్రాయటానికి కొంత అవకాశం లభించింది. సాహిత్య చింతామణి అనే అలంకార గ్రంథాన్ని, సంగీత చింతామణి, సప్తశతి సారటీక అనేపుస్తకాలు వ్రాశాడు. అమరుకానికి వ్యాఖ్య వ్రాశాడు. దీనిని శృంగార దీపిక అంటారు. ఇది ముద్రితము. వామన భట్టబాణునిచే వీర నారాయణ చరితము వ్రాయించి, తన ప్రశస్తిని ఉగ్గడింపచేయించాడు. ఇది పద్య కావ్యం. ఈ రచన వలన వేమారెడ్డి చరిత్ర తెలుసుకోను వీలుగా ఉంది.

వీరనారాయణ చరితమును వేమ భూపాల చరితమని కూడా అంటారు. ఈయన వద్ద కవి పండితులనేకమంది ఉండేవారు. వామన భట్టబాణుడు ఇంకా నలాభ్యుదయము, రఘునాథాభ్యుదయము అనే పద్య కావ్యాలు వ్రాశాడు. పార్వతీ పరిణయము, శృంగార భూషణము అనుదృశ్య కావ్యాలు రచించాడు. శబ్ద చంద్రిక, రత్న శబ్దాకరము అను నిఘంటువులు కూర్చాడు.

మహాజ్యోతిష్యుడైన పెద్దియజ్వకు పెదకోమటి వేమారెడ్డి కల్వపాముల గ్రామాన్ని యిచ్చాడు. భూలోక ధన్వంతరియైన భాస్కరార్యునకు పొన్నుపల్లి గ్రామం యిచ్చాడు. ఎల్లే పెద్ది లక్ష్మణ దీక్షితులకు, షడ్దర్శనాల వల్లభ సోమయాజికి పెద్దపూడి గ్రామం దానమిచ్చాడు. చాలామందికి యిలా దానాలుచేశాడు. ఈ దాన శాసనాలు శ్రీనాథులవారే వ్రాశారు.

1405లో శ్రీనాథులవారితోను, తన గురువు శంకర మౌనితోను శ్రీశైల యాత్ర చేశాడు. అక్కడ శివరాత్రినాడు గురువు శంకర మౌనికి పినపాడు గ్రామాన్ని దానం యిచ్చాడు.

ఈ రెడ్డిరాజు రచనలు ముద్రింపవలసి ఉన్నాయి.

## ఫిరంగి పురశాసనం

> శాకాబ్దములు సహస్రమును మున్నూట ముప్పది యొకండును నైన భవ్య సంఖ్యా
> వళులు విరోధి సంవత్సరంబున ఫాల్గుణంబున బహుళ పక్షంబు విదియ
> శుక్రవారంబున శుభముహూర్తంబున శ్రీధాన్యవాటి పురాధిపతియు
> కృష్ణవేణ్ణాజల క్రీడా వినోదుండు నగు గన్న భూపాలు ననుగు బుత్రి

వీర నారాయణుడు వేమ విభుని దేవి - భూరి సద్గుణ నికురుంబ సూరమాంబ

జగము వినుతింప సంతాన సాగరాఖ్య - వరతటాక ప్రతిష్ఠోత్సవం బొనర్చె

"ఈ చెరువు ఫిరంగిపురం మొదలు మేడి కొండూరు వరకును గలదు. కట్ట బరుమైళ్ల పొడవు. తూములచ్చటచ్చట గనుపట్టుచున్నవి. తూము లెన్నియో తెలియ రాదు" అని ముద్దులపల్లి గురుబ్రహ్మ శర్మ 1920లో వ్రాశారు. ఈనాడు ఆ గుర్తులు లేవు.

సూరమాంబ ఫిరంగిపురం దగ్గర 'సూరమాంబపురం' అనే ఊరు కట్టించింది. ఆ గ్రామం నామావశిష్టంగా ఉంది.

**దంతలూరి గన్నభూపాలుడు**

పెదకోమటి వేమారెడ్డి భార్య సూరమాంబ. ఈమె సంతాన సాగరం అనే చెరువు త్రవ్వించింది. ఈ విషయం ఫిరంగి పురం శాసనంలో ఉంది.

సూరమాంబ తండ్రి దంతలూరి గన్న భూపాలుడు. ఆనాటి విద్యాపూడిని నేడు ఫిరంగిపురం అని పిలుస్తున్నారు.

"దంతలూరి వారు క్షత్రియులుగాను, రెడ్లు శూద్రులుగాను, నుండుట బాధాకరము. కాని...... శ్రీనాథుని కాలమున రాజ్యమేలుచున్న రెడ్డి రాజులకు క్షత్రియులతో చుట్టరికము నడచినట్లు తెలియవచ్చు చున్నది. .........." అంటారు కొర్లపాటి వారు.

"శ్రీనాథుడు ధనంజయ విజయమను పేరుగల గ్రంథమును దంతలూరి గన్నభూపాలుని పేర రచించినట్లు మూర్తి త్రయో పాఖ్యానమను ప్రబంధమున గలదు. మూర్తి త్రయోపాఖ్యానము దంతలూరి బాపిరాజు రచించినది" అని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అన్నారు.

మూర్తి త్రయోపాఖ్యానము 17వ శతాబ్ది పూర్వార్థంలో దంతలూరి బాపకవి వ్రాశారు. అందులోని పద్యం చూడండి.

అహిత దుర్గాధ్యక్షు లందరు భయమంద గ్రీడి కైవడి నిల్చె దాడినాడ
నక్షుద్ర దాన విద్యా క్షాత్రముల చేత బ్రతి యెవ్వరును లేక ప్రతిభ గాంచె
తనకీర్తి దశదిగంతరగీయ మానమై కనుపట్ట ధర్మ మార్గంబు నెఱపె
శ్రీనాథ సుకవీంద్రుచే ధనంజయ విజయంబను సత్కావ్యమంది వెలసె
నృపతి మాత్రుండె నిజపాద నీరజాత - ఘటిత కోటీర వైరి భూకాంత మాన
సాంతర భయాపహారి ; శ్రీదంతలూరి -గన్నభూపాలమౌళి దోర్గర్వశాలి. ( 1 - 60 )

భారవి వ్రాసిన కిరాతార్జునీయం అర్థగౌరవంతో అనుపమానమైనది కావటం వలన శ్రీనాథులవారు దానిని తెనుగులో వ్రాసి గన్న భూపాలునికి అంకితం యిచ్చి ఉంటారని ప్రముఖ విమర్శకులందరూ భావించారు. హరవిలాసాన్ని సంగ్రహంగా రచించటం వలన

సంతుష్టినొందక శ్రీనాథులవారు యీ రచన చేసి ఉంటారని వారందరూ చెప్పారు.

ఈ రచన క్రీ.శ. 1412 ప్రాంతంలో జరిగి ఉంటుంది.

పెదకోమటి వేమారెడ్డి జీవితమంతా వడిదుడుకులతోనే నడిచింది. పూర్వ రాజ్య వైభవాన్ని తేవాలనుకొని ప్రయత్నించినా కుదరలేదు. ఉన్న రాజ్యాన్ని అతికష్టంమీద నిలుపుకొచ్చాడు. ఈయన స్వయంగా విద్వాంసుడు. బహుగ్రంథకర్త. సంగీత సాహిత్యాలలో ఆరితేరినవాడు. సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంకితుడు. తన పూర్వీకులవలె వసంతోత్సవాలు జరిపించాడు. వసంత రాయ, కర్పూర వసంతారాయ బిరుదులు దాల్చాడు.

పెదకోమటి వేమారెడ్డి చివరి దశలో వెలమవారు దండయాత్ర చేశారు. కొండవీటి పాలకుల సింహలాంఛనం నందికంత పోతురాజు కఠారిని తీసుకు వెళ్లారు. ఈ యుద్ధంలో వేమ భూపాలుడు చనిపోయాడు.

ఈ సమరం 1420 లో జర్గిగి ఉంటుంది.

## రాచవేమారెడ్డి (1420 -1424)

రాచవేమారెడ్డి తనతల్లి కట్టించిన సంతానవారిధి అను తటాకానికి నీరు అందించే జగనొబ్బగండ కాలువను త్రివ్వించినట్లు ఒక శాసనం వలన తెలుస్తోంది.

రాచవేమారెడ్డి కాలానికి రాజ్యం కుదించుక పోయింది. భోగ లాలసుడైన రాచవేమన సమర్థుడు కాదు. పరాక్రమవంతుడూ కాదు. పైగా వచ్చే ఆదాయం సరిపోవటం లేదు. అందువలన విచక్షణారహితంగా పన్నులు వేశాడు. అందులో ఒకటి పురిటి మంచంమీగ పన్ను. ఏ స్త్రీ అయినా ప్రసవిస్తే పన్ను కట్టవలసిందే.

ఈ విధానాన్ని ప్రజలు బాగా వ్యతిరేకించారు. శ్రీనాథులవారి వంటి పెద్దలు చెప్పకుండా ఉండి ఉండరు. చెప్పినా రాచవేమారెడ్డి పెడచెవిని పెట్టి ఉంటాడు. ప్రజాకంటకుడుగా తయారైనాడని కొండవీటి దండకవిలెయు, కైఫీయతు తెలియ జేస్తున్నాయి.

సవరం ఎల్లయ్య అనే బలిజ నాయకుని భార్య ప్రసవించింది. రాజ భటులు పురిటి పన్ను కట్టమని వేధించారు. ఆ సంగతి తెలిసి, ఎల్లయ్య కోపంతో మండిపడ్డాడు. కోటలోకి వెళ్లి ముత్యాలమ్మ గుడి సమీపంలో రాచవేమారెడ్డిని పొడిసి చంపివేశాడు అని మెకంజీ కైఫీయతు తెలుపుతోంది.

ఇలా కొండవీటి రాచరికం వందేళ్ల తర్వాత 1424లో అంతమయింది. పంటరెడ్లు మేడివదలి కత్తిపట్టి రాజ్యాన్ని స్థాపించి వందేళ్లు పాలించారు. చరిత్రలో వసంతోత్సవాల కొండవీటిని నిలుపుకున్నారు. ఒక్క శతాబ్దం వెలిగిన వంశం ఆకస్మికంగా అంతరించటం వలన చరిత్రలో గుర్తు లేకుండా ఉండే దేమో ! కాని ఎఱ్ఱన, శ్రీనాథుల వంటి మహనీయుల

చలవ వలన, కావ్యగతమై భవిష్యత్తుకు అందగలిగింది. కావ్యరసాస్వాదులకు, చరిత్ర పరిశోధకులకు మాననీయమైంది.

## చరిత్ర పుట తిప్పింది

హంపీ విజయ నగర పాలకులు పడమటి దిశనుండి, ఆక్రమించారు. కొండవీడు వారి రాజ్యంలో కలిసింది. కళింగ గాంగ వంశం వారు కోస్తా ఆక్రమించారు.

నాయకత్వం కరువైంది. ప్రజానుభూతి లేకపోయింది. చివరకు చరిత్రలోకి జారిపోయింది.

## ఆవేదన

ఒక రాజ్య పతనం రాజకుటుంబానికే కాదు, ఆరాచరికాన్ని ఆశ్రయించిన వారందరికీ ఇబ్బందులు కల్పిస్తుంధి. నిరాశ్రయుల్ని చేస్తుంది.

కొండవీటి రాజకీయాలలో శ్రీనాథుల వారికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను చాలా సంబంధం ఉంది. ఆయన బాధ అంతులేనిది. అవధులు లేనిది.

తన కనుల ముందు సంపద్విలాసాలతో, వసంతోత్సవాలతో, పునుగు, జవ్వాది, కస్తూరి, కర్పూర పరిమళాలతో పరిఢవిల్లిన కొండవీడు నేడుగత వైభవంగా మిగిలి పోయింది. చివరకు రూపు తరిగి రెడ్డిరాజుల గత చరిత్రగా నిలచి పోయింది. తాను రాజసంతో, రాజలాంఛనాలతో విద్యాధికారిగా, శాసన రచయితగా చెలాయించిన ప్రభుత్వం చితికి పోయింది. కన్నీటి గాథగా ముగిసింది.

శ్రీనాథుల వారికి తాను కొండవీటి మీద చెప్పిన చాటువు గుర్తు కొచ్చింది. "పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల కొనగొని విడనాడు కొండవీడు" అనుకున్నారు. తాను" "కూర్మిన మరావతికి జోడు కొండవీడు" అని చెప్పారు. ఏదా కొండవీడు? ఏమైపోయిందా వైభవం! చివరకు ఫురిటి పన్ను వేసి పాడిపించుకున్న రాచవేముడు తన మిత్రుడు, ప్రభువు అయిన పెదకోమటి వేమారెడ్డి పుత్రుడు కావటం భరించరాని బాధగా ఉంది. కొండవీటి కోటలోని ప్రతిదీ తన ప్రభువును గుర్తుచేస్తోంది. గుండె కోసి వేస్తోంది. శ్రీనాథుల వారి మనసు ద్రవించింది. కనులు చెమర్చాయి. కాని ధీర చిత్తంతో మనసు దిటవు చేసుకున్నారు. తన కర్తవ్యం ఏమిటో పరిశీలించుకున్నారు. తన కనుల ముందు విజయనగర శత్రుసేనానుల కదలికలు కడు బాధాకరంగా ఉన్నాయి. కాబట్టి కొండవీడువదలి మనశ్శాంతికి మరో చోటుకు వెళ్లాలి. ఎక్కడుందా ప్రదేశం ? చుట్టూ ఉన్న రాజాస్థానాలన్నీ శత్రు కూటాలే. కాబట్టి దేశ సంచారం చేసి, ప్రజల్లో కలసిపోయి, వారి జీవితంలో పాలు పంచుకుంటూ గతాన్ని మరవాలి. సంచారం చేయాలి.

# పదవ ప్రకరణము

## పల్నాటి పర్యటన : చాటుధార

ఎక్కడికి వెళ్లాలి? దగ్గరలో ఉన్న పలనాడు మరో మారు చూసిరావచ్చు. ఈ పర్యాయం వివరంగా పరిశీలించవచ్చు. బాధ్యతలులేవు. రాచకార్యాల పరుగుల్లేవు. బంధు మిత్రులున్న ప్రాంతం. మనశ్శాంతి కిదో మార్గం.

ఆయన మేనాలో కూర్చున్నారు. బోయీలు మోసుకెళ్తున్నారు. అంతర్ముఖుడైన ఆయనకు తన యింటికి వచ్చి ఆతిథ్యం అందుకున్న అతిథుల మాటలు గుర్తుకొచ్చాయి.

**తినలేమో కవి సార్వభౌమ ఇక 'సంతృప్తాయె యీ నీదు క**
**మ్మని పణ్యారము తోడ బూరెగమితో, మండెంగ తండంబుతో**
**ననుగుం బాసెము తోడ బాండ కల మాహారంబుతో, నేతితో**
**ఘన రంభాఫలఖండ శర్కలతో గల్పింప దధ్యాదులన్**

తన పరివారంతో పలనాటి గ్రామసీమల మధ్యగా పయనించారు. పేదరికంలో మునిగిన ప్రజలు భూమాతను నమ్మి బ్రతికే తీరు పరిశీలించారు. తానుగతంలో చూశారు. కాని ఈనాటి చూపేవేరు. పల్నాడంతా చిన్న చిన్న రాళ్లతో, తేళ్లతో, పాములతో నిండి ఉంది చిల్లర దేవుళ్ల కొలుపులు జాస్తి. తామసపూజలెక్కువ. సన్న బియ్యం దొరకవు. జొన్న కూళ్లతే సరిపెట్టుకోవాలి. అలకాపురం నుండి దిగివచ్చి పలనాటిలో అడుగు పెడితే, రంభైనా సరే ఏకులు వడకవలసిందే. లక్ష్మీదేవి కోడలైనా, మామగారు మేడిపట్ట వలసిందే. భూమి గుద్దళించవలసిందే. చెమటోడ్చి ఆరుకాలాలు భూమి నారాధించవలసిందే. తమ పంటలో పైవారి ఫాలు పోగా పొట్టకే చాలని పేదరికం వారిది. ఐనా ఆ రైతు లెంత ఉదారులు! తానుకాలుపెట్టిన ప్రతి గ్రామంలోనూ తనను దేవునిలా ఆరాధిస్తున్నారు. తమ శక్తికి మించి ఆదరిస్తున్నారు. భూ మాత యిచ్చిన దేదో ఒకటి కానుకగా ఇస్తున్నారు. పాలు, పెరుగు, వెన్న, నేయి, మజ్జిగ, పళ్లు, ధాన్యాలు, కూరగాయలు పట్టుకొస్తున్నారు.

ఈ ఆదరణ మరో విధంగా ఉంది. ఈ అనుభూతి మరో లోకంగా ఉంది. ఈ ఆత్మీయత అమృతమయంగా ఉంది. తాను రాజరిక ప్రాబల్యాలలో రాజస, తామస మర్యాదలు చూసి ఉన్నారు. ప్రజారాధన నేడు చూస్తున్నారు.

ఆ గ్రామ ప్రజల మధ్య ఆసీనులై, ఆనందంగా వారి ముఖాల వంక చూసి, వారి జీవితాలను, ఆప్రాంతాన్ని అక్షర బద్ధం చేసి కవితలల్లాలనుకున్నారు. తన సహజ గంభీర సంస్కృత పద భూయిష్ట కవితా విన్యాసం విన్నా, వారలకు అర్థంకాదు. అందుకని తీయగా, మృదువుగా దేశి ఛందోరీతిలో చెప్పారు.

చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు - నాగు లేటి నీళ్లు నాపరాళ్లు
సజ్జ జొన్న కూళ్లు సర్పంబులును తేళ్లు - పల్లెనాటి సీమ పల్లె టూళ్లు.

వారి మాటలు ప్రజలకు అర్థమయినాయి. చుట్టూ ఉన్న వారు ఆనందంలో పొంగి పోయారు. విస్ఫారిత నేత్రాలతో ఆ మహనీయుని కన్నార్పక చూశారు.

శ్రీనాథులవారు చిరునగవుతో మరో పద్యం చెప్పారు.

జొన్న కలి, జొన్న అంబలి - జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ - పన్నుగ పలనాటి సీమ ప్రజలందరికిన్.

ప్రక్కనే ఉన్న దుగ్గన ఆ చాటుద్యాలను తాటి ఆకుల మీద వ్రాయించారు.

అలా పల్నాడు పర్యటిస్తూ, వారవనితలు, రాజదర్బారులు, వసంతోత్సవాలు, కవిసన్మానాలు గుర్తు వచ్చి కలయ జూశారు. అలనాడు లకుమా దేవి కాలి అందెల రవళికి మైమరచి ఆనందించిన సంగతి గుర్తు వచ్చింది. మరోమారు గ్రామీణులను చూశారు.

మరోపద్యం జాలువారింది.

రసికుడు పోవడు పల్నా - డెసగంగా రంభయైన ఏకులె వడకున్
వసుదేవుడైన దున్నును - కుసుమాస్త్రుండైన జొన్న కూడే కుడుచున్.

దుగ్గన నవ్వుకున్నాడు. మనసులో జాలి పొంగింది. కాని నాటి పరిస్థితివేరు.

అలా సాగుతూ మరో ఊరులో ఆగారు. వేసవి తాపం అధికంగా ఉంది. ఆ ఊరి ౹రణం ఆతిథ్యం యిస్తున్నాడు. నీరు బిందెలతో తెస్తున్నారు. పరివారానికి చాలటంలేదు. వారికి దాహం వేసింది. చల్లని నీరు తేవటానికి వెళ్లారు. పాత్రలో నీరు అడుగంటింది. సంతత ఈశ్వరార్చన కళాశీలికి అమృతధారగా, అలవోకగా కందం వెలువడింది.

సిరిగల వానికి చెల్లును - తరుణుల పదియారు వేల తగపెండ్లాడన్
తిరిపమున కిద్దరాండ్రా - పరమేశా గంగ విడుము పార్వతి చాలున్

ఆ గ్రామాలు, నగరాలు కావు. స్వయం పోషకాలైనా కొండవీటి పురంలోని సౌకర్యాలెలా కూడగలవు? అందుకే తాను గతంలో చెప్పిన చాటుపద్యం గుర్తు కొచ్చింది.

అంగడి యూరలేదు, వరియన్నములేదు, శుచిత్వమేమి లే
దంగన లింపులేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగ పడంగ గా వలె,కృపాపరులెవ్వరు లేరు, దాతలె
న్నంగను సున్న; గాన, పలనాటికి మాటికి బోవనేటికిన్

కార్యమపూడిలో కాలుమోపారు. సరస మర్యాదలందుకున్నారు. పలనాటి యుద్ధం జరిగిన ఆంధ్ర కురుక్షేత్రమది. అక్కడ వీరుల స్మృతి చిహ్నాలున్నాయి. ప్రతి విషయం తరచి తరచి తెలుసుకున్నారు. ప్రజల పాటలు, కథలు సావధానంగా విని, స్పందించారు.

ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై సామంత నృపతులు చాపకూడు !
ఇచ్చోట జింతించె నిచ్చ నుపాయంబు నళినాక్షి! యార్వెల్లి నాయురాలు !
నిజమను శుద్ధికై నిప్పుల యేటిలో నోలాడె నిచ్చోట బీలసాని !
ఇచ్చోట బోరిరి యిల పణంబుగ గొల్ల సవతి తల్లుల బిడ్డ లవని పతులు !
ధీరు లగు వార లేవురు వీర పురుషు - లై, మదోద్ధతి నిచ్చోట నాజి బడిరి !
అనుచు జెప్పుదు రైతిహ్యమచట నచట ! - జనుల పెద్దలు పల్లె దేశముల యందు.

(క్రీడాభిరామం 122)

కార్యమపూడిలో నాగులేటి నీట కాలిడి, పాద ప్రక్షాళన గావించి, పరవశత్వంలో మరో పద్యం చెప్పారు.

వీరులు దివ్యలింగములు, విష్ణువు చెన్నుడు, కల్లిపోతురా
జారయ కాలభైరవుడు, నంకమ శక్తియు నన్న పూర్ణయున్;
గేరెడి గంగధార మడుగే మణి కర్ణికగా జెలంగు నీ
గారెమపూడి పట్టణము కాశి గదా! పలనాటి వారికిన్ ( శ్రీనాథుని చాటువులు 100)

ఆ తరువాత వారు అడిగొప్పల వెళ్లారు. ఆ గ్రామ వాతావరణము వారికి నచ్చలేదు. చింత పల్లి వెళ్లారు. ఆ గ్రామ పురోహితుని ఆతిధ్యం స్వీకరించారు.

పురోహితుని పేదరికం మామూలుదికాదు. అందుకే ఆపురోహితుని మీద చిత్రలేఖనంలో చిత్రించిన రీతిలో పద్యం చెప్పారు.

దోసెడు కొంపలో బసుల త్రొక్కిడి, మంచము, దూడ రేణమున్
పాసిన వంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్
మాసిన గుడ్డలున్ తలలు మాసిన ముండలు, వంట కుండలున్
రాసెడు కట్టెలున్ తలపరాదు పురోహితు నింటికృత్యముల్. ( శ్రీ.చా. 94 )

సాయంకాలం చల్లగాలిలో చెట్టుక్రింద ఆసీనులై వారు మాట్లాడుతున్నారు. ఒక వ్యక్తి అడిగొప్పల వెళుతూ "ఏమన్నా కబుర్లు చెపుతారా" అని అడిగాడు. శ్రీనాథులవారు చమత్కరించారు.

గుడిమీది కోతి తోడను - గుడిలోపలి నంబివారి కోడలి తోడన్
నడివీధి లంజతోడను - అడిగొప్పల హోరుగాలి (నూరబావి) నడిగితి ననుమా !

( శ్రీ.చా. 80 )

సుతిమెత్తని జీవితానికి అలవాటుపడిన కవిసార్వభౌములకు, రాజభోగాల మధ్య గడిపిన రాజకవికి, పలనాడు బ్రహ్మరథం పట్టినా, ఆ జీవితాలు, ఆ భోజనాలు, ఆ అలవాట్లు అనుకూలంగా లేవు. ప్రజా హృదయంలో తాను స్థానాన్ని పొందినాననే ఆనందం ఉన్నా,

శారీరకావసరాలు వేధిస్తున్నాయి. ఆ భోజనం అసలే నచ్చటం లేదు. (అందుకే చింత చిగురు బచ్చలితో వండిన వేడి వేడి కూరతో జొన్నన్నం కలిపి ఒక్కముద్ద తిని చూడు నీకే తెలుస్తుంది. నీవేమో ఆ పూతన చనులపై పూసిన విషం త్రాగానని, ఆ దావాగ్నిని మింగానని అనుకుంటున్నావేమో ! అంటూ గోపాలకృష్ణుని ఎత్తిపొడిచారు; వ్యంగ్యంగా విసురు విసిరారు.

పుల్ల సరోజనేత్ర ! అలపూతన చన్నుల చేదు ద్రావి నా
డల్ల దవాగ్ని మింగితి నటంచును నిక్కెదవేల ? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు బచ్చలి శాకము జొన్న కూటితో
మెల్లన నొక్క ముద్ద దిగ మ్రింగుము నీపస గాన నయ్యెడిన్. ( శ్రీ.చా. 70 )

వ్యంగ్యోక్తులు, హాస్యోక్తులు వారి సరదా ముచ్చట్లు. యదార్థాలను చెపుతూ వింతసోయగాల విన్యాసా లాయన పద్యపాదాలు.

పలనాటి భౌతిక సరిహద్దులపై నవ్వు పుట్టించే చాటువు చూడండి.

నల్లం గొండయు నాగరి - కల్లును ధరణీ స్థలిం బ్రగల్భ స్థలముల్
పల్లేరు నాగులేరును - బల్లె క్ష్మాకాంత యెల్ల ప్రారంభమ్ముల్ (క్రీడా. 121)

పులిపాడు అనే గ్రామంలో కరణం శేషయ్య. ఈయన ప్రజలను బాధిస్తుండేవాడు. తగాదాలు పెట్టి, జుట్టు ముళ్లేసి ఆ పేద ప్రజలను పీల్చుక తింటుండేవాడు. ఆ ఊరి పెద్ద కాపు హనుమయ్య. కరణాన్ని మించిన కుటిల స్వభావి. మరోవ్యక్తి పుల్లయ్య. ఈ గ్రామపెద్దల ఆగడాల కంతులేదు. గురజాల ప్రాంతమంతా వీళ్ల చేతుల్లో ఉంచుకొని ప్రజాకంటకులుగా తయారైనారు.

శ్రీనాథులవారు గురజాల వెళ్లినపుడు ఆ పెద్దల ఆగడాలు చూశారు. నిర్లక్ష్యం చూశారు. చెళ్లున చాటువు ఝుళిపించారు.

తేలాకాయెను బోనము - పాలాయెను మంచినీళ్లు, పడి యుండుటకున్
నేలయు కఱు వాయె నిశీ! - కాలిన గురజాల నిష్ట కామేశ!శివా! ( శ్రీ.చా. 91 )

పులిపాడు పెద్దలకు ఈ విషయం తెలిసింది. వాళ్ళు విరగబడి నవ్వుకున్నారు. శ్రీనాథుల వారిని చిన్న చూపు చూశారు.

మరో చాటువు అవతరించింది.

ఊరు వ్యాఘ్రనగర మురగంబు కరణంబు - కాపు కపివరుండు, కసవు నీడు
గుంపు గాగ నిచట గురజాల సీమలో - నోగులెల్ల గూడి రొక్క చోట ( శ్రీ.చా. 75 )

అధికార హీనుడైన వ్యక్తిని అవకాశవాదు లెందుకు ఆదరిస్తారు. వీరంతా యీనాడు విజయనగర పాలకుల క్రింద అధికారం చెలాయిస్తున్నారు.

జానపదుల గుసగుసలు ఆయన చెవిని పడినాయి. "అంత పెద్ద కవి వచ్చి ఏవో పద్యాలు చెప్పటం తప్ప, తమ వారి వీరగాథలను తమకు తెలిసే రీతిలో నాలుగు మాటలు చెప్పనేలేదు. పాడుకోను వీలుగా నాలుగు మాటలల్లితేబాగుండును'

మాలకన్నమదాసు, మగువ మాంబాల, బాలచంద్రుడు, పెరిందేవి, అనపోతు, నాగమ్మ బ్రహ్మన్న, నలగామరాజు - ఒక రేమిటి ఎందరో వీరపురుషుల వీరగాథల కాణాచి పలనాడు. వీరవైష్ణవం, వీరశైవం కత్తులుదూసి సర్వవిధ్వంసం చేశాయి. రాచరిక అధికార పోరాటంలో మతం కూడా పాలు పంచుకుంది. ఈ రెండు మతాల వారు మానవ సమానత్వాన్ని బోధించారు. కాని కార్యరంగంలో ఒకరి నొకరు ఎదురించారు. కార్యమపూడి రణరంగంలో ఘోరయుద్ధం జరిపారు. ఈ యుద్ధం 1176 -1182 మధ్య జరిగింది.

ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుల వారికి బ్రహ్మన్న మీద అభిమానం కలిగింది. తనముందు తరాల శివకవులు వీరశైవాన్ని జాను తెనుగులో ద్విపదగా వ్రాసి సామాన్యుల కందించారు. జాన పదుల కోరిక తీర్చటానికి పలనాటి భారతాన్ని మంజరీ ద్విపదలో చెప్పాలనుకున్నారు. తనను పూజిస్తున్న ప్రజలకోరిక తీర్చటం మంచిదనుకున్నారు.

మాచెర్ల చెన్నకేశవుని, గురజాల దుర్గను, ఇతర దేవతలను స్మరించి, పలనాటి వీరచరిత్రలో కొన్ని భాగాలు చెప్పారు.

ఈ ద్విపద కావ్యంలో మంచి రామణీయకత ఉంది. ఈ రచనలో శ్రీనాథులవారి ప్రౌఢత్వం కన్పించటం లేదనే వాదన ఉంది. శ్రీనాథులవారి చాటువులలో కూడా చాలా చోట్ల యీ పెద్దలు చెప్పే ప్రౌఢత్వం కన్పించదు.

ఏరచయిత అయినా తాను వ్రాసేది ఎవరి కొరకు అని ఆలోచించుకొన్నప్పుడు, ఎదుటివారికి అర్థమయ్యేరీతిలో వ్రాస్తారు. అంతేగాని జానపదుల కందించవలసిన కావ్యాన్ని భాషా భేషజంతో క్లిష్టంగా వ్రాయరు.

ఐతే ఇందులో భావా వేశాలు బహుసొంపుగా ఉంటాయి. అందమైన సంభాషణలుంటాయి. పాడుకొనే వారికి, వినేవారికి పరమానందం కల్గిస్తాయి. కాలంతో పాటు యీద్విపద చరణాలు పాడేవారి నోట క్రమేణా మారిపోతూ, విస్తరిస్తూ ఉండటం మనం గమనించగలం. ఇది సహజం.

శ్రీనాథులవారు పలనాటి వీరచరిత్రలో కొన్ని భాగాలు మాత్రమే వ్రాశారు.

పలనాటి వీరచరిత్రలోని నలగామ రాజు సభలో జరిగిన నృత్యాన్ని గొప్పగా వర్ణించారు. రాజాస్థానంలోని ఆచారవ్యవహారాలు, నృత్యాలు తెలిసినవారే వ్రాయగలరు. పైగా నృత్య ప్రదర్శనలో వాడిన సాంకేతిక పదాలు శ్రీనాథుల వారివంటి అనుభజ్ఞులే వ్రాయగలరు. ఈ భాగాన్ని అనుబంధంలో ఇస్తున్నాను.

పల్నాటి వీరగాథా గానాభినయవర్ణన ఆయన చక్కగా వర్ణించారు.

ద్రుత తాళంబున వీర గుంఫితక ధుంధుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు, నాంతరాళిక యతి గ్రామాభిరామంబుతో
యతి గూడన్, ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కతె, ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్ ( క్రీడ. 116 )

పల్నాటి వీరులను గూర్చి చెప్పేటప్పుడే, ఆవీరగాథకు శివాలెత్తి చేసే విన్యాసాలు చూడండి.

గర్జించి యరసి జంఘా కాండ యుగళంబు వీర సంబెటకోల వ్రేయు నొకడు
ఆలీఢ పాదవిన్యాస మొప్పగ వ్రాలి కుంతాభినయము గైకొను నొకండు
బిగువు కన్నుల నుబ్బు బెదరు చూపులతోడ ఫీట్కారమొనరించు బెలుచ నొకడు
పటు భుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల ధరణి యాస్ఫోటించి దాటునొకడు
ఉద్ధిప్రకటింప నొక్కరుండోలనాడు - బయలు గుఱ్ఱంబు భంజళ్ల బఱపు నొకడు
కొడుము దాటింపుచును బెద్ద కొలువులోన - బడతి పల్నాటి వీరుల బాడునపుడు.
( క్రీడా 117 )

శ్రీనాథులవారు ఈ రచన చేయటానికి మరో కారణం కూడా ఉందని నేను భావిస్తున్నాను. పలనాటి బ్రహ్మన్న కులవ్యవస్థను కాదని చాపకూడు పెట్టిన ఘనుడు. మాలకులస్థుడైన కన్నమదాసుని తన స్వంత కుమారుని వలె భావించి ప్రధాన సేనానిగా చేశాడు. పల్నాటి యుద్ధం తరువాత వీరికి సాంఘికంగా గౌరవం తగ్గింది. కులవ్యవస్థ పుంజుకుంది. అప్పుడు వీరంతా పద్మనాయక వెలమలుగా కాకతీయులను కొలిచారు. రాచకొండ, దేవరకొండ పాలకులు కూడా పద్మనాయకులే. వారి వద్ద ఉన్న తమ ప్రభువుల నందికంతపోతురాజుకతారిని సాధించాలి. ఆ అపకీర్తిని తొలగించి తన ప్రభువు గౌరవాన్ని నిలబెట్టాలి.

కాని ఈనాటి పరిస్థితులలో రాచకొండ వారి దర్శనమే దుర్లభం. అందుకు కాలం కలసిరావాలి. బ్రహ్మన్న మీద, పలనాటి వీరుల మీద తాను రచన చేస్తే, ప్రజలకు, పద్మనాయక ప్రభువులకు ప్రీతి కలుగుతుంది. అనుకూలత కలిగినపుడు తాను రాచకొండ వెళ్లవచ్చును.

శ్రీనాథులవారిలా ఆలోచించి ఉంటారని నేను భావిస్తున్నాను. వారి జీవితాన్ని పరిశీలించినపుడు ఇలాంటి ఊహరావటం సహజమేనని నేనుకుంటున్నాను.

**ఇతర రచనలు**

రచనచేయటం ఒక వ్యసనం వంటిది. ఆగని ప్రవాహం వంటిది. రచయిత

మనోసముద్రంలో నిరంతరం అమృత మధనం జరుగుతూనే ఉంటుంది. అద్భుత రీతిలో సృష్టి జరుగుతూనే ఉంటుంది. కవితా జగత్తులో విన్యాసాలు చేయగల శ్రీనాథులవారు ఆ క్లిష్ట కాలంలో ఏం చేశారు? ఏరచనలు చేశారు? చరిత్ర పొరల్లోకి జారిపోయిన వీరి రచనలు చాలా ఉండి ఉంటాయి. కాని, తరువాత కాలంలో వచ్చిన కవులు తమ గ్రంథాలలో ఆ రచనలను గూర్చి చెప్పటం వలన కొన్నిటిని గుర్తించ గలిగారు. కాని ఆ రచనలు ఇంతవరకు దొరకలేదు.

శ్రీనాథుల వారి మరో గ్రంథం 'నందనందన చరిత్ర'. ఇంకో రచన 'వల్లభాభ్యుదయం' ఇంకొకటి 'కామశాస్త్రం'. మరొకటి 'ధనంజయ విజయం' . వీటిని గూర్చి తెలుసు కుందాము.

శ్రీనాథులవారి లభ్యమయిన రచనలలో నందనందన చరిత్ర విషయం ఎక్కడా చెప్పలేదు. కాని గణపవరపు వెంకట కవి ప్రయోగ రత్నాకరమునందు ఈ పుస్తకం సంగతి చెప్పాడు. అలాగే కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ఛందము నందు ఈ విషయం ప్రస్తావించాడు.

ఐతే ఇద మిద్ధమని చెప్పలేము. కాని ఈ గ్రంథాన్ని వైష్ణవ భక్తుడయిన పంటమైలారురెడ్డికి అంకిత మిచ్చి ఉంటారని పలువురు ఊహిస్తున్నారు.

శ్రీనాథులవారు తన అవసాన కాలంనాటి పద్యంలో "కైలాసగిరి చేరె మైలారు విభుడేగి దినవెచ్చమేరాజు తీర్చగలడు" అని చెప్పారు.

పంట మైలారు రెడ్డి 1424 - 1429 సంవత్సరాల మధ్య మంచిదశలో ఉన్నందున ఈ రచన 1426న వ్రాసి ఉంటారని శ్రీరామమూర్తి గారు నిర్ణయించారు.

## ఒంటరితనం

అహంకారి శ్రీనాథకవిసార్వభౌములు. తన కివ్వమని ఎవరినీ చేయిసాచి అడిగినవారు కాదు. ఈయదలిస్తే నీ యీవికి అందం అలదుకోవాలనుకుంటే, శ్రీనాథునికివ్వండి అని పురుషాహంకారంతో పద్యాలల్లిన ప్రతిభామూర్తి. అట్టి వ్యక్తిత్వమున్న తను తలవంచలేదు. చేయిసాచలేదు. ఆనాటి ప్రముఖ ప్రభువుల పంచకు చేరలేదు. ఒంటరితనం తప్పదు.

## హంపీ విజయనగరం

మొదటి దేవరాయలు 1422లో చనిపోయాడు. వెంటనే యువ రాజుగా ఉన్న రెండవ (విజయ) బుక్కరాయలు (1422-26) సింహాసనమెక్కాడు. అతని తరువాత అతని ముగ్గురు కుమారులలో రెండవ దేవరాయలు (1426-46) రాజ్యానికొచ్చాడు. ఈ దేవరాయలనే ప్రౌఢదేవరాయలని పిలుస్తారు. ఈయన పాలనలో విజయనగర సామ్రాజ్యం అన్నివిధాలా అభివృద్ధి చెందింది.

ఈ విషయాలు చెప్పటానికి కారణం లేకపోలేదు. శ్రీనాథులవారు భవిష్యత్తులో

ప్రౌఢదేవరాయలలో కనకాభిషేకం చేయించుకొనవలసి ఉంది. అందువలన సమకాలీన చరిత్రను రేఖామాత్రంగా ముచ్చటించాను.

## తెలుగు రాయడు

శ్రీనాథుల వారిని ఆదుకున్నవారిలో చిన్న చిన్న రాజులు, సైన్యాధిపతులు ఉన్నారు. వీరిలో తెలుగు రాయలొకరు.

వినుకొండ, కొండవీడు దుర్గాలను ప్రౌఢదేవరాయలు స్వాధీనంచేసుకొనేటప్పుడు ఒక వ్యక్తి బాగా సహకరించాడు. ఆయనను 'తెలుగు రాయడు' అని పిలుస్తారు. ఆయన ఏ ప్రాంతాన్ని పాలించాడో స్పష్టంగా తెలియటంలేదు.

తెలుగు రాయని తండ్రి శంభురాయలు. శంభురాయలకు సాంపరాయలనే పేరుంది.

తెలుగు రాయలకు "శ్రీ మన్మహామండలేశ్వర, మేదిని మీసరగండ, కఠారి సాళువ, ధరణి వరాహ" అనే బిరుదులున్నట్లుగా తెలుస్తోంది. సాళువ, ధరణి వరాహ పదాలను బట్టి ఇతడు కన్నడ దేశీయుడై యుండవచ్చును. ఈ సందర్భంలో విజయనగర పాలకులది వరాహ కేతనమని మనం గుర్తు చేసుకోవటం అవసరం.

శ్రీనాథుల వారికి తెలుగు రాయడు పరిచయ మయ్యాడు. ఈ పరిచయం ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో ఆధారాలు లేవు. శ్రీనాథులవారు మనసారా దీవించినట్లు ఒక చాటు పద్యం వలన తెలుస్తోంది.

ధాటీ ఘోటక రత్న ఘట్టన మిళద్ధ్రా ఘిష్ట కల్యాణ ఘం
టా టంకార విలుంఠలుంఠిత మదోన్మత్తా హితక్షోణి భృ
త్కోటీ రాంకిత కుంభినీధర సముత్కూటాటవీఝూట క
ర్ణాటాంధ్రాధిప ! సాంపరాయని తెలుంగా ! నీకు బ్రహ్మాయు వౌ

కృష్ణాజిల్లాలో ఉన్న శ్రీకాకుళంలోని ఆంధ్రమహావిష్ణువుకు తెలుగు రాయడనే పేరుంది. తెలుగు రాయని పేరు మీద ఆంధ్ర దేశంలో ఇంకా కొన్ని గ్రామాలున్నాయి. నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలో తెలుగురాయని పురం అనే గ్రామం ఉంది. ఇలాగే మా స్వగ్రామం దగ్గర శ్రీకాకుళం శివారు గ్రామం "తెలుగు రాయని పాలెం" ఉంది. సప్త గోదావరులలో ఒకటైన తుల్యభాగా నది ప్రక్కన 'సాంపరాయణ' గ్రామం ఉంది.

శ్రీనాథులవారు భీమేశ్వర పురాణంలో తృతీయాశ్వాసంలో 39వ పద్యంలో "తుల్యభాగా తటీ ద్రుమ మండలంబైన సాంపరాయ పురంబు సరణి బట్టి" అన్నారు. వీటిలో ఏదో ఒకటి వీరి రాజధాని కావచ్చును.

కాని, తెలుగు రాయని శాసనాలు వెలనాడు, పొదిలి ప్రాంతాలలో కన్పిస్తున్నాయి. సింహాచలంలోకూడా ఒక శాసనం ఉంది.

విజయనగర రాజులకు, గజపతులకు జరిగిన యుద్ధంలో ప్రౌఢదేవరాయల పక్షాన

పాల్గొని 1428లో సింహాచలంలో శాసనం వేయించాడు. ఈ శాసనం వలననే ఇతను కన్నడ దేశంలోని సంబురాయుని కుమారుడని తెలుస్తోంది.

## తెలుగురాయని దర్శనం

పలనాడు పర్యటన పూర్తి అయ్యాక, శ్రీనాథులవారు కృష్ణానది మధ్య లంకమీదనున్న శ్రీకాకుళం వెళ్లి ఆంధ్ర మహావిష్ణువును సేవించి ఉంటారు. అక్కడ వారు చెప్పిన చాటువులు కొన్ని యీ విషయాలను తెలియజేస్తున్నాయి. తాను పూజించిన ఆంధ్రదేవుని "జార చోర మహాధూర్త చక్రవర్తి, దేవ వేశ్యా భుజంగుండు, తెలుగు భర్త" అంటూ శ్రీకాకుళపు తిరునాళ్లలో అసమబాణుని స్వైర విహారాన్ని వర్ణించారు. ఆ వర్ణన కొంచెం జుగుప్సాకరంగా ఉన్నా, నాటి సాంఘిక జీవితాన్ని వివరిస్తుంది.

**ముంజె పదనైన శంబర - భంజను గేహములు గలుగు బ్రాహ్మణ విధవా**
**పుంజము లుండగ, నూరక - లంజియ లేమిటికి గాకుళపు దిరునాళ్లన్?**

( క్రీడా 211 )

ఇబ్బందికరంగా ఉండే పద్యాలు చాలా ఉన్నాయి. వాటిని ప్రస్తుతానికి వదలి వేస్తున్నాను.

వారవనితల సౌందర్యారాధన చేస్తూ, కొన్ని దినాలు హాయిగా ఉన్నారు. గత కాలంలో శ్రీకాకుళం పేరు పొందిన వ్యాపార కేంద్రం. 108 వైష్ణవ పుణ్యక్షేత్రాలలో ప్రధానమైన వాటిలో ఒకటి. ఆంధ్ర శాతవాహనుల కాలం నుండి మంచి పేరు పొందింది. శ్రీకాకుళంలో వల్లభరాయనికి 1166నుండి దేవాలయమున్నట్లు శాసన ప్రమాణముంది. కళింగాన్ని పాలించిన వీరనరసింహ దేవుని పెంపుడు సోదరుడు అనంతపాలుడు, అన్నగారి ఆనతిని, దండనాథుడుగా కొంత సైన్యాన్ని తీసుకొని కోస్తా వెంట కాంచీపురం దాకా జైత్రయాత్ర చేశాడని, శ్రీకాకుళ స్థల పురాణమైన సంస్కృత శ్రీకాకుళ మాహాత్మ్యమునకు ఆంధ్రీకరణమైన వల్లభాభ్యుదయము అను గ్రంథంలో ఉంది. అందులో అనంతపాలుడు శ్రీకాకుళం వద్ద ఆగి తెలుగు వల్లభునకు ఒక ఆలయముకట్టించాడని, ఆ తరువాత కాంచీపురం వెళ్లి శత్రువులను జయించి, జయస్తంభము నాటించాడని ఉంది. మొదటి వీరనరసింహ దేవుడు 1237, 38 నుండి 1263 వరకు పాలించాడు. ఇందువలన శిథిలమయిన ప్రాచీన దేవాలయాన్ని అనంతపాలుడు తిరిగి నిర్మించి ఉంటాడని భావిస్తున్నాను.

శ్రీనాథులవారు శ్రీకాకుళం వెళ్లింది 1426 తర్వాత అయివుంటుందనుకుంటున్నాను.

## కర్ణాడు

శ్రీనాథులవారు తెలుగు రాయని దీవించిన పద్యంలో కర్ణాటాంధ్రాధిప అనటం వలన ఇతను ఆంధ్ర దేశంలోని కరనాడు ప్రాంతాన్ని పాలించే రాజై ఉండవచ్చు ననుకుంటున్నాను.

నందికొంట్కూరు, కర్నూలు, నంద్యాల తాలూకాలలోని కొన్ని భాగాలు కలసి గతంలో 'కరనాడు' అని పిలువబడేవి. శాతవాహనుల కాలంలోని కర్ణిరాజులు పాలించిన ప్రాంతాలను కరినాడు అని పిలిచేవారు. కణ్ణ విషయమని వ్యవహరించేవారు. సాతవాహనుని కోటకు రూపాంతరమైన సాతాని కోట ఇప్పటికీ శ్రీశైలం ప్రాంతంలో ఉంది. దీనినిబట్టి, ఇతని శాసనాలు లభించిన వెలనాడు, పాదిలి ప్రాంతాలను దృష్టిలో ఉంచుకొని, ఇతను ఏ ప్రాంతాన్ని పాలించాడో నిర్ణయించవచ్చుననుకుంటున్నాను.

ఐతే కర్ణాడు ప్రాంతం సముద్ర తీరం వరకు ఉంది. శ్రీశైలం నుండి తూర్పు సముద్రం వరకు ఉన్న ప్రాంతాన్ని పాకనాడని, ఒంగోలు, బాపట్ల, రేపల్లె ప్రాంతాలను కమ్మనాడని పిలిచేవారు. పాకనాడులో కొంత, కమ్మనాడులో మరికొంత కలిసి కర్ణాడుగా పిలువబడి ఉంటుందనే వాదన ఉంది. మొత్తం మీద రెండు వాదనలను సమన్వయం చేసుకుంటే కర్ణాడు ప్రాంతమేదో రేఖా మాత్రంగా నిర్ణయించవచ్చును.



## నిజము నాది కర్ణాటి భాష

పల్నాటి వీర చరిత్రకు వ్రాసిన పీఠికలో పండిత ఉమాకాన్త విద్యాశేఖరుల వారు "శ్రీనాథుడు తమిళుడో లేక చాళుక్యుల ప్రధాన నగరమైన 'కల్యాణ' పు ప్రాంతాన్నుండి వచ్చిన కర్ణాటుడో అయిఉంటాడని వ్యక్తమగు చున్నది" అన్నారు. కాని యీ వాదన సరికాదు. మనమింతకు ముందే, పరిశీలించిన కర్ణాడు, కర్ణాటి పదాలు ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినవని తేలిపోయింది. ఆంధ్రదేశంలో కర్ణాటి యింటి పేరు గలవారున్నారు.

తెలుగు రాయనికి తాను కర్ణాటి వాడినని చెప్పుకోవటం బాగా యిష్టంలాగుంది. అది గమనించి, శ్రీనాథులవారు "కర్ణాటాంధ్రాధిప" అని సంబోధించి ఉంటారు.

శ్రీనాథులవారు పాకనాటివారు. బెండపూడి అన్నమయ్య "పాకనాటింటివాడవు - బాంధవుడవు' అన్నాడుగదా! పాకనాడు కర్ణాటి ప్రాంతంలోనిదని వివరించాను. అందువలననే శ్రీనాథులవారు తను కర్ణాటివాడినని, తనది కర్ణాట భాష అని, సగర్వంగా చెప్పుకున్నారు. భీమఖండంలోని యీ పద్యం గమనించండి.

**ప్రౌఢి బరికింప సంస్కృత భాష యండ్రు -పలుకు నుడికారమున నాంధ్ర భాష యుండ్రు**
**ఎవ్వరేమండ్రు గాక నాకేటి కొరత - నా కవిత్వంబు నిజము కర్ణాట భాష**

( భీమే 1-15 )

ఇంకొక విధంగా చెవికింపైన భాషయనికూడా చెప్పుకోవచ్చును.

## కస్తూరికా భిక్షా దానము

మరల మనం తెలుగు రాయల వద్దకు వద్దాం. శ్రీనాథులవారు తనను ఆదరించిన తెలుగు రాయలతో ద్రాక్షారామం వెళ్లి ఉంటారు. తనను మెచ్చుకుంటూ కావలసింది కోరుకోమని తెలుగురాయడు చెప్పి ఉంటాడు. ఐతే శ్రీనాథులవారామాటకు స్పందించి, వెలిబుచ్చిన కోరిక విలక్షణంగా ఉంది.

తాను ద్రాక్షారామంలో కుదురుగా కూర్చోలేరు. సానికూతుళ్లున్న ద్రాక్షారామం స్వర్గంలోని అప్సరసలను మించి ఉంటుంది. సరసత తెలిసిన పుంభావ మూర్తికి చేతినిండా కస్తూరి ఉంటేగాని సయ్యాటలాడటానికి సులభంగా ఉండదు. అందుకే తాను కస్తూరి కావాలని ఎందుకు యాచిస్తున్నారో చెప్పేశారు.

**అక్షయ్యం బగు సాంపరాయని తెనుంగాధీశ! కస్తూరికా**
**భిక్షాదానము చేయరా! సుకవిరాట్ బృందారక స్వామికిన్**
**ద్రాక్షారామ పురీ విహార వర గంధర్వాప్సరో భామినీ**
**వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించు దద్వాసనల్**

అడగటం, ఆయన యివ్వటం, ఆపైన అన్నంతవనీ చేయటం జరిగి ఉంటుందనటానికి ఏమాత్రం సందేహించవలసినది లేదు.

గోదావరి ప్రాంతంలో ఉన్న వలివెల గ్రామం లోని వారకాంతల మీద ఒక చాటువు విసిరారు..

**ఉలిమిడి చెక్కయున్ మిగుల నుక్కయు జప్పని రొట్టిముక్కయున్**
**మలినపుగుడ్డలున్ నులక మంచపు గుక్కియు, జీకటిల్లునుం**
**దలచిన రోతవచ్చు నొకనాటి సుఖం బొక యేటి దుఃఖ మీ**
**వలివెల వారకాంతల యుపస్థలకున్ బదివేల దండముల్.**



తెలుగు రాయుడు శ్రీనాథులవారిని అపూర్వంగా ఆదరించాడు. గౌరవించాడు. శ్రీనాథుల వారు ఏ గ్రంథమైనా అతనికి అంకితమిచ్చారో లేదో యింతవరకు వెలుగు లోకి రాలేదు. కాని తన అవసానదశలో "రంభ గూడె తెలుంగు రాయరాహుత్తుండు కస్తూరికే రాజు బ్రస్తుతింతు", అన్నారు.

ఐతే శ్రీనాథులవారు 'వల్లభాభ్యుదయము' అనే గ్రంథాన్ని 1428వ సంవత్సరమున రచించి ఉంటారని కొర్లపాటి శ్రీరామమూర్తి గారూహిస్తున్నారు.

వారి మాటలు తెలుసుకుందాము "వల్లభాభ్యుదయము శ్రీకాకుళ స్వామియైన తెలుగు వల్లభుని చరితమనగా శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమగుట సంభవము.

"అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ" యను పద్యమున ప్రసక్తుడైన తెలుగు రాయల పేరు శ్రీకాకుళ స్వామియైన తెలుగురాయలది కావచ్చును. కస్తూరి యొసగిన సాంపరాయని తెలుంగు రాయల కోరిక పయి శ్రీనాథుడు శ్రీకాకుళస్వామియైన తెలుంగు రాయల మీద గ్రంథము రచించుట సంగతము. పంటమైలారు రెడ్డి ప్రాపు లభించిన కాలమునందే సాంపరాయని తెలుంగు రాయల సమాదరము కూడ శ్రీనాథునికి లభించినది. కాబట్టి శ్రీనాథుడు వల్లభాభ్యుదయము నాకాలమున రచించుట సంగతము."

"సమిష్టిపై వల్లభాభ్యుదయ రచనాకాలము స్థూలముగ 1428వ సంవత్సరము." అన్నారు.

## పంట మైలారు రెడ్డి

శ్రీనాథులవారిని ఆదరించిన వారిలో పంట మైలారు రెడ్డి కూడా ఉన్నాడు.

ఈయన ప్రౌఢదేవరాయలకు నమ్మినబంటు. గొప్ప సేనాని. అతిపరాక్రమ వంతుడు. అనేక యుద్ధాలలో పాల్గొన్న యోధుడు. బహమనీలతోను, గజపతులతోను జరిగిన పోరాటాలలో ప్రౌఢదేవరాయలకు విజయాలను సమకూర్చిన దిట్ట.

ఇతని తండ్రి ముమ్మడేంద్రుడు. తల్లి ముంచాంబ.

పంటమైలారు రెడ్డికి "ధరణి వరాహుడు; చౌహత్త మల్లుడు" అనే బిరుదులున్నాయి. ఈయన శ్రీనాథుల వారికి దిన వెచ్చాన్ని కూరుస్తుండేవాడు. బహుశా కొండవీటి పతనం తరువాత, రాజమహేంద్రవరంలో ఆదరణ లభించేటంతవరకు పంటమైలారురెడ్డి ఆదుకొని ఉంటాడు.

కష్టకాలంలో ఆదుకున్నవాడే సరియైన హితుడు. అలాంటివే ఎవరికైనా మనసులో గుర్తుంటాయి. మానవుడు మరల కష్టాల బురదలో పడిపోయినపుడు, గతకాలంలో బాధల్లో ఆదుకున్నవారు మనసులో మెదలటం సహజం. అందుకే శ్రీనాథులవారు "కైలాసగిరి చేరె మైలారు విభుడేగి దిన వెచ్చ మేరాజు దీర్చగలడు" అన్నారు.

### చాటువులు

దాక్షారామంలో ఉన్న రోజుల్లో ఏమి చణుకులు చెప్పారో తెలియదు. కాని ఆ వారకాంతల సౌభాగ్యాన్ని చూసి -

కవితల్ చెప్పిన పాడనేర్చిన వృథాకష్టంబె, యీ భోగపుం
జవరాండ్రేకద భాగ్యశాలినులు! పుంస్త్వంబేల పో పోచకా !
సవరంగా సొగసిచ్చి, మేల్ యువతి వేషం బిచ్చి పుట్టింతువే
నెవరున్ మెచ్చి ధనంబు లిచ్చెదరు గాదే పాపపుందైవమా ! అన్నారు.

జంగమ. వారి చిన్నది విశ్వేశ్వరార్చనలో కంచుతాళాలు వాయిస్తూ అందరినీ ఆకర్షించిందట. ఆ విషయమూ చెప్పారు.

దాయాదుల్వలె గుబ్బచన్ను లొఅయుణ్ ధావళ్య నేత్రాంబుజ
ఛ్ఛాయల్తాండవమాడ గేరి పురుష స్వాంతమ్ముల న్మన్మథుం
డేయన్, జంగమువారి చంద్రముఖి విశ్వేశ్వరార్చనా వేళలన్
వాయించెం గిరిగిండ్లు బాహుకుశల వ్యాపార పారీణతన్

కలలు అందరికీ వస్తాయి. మన ఆలోచనలను బట్టి ఆకలల రూపుకూడా మారుతూ ఉంటుంది. శ్రీనాథుల వారికి ఓరాత్రి గొప్ప కలవచ్చింది. అది మామూలు కలకాదు. పగలు చూసి, మనసులో భ్రమలు కలిగినందున, ఆ తీయని రూపు కలలో కన్పించి ఏవేవో చేసినట్లుంది. అందుకే ఆ సుందరాంగిని చూసి నవయువకునిలా ఉత్పలమాల విసిరారు.

మొన్నటి రేయి నా కలను మోహము లొల్కగవచ్చి యంతలో
సన్నపు వల్వదీసి బిగిచన్ను లురంబున నొక్కుచున్న నే
కన్నులు విప్పి చూచి, నినుగానక, హా ! యని చింతనొందితిన్
తిన్నగ వచ్చి నావలపు దీరిచి కూడవె ప్రాణ నాయికా !

ఎక్కడకు వెళ్లారో ? ఏ నగరంలో చూశారో గాని, ఓ చాటువు చెప్పారు.

చీరయు, ముక్కు ముంగరయు, జెంపల గంధము, జుక్కబొట్టు, మం
జీర ఝుణంఝుణారవము, జేతుల కంకణ నిక్వణంబు. నొ
య్యారపు జాఱుకొప్పును, గయాళి తనంబును కాని లోన శృం
గార మొకింత లేదనుట గంటిని నీ పురి వారకాంతలన్

ఇలా వారకాంతా పరిష్వంగాలతో, కస్తూరి సంకుమద సుగంధ పరిమళాలతో, కాలాన్ని గడిపివేస్తున్నా, శివార్చనా పరునిగా అందరితో గౌరవించబడే శ్రీనాథులవారు మరో కావ్యాన్ని వ్రాయటానికి మానసికంగా సిద్ధమవుతున్నారు

ఇక్కడో విషయాన్ని వివరిస్తాను. కాలాన్ని బట్టి సాంఘిక, నైతిక విలువలుంటాయి. రాచరిక వ్యవస్థలో స్త్రీ భోగవస్తువు. అందువలన యీ రోజులలో వ్యభిచారం అని మనం వాడే పదానికి ఆనాడు అర్థం వేరు. పైగా సంఘంలో వారకాంతలకు గౌరవం ఉంది. రాజాస్థానాలలో, దేవాలయాలలో వారికి మంచి స్థానం ఉంది. అందువలన శ్రీనాథుల వారు గాని, మరొకరు గాని వారకాంతల సౌందర్యారాధన చేస్తే దాన్ని అంతవరకే తీసుకోవాలి. ఆనాడు పురుష ప్రతాపంగా గౌరవించిన దాన్ని, ఈనాటి మన స్థాయిలో అంచనా వేయరాదు.

## రాజమహేంద్రవర పాలకులు

ఒక మాటు చరిత్రను పరిశీలిద్దాం,

అల్లాడరెడ్డి చనిపోయిన తరువాత రాజ్యపాలన చేయవలసిన అనితల్లి భర్త, అల్లాడరెడ్డి రెండవ కుమారుడైన వీరభద్రారెడ్డికి ఆ అవకాశం రాలేదు. అల్లాడరెడ్డి సోదరుడైన అనపోతారెడ్డి కుమారులు కొమరిగిరి రెడ్డి, అనపోతారెడ్డి రాజమహేంద్రవరాన్ని ఆక్రమించుకున్నారు.

స్థానిక చరిత్రల వలన 1420లో కళింగ గజపతి కొండవీటి వరకు ఆక్రమించినట్లు తెలుస్తోంది. బహుశా అతని సాయంతో, రాజమండ్రిని, సామంతులుగా వారు పాలించి ఉంటారు.

వేమ, వీరభద్రారెడ్లు 1423 నాటికి మరల రాజ్మహేంద్రవరాన్ని స్వాధీనం చేసుకున్నారు. బహుశా వీరు దక్షిణ కళింగ దేశంలో కొంత భాగం వదలుకొని, సామంతులుగా ఉండేటందుకంగీకరించి ఉంటారు. విజయనగరం వారు కొంత సహకరించి ఉండి ఉంటారు.

వీర భద్రారెడ్డి (1423 -1448) రాజ్మహేంద్రవరం పాలించే కాలంలో షుమారు 1428 తర్వాత శ్రీనాథుల వారు ద్రాక్షారామంలో ఉన్నారు. వీరి ప్రతిభా విశేషాలు ఆ ప్రాంతమంతా వ్యాపించాయి.

అల్లాడ వేమారెడ్డి సర్వ సమర్థుడు. తనతమ్ముడు వీరభద్రారెడ్డికి అండగా ఉండేవాడు. ఇందువలననే వేమ, వీరభద్రారెడ్ల పేర్లు కలసి తరచుగా విన్పిస్తాయి.

## పదకొండవ ప్రకరణము

### అన్నయ మంత్రి

వీరి మంత్రి బెండపూడి అన్నయ.

అన్నయమంత్రి శివభక్తుడు. ద్రాక్షారామ భీమేశ్వరారాధకుడు. భీమేశ్వరుని మొగలి వాకిట మండపం కట్టించాడు. ఎన్నో దాన ధర్మాలు చేశాడు.

అన్నయ శ్రీనాథులవారి బంధువు. శ్రీనాథుల వారి కవితను అపారంగా అభిమానించే వ్యక్తి. శృంగార నైషధాన్ని సింగన మంత్రికి అంకిత మిచ్చి చెప్పిన పద్యాలు అన్నయ మంత్రికి తెలుసు. ద్రాక్షారామంలో, భీమేశ్వరార్చనలలో శ్రీనాథులవారిని కలిసి ఉంటారు. కవితా సుధారసాస్వాదన చేసి ఉంటారు. ఆనాటి రాజకీయాలు ముచ్చటించుకొని ఉంటారు.

తనకెంత ప్రేమాభిమానాలున్నా, శ్రీనాథుల వారిని వేమ, వీరభద్రారెడ్లకు పరిచయం చేయటం కోరి కొరివితో తల గోకుకోవటమేనని అన్నయ మంత్రికి తెలుసు.

పాతపగలు పూర్తిగా పలచబారలేదు. కొండవీడు పతనమై పోయింది. ఆనాటి కక్షదారులు ఒక్కరూ లేరు. కాటయవేముని వారసులు మాత్రం మిగిలి ఉన్నారు. కవితా

ప్రభాసతో వెలుగొందుతున్న శ్రీ నాథుల వారొక్కరు మాత్రం పంటరెడ్ల ప్రాభవ చిహ్నంగా ఉన్నారు.

ఐతే రాజకీయాలు త్వరిత గతిని మారిపోతున్నాయి. రాజమండ్రి పాలకుల చుట్టూ గజపతులు, అశ్వపతులు, రేచెర్ల వెలమలు, నరపతులు ఉన్నారు. కత్తులబోను మాదిరిగా ఉంది.

ఈ దశలో తమను నాశనం చేయాలని చివరకు బహమనీలతో సైతం చేయికలిపిన, పెదకోమటి వేమారెడ్డి పాలనలో పదునెనిమిదేండ్లు విద్యాధికారిగా, రాజకీయ ధురంధరుడుగా, లౌకికుడిగా, రాయబారకుశలుడుగా ఉన్న శ్రీనాథుల వారిని వేమ వీరభద్రారెడ్లు నమ్మగలరా? గౌరవించగలరా? వెంటనే పరిచయం చేయటం మాత్రం అన్నయ మంత్రికి కుదిరే విషయమా?

అన్నయ మంత్రి ఆలోచించాడు. శ్రీనాథుల వారితో కావ్యం వ్రాయించి, అంకితం తీసుకుని, వాతావరణంలో కొంత ప్రశాంతత, అనుకూలత చేకూర్చాలి. కొంత ప్రచారం జరగాలి. ఆ తరువాత ప్రభువుల మనసెరిగి పాచిక వేయవచ్చు. ప్రాపు కూర్చవచ్చు.

ముందుగ మంత్రి వర్యునకు కృతి యిచ్చి, ఆ కృతిలో తానాశ్రయం పొందాలనుకున్న ప్రభువుల ప్రాభవాన్ని స్తుతించి, పరోక్షంగా సంతృప్తి పరచటం శ్రీనాథులవారి ప్రత్యేకత. హర విలాసంలో కుమారగిరి రెడ్డిని పొగిడినట్లుగా భీమేశ్వర పురాణంలో వేమ వీర భద్రా రెడ్లను గొప్పగా చెప్పటం రాజకీయపు ఎత్తుగడ మాత్రమే.

**"అమ్మహా మంత్రీశ్వరు నేలిన వీరభద్రేశ్వర**
**వేమభూపాలుర వంశావతారం బభివర్ణించెద"** అన్నారు. (భీమే 1-30)

ఆ పైన " అందు బద్మ నాయకులన, వెలమలన, కమ్మలన, సరిసర్లన, వంటర్లన బహుప్రకార శాఖోపశాఖా భిన్నంబులైన మార్గంబులం .........పంట మహాన్వయంబు బాకనాటి దేశంబున ........" అంటూ చతుర్థ కులస్థులైన రెడ్డి ప్రభువులను వర్ణించారు.

సర్వ సమర్థుడై, తమ్ముని రాజ్యపాలన సుకరంగా జరిగేటందుకు అన్నివిధాలా తోడ్పడుతున్న వేమారెడ్డిని గొప్పగా శ్లాఘించారు.

**తమ్ముని వీరభద్ర వసుధాధిపు విక్రమ వీరభద్రుని**
**న్నమ్మద లీల రాజ్యభరణ స్థితి బట్టముగట్టి బాహు ద**
**ర్పమ్మున వేమ భూవరుడు వ్రాసె జగద్విజయ ప్రశస్తి వ**
**ర్ణమ్ములు దిగ్ధురంధర సురద్విపకుంభ విషాణ మండలిన్** (భీమే 1-34)

అన్నదమ్ముల అన్యోన్యత గొప్పగా వర్ణించారు.

తన విషయం చెప్పుకుంటూ "పెక్కు చెప్పియు కాంక్షచనక వెండియును కావ్య మొకటి

గావింపదలచి ' అన్నారు. (భీమే 17,18)

ఇలా ఉండగా, ఒకమంచి ముహూర్తాన అన్నయమంత్రి సాదరంగా శ్రీనాథులవారి నాహ్వానించాడు.

ఆ సన్నివేశాన్ని శ్రీనాథులవారు కళ్లకు కట్టేరీతిలో వర్ణించారు.

భాట్ట ప్రభాకర ప్రస్థాన సంవేద్యు లుద్దండ పండితు లొక్కవంక
ఫణిప్రభాషిత భాష్య ఫక్కి కా భావజ్ఞు లుత్తమ ప్రాగల్భ్యులొక్క వంక
గణభుజ్మత గ్రంథగాఢార్థ విదులు బాహుశ్రుత్య సంపన్ను లొక్క వంక
వేదాంత వాసనా విశ్రాంత హృదయజ్ఞు లుపనిషత్త త్త్వజ్ఞు లొక్కవంక
నుభయ భాషా కవీశ్వరులొక్కవంక, వేశ్యలొక వంక, నొకవంక వీరభటులు
జెలసికొలువంగ గొలువుండి పిలువబంచె బెండపూడన్న మంత్రీశ్వరుండు నన్ను

(భీమ 1-21)

పిలువ నంపి ఆ పైన అడిగిన తీరు ఆహ్లాదంగా ఉంది.

వినిపించినాడవు వేమ భూపాలున కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినాడవు గాఢపాకంబైన హర్షనైషధ కావ్యమాంధ్ర భాష
భాషించినాడవు బహుదేశబుధులతో విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లి నాడవు విశద కీర్తి స్ఫూర్తి కర్పూరములు దిశాంగణములందు
పాకనాటింటివాడవు, బాంధవుడవు, కమలనాభుని మనుమడ వమల మతివి
నాకు గృపసేయు మొక ప్రబంధంబు నీవు, కలితగుణగణ్య శ్రీనాథకవి వరేణ్య

(భీమే 1-23)

శ్రీనాథుల వారు పరమ లౌకికులు. మానవ మనస్తత్వాన్ని బాగా తెలుసుకున్నవారు. అందువలన ఉపక్రమంలో ప్రోలయ వేముని, అనపోతారెడ్డిని, అనవేమారెడ్డిని, కుమారగిరిని ముందుగా స్మరించారు. పెదకోమటి వేమారెడ్డి పేరెత్త లేదు వెంటనే అల్లాడరెడ్డిని పొగడినారు. ఇతని పుత్రులు వేమ వీరభద్రారెడ్లను, గురువయిన ఘోడెరాయ భీమేశ్వరుని స్మరించారు.

ఇదంతా కార్యసాధనకు అవలంబించిన ఎత్తుగడ. కావ్యరచనను రాజకీయంగా మార్చుకున్న లౌకిక చక్రవర్తి.

అన్నయ యిలా అన్నాడు.

సప్త సంతానములు నాకు సంభవించె - నొక ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ
నా వెలితిమాన నాపేర నంకితముగ - శివ పురాణంబు తెనుగుగా జేయు మొకటి

(భీమే 1 - 24)

అన్నయ మంత్రి కోరిన రీతిగా శ్రీనాథులవారు భీమఖండాన్ని రచించారు. ఇందులో కథ చిన్నది. వర్ణనలు ఎక్కువ. తెలుగు సాహిత్యంలో ఈ విధానాన్ని శ్రీనాథుల వారే ప్రవేశపెట్టారని సాహిత్య సాగర మథనం చేసిన వారంటారు. తరువాత ఇంతటి విద్వత్కవి మరొకరు లేరని ఆచార్య పింగళి లక్ష్మీ కాంతం గారన్నారు.

అల్లాడరెడ్డి మంత్రి. అరియేటి లింగన మంత్రి. ఈయన తమ్ముడు అన్నయ మంత్రి బహుభాషావేత్త. గొప్ప రసికుడు. శివభక్తుడు. భీమేశ్వర పురాణం వ్రాసిన శ్రీనాథులవారు రసికులే. ఇందువలన ఉభయులకూ ప్రీతికరమైన అనేక సన్నివేశాలు, వర్ణనలు, పద్యాలు రూపుదిద్దుకున్నాయి. అందుకే భీమఖండంలో భీమేశుడు 'సానివాడల కరుగున్' అని వ్రాశారు. ఇలా పరమేశ్వరుని కూడా సానివారి గృహాలకు పంపించి, వర్ణించక పోతే శివార్చనాధురీణుడైన శ్రీనాథులవారికి తృప్తి లేనట్లుంది.

అందమైన అంగనలు అగుపిస్తే ఒడలు పులకరించి, ఆశువుగా చాటువులలోనో, సందర్భాను సారంగా రచనలలోనో నాలుగు విసుర్లు విసరటం వారికి యిష్టం.

**కాంచీ కంకణ తారహార కటక గ్రైవేయ భూషావళుల్**
**లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూడన్న నిన్**
**బంచాస్త్రోపము, దారతార కవయన్ బ్రార్థించి లోలోపలన్**
**బంచారామము లందు బల్లెల బురిన్ బ్రౌఢేందు బింబాననల్** (భీమే 1-78)

ఈ పద్యం రసిక చక్రవర్తి శ్రీనాథులవారి వచోరీతికి మచ్చుతునక.

## భాషా ప్రకర్షా ప్రలోభం



శ్రీనాథులవారు వ్రాసిన ఈ పద్యం బిందుపూర్వక చకార ప్రాసతో ఉంది. యతులు సహృదయుల నాకర్షిస్తాయి. దీనిలో కన్పించే భాషా ప్రకర్షా ప్రలోభం చాలామంది కవులలో ఉన్నా, శ్రీనాథులవారిలో బాగా కన్పిస్తుంది.

"ఐతే భాషా ప్రకర్ష - తరచు - జానెడు పిలకకు మూరెడు పూలజడ వేసినట్లే ఉంటుంది." అంటారు శ్రీమాన్ నండూరి రామకృష్ణమాచార్య. "శ్రీనాథ మహాకవితో ప్రారంభమైన భాషా ప్రాగల్భ్య ప్రకర్ష ప్రబంధ యుగంలో శాఖోపశాఖలతో విస్తరించి వటవృక్ష ప్రాయమైనది. 'రీతిరాత్మా కావ్యస్య' అన్న ఆలంకారికులు ఉన్నారు. రీతి సుభగమైన గంభీర శయ్యతో శ్రీనాథుని సీసాలలో ఉయ్యాల ఊపు హృదయాలను అలరిస్తుంది"

"అంకిత పద్యాలలో రసస్ఫూర్తి కేవలం భాషా న్మేషంతో కలిగించటం కష్టం. శ్రీనాథ మహాకవి అన్నయ మంత్రి కీర్తిని ఉగ్గడిస్తూ ఒక చక్కని చిక్కని సీసపద్యం భాషా ప్రకర్ష

చూపిస్తూ వ్రాశారు." అంటారు - నండూరి కృష్ణమాచార్యుల వారు.

ఆ పద్యంలోని అందాలు చూడండి.

ముక్కంటి దరహాసమున కనుప్రాసంబు; మిన్నేటి నీటికి మిక్కుటంబు;
శారదజ్యోత్స్నా ప్రసాదంబునకు వీప్స; నలువ శుద్ధాంతమున కనుభాష;
కల్పకారామరేఖకు ప్రతిచ్ఛందంబు; త్రిదశేంద్రుకరటి కామ్రేడితంబు
పుండరీకారణ్యమునకు నధ్యాహార; మమృతాంబునిధి కభిధాంతరంబు,
గంధసార తుషార పాణింధమంబు; దాన విద్యా విలాస విద్యాధరుండు
మంత్రి యన్నయదేవయ్య మహితయశము నిఖిల దిక్తట మంతయు నిండియుండె.
(భీమ 1-54)

" ఈపద్యంలోని అనుప్రాస-వీప్స-అనుభాష-ప్రతిచ్ఛందము. ఆమ్రేడితము - అధ్యాహారము-అభిధాంతరము-సమానార్థకాలే.".

## అన్నయ గొప్పతనం

అన్నయ మంత్రి శక్తియుక్తులను, దాతృత్వాన్ని శ్రీనాథులవారు చక్కగా వర్ణించారు. అనేక భాషలలో ఆరితేరిన అన్నయ మీద పద్యం చూడండి.

అరబీభాష, తురుష్క భాష, గజ కర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జర భాషల్, మళయాళ భాష, శకభాషా, సింధు సౌవీర బ
ర్బర భాషల్, కరహాటభాష మఱియుం భాషా విశేషంబు ల
చ్చెరువైవచ్చు నరేటి యన్ననికి గోష్ఠీ సంప్రయోగంబులన్. (భీమే 1 -73)

శ్రీనాథుల వారు చెప్పిన మరో పద్యం వలన అన్నయ మంత్రి ఆనాటి దేవాలయాలకు కూర్చిన కట్టడాలను మనం తెలుసుకో గలుగుతున్నాము. ఇవన్నీ శివాలయాలలో ఒనగూర్చినవేకావటం విశేషం. సాని పిల్లల సరససాంగత్యాలతో స్వర్గసుఖాలననుభవిస్తూ, మరో వైపు శివారాధన చేస్తూ జీవితాన్ని ఇహపరయుక్తంగా మలచుకోవటం కన్పిస్తుంది. పరస్త్రీ సాంగత్యం తమపూజాది భక్తి కార్య క్రమాలకు అడ్డు వస్తుందని ఆ ప్రముఖులు భావించలేదు.

రాజమహేంద్ర దుర్గమున గావించె శ్రీ వీరభద్రునకు బ్రాకార రేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని మ్రోల రామేశు దమతల్లి నామకముగ,
సంగమేశ్వర దివ్య శంభు లింగమునకు కల్పించె కళ్యాణ గర్భగృహము
దక్షవాటిక యందు దరుణేందు మౌళికి మొగలి వాకిట ధామమును రచించె
ప్రాగ్దిశావ ప్రగోపుర ప్రాంగణమున - సప్తముని సింధు సోపాన సరణి కెలన
దీర్చె భవనంబు భీమయ దేవునగరి - మంత్రి దేవయ యన్నయా మాత్యవరుడు.
(భీమే 1-75)

## భీమఖండం

సప్త సంతానాలలో ఒకటైన కృతిని పొందిన అన్నయ మంత్రి రసహృదయాన్ని మురిపించేరీతిలో, రసికతకు తగినట్లే శ్రీనాథులవారు భీమఖండంలో అవకాశం లేకపోయినా, అవసరం లేకున్నా, కథలో కల్పనలో శృంగారాన్ని దండిగా నింపివేశారు.

భీమనాథుని ద్రాక్షా రామానికి రప్పించి, అచ్చమైన శృంగారపురుషునిగా - అనగా కృతి గ్రహీత అన్నయ మంత్రి ఆనందపడేరీతిలో - రచన చేశారు. పరమేశ్వరుడు శ్రీనాథులవారి చేతిలో ఎలామారి పోయాడో చూడండి. మారుమూల గ్రామంలో వ్యవసాయం చేసుకునే రైతుబిడ్డ పట్టణానికి వెళ్లి అక్కడే స్థిరపడి పైలాపచ్చీసుగా మారిపోయినపుడు ఏయే మార్పులు కన్పిస్తాయో అచ్చం అలా మారిపోయాడు పరమేశ్వరుడు.

గజ చర్మ మెన్నడో కాని నిచ్చలు కట్టు పసిడి కమ్ముల పట్టు పచ్చడంబు
భసిత మెన్నడొకాని ప్రతిదినంబు నలందు మలయజంబు కురంగమదము గూర్చి
నిడుదపాముల రాజు తొడవు లెన్నడొ కాని తారహారములు నిత్యము ధరించు
నృకరంకరుండ మాలిక లెన్నడో కాని ధరియించు కల్హార దామ మెపుడు
కాటనడు చక్కి నెన్నడో కాని యుండు - దక్షవాటి సువర్ణ సౌధముల మీద
నెన్నడొ పిశాచులగాని ఇందు ముఖుల - నెల్లకాలంబు దలచు భీమేశ్వరుండు
(భీమే 1-116)

ఇలా మారిపోయిన శివుడు ఎలా నిగ్రహంతో ఉండగలడు. పైగా సాని యీశానియై ఆయనగారిని మెప్పిస్తుంది. ఆటాడి, పాటపాడి ఆయన్ని ఆనంద డోలికలలో ఊపేస్తుంది. కథను రసరాజరసంతో నింపి, సాని కూళుల్ల సౌందర్యాన్ని చదివేవాళ్లకు చిత్తచాంచల్యం కలిగేలా వర్ణించారు శ్రీనాథులవారు.

చందురునితోడ కల్పవృక్షములతోడ - తారతో లక్ష్మితో అమృతంబు తోడ
కౌస్తుభము తోడ మున్నీట కలిగినారు - విబుధ గంధర్వజాతుల వ్రీటిసతులు
(భీమే 1-95)

## నా రచనా రీతి

ఈ రచనలో నేను చెప్పదలచింది ఆనాటి రాచరిక వ్యవస్థల పుట్టుక, పెంపు, ఘర్షణ, సాహిత్య పోషణ, పతనం వైపు ప్రయాణాలను గూర్చి; మరోవైపు ఆ సంకుల, కుటిల, స్వార్థ పోరాటాల మధ్య మహనీయ మూర్తి శ్రీనాథులవారి పాత్ర, వారి పాటవం, పద్యకవిత, ముఖ్యంగా చాటు కవితలను గూర్చి; అనగా నాటి సాంఘిక జీవనం ప్రస్ఫుటం కావాలని, హిందూ మతోద్ధరణ కొరకంటూ ప్రారంభమైన రాజ్యాలు, బహమనీ సుల్తానుల

సహాయాన్నర్థించి, చివరకు, దక్షిణ భారతంలో ముస్లింలకు బలీయమైన స్థానాన్ని యిచ్చిన తీరు తెన్నులు; మితిమీరిన రాజ్య కాంక్షలు; రైతులను, శ్రమ జీవులను పిండుకుతినటం; కులవ్యవస్థలో దాగిన పైకులాల వారి దోపిడి - ఇలా చాలా చెప్పాలనుకున్నా. ఐతే ఈ రాజ్యాల మధ్య తిరిగిన శ్రీనాథులవారినాధారం చేసుకొని ఒక కథగా ఈ రచన సాగించాను.

ఆనాటి సాహిత్యమంతా బ్రాహ్మణుడు, రాజు అనే రెండుచక్రాల బండిమీద పరుగెత్తింది. ఆ బండి పురాణకథలను తెలుగులో నింపుకుంటూ పరుగులు తిసింది.

"సాహిత్యం జ్ఞానదానం చేయదు. సంస్కారాన్ని పెంచి, అనుభూతుల వలయాలను వ్యాపింప చేసేందుకు ప్రయత్నిస్తుంది. అలాంటి సాహిత్యం సమాజాన్ని ముందుకు తీసుకు వెళ్తుంది. ఇందుకు ఊతమివ్వనిది సరియైన సాహిత్యంగా అంచనా వేయరాదు" అంటారు ఆధునికులు.

ఐతే శ్రీనాథులవారి సాహిత్యాన్ని నేటి కొలబద్దతో కొలువ రాదు. ఆనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితిలో వారి రచనా ప్రభావ మేమిటి? ఈ విషయాలు మరికొంత దూరం వెళ్లాక చెప్పుకుందాము.

## సౌందర్యారాధన

మనం ముడుచుకొని కూర్చోక, సాహిత్యావగాహనకు ప్రయత్నిస్తే చాలా సంగతులు అర్థం చేసుకోగలుగుతాము. జీవితంలో, సాహిత్యంలో సౌందర్యారాధనకావాలి. అదిలేకుంటే యాంత్రిక జీవితం అవుతుందిగాని, ఆనందరసకందాయంగా జీవితం మారదు.

తాను ఏదశలో ఉన్నా శ్రీనాథులవారు సౌందర్యారాధకులుగా, సౌందర్యోపాసకులు గానే ఉన్నారు. శబ్దంలో, అర్థంలో, భావంలో, చమత్కారంలో, సరసతలో, వ్యంగ్యంలో - ఎన్నో రీతుల వారి సునిసిత దృష్టి సౌందర్యారాధన చేసింది. ఆరాధించిన దానిని, అందంగా వారు పద్యపాదాలలో ప్రస్తావించారు.

ఈ భావాన్ని వివరించి, ఎక్కువగా పద్యాలను ఉదహరిస్తే గ్రంథం మోయలేని భారమవుతుంది. అందువలన ఒక ఉదాహరణ యిస్తాను. వారి రచనా రీతి, విన్యాస ప్రాభవం గమనించండి.

పున్నమినాటి వెన్నెలరేనితో పాటు తెల్లతామర మొగ్గదొడిగింది. సముద్రపు గాలితో - పైరుగాలితో - ఆ మొగ్గ వికసించింది. వికసించినందున పరిమళము దిక్కులన్నిటా ప్రసరించి వ్యాపించింది. ఆ తెల్ల తామర మధ్యలో కాంతిమండలము - సంభవించింది. మనం వికసించిన తెల్లతామర పూవును పరిశీలిస్తే, మధ్యలో కేసరాలతో కూడి, పుప్పొడితో సువాసనల వెదజల్లు బంగారు రంగు పీఠం ఉంటుంది. సృష్టిలో ఆ సమ్మేళనం అద్భుతంగా నేత్రానందంగా ఉంటుంది.

కాశీలో మణికర్ణిక తీర్థం ఉంది. అది పరమ పవిత్రమయింది. ఇక్కడ పద్మగర్భంలో కాంతిమండలంలోని మణికర్ణికాగ్రం మీద లక్ష్మీదేవి జనించింది. ఆ పైన నారాయణుని లీలా స్వయంవరంలో వరించింది అని వ్రాశారు.

దీన్ని వారి పద్యంలో చూడండి.

సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబంబుతో బుట్టె తెల్లని తమ్మి పువ్వు మొగ్గ
విరిసె నొయ్యొయ్యన వేలావనీ వాటి పవమాన కోమలా స్ఫాలనమున
వాసించె నఖిల దిగ్వలయంబు మధుర విస్తార కేసర ధూళి సౌరభములు
అంభోజ మధ్యంబు నందుద్భవం బొందె మహిత కాంతిచ్ఛటా మండలంబు
అందు మణికర్ణికాగ్ర సింహాసనమున - లక్ష్మి యుదయించి హస్త పల్లవము నందు
పసిడి పూదండ బూజించె పద్మనయను - నర్థి వరియించె లీలా స్వయంవరమున.
( భీమే 4-95 )

## వక్రత, కాఠిన్యత, సరసత

శ్రీనాథులవారు తనకవిత్వాన్ని గూర్చి తానే వివరించుకున్నారు. అవి (1) వక్రత (2) కాఠిన్యత (3) సరసత. ఈ మూడుగుణాలను చెప్పుకుంటూ అందంగా పద్యం చెప్పారు.

హర చూడా హరిణాంక వక్రతయు గొల్లాంత స్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననగా సత్కావ్యముల్ దిక్కులం
జిర్ణకాలంబు నటించుచుండు కవిరాజీగేహ రంగంబులన్ ( భీమే. 1 - 11 )

లోతుగా పరిశీలించినచో ఈ కావ్యాలలో ఎన్నో అందాలు ఎన్నో రీతులలో కన్పిస్తాయి.

పద్యంలో పదమునకు చివర వచ్చిన రెండక్షరాలను తీసుకొని, ఆ తరువాత ప్రారంభమయ్యే పదానికి ముందువాడటం వలన శబ్దం చెవికి శ్రావ్యంగా ఉంటుంది. అలాంటి పద్యాన్ని వారు వ్రాశారు.

అవనీభార ధురీణ! రీణ రిపు సైన్యాధీశ ! ధీశక్తి వై
భవలీలాజిత కావ్య ! కావ్య రచనా పారీణతా వాస! వా
సవభోగ ప్రతిమాన! మాన వినయాచారార్థ సంభార! భా
రవిసంకాశ! మహాకవీంద్రపరిష త్రుస్తూయ మానోదయా! ( భీమే 4-211 )

మరో పద్యంలోని అందం చూడండి. భవునిమీద 'భ'కారాన్ని ముప్పది ఎనిమి పర్యాయాలు వాడి తన శబ్దాధికారాన్ని విన్యసించారు.

భవు భవానీభర్త భావ సంభవ వైరి భవరోగ భంజను భాలనయను
భోగప్రదుని భోగి భోగిరాజ విభూషు భూనభోభివ్యాప్తు భువన వంద్యు

భగవంతు భర్గుని భసితాంగరాగుని భానుకోటి ప్రభా భాసమాను
భాగీరథీమౌళి భగదృగ్వి పాటను భూరథాంగుని భద్రభూతి ధరుని
భామినీ సువిలాసార్ధ వామభాగు - భక్తితోడ భజింపరో భవ్యమతులు
భావనా భాజుల కతండు ఫలము లొసగు - భాగ్య-సౌభాగ్య వైభవ ప్రాభవములు
( భీమే 3 - 83 )

గోదావరి నది పూర్తి స్వరూపాన్ని తెలుపుతూ మరో పద్యం చెప్పారు.

## ప్రతిపక్ష పరుషాలు

రాజమహేంద్రవరము, కోనసీమల లోని పండితులకు శ్రీనాథుని మీద కడుపుమంటగా ఉంది. అందువలన భీమఖండం నచ్చలేదు. కొద్ది సంవత్సరాల క్రితం వరకు విపక్షమైన కొండవీటివారి కొమ్ముకాసి, నేడు తగుదునమ్మా అంటూ గోదావరి మండలంలో కాలుమోపి, కుర్రకవులు కులుక్కునేలా నాలుగు పద్యాలు వ్రాస్తేమాత్రం మాకేమిటన్నట్లు ఆ పండితులు విమర్శలు సాగించారు. "ప్రౌఢ నిర్భర వయః పరి పాకంలో" ఉండి కూడా ఈ వ్రాతలేమిటి? ఈ కూతలేమిటి? అని వారు ఈసడించారు.

వారి ఈసడింపుల మాట అలా ఉంచి, పరిశీలిస్తే భీమఖండంలో ఉదాత్తమైన భక్తి భావాలు, చక్కని గద్యాలు, స్తుతులు ఉన్నాయి. కొంత వేదాంతమూ ఉంది. కాని యివన్నీ శృంగార ప్రవాహంలో కొట్టుకపోయాయి. పైగా వారి చాటువుల మ్రోత చెవు లదరగొడుతున్నాయి. శ్రోత్రియులకు మింగుడు పడటంలేదు.

అవకాశం దొరికితే అలాంటి వారు ఊరుకుంటారా? అంతే జరిగింది. వారు శ్రీనాథులవారి కవిత్వాన్ని దుయ్యబట్టారు. భీమ ఖండంలో సాని పిల్లల శృంగారం తప్ప మరేమీలేదన్నారు. అంతటితో ఊరుకోలేదు. శ్రీనాథులవారి శృంగార నైషధం డుమువులు తగిలించిన రచనగాని వేరే ఏమీ కాదన్నారు. నీ డుమువులు నీవు తీసుకొని, మా హర్ష నైషధాన్ని మాకిచ్చేయమన్నారు. ఆ విమర్శలకు అవధులు లేక పోయాయి.

## కుకవి నింద

శ్రీనాథులవారికి యివన్నీ కువిమర్శలుగా కన్పించాయి. వద్దనుకుంటున్నా మురుగు వాసనలు ముసురుతున్నాయి. దోమపోటులా బాధిస్తున్నాయి. ఎత్తిపొడుపులు, వేళాకోళాలు జాస్తి అయినాయి. అందువలన కుకవి నిందగా తన భావాలను భీమఖండంలో వెల్లడించారు. తన పూర్వ రచనలలో లేని కుకవి నింద కావాలని భీమఖండంలో వ్రాయటం ఇందువలననే నని విమర్శకులు భావిస్తున్నారు.

కడుపు రగులుకుపోయి కఠినంగా వితండ వాదనలను ఖండించారు.

బోధమల్పంబు, గర్వ మభ్యున్నతంబు, - శాంతి నిప్పుచ్చరంబు, మచ్చరము ఘనము,
కూప మండూకముల బోలె కొంచె మెరిగి - పండిత మ్మన్యులైన వైతండికులకు
( భీమే 1 - 13 )

ఇలా ఖండించినా వాళ్ల నోళ్లు మూయలేదు. అందుకేనేమో తన భావాలను మరింత కఠినంగా ప్రతికక్షుల విమర్శలకు దీటుగా, ఇహంలో తనరసికతను ఈసడించి పరంలో వాళ్లు ఏంచేస్తారో తమాషగా చెప్పారు.

శ్రుతి శాస్త్ర స్మృతు లభ్య సించుకొని విప్రుండంత నానాధ్వర
వ్రతుడై పోయి కనున్ బురందర పురారామ ద్రుమానల్పక
ల్పతరు ప్రాంత లతా కుడుంగ సుఖసుప్త ప్రాప్త రంభా భగ
ప్రతి రోమాంకుర పాటనక్రమ కళాపాండిత్య శౌండీర్యమున్
( కవితా సమీక్ష చాటువులు పుట 81 )

ఐనా వాళ్లకు బుద్ధి రాలేదు. ఘోరమైన రీతిలో అసభ్యతగా ఉన్నా, కావాలని మరోపద్యం విసిరారు.

హంసీయానకు కామికన్నధమ రోమాళుల్న భః పుష్పముల్
సంసారద్రుమ మూల పల్లవ గుళు చ్ఛంబైనే యచ్చోట, వి
ద్వాంసుల్రాజ మహేంద్ర పట్టణమునన్ ధర్మాసనంబుండి, ప్ర
ధ్వంసాభావము ప్రాగ భావమనుచున్ దర్కింతు రశ్రాంతమున్. ( చా.ప.మ.మ.887)

కావ్య విమర్శకన్నా, కక్షతో, అసూయతో, వితండ వాదంతో విమర్శకు దిగినపుడు, ఎంత చేసినా బుద్ధిరానపుడు ఎవరు మాత్రం ఏం చేయగలరు? ఏమనిషైనా తన స్థాయికన్నా క్రిందకు దిగి, కువిమర్శకు దిగినపుడు సమాధానం ప్రతిసారీ చెప్పలేడుగదా! పండిత ప్రకాండుల మధ్య మెలగి విశిష్ట వ్యక్తిత్వం కలిగి, రాజ సన్మానాలు పొంది, ప్రత్యేక రచనా శైలి కలిగిన, శ్రీనాథులవారు భీమ ఖండంలో కుకవి నిరాకరణలో ఏమన్నారో చూడండి.

నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ - నడరి కాకులు బిట్టు పెద్దరచి నప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స -సైపరాకున్న నెందేని జనుట యొప్పు
( భీమే 1 - 14 )

కాకిగోల పడలేనపుడు హంస నోరు మూసుకోవటమే మంచిది. అదీ కుదరనపుడు ఎక్కడికైనా వెళ్లిపోవటం ఉత్తమం అన్నారు. రాజమండ్రిలో పండితుల విమర్శల వలన, తనలో కలిగిన భావాలకు పద్య రూపంగా యిలా యిచ్చినా మంచి వారిని గూర్చి మంచిగా ఆలోచించారు. తనను 'సుకవిజన విధేయుడ'నని చెప్పుకున్నారు.

మనం ఇక్కడ ఆగి డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు భీమేశ్వర పురాణాన్ని గూర్చి

చెప్పిన మాటలు స్మరించి, ముందుకు సాగుదాం. "శృంగార నైషధమున బీజ మాత్రము, హర విలాసమున బిందు భూతమునయిన శ్రీనాథుని స్వతంత్ర కవితా శక్తి, భీమ ఖండమున పతాకస్థాయి నంది స్వతంత్ర కావ్య సాక్షాత్కార మగుట 'యాంధ్ర సరస్వతి యదృష్టము"

## గోదావరి గంగ

నదుల ప్రక్క నివసించే వాళ్లకు, ఆ జలధారల మీద అపరిమితమైన అనురాగం ఏర్పడుతుంది. తొలకరిలో నదికి నీళ్లు తగిలి, సాగి, పొంగి ప్రవహిస్తున్నపుడు ఆ కమనీయ దృశ్యాన్ని చూసి ఆనందిస్తారు.

గోదావరి గంగను ఋషులు ఆహ్వానించే తీరు ముచ్చటగా ఉంటుంది.

విచ్చేయవమ్మ శ్రీ వృషభ వాహన ధర సామజకటమదాసార ధార
పయనంబు గావమ్మ భర్గ జటాటవీ కుటజ శాఖా శిఖా కోరకంబ
రావమ్మ యాదిమ బ్రహ్మ దోః పల్లవ స్థిత కమండలు పుణ్య తీర్థ జలమ
లేవమ్మ విశ్వంభరావధూటీ కంఠ తార మౌక్తికహార ధామకంబ
తెరలతో వీచికల తోడ దరులతోడ - విమల డిండీరఖండ దండముల తోడ
మురువు తీవియు నామోదమును జవంబు - వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ
( భీమే 4 - 175 )

భీమేశ్వర పురాణంలో వర్ణించిన సప్తగోదావరి ఆనాటిరూపంలో యీనాడులేదు. కాటన్ ఆనకట్ట కట్టాక గోదావరి పాయలు కొన్ని మురుగు కాల్వలుగా మారాయి. అది కాకుండా గతంలో మీట వేసి గోదావరి భీమేశ్వర దేవాలయానికి బాగా దూరంగా దక్షిణానికి జరిగినట్లు కన్పిస్తోంది.

గోదావరి నదిని ఎన్నిచోట్ల వర్ణించారో చెప్పలేము. ఆ నదీమతల్లితో అంత అనుబంధం పెంచుకున్నారు. భరద్వాజాది మహామునుల మాటలుగా ఆనంద పారవశ్యంగా వారు గోదావరి గంగను నడువమని యింకా చెప్పారు.

అదె మా స్వామి సుధారసోద్భవుడు దక్షారామ భీమేశు డ
భ్యుదయం బొంది ప్రతిష్ఠ గైకొనెడు నంభోరాశి తీరంబునన్
బదమా షట్పదమాలికా పరిల సత్పా థోధునీ సంపదా
స్పదనా నాసలిల ప్రవాహలహరీ సంభార గోదావరీ. ( భీమే 4 - 176 )

గోదావరి నది పూర్తి స్వరూపాన్ని తెలుపుతూ మరో పద్యం చెప్పారు.

త్ర్యంబకాచల శిఖరాగ్రము నందు నుదయించి పొదలి యార్యావర్త భూమి దఆసి
మలగి దండకవనీ మధ్య భాగమున నా ప్రస్రవణాచల ప్రస్థమొఆసి

పట్టిస శ్రీవీర భద్రేశు సేవించి క్షేత్ర సోమేశు మందిరము డాసి
యేచి యనంత భోగేశ్వర స్థానంబు రుద్ర పాదములపై ద్రోవగాగ
కోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి - కుండలాముఖ క్షేత్రంబు గుస్తరించి
భీమమండలి దాపల బెట్టుకొనుచు - గౌతమీ గంగ లవణాబ్ధి గౌగిలించె.

( భీమే 3 - 21 )

సంస్కృత భీమ ఖండం శ్రీనాథులవారి భీమ ఖండానికి సంస్కృతీకరణం అనటానికి ఇలాంటి పద్యాలను మార్చటం కన్పిస్తుంది.

కాలం నిలవదు. కదలి పోతూ ఉంటుంది. అలాగే శ్రీనాథులవారికి కాలు నిలవదు. దేశ పర్యటన, జీవిత పరిశీలన వారికి చాలా యిష్టం. వారు సింహాచలం దాటి పైదాకా పర్యటించినట్లు కొన్ని చాటువులు చెపుతున్నాయి.

## పొరుగు పాలకులు

మరోమారు చరిత్ర పరిశీలిద్దాం.

అల్లాడ రెడ్డి చనిపోయాక ఆయన అన్న కుమారులు కుమారగిరిరెడ్డి, అనపోతారెడ్డి రాణ్మహేంద్రవరాన్ని ఆక్రమించుకొని పాలించారని చెప్పాను. అనపోతారెడ్డి ఉత్కళ రాజయిన నాల్గవ భానుదేవుని ఆశ్రయించాడు. నాల్గవ భానుదేవునకు కజ్జల భానుదేవుడనే పేరుంది. అతను దాడి చేసి పిఠాపురం వరకు జయించాడనే మాట ఉంది. ఈ మాటా చెప్పుకున్నాం.

భానుదేవుని ఆశ్రయించినా, పెదతండ్రి బిడ్డలను పారద్రోలి వేమ, వీరభద్రారెడ్లు రాజమండ్రిని ఆక్రమించారు. 1423 నుండి వీరు పాలించారు. ఉత్కళ రాజుతో మిత్రత్వం నెరపారు. భానుదేవుని శాసనాలు 1430 వరకున్నాయి. కాబట్టి ఈ మైత్రి 1430 వరకు సాగి ఉంటుందని శ్రీరామమూర్తిగారు భావిస్తున్నారు.

భీమఖండ రచన 1430లో జరిగి ఉంటుంది.

కాని, కర్ణాటక సింహాసనాన్ని అధిరోహించిన ప్రౌఢ దేవరాయలు దండయాత్ర వెడలి కళింగ, ఉత్కళ రాజ్యాధిపతియైన గజపతిని తరిమి సింహాచలం వరకు ఆక్రమించినట్లు అతని సామంత మండలేశ్వరుడయిన తెలుగురాయడు 1428లో సింహాచలంలో శాసనం వేయించాడు. ఇందువలన సింహాచలం వరకు ప్రౌఢ దేవరాయల క్రిందకు వచ్చింది. రేచెర్ల వెలమవారు ఈ దండయాత్రలో కర్ణాట భూపతులతో పొత్తు కలిపి ఉంటారు అని మల్లంపల్లివారు వ్రాశారు.

ఈ దండయాత్రను గూర్చి వెలుగోటివారి వంశ చరిత్రలో ఇలా వుంది.

"చటులోగ్ర గతి రాయశరభమై యవలీల దిరుగ సింహాద్రి సాధించినాడు
గంగసాక్షిగ మీతి కదిసి రాజమహేంద్రవరము చూఱలుగొని వచ్చినాడు

వీరభద్రుని దొడ్డ విభువేమ నృపతుల రట్టడి కాలండె బెట్టినాడు."

ఈ విజయం ప్రౌఢ దేవరాయలతో కలసి చేయుటవలన వచ్చిందా లేక రాచకొండ వారే స్వయంగా సాధించారా అనేది సరిగా నిర్ధారణ కాలేదు.

ఇందువలన వీరభద్రారెడ్డి విజయనగరం వారి సామంతుడుగా మారక తప్పలేదు.

వేమ, వీరభద్రారెడ్లు 1430లో దండెత్తి వెళ్లి దక్షిణ కళింగాన్ని జయించారని, సింహాచలంలోని శాసనాలే ఇందుకు సాక్ష్యాలని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాశారు.

వేమ, వీరభద్రారెడ్డి సోదరుల శాసనాలు 1434 వరకే కన్పిస్తున్నాయి. 1437లో ద్రాక్షారామ శాసనంలో వీరు చేసిన దానాల సంగతి ఉంది. బహుశ 1444 వరకు ఈ సోదరులు రాజమహేంద్రవరాన్ని పాలించి ఉండవచ్చును.

## రాచకొలువు

మరల మనం మన కవిరాజు గారి సంగతి ఆలోచిద్దాం. శ్రీనాథులవారి కవితా ప్రకంపనాలు వేమ, వీరభద్రారెడ్ల వరకు ఏనాడో చేరినాయి. క్రమేణా పరిచయాలు పెరిగాయి. భీమఖండం పూర్తి అయ్యేనాటికి రాజసోదరులతో చెలిమి ఏర్పడింది.

అన్నయమంత్రితో కలసి శ్రీనాథులవారు సింహాద్రి నారసింహుని దర్శించి ఉంటారు. ఆపైన మరికొంత దూరం తిరిగి చూసి ఉంటారు.

## వేమారెడ్డి మీద చాటువులు

అల్లాడ వేమారెడ్డి మీద చెప్పిన కొన్ని చాటువులు ఉన్నాయి. అవి శ్రీనాథులవారివి కావచ్చని వేటూరి ప్రభాకర శాస్త్రిగారన్నారు.

వివిధ విద్యోద్దండ! విద్వత్కుముదకాండ! హరిణాంక! రూపనారాయణాంక!
నీతోగ్రకరవాల! నిర్జితారి నృపాల! సప్తాంగ! రాజ వేశ్యాభుజంగ!
సకల మహీరాజ్య సంరక్షణోద్యోజ్య! కులశీల గుజ్జరి దళ విభాళ!
భామా జన స్వాంత పరితోషణ లతాంత! కోదండ! రాయ చేకోలు గండ!
జయ విజయ జన్య కాంభోజ హయ సమాజ - ఖుర విపాటన సంభూత కుతల రేణు
పటల నిబిడ ఘన ధ్వాంత భరిత భువన - విజయ రఘురామ! అల్లాడ విభుని వేమ!
(చా.ప.మ.మం. 94 )

మరో సీసపద్యం కూడా వేటూరివారే వెలువరించారు.

జయ! రాయ వేశ్యా భుజంగాంక నిశ్శంక అభ్యుదయంబు రాజాధిరాజ!
మంగళం బానత మండలీకరగండ సంకల్ప సంసిద్ధి సమర విజయ!
బ్రహ్మాయు వరిరాయ బసువ శంకర ముద్ర వర్ధిల్లు గాయగోవాళ బిరుద!
మహిమించు రిపు చెంచుమల చూఱ కారాంగ స్వస్తి కర్పూర వసంతరాయ!

ఆంధ్ర . . . . . . . . . . . సింధు యవన చేది - వీరలక్ష్మీ స్వయంవర వీక్షణాఢ్య
ధరణి పాలింపు మాచంద్ర తారకముగ - విక్రమోన్నిద్ర! అల్లయ వీరభద్ర!

## చాటుపద్య సరదాలు

శ్రీనాథులవారికి రామయ మంత్రి బంధువు. సన్నిహితుడు. పైపెచ్చు భోజనప్రియుడు. ఆయన్ని ఆటపట్టిస్తూ చెప్పిన చాటువు నవ్వు పుట్టిస్తుంది.

గ్రామము చేతనుండి పరికల్పిత ధాన్యము నింటనుండి, శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచే గడతేరెగాక మా
రామయ మంత్రి భోజన పరాక్రమ మేమని చెప్పవచ్చు, నా
స్వామి యెరుంగు తత్కబళచాతురి తాళఫల ప్రమాణమున్.

ఇలాగే కలిదిండి కామయ కుమారుని ఆట పట్టించటం మన తెలుగువారి బావా మరదుల సరసాలకు ప్రతీకగా నిలుస్తుంది.

మా కలిదిండి కామయ కుమారకు డన్నిట తండ్రి వైఖరే
కాక తదన్యు డెట్లగును? గాడిదకున్ తురగంబు పుట్టునే?
చేకొని కొంకి నక్కకును సింగము పుట్టునె? మాలకాకి కిం
కోకిల పుట్టునే? చిఱుత కుక్కకు మత్తగజంబు పుట్టునే?

రస చక్రవర్తి శ్రీనాథులవారు చెప్పిన చాటువులు ఎక్కువగా స్త్రీల మీదననే మాట నిజమనిపిస్తోంది. ఈ చాటువులు చూడండి.

కామిని! యేమె! నీ వయసు కావరమా? మొగమెత్తి చూడవే
ప్రేమను ముద్దుగుమ్మ! అని పిల్చిన బల్క విదేటి గర్వమే?
కోమలమైన నీకులుకు గుబ్బల మీదట నున్న యట్టి నా
ప్రేమ మరుండెరుంగు నిక వేరుగ నేరను బ్రాణనాయికా!

అంతటితో ఊరుకోలా. శృంగార శ్రీనాథుడు గదా!

పచ్చల్ తాపిన తారహారములతో బాలిండ్లు గాన్పించి, నే
మెచ్చన్ బైబడి కౌగిలియ్య విదియేమే? మేటి పంతంబుతో
వచ్చెం జూడవె పచ్చవిల్ దొరయదే, ప్రాణంబు రక్షింపవే!
కుచ్చెళ్లొప్పుగ నూడదియ్యనియవే! కొమ్మా! జగన్మోహినీ!!

సింహాచలం దాటి ఓఢ్ర దేశ సంచారంలో చెప్పారో లేక మరే ప్రాంతంలో అన్నారోగాని రంగుల చిత్రలేఖనం గా ఒక పద్యం చెప్పారు.

మకరధ్వజుని కొంప యొక చెంప కన్పింప చీర గట్టినదయా చిగురుబోడి!
ఉభయ పక్షములందు నురు దీర్ఘతరము లౌ నెరులు పెంచినదయా నీలవేణి!

పసుపు వాసన గ్రమ్ము పైట చేలము లెస్స ముసుగు పెట్టినదయా ముద్దుగుమ్మ!
పూర్ణ చంద్రుని బోలు పొసగు సింధూరంపు బొట్టు పెట్టినదయా పొలతి నుదుట!
నెమ్మి మీఱంగ నిత్తడి సొమ్ము లలర - నోర చూపుల గుల్కు సింగార మొల్క
గల్కి యేతెంచె మరుని రాచిల్కయనగ - వలపులకు బేటి యొక యొడ్డెకుల వధూటి!

సుందర చిత్రంగా బిందె జారిన పూజారి వారి కోడలి మీద చెప్పిన చాటువు శబ్ద చిత్రము.

పూజారి వారి కోడలు - తా జారగ బిందె జారి దబ్బున బడియెన్
మైజాఱు కొంగు దడిసిన - బాజారే తిరిగి చూచి పక్కున నవ్వెన్

అసిధార వంటి వాక్కు, అన్యాయం సహించని తత్వం, నిప్పులు చిమ్మే కవితా ప్రజ్ఞ, వారి మాట నేర్పు ఎదిరి పక్షానికి కొరడా దెబ్బ వంటిది.

నెమలిపురి యమ పురము గా - యముడాయెను బసివి రెడ్డి యంతకు మిగులన్
యమదూతలైరి కాపులు - క్రమమెఱుగని దున్న లైరి కరణా లెల్లన్

ఇలాంటి యముళ్ళు, యమదూతలు వారి విమర్శలను సహించగలరా? భవిష్యత్తులో ఏమి జరుగుతుందో చూద్దాం.

## ధూర్త గోపాలుని ముద్దు

మరల మనం భీమ ఖండాన్ని గూర్చి కొంచెం ఆలోచిద్దాం. ఆ గ్రంథంలో మొట్టమొదట అవతారికలో రాధాకృష్ణుల విషయం ఉంది. తెలుగు సాహిత్యంలో రాధకున్న పాత్ర చాలా చిన్నది. ఉత్తరాదివారి రాధ స్థానంలో ఆంధ్రులు సత్యభామను పెంచుకున్నారు. కాని, శ్రీనాథులవారు తన గ్రంథంలో తొలిగా రాధామాధవ శృంగారాన్ని వర్ణించారు. ధూర్తగోపాలునితో తాంబూలంతో తడిసిన ఎర్రని పెదవులను రాధ మోవిపై ఆనించేలా చేసి, ముద్దు పెట్టించారు. ఈ ఇరువురి ముద్దులాటను తెలుగులో ముందుగా చెప్పిన ఘనుడు శ్రీనాథులవారే. ఇది వారి అనుభవమేమో!

ఈ ధూర్త గోపాల పదాన్ని భామాకలాపాల్లో ఘనంగా, విరివిగా, కొంటెగా భాగవత కళాకారులు, నవజనార్ధన కళాకారిణిలు, తూరుపు భాగవతులు వాడుకున్నారు.

భీమ ఖండంలో ఇష్టదేవతాస్తుతిలోని పద్యం చూడండి.

బాలిక మోము మత్త పనబర్హి కిశోరక లాస్యలీలబై
వాలిచి పచ్చ కప్పురపు వాసనతోడి ముఖారవింద తాం
బూలపు మోవి మోవి పయి మోపుచు రాధకు నిచ్చు ధూర్తగో
పాలుడు బ్రోచుగావుత మపార కృపామతి మంత్రి యన్ననిన్. ( భీమే 1 - 3 )

కృతిభర్త అన్నయమంత్రి, కృతికర్త శ్రీనాథులవారు ధూర్త గోపాలునికి యిలాంటి విషయాలలో తీసిపోయేవారు కాదు. ( 1 - 22 )

కన్నులు చల్లగా నిను సుఖంబుగ నెన్నడు జూతునో చెలీ!
యిన్నిటి కేలనే? మనల నిద్దరి వాంఛలు తీరగ, హాయిగా
చిన్ని కుచంబులానుచును, చెక్కిలి నొక్కుచు, ముద్దులాడగా
నెన్నటి కబ్బునో! మన యదృష్టము స్పష్టము చేయరాదటే!

## భీమఖండ రచనా రాజకీయమే

రాజమండ్రి కవులెన్ని అన్నా, పండితులెంత దూషించినా, తను కావ్యాలలో వాడిన భాషను యీసడించినా, నిరుత్సాహపడకుండా శ్రీనాథులవారు సమాధానం చెపుతూనే ఉన్నారు. ఈ సందర్భంలోనే "నిజమునాది కర్ణాట భాష" అని స్పష్టంచేశారు.

కథలో పటుత్వంలేని భీమఖండం రాజకీయవుటెత్తుగడల్లో ఒక భాగంగానే రూపొందింది. ఈ రచన కూడా త్వరితగతిని వర్ణనలతో పూరించి పూర్తి చేశారు. గోదావరి మండలాన్ని తనివితీరా వర్ణించారు. కూరగాయలు. పళ్లు, తినుబండారాలు, ఆచార వ్యవహారాలు, సానికూతుళ్లు, నృత్యాలు, మనకీ గ్రంథంలో కన్పిస్తాయి. ఒక విధంగా ఈ రచన ఆనాటి గోదావరి మండలపు సాంఘిక జీవనాన్ని పుణికి పుచ్చుకున్నదని చెప్పవచ్చును.

## భీమేశ్వరాలయం : గ్రామ దేవతలు

కాకతీయుల కాలంలో ప్రప్రథమంగా గ్రామ దేవతల పేర్లు శాసనాల్లోకి ఎక్కాయి. శ్రీనాథులవారి భీమేశ్వర పురాణంలో గ్రామ దేవతలు భీమేశ్వరుణ్ణి కొలుస్తున్నట్లు వర్ణించారు. పడమర గోగులమ్మ, ఉత్తరాన మండతల్లి, తూర్పున నూకాంబిక, దక్షిణాన ఘట్టాంబిక నాలుగు దిశలనుండి కాపాడుతుంటారు.

"ఆది కాలంలో ఆర్యులు గ్రామ దేవతల మీద ఆసక్తి చూపలేదు. తెగలతో సమాజం కలసిపోయాక వర్ణాశ్రమ వ్యవస్థతో పాటు, తెగల జీవితంలోని అనేక లక్షణాలు మిశ్రమ మయ్యాయి. గ్రామ దేవతలు శివుని భార్యలుగా గౌరవ స్థానాన్ని పొందారు." అంటారు కంభంపాటి సత్యనారాయణగారు.

శ్రీనాథులవారు యీ నలుగురు గ్రామదేవతలను వర్ణిస్తూ పద్యాలు చెప్పారు.

పదునెనిమిది శక్తి పీఠాధి దేవతలలో ఒకరైన మాణికాదేవితో కలసి భీమేశ్వరుడు, ద్రాక్షారామంలో మరుల నృత్యాలు తిలకిస్తూ ఉంటాడు.

( భీమే 1 - 105 )

## హంపీ యాత్ర

హంపీ విజయనగర పాలకుడు ప్రౌఢ దేవరాయలు సింహాసనం అధిష్టించాక, రాజ్య విస్తరణ ప్రారంభించాడని, వేమ వీరభద్రారెడ్లు వారికి సాక్షికంగా సామంతులుగా ఉన్నారని

చెప్పుకున్నాము. విజయనగర పాలకులలో ప్రౌఢ దేవరాయలు కడు సమర్థుడు. కవి పండిత పోషణ బాగా చేశాడు. తెలుగు కవులను కూడా బాగా ఆదరించాడు.

రాజ్మహేంద్రవరాన్నుండి బయలుదేరి హంపీ విజయ నగరం వెళ్లి ఆ ప్రఖ్యాత రాజాధిరాజు వద్ద మెప్పు పొందాలని శ్రీనాథులవారు భావించారు. అదే సమయంలో విజయనగరం వారితో బాగా అనుకూలంగా ఉండటం రాజకీయంగా రాజ్మహేంద్రవరం వారికి అవసరం. అప్పటికే తమ బద్ధ శత్రువులయిన వెలమదొరలు విజయనగరం వారితో సఖ్యంగా ఉంటున్నారు. రాజకీయ స్నేహాన్ని పెంపొందిచుకోను సరైన రాయబారి కావాలి. అలాంటిది, సాంస్కృతిక రాయబారి ద్వారానే సాధ్యం. ఇందుకు అన్ని విధాలా శ్రీనాథులవారు తగినవారు.

వేమ, వీరభద్రారెడ్లు ఆలోచించారు. శ్రీనాథులవారి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ సమకూర్చి, సుఖకరంగా ప్రయాణం సాగించేందుకు వీలు కల్గించారు. ఈ ప్రతిపాదన ఎటునుండి ఎలా వచ్చిందో నాకు తెలియదు. ఇది నా ఊహ మాత్రమే.

శ్రీనాథులవారు విజయనగరం 1428-1438 మధ్య వెళ్లి ఉంటారని ఆరుద్రగారంటారు. శ్రీనాథులవారికి ప్రౌఢ దేవరాయలు 1435 ప్రాంతంలో కనకాభిషేకం చేశాడని వేటూరి ప్రభాకర శాస్త్రిగారంటారు. ఈ వాదనను అంగీకరిస్తే ప్రౌఢ దేవరాయలు రాజ్యానికొచ్చిన తొమ్మిదవ సంవత్సరంలో యీ సత్కారం జరిగి ఉంటుంది. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు భీమఖండ రచన 1430 - కాశీ ఖండ రచన 1433 కాబట్టి ఈ మధ్యలో కనకాభిషేకం జరిగిందంటారు.

## పన్నెండవ ప్రకరణము

### ప్రయాణ మార్గం

ఒక శుభ ముహూర్తాన పండిత పరివారంతో శ్రీనాథులవారు హంపీయాత్ర ప్రారంభించారు. గ్రామాలలో తనను గూర్చి తెలిసిన వారందించిన సపర్యలనందుకుంటూ, ముందుకు సాగారు. ఆనాడు హంపీ విజయనగరానికి రాజ్మహేంద్రవరం నుండి ఉన్న రాజమార్గాలలో దేనివెంట ప్రయాణం చేసి ఉంటారో మనం తేలికగా చెప్పవచ్చును.

అప్పటి వ్యాపార మార్గాలే ప్రయాణ మార్గాలు. రాజ్మహేంద్రవరం నుండి విజయవాడ వచ్చి కృష్ణానదిని దాటాలి. తరువాత కొండవీడు ప్రక్కగా, వినుకొండ మీదుగా వెళ్లేది ఒక మార్గము. రెండవది బెజవాడ వద్ద కృష్ణ దాటకుండా గోల్కొండ ప్రక్కగా హంపీ చేరుతుంది. మరో మార్గం గుంటూరు, దాచేపల్లి, వాడపాలెం, దేవరకొండలమీదుగా వెళ్తుంది.

శ్రీనాథులవారు వినుకొండ మీదుగానే వెళ్లారు. ఈ నిర్ణయానికి కారణం తన

ప్రయాణంలో వారు చెప్పిన చాటువులే ఆధారం.

## వినుకొండ వల్లభరాయడు

వల్లభరాయడు ముక్కినాటిలోని మోపూరు మీద అధికారిగా ఉండేవాడు. ఈ గ్రామం పులివెందుల తాలూకాలో ఉంది. ఈయన స్వయంగా పద్యాలల్లుతుండేవాడు. నాటకాల పిచ్చి బాగా వుంది. తన ఊరిలో జరిగే తిరునాళ్లలో నాటకాలాడించేవాడు. భైరవ స్వామి భక్తుడని అనుకుంటాను. చాటుధార ఉన్నవాడు కావటం వలన మంచిపేరు ఉంది. విజయనగరంలో మంచి పలుకుబడి ఉంది. అప్పటికే ప్రాకిపోయిన శ్రీనాథులవారి రచనల మీద మంచి అభిమానముంది. ప్రేమా ఉంది.

క్రీడాభిరామంలోని 22వ పద్యం వలన వల్లభామాత్యుని విశేషాలు బాగా తెలుస్తాయి.

మూడు గ్రామ గ్రాసముల గూడంగ మోపూరు పాలించె ముల్కినాట,
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు కరతలామలకంబు గా పఠించె,
ప్రత్యక్షమొనరించి భైరవ స్వామిచే సిద్ధ సారస్వత శ్రీ వరించె,
గామకాయనస విశ్వామిత్ర గోత్రంబు వంశ గోత్రంబుగా వార్త కెక్కె
నెవ్వ, డా త్రిపురాంత కాధీశ్వరునకు, - రాయ నవరత్న భండార రక్షకునకు
బ్రియతనూజుండు, చందమాంబిక సుతుండు - మనుజమాత్రుండె వల్లభామాత్య వరుడు.

శ్రీనాథులవారొస్తున్నారని తెలిసి, వినుకొండ వల్లభరాయడు ఎదురేగి స్వాగతం చెప్పాడు. సాదరంగా తోడ్కొని వచ్చి, ఆతిధ్యమిచ్చాడు. నెమ్మదిగా తన రచనల సంగతి చెప్పాడు.

## శ్రీనాథుని ప్రశంస

చెప్పినవన్నీ విన్నారు కవిసార్వభౌములు. వల్లభామాత్యునికున్న చాటుకవితా పాటవం అరుదుగా మాత్రమే లభ్యమవుతుందన్నారు.

హాటక గర్భ వధూటీ - వీటీ కర్పూర శకల విస్ఫురమర సౌర
భ్యాటోప చాటు కవితా -పాటవ మరుదవని వల్లభన్నకు నమరున్

( క్రీడా - 24 )

మరో కందపద్యంతోనూ మెచ్చుకున్నారు.

అమృతరస మథన సంభవ - ఘుమ ఘుమిత వయఃపయోధి కోలాహలమున్
భ్రమియించు దిప్ప సచివో - త్తము వల్లభ విభుని చాటుధారా ఫణితుల్

( క్రీడా - 26 )

రాయపాటి తిప్పన సంస్కృతంలో ప్రేమాభిరామము వ్రాశాడు. దాన్ని అనుసరించి,

పెసుకొండ వల్లభామాత్యుడు క్రీడాభిరామము అనే రూపకాన్ని వ్రాస్తున్నాడు. ఇది దశ రూపకాలలో ఒకటి.

## దశ రూపకాలు

రంగస్థల ప్రదర్శనకు పనికి వచ్చే రచనలను రూపకాలని పిలుస్తారు. అవి పది విధాలుగా ఉంటాయి. (1) నాటకం (2) ప్రకరణం (3) అంకం (4) వ్యాయోగం (5) భాణం (6) సమవాకారం (7) వీధి (8) ప్రహసనం (9) డిమం (10) ఈహామృగం.

వల్లభామాత్యుడు వ్రాసిన క్రీడాభిరామం వీధి.

తన క్రీడాభిరామం సరిచూసి పెట్టమని వల్లభరాయుడు అడిగి ఉంటాడు. శ్రీనాథులవారు ఉదారంగా సరిచేసి కొంతా, స్వయంగా వ్రాసి కొంతా, వల్లభుడే యీ రచన చేశాడని నలుగురూ అనుకొనే రీతిలో ఆ పని చేసి పెట్టి ఉంటారు.

## దేశభాషలందు తెనుగులెస్స

ఇందులోనే తెలుగువారంతా పులకించే పద్యం ఉంది. దేశ భాషల్లో తేనెవంటి తెనుగు విశిష్టతను తెలుపుతుంది.

**జనని సంస్కృతంబు సకల భాషలకును - దేశ భాషలందు తెనుగు లెస్స**
**జగతి తల్లికంటె సౌభాగ్య సంపద - మెచ్చుటాడు బిడ్డ మేలుగాదె?**

( క్రీడా - 37 )

తొలిగా దేశభాషలందు తెనుగులెస్స అన్న ధీశాలి శ్రీనాథులవారు.

## కేతన రచనలు

మూలఘటిక కేతనకు అభినవ దండి అనే బిరుదు ఉంది. దండి సంస్కృతంలో గద్యంలో చెప్పిన దశకుమార చరిత్రను కేతన తెలుగులో గద్యపద్యాలున్న కావ్యంగా చెప్పాడు. ఇలా తెలుగులో తొలి కథా కావ్యం పుట్టింది. దీనిని తిక్కన గారికి అంకితమిచ్చాడు. ఇలాగే తెలుగులో తెలుగు భాష కొరకు "ఆంధ్ర భాషా భూషణం" అనే పేరుతో మొట్టమొదటి వ్యాకరణం వ్రాశాడు. మరో పుస్తకం "విజ్ఞానేశ్వరీయం", ఇది ధర్మ శాస్త్ర గ్రంథం. దీనిని యాజ్ఞవల్క్య స్మృతి అంటారు. దీనికే మితాక్షరి అనే పేరుతో ఒక వ్యాఖ్యానాన్ని విజ్ఞానేశ్వరుడు రచించాడు. దీనిని తెలుగులో అనువదించాడు కేతన. తెలుగులో తొలి కథా కావ్యాన్ని వ్రాయడమేగాక మొట్టమొదటి వ్యాకరణ గ్రంథాన్ని, ధర్మ శాస్త్రాన్ని రచించిన కేతన ధన్యుడు.

అంతటి మూల ఘటిక కేతన తన రచన 'ఆంధ్ర భాషా భూషణం'లో ఒక చక్కని పద్యం చెప్పాడు.

తల్లి సంస్కృతంబు యెల్ల భాషలకును - దాని వలన కొంత గానబడియె
గొంత తాస గలిగె నంతయు నేకమై - తెనుగు బాస నాగ వినుతి కెక్కె.

ఇక్కడ కూడా యెల్ల భాషలకు తల్లి సంస్కృతం అనటం సరికాదు. ఈ భావాన్నే శ్రీనాథులవారు గ్రహించి ఉండవచ్చు.

సంస్కృతం దేవభాష అని, అన్ని భాషలకు తల్లి అని ఆనాటివారు నమ్మి ఉంటారు. వారి వెనుక తరాలవారు - చాలా శతాబ్దాల వెనుక - ఒక భాషను సంస్కరించి సంస్కృతం చేశారు. అందువలన సంస్కృతం సహజమైన భాషకాదు. వైదిక మతానికి, రాజాస్థానాలకు పనికి వచ్చిన భాష. కాని అసలైనది ప్రాకృతం; వైదిక ప్రాకృతమే సంస్కరించబడి సంస్కృతమయింది.

అందువలన సకల భాషలకు సంస్కృతం తల్లి కాదు.

## క్రీడాభిరామం

వల్లభామాత్యుని చాటువులు ఒక్కటి కూడా దొరకలేదు. కాని క్రీడాభిరామం లభించటం తెలుగువారి అదృష్టం. అందులో అనేక విషయాలు అక్షరబద్ధమయినాయి.

ఇంతకు ముందు శ్రీకాకుళం తిరునాళ్ల సంగతి చెప్పాను. ఇక్కడ మరోపద్యం ఆ గ్రంథంలోనిది వ్రాస్తున్నాను. మన్మథుని పెచ్చిపనులు చూడండి.

జవరాలి బొడగన్న సన్యాసిపై నేయు దులసి లేజిగురాకు తూపు మరుడు,
వేద విప్రుని గన్న విధవపై ఝళిపించు దర్భ పల్లవ హేతి దర్పకుండు,
కటకారకుల కన్య గనిన హాళికు మీద బొడుచు పూ ములుకోల బుష్పశరుడు,
నాడింధముని గన్న నాతిపై నేయును అలరు జిచ్చుఱకోల నంగభవుడు,
బెరసి వెన్నెల కాయంగ బేరకమ్మ - పులిన తలముల నాయాయి కొలము లెఱిగి
తాల్చు శస్త్రాస్త్రములు జార దంపతులకు - నసమ బాణుండు తిరునాళ్ల నన్నినాళ్ల
(క్రీడ - 212)

మరో సీసంలో మరీ దారుణంగా స్వచ్ఛంద చారిణులకు కథానాయకుడు - దీవెనలిచ్చాడు. ఒకచోట "కొత్త లంజల కాముంద, ఉత్తముడవు" అని పిలుపించుకున్నాడు.

క్రీడాభిరామానికి బి.వి.సింగాచార్యగారు 'సమాలోకనము' అంటూ ముందుమాట వ్రాశారు. ఇది సరసతతో కూడిన సద్విమర్శ అని అనటానికి సందేహించవలసిన అవసరం లేదు. వారిలా అన్నారు "తెలుగులో ఇదొక గొప్ప కావ్యం. గొప్ప కావ్యానికి ఒక గొప్ప లక్షణం సమకాలిక ప్రజల జీవన విధానాలను ప్రతిఫలించటం. ఈ లక్షణం ఈ కావ్యానికి వచ్చినంతగా ఇంక ఏ ప్రాచీన తెలుగు కావ్యానికీ నప్పదు. ఏనాడో సంస్కృత పురాణ గాథానువాదమే సర్వ కవితా విధానంగా సాగుతూన్న సమయంలో రచితమైన ఈ కావ్యానికి ఈ అధునిక

కవితా లక్షణం అతకటం వింత".

ప్రభాకర శాస్త్రి గారు యీ గ్రంథాన్ని పరిష్కరించి 1928లోనే ముద్రించారు.

### చలికాల వర్ణన

క్రీడాభిరామంలో చలికాలపు వర్ణన పల్లెవాసులకు ఏనాటికీ సరిపోతుంది.

పక్కలు వంచి వంచి, ముని పండ్లను పండ్లను రాచిరాచి, ఔ
మ్మక్కిల జేసి చేసి, తల యల్లన కాళుల సందినంది, లో
చక్కికి నొక్కి నొక్కి ఇరుచంబడ, గుమ్మడి మూటకట్టి, పీ
పెక్కి దువాళి చేసి, చలియిక్కడనక్కడ బెట్టు వేకువన్ ( క్రీడా - 45 )

### కలగా పులగం

క్రీడాభిరామం కథలో ఓరుగల్లులో రెండవ ప్రతాపరుద్రుని పాలన (1296-1323) నాటి విశేషాలు వర్ణించబడినాయి. 'సర్వ జగత్ప్రసిద్ధ సుమనో బాణాసనామ్నాయ, విద్యోపాధ్యాయి, ప్రతాపరుద్ర ధరణీ శోపాత్త గోష్ఠీ, ప్రతిష్ఠాపారీణ' అయిన మాచల్దేవి అనే వారాంగన విశేషాలు వర్ణింపబడినాయి. ( క్రీడా - 180 )

క్రీడాభిరామంలో అంతకుముందున్న ఓరుగల్లు చరిత్రను - 120 సంవత్సరాల తర్వాత - అప్పుడే జరుగుతున్నట్లు వ్రాస్తూ సమకాలీన సంఘటనలను, సాంఘిక జీవితాన్ని చాలా వర్ణించారు.

క్రీడాభిరామం చరిత్ర రీత్యా వ్రాసింది కాదు. తోచినవి, చూసినవి, విన్నవి గుది గ్రుచ్చి, పచ్చి శృంగారాన్ని పనిగట్టుకొని వర్ణించి, 'వీథి' తయారు చేశారు. ఐతే కవితా చమత్కారం వలన ఈ రచన రసజ్ఞులను మురిపిస్తుంది. ఈ పద్యం చూడండి.

జాణ తనము గల్గి, సరసతయును గల్గి - తెలివి గల్గి, మోర తీరు గల్గి
చే యలంతి తనకు చేకూడినప్పుడు - వావివలదు లంజె వారి యింట
( క్రీడ - 253 )

ఇలా సలహా యిస్తాడు కథానాయకుడు మంచెన శర్మ. ఆనాటి శృంగార భావాల నన్వయించుకునే జారుల మనో గతాభిప్రాయాలను విడమరచి తెలుపుతుందీ రచన.

### శబ్ద చిత్రాలు

ఈ రచనలో జానపదుల నుడికారం చాలా కన్పిస్తుంది. అంటరాని వారని దూరంగా ఉంచిన అనేకమంది జానపదుల స్వరూప, స్వభావాలు వర్ణించబడినాయి. ఇలా యిదో మహత్తర గ్రంథం.

ఇందులో జక్కుల పురంధ్రి నృత్యరామణీయకమును సొగసుగా చిత్రించారు.

కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వని తార కంఠస్వరంబుతో గారవించ!
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను కొడుపుచే దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబు జూపంగ వలయుచో జెవిత్రాడు బిగియించు జీవగజ్జ
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప
రాగమున నుండి లంఘించు రాగమునకు - నురుమయూరు ద్వయంబుపై నొత్తి గిల్ల
గామవల్లీ మహాలక్ష్మి కైటభారి - వలపు పాడుచు వచ్చె జక్కుల పురంధి.

( క్రీడా 136 )

ఆంధ్రుల నృత్యారాధనలో తరువాత కాలంలో 'జక్కిణి' దరువు, జక్కుల నృత్యం క్రమేణా పెరిగాయి. యక్ష గానరూపం తీసుకున్నాయి. ఆనాటి పోకడలను అక్షరబద్ధం చేసిన మహనీయుడు శ్రీనాథులవారు.



## మార్గ దేశి నృత్యాలు

''పాటలు పాడించేటప్పుడు, ఆటలు ఆడించేటప్పుడు శ్రీనాథుడు పక్షపాతం లేకుండా దేశి, మార్గ రీతులు రెంటినీ పేర్కొంటాడు. వీధి నాటకాన్ని వ్రాశాడు. వీధుల్లో వినోదాలు వర్ణించాడు. మొగ్గవేసి అభంగిమలోనే నాలుకతో పూసలు గ్రుచ్చే దొమ్మరి పిల్లను మెచ్చుకున్నాడు. మేష యుద్ధాలను, కోడి పందాలలో ఓడిపోయిన వారి విలాపాన్నీ గ్రంథస్థం చేశాడు.'' అంటాడు ఆరుద్ర.

## వీర శైవారాధకులు

వీరశైవ ప్రభావంతో ఆంధ్రదేశంలో చంపుడు గుళ్లుండేవి. అలాంటి గుళ్లల్లో వీరశైవులు, వళ్ళు గగుర్పొడిచే విధంగా, భీకర కృత్యాలు చేసేవాళ్లు.

అవ అవ మండు నెఱ్ఱని చంద్రమల్లెల చోద్యంపు గుండాలు చొచ్చువారు,
కరవాడి యలుగుల గనప పాతర్లలో నుట్టి చేరులు కోసి యుఱుకు వారు
గాలంపుగొంకి గంకాళ చర్మము గ్రుచ్చి యుడు వీధి నుయ్యేల లూగువారు
కటికి హొన్నాళంబు గండకత్తెర పట్టి మిసిమింతులును గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు - యెడమ కుడిచేత నారతులిచ్చువారు
సాహసము మూర్తిగైకొన్న సరణివారు - ధీర హృదయులు మైలార వీరభటులు

( క్రీడ - 142 )

## క్రీడాభిరామ రచన

క్రీడాభిరామంలో ఆశ్వాసాంత గద్యంలో ఇలా ఉంది. "ఇది శ్రీమన్మహామంత్రి శేఖర వినుకొండ తిప్పయామాత్య నందన చందమాంబా గర్భపుణ్యోదయ, సుకవిజన విధేయ వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబను వీధి నాటకంబున సర్వంబు నేకాశ్వాసము".

ఇలా స్పష్టంగా ఉన్నా, యీ రచన శ్రీనాథులవారే వ్రాశారని వేటూరి ప్రభాకర శాస్త్రిగారన్నారు. ఇందుకు ఆధారంగా యీ రచనలోని చాలా పద్యాలను, పదబంధాలను శ్రీనాథులవారి యితర కావ్యాలలోని వాటితో పోల్చి చెప్పారు. శ్రీనాథులవారే వ్రాసి వల్లభరాయుని పేర పెట్టారని వారనటం, చాలా వరకు పండితలోకం నమ్మటం జరిగింది. ఇందులోని పచ్చి శృంగారం చూపించి శ్రీనాథుల వారిది వ్రాసి ఉండరనే వారు కూడా, వారి చేయి తగిలే ఉంటుందని నమ్ముతున్నారు. నేను ప్రారంభంలోనే మనవి చేసినట్లు వల్లభుడు వ్రాసినదానిని, శ్రీనాథులవారు సరిచూసి, సరిచేసి, తాను కొంత కలిపి, వల్లభుని రచనగా వదిలివేశారు.

ఇలా వ్రాస్తూ వెళ్తే చాలా దూరం వెళ్లాల్సి ఉంటుంది. మనం హంపీ విజయనగరం వెళ్తేగాని, శ్రీనాథులవారి చమత్కారాలు చూడలేము. బయలుదేరుదాము.

తన గ్రంథాన్ని చూసి, తానే మురిసి, మైమరచే రీతిలో తీర్చి దిద్దిన శ్రీనాథులవారి ఋణం తీర్చుకోలేనిదిగా ఉందని వల్లభుడు భావించాడు. శ్రీనాథులవారి మనసెరిగి ప్రయాణ సన్నాహాలు చేశాడు.

## ప్రయాణం

వల్లభామాత్యునికి హంపీ విజయనగరంలో చాలామంది ప్రముఖులు తెలుసు. అక్కడున్న ముమ్మకవితో బాగానే పరిచయం ఉంది. ఈ పరిచయాన్ని శ్రీనాథులవారికనుకూలంగా వల్లభామాత్యుడు ఉపయోగించి ఉంటాడు.

## రేనాటి వారు

శ్రీనాథులవారి మార్గంలో రేనాడు ఉంది. ఈ ప్రాంతం గుండా 'కుందు' నది ప్రవహిస్తుంది. రేనాటి ప్రజలు శ్రీనాథులవారిని ఘనంగా సన్మానించారు. అందుకానందించి కమ్మని పద్యం చెప్పి వారికి శాశ్వత కీర్తి సంతరించి పెట్టారు.

మందరాద్రి సములు మానవులందరు - చందమామ కూన లిందు ముఖులు
కందులేని మౌక్తి కంబులు జొన్నలు - కుందనంపు బెడ్డ కుందుగడ్డ

అంచెలంచెలుగా ప్రయాణం చేసి మన మహాకవి తన పరివారంతో విద్యానగరమైన విజయనగరంలో అడుగు పెట్టారు.

# పదమూడవ ప్రకరణము

## ముమ్మకవి దర్శనం

శ్రీనాథులవారు ఒక సుముహూర్తాన ముమ్మకవిని దర్శనం చేసుకున్నారు. తన కవితా శక్తిని వివరించి, ప్రౌఢదేవరాయల దర్శనం చేయించమని ఒక చాటువులో అర్థించారు.

పంపావిరూపాక్ష బహుజటా జూటికా రగ్వధ ప్రసవ సౌరభ్యములకు,
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా గంభీర ఘుమ ఘుమారంభములకు
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర ద్రాక్షాలతా ఫల స్తబకములకు,
కర్ణాట కామినీ కర్ణహాటక రత్న తాటంక యుగ ధాళ ధళ్యములకు
నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత - తెలుగునను సంస్కృతంబున బలుక నేర్తు
ప్రౌఢ దేవేంద్ర రాయ భూపాలవరుని- సమ్ముఖమ్మున దయజూడు ముమ్మసుకవి !

రాజ దర్శనం దొరకటం చాలా కష్టమైనపని. ఆ అవకాశాన్ని కల్పించమని అడుగుతున్న శ్రీనాథులవారి పద్యధారకు ముగ్ధుడైపోయాడు ముమ్మకవి. తప్పకుండా ప్రయత్నిస్తానన్నారు.

## దయలేని కన్నడ రాజ్యలక్ష్మి

రాజ దర్శనానికి ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి. పనిలో సఫలత కన్పించటం లేదు. ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్నట్లుంది. ఇష్టంలేక పోయినా శ్రీనాథులవారు సద్దుకుపోతూనే ఉన్నారు. ఐనా కన్నడ రాజ్యలక్ష్మికి దయరాలేదు. తన బాధలను చాటువుతో వెళ్లబుచ్చుకున్నారు.

కొల్లాయుంచితి, గోక సుట్టితి, మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ తిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా
చల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు బోనాడితిన్
తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుడన్

విజయనగర రాజవీధుల్లో, కవి పండిత చర్చల్లో శ్రీనాథులవారి చాటువులు ప్రచారమయ్యాయి. ముమ్మకవితో వెళ్ళి శ్రీనాథులవారు కూడా అనేక మందిని కలుసుకున్నారు.

## డిండిమ భట్టు

డిండిమభట్టు ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో ఉంటున్నాడు. కవిసార్వభౌముడనే బిరుదు ఉంది. ఈయన తాత తండ్రులు కూడా మంచి పండితులే. మాతామహుడు శైవ వేదాంత పారంగతుడు. డిండిమభట్టు అనే బిరుదాంకితుడు. అసలు పేరు

అరుణగిరినాథుడు.

తాతగారి వద్దనుండి అరుణగిరి నాథునకు కవిసార్వభౌమ బిరుదు విజయ డిండిమము లభించాయి. ఇతని గొప్పతనాన్ని తెలుపుతూ ఒక చాటువు ఉంది.

**అగ్రే డిండిమ తాండనం తతయితో వంది వ్రజో ద్ఘోషణం**
**ద్విత్రా శ్చిత్ర పటాః కియంతి బిరుద ప్రోతాని పద్యాని నః**
**ఆస్తాం తావదిదం మహేశ మకుటీకోటీర కల్లోలినీ**
**కల్లోల ప్రతిమల్ల సూక్తి విభవైర్ద్వేష్యాన్వి జేష్యా మహే॥**

శృంగార శ్రీనాథంలో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ శ్లోకాన్ని ఉత్పలమాలలో అనువదించారు.

**ముంగల జైత్ర డిండిమము మ్రోతలు; వంది జనస్తవార్భటుల్**
**చెంగట; రెండు మూడు తన చిత్తరువుల్; బిరుదాంకితంబు లిం**
**కంగల, వింతకంటె శితికంఠ శిరస్సరి దూర్మి భంగి వా**
**గ్భంగులెసంగు మాకు బ్రతిపక్ష బుధౌఘము నోడగొట్టగన్**

" (మాకు) ఎట్టయెదుట విజయ డిండిమము మ్రోయింపు; ఇటునటు వందిజనుల స్తోత్రములు: రెండుమూడు చిత్రపటములు (రూప ప్రతిబింబములు?) మఱికొన్ని బిరుదంకితములగు పద్యములు; గలవు. ఇవి యట్లుండ - పరమేశ్వరుని జటాజూటమునందు దొనకులాడు గంగానది తరంగములతో బ్రతిఘటింపజాలు సూక్తి వైభవములచే బ్రత్యర్థి పండితులను జయింతుము'' అని శ్లోకానువాదాన్ని చెప్పారు.

అరుణగిరినాథుని పాండిత్య ప్రకర్షకు, దర్పానికి అవధులు లేకుండా ఉన్నాయి. ఆర్భాటంగా అరుణగిరినాథుడు రాజ వీధులలో వెళ్లటం శ్రీనాథులవారు చూశారు. ఒకరోజు అనుకోకుండా కలిశారు.

## మాటకారి శ్రీనాథుడు

ప్రౌఢదేవరాయల వారి ఆస్థానంలోని కవి పండితలోకంలో అరుణగిరి నాథుడు ప్రధాన వ్యక్తి. తనకు అతనితోనే పోటీ ఉంది. అలాంటి వ్యక్తి లోతుపాతులు గ్రహించటం ముఖ్యం. వీలు చిక్కితే ఒక పట్టు పట్టిచూడటం అవసరం.

ఆ సమయం రానే వచ్చింది. కలసినపుడు మాటల సందర్భంలో "మీకేమి బిరుదులున్నాయి?'' అని అడిగాడు డిండిమభట్టు.

చమత్కారంగా శ్రీనాథులవారు బిరుదులదేముంది? కావలసింది ప్రతిభ అన్నట్లుగా తన బిరుదులు వెంటపెట్టుకొని రాలేదు అన్నారు. నీలాగా ఆ కంచు ఢక్కా వాయిస్తుంటే,

అందలంలో బజారుల వెంట తిరుగుతూ బిరుదులు చెప్పించుకొని పొగిడించుకోవటం నాకు నచ్చదనే హేళన ధ్వనించేలా చక్కని సమాధానం చాటువుతో ఇచ్చారు.

తరువున గాండీవం బిడడె ధర్మజునాన గిరీటి? యేను వా
క్సరసిజనేత్ర నానతి విచారము చొప్పున గర్వహీనతన్
మరల తెనుంగు భూమి కసమాన గతిన్ గొని పోవువాడ, నే
బిరుదులు నారి వాగుకడ బెట్టితి, సత్కవి సార్వభౌముడన్

శ్రీనాథులవారి అసామాన్య లౌకిక వచోరీతికి ఈ పద్యం మచ్చుతునక. మనోధర్మ విశ్లేషణకు పనికివచ్చే చక్కని పద్యం. ఈ పద్యాన్ని గూర్చి ఎంతైనా చెప్పవచ్చును.

మాట చమత్కారానికి భావ చమత్కారాన్ని జోడించి నెమ్మదిగా "నేనూ సత్కవి సార్వభౌముడనే"నని అన్నారు. అనటం కూడా అది బిరుదుగా గాక మాటవరుసకన్నట్లు విసిరారు.

అరుణగిరినాథునకు శ్రీనాథులవారెవరో తెలియకుండా ఉండటానికి వీల్లేదు. ఏయేరాజులవద్ద ఎలాంటివిద్యావంతులున్నారో దర్బారు ప్రముఖులకు తెలియకుండా ఉండదు. తమ తమ రంగాలలోని ప్రసిద్ధ వ్యక్తులను గూర్చి తెలుసుకోవటం, వారి పోకడలను అర్థం చేసుకోవటం వారందరికీ అవసరం.

## ప్రతిభా మూర్తులు

పడిపోయిన కొండవీటి ప్రాభవ చిహ్నంగా, గతకాలపు విద్యాధికారిగా, బహు గ్రంథ రచయితగా తన ముందు మందహాసంతో, నిర్భీతిగా నిలచిన పురుషమూర్తి పుంభావ సరస్వతి శ్రీనాథులవారి వచోవైభవం అరుణగిరినాథుడు గమనించాడు. తాను అప్రతిహతమైన విజయనగర సామ్రాజ్య రమారమణుడు శ్రీశ్రీశ్రీ ప్రౌఢ దేవరాయ ప్రభువుల ఆస్థాన పండితుడు. కవి సార్వభౌముడు. అహంకారం మూర్తీభవించిన గౌడ డిండిమ భట్టు ఊరుకుంటాడా? తన ప్రత్యర్థి తనకు అందకుండా చంపకమాలతో చెప్పాడు. తాను అర్థం చేసుకున్నాడు. అంచనా కట్టుకున్నాడు.

అరుణగిరినాథునకు ఆలోచించిన కొలది శ్రీనాథులవారిమీద విద్యా స్పర్థ పెరుగుతోంది. మరోవైపు గౌరవం ఇనుమడిస్తోంది.

ఆ రగడ అంతటితో ఆగలేదు. ఆ స్పర్థ విద్యానగర వీధులలో పడింది. చారులవలన దర్బారు ప్రముఖులకు తెలిసింది. మంత్రులవరకూ వెళ్లింది. ప్రౌఢదేవరాయలచెవిని పడింది. ఐనా ఆయన మాట్లాడలేదు. ఆహ్వానం పంపించలేదు. ఇందుకు అనేక కారణాలున్నాయి.

## గడుసుతనం

శ్రీనాథులవారు వచ్చినపని రాణ్మహేంద్రవర రాజరిక సుస్థిరత సంపాదించి పెట్టటానికి. కవుల వాదనలో గణుతికెక్కి, ప్రౌఢరాజేంద్రుని ప్రాపునొంది, కార్యం సాధించాలి. కుదరటం లేదు.

వచ్చిన పని కాకుండా తిరిగిపోవాలా? తప్పదా? ఎన్నాళ్లీ ఎదురు చూడటాలు? కవిరాజుకు కఠిన పరీక్ష అయింది.

తలవంచటం తెలియని కవి కంఠీరవుడు శ్రీనాథులవారు. తెగించి ఒక పద్యం వ్రాసి తిన్నగా ప్రౌఢదేవరాయలవారికి పంపించారు.

ఈ పద్యాన్ని జాగ్రత్తగా పరిశీలించటం అవసరం. శ్రీనాథులవారి వ్యక్తిత్వంలోని మహోన్నత లక్షణాలను పుణికి పుచ్చుకున్న పద్యం ఇది.

డంబు సూపి ధరాతలంబుపై తిరుగాడు కవి మీదగాని నా కవచమేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు కవి శిరస్సునగాని కాలు చాప
సంగీత సాహిత్య సరస విద్యల నేర్పు కవుల రొమ్ములుగాని కాల్పవిడువ
చదివి చెప్పగనేర్చి సభయందు విలసిల్లు కవి నోరుగాని వ్రక్కలుగదన్న
దంటకవులకు బలువైన యింటి మగడ - కవుల వాదంబు విన వేడ్క గల్గెనేని
నన్ను బిలిపింపు మా స్థాన సన్నిధికిని - లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

విశాల సామ్రాజ్యానికి అధిపతిగా ఉన్న ప్రౌఢరాయల వద్దకు, రాజాధిరాజ బిరుదాంకితుడైన మహారాజు వద్దకు, ఇలాంటి పద్యాన్ని వ్రాసి పంపటానికి అసామాన్యమైన ధైర్యం కావాలి. ఈ పద్య లేఖలో చతురత, వ్యవహార జ్ఞానంతోపాటు గడుసుతనం కన్పిస్తుంది. రాజసం విన్యసిస్తుంది.

ఇది ఒక సవాలు. "మీకు నిజంగానే కవుల వాదన వినాలనే కోరిక కలిగితే మమ్మ్మ పిలిపించండి. ఆపైన మా శక్తియుక్తులు చూడండి" అని రాజసంగా కవిరాజు రారాజుకు కబురుపెట్టటం, ఆ సవాలు తప్పుకోటానికి వీలులేకుండా ముందుగా తన శక్తి సామర్థ్యాలను చెప్పటం మరొకరి వల్ల అయ్యేపనికాదు. ఇలా నిర్భీతిగా చెప్పిన పద్యం, సంఘటన, ఆంధ్ర సాహిత్యంలోనే అపూర్వం. బహుశ యిదే మొదటిది కావచ్చు.

## ఆహ్వానం అందింది

చాణక్యత ఫలించింది. తప్పుకోటానికి, వాయిదా వేయటానికి వీలులేని విధంగా ఆ పద్యం నిలిచింది. విద్యానగర ప్రజలు కూడా ఈ వేడుక చూడముచ్చట పడుతున్నారు. ప్రౌఢదేవరాయలు ఆహ్వానం పంపించాడు. అందుకున్న శ్రీనాథులవారంగీకరించారు.

## కవుల వాదన

రాజగురువైన చంద్రభూషణ క్రియాశక్తి ఒడయరు మధ్యవర్తిగా ఉన్నాడు. కవులు, పండితులు, సైన్యాధిపతులు, వేదవేదాంగ పారంగతులు, వైయాకరణులు, దండనాథులు ఇంకా ఎందరో ప్రముఖులు, రసజ్ఞులు ఉన్న నిండుపేరోలగంలో, వాదన ప్రారంభమయింది ఎన్ని రోజులు సాగిందో ఏ విషయాలపైన సాగిందో తెలియదు. రెండు మదపుటేనుగులు ఢీకొన్న చందాన, రెండు ఆబోతులు కుమ్ముకునే రీతిలో వాదనలు ఉద్ధృతంగా సాగాయి.

అపార భాషాజ్ఞానం, బహుశాఖా సారసంగ్రహం, రాజనీతిజ్ఞత, సంచారానుభవం, విద్యాధికారిగా కూర్చుకున్న జ్ఞానం, వంటపట్టిన వాగ్వైభవ మూర్తి శ్రీనాథులవారు. ఐనా, గౌడ డిండిమభట్టు సామాన్యుడు కాడు.

ఇరువురూ ఉద్దండ పిండాలే. ఇరువురూ వయసు మళ్లుతున్న ప్రతిభాశాలురే ఇరువురూ అయఃపిండాలే.

## విజయం వరించింది

ఫలితం ప్రకటించారు. అరుణగిరి నాథుడు ఓడిపోయాడు. శ్రీనాథులవారు గెలిచారు. వెంటనే గౌడ డిండిమభట్టు కంచుఢక్క పగులగొట్టించారు.

వినయంగా "సత్కవిసార్వభౌముడన్" అన్న శ్రీనాథులవారు తన ప్రత్యర్థికున్న 'కవి సార్వభౌమ' బిరుదు తీసివేయించారు.

## కనక స్నానం

విజయనగరం విస్తుపోయింది. తేరుకొని ఆ తేజోమూర్తికి ప్రణామాలు చేసింది గడుసువారు కదా శ్రీనాథులు; ప్రభువు వంకచూసి ప్రణామాలు చేసి, చిరునగవుతొ లౌకికంగా చెప్పారు. "నేను తమను కీర్తించాలి. ఇంతకుముందు అనేకమంది చెడ్డ రాజులను స్తోత్రం చేశాను. ఆ దోషం పోయి వాక్శుద్ధి కలగాలి. అలా జరగటానికి కనక స్నానం చేయాలి" అన్నారు.

జన నాథోత్తమ! దేవరాయ నృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛన సంకాశ! మహాప్రభావ! హరి దక్షా రక్ష! నాబోటికిన్
కున్నృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగా
కనక స్నానము జేసిగాక పొగడంగా శక్యమే దేవరన్!

దక్షిణాధీశుడు తన ముత్యాల శాలలో ఘనంగా ఏర్పాట్లు చేయించాడు. దీనారటంకాల బంగారు కాసులతో తీర్థమాడించాడు. కనక స్నానం చేసిన కవి సార్వభౌముడు తృప్తిగా దేవరాయలవంక చూశారు. మనసులో చదువుల తల్లిని స్మరించారు. గొంతెత్తి స్తుతించారు.

**స్తుతించారు**

బోటీ భారతి ఆర్భటిన్ మెరయుమీ చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు ప్రౌఢదేవనృపతిన్ నాసీరథాటీ చమూ
కోటీ ఘోటక ధట్టికా ఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీ ధూత ధరారజ శ్చులుకి తాంభోధిన్ ప్రసంశించెదన్

శ్రీనాథులవారి నభిషేకించిన బంగారు నాణాలు ఇతరులు పంచుకున్నారు. ఆయన ఏవిధంగా ప్రశంసించారో కావ్యాలలో దొరకలేదు. అంతటి ప్రధాన ఘట్టాన్ని వివరించే పద్యాలు లభించకపోవటం దురదృష్టం.

కాని వారి చాటు పద్యమెకటి మాత్రం లభించింది.

ఖండేందు మౌళిపై గలహంసపాళిపై గర్పూర ధూళిపై కాలు ద్రవ్వ
మిన్నేటి తెరలపై మించు తామరలపై మహి మంచునుఱలపై మల్లరించు
జంభారి గజముపై చంద్రికా రజముపై చందన ధ్వజముపై చౌకళించు
ముత్యాల సరులపై మొల్ల క్రొవ్విరులపై ముదికల్పతరులపై మోహరించు
వెండిమల యెక్కి శేషాహి వెన్ను దన్ని - తొడరి దుగ్ధాబ్ధి తరగల తోడ నమరి
నెరతనం బాడి నీ కీర్తి నిండె న హహ - లక్షణోపేంద్ర దేవరాయక్షితీంద్ర

విద్యానగరంలో కొంతకాలం ఉండి రాచమర్యాదలననుభవించారు. తాను వచ్చిన రాచకార్యం చక్కబెట్టారు. రాణ్మహేంద్రవరం వారికి, విజయనగరం వారికి స్నేహ సంబంధాలను పెంచి, వడిదుడుకులు లేని పాలనను వీరభద్రారెడ్డి నెరవేర్చేందుకు తన పరిచయాలను ఉపయోగించారు.

ఐతే అంతటి మహానగరంలో ఉంటూ కవిసార్వభౌముడు ఏకావ్యమూ వ్రాయకుండా ఉంటారా? ఊహకందని విషయం కాదుగాని స్పష్టంగా చెప్పటానికి వీలులేదు. వారు వ్రాసే ఉంటారని నా నమ్మిక.

## పదునాల్గవ ప్రకరణము

### తిరుగు ప్రయాణం

తాను విజయనగరంలోనే ఉండవచ్చును. కాని ఆయనకు అది రుచించలేదు. తాను ఆంధ్ర దేశంలోనే ఉండాలి. రెడ్డి ప్రభువుల అంతరంగికుడుగానే మెలగాలి. చివరివరకు తెలుగునేల మీదనే బ్రతకాలి.

యాత్ర శుభప్రదంగా ముగిసింది. కాని మరో ప్రభుత్వం మిగిలిఉంది. అక్కడ కూడా విజయపతాకను ఎగురవేయాలి. తన ప్రభువు, మిత్రుడు అయిన పెదకోమటి

వేమారెడ్డికి సంబంధించిన "నందికంత పోతురాజు కఠారి" ఉంది. పైగా బొమ్మపెట్టి ఆయనను అవమానించారు. ఆ పనులు కూడా సాధిస్తే తన జన్మ తరిస్తుంది. ఋణం తీరుతుంది.

విజయనగర ప్రయాణంలో వెంటవున్న బావమరది దుగ్గన, మందిమార్బలంతో ప్రయాణానికి సిద్ధం చేశాడు.

## మొరస రాజ్యం

శ్రీనాథులవారు హంపీ విజయనగరం వెళ్లేటప్పుడు, అక్కడనుండి రాచకొండకు వెళ్లేటప్పుడు కర్నూలు మండలం గుండా వెళ్లవలసి ఉంటుంది. మొరము, గులకరాళ్లు ఎక్కువగా ఉండటం వలన ఈ ప్రాంతానికి మొరసు రాజ్యం అనే పేరుంది. ఆ ప్రాంతాన్ని, ప్రజలను పరిశీలించి చాటువులు చెప్పారు.

**గొంగడి, మేలు పచ్చడము, కుంపటి, నల్లులు, కుక్కి మంచమున్**
**చెంగట వాయుతైలము లజీర్ణపు మందులు ఉల్లిపాయలున్**
**ముంగిట వంటకట్టియల మోపులు, దోమలు, చీఱపోతులున్**
**రంగ! వివేకి కీ మొరసు రాజ్యపు కాపుర మెంత రోతరా!**

మరో పద్యం ఇలా అన్నారు.

**వంకర పొగలున్ నడుము వంగిన కత్తులు, మైలకోకలున్**
**సంకటి ముద్దలున్, జనుప శాకములున్, బలుపచ్చడంబులున్**
**డెంకగు నోర చూపులును దేకువ దప్పిన యేస బాసలున్**
**"అంకుల బ్రహ్మ" ఈ మొరసు రాజ్యము నెట్లు సృజించె నక్కటా!**

## సింగభూపాలుని కొలువు

శ్రీనాథులవారి కాలానికి రాచకొండలో ముమ్మడి సింగమనాయకుడు (1430-1475), దేవరకొండలో కుమార మాదానాయకుని కుమారుడు లింగమనేడు పాలిస్తున్నారు.

సింగభూపాల నామధేయము ఈ కుదురులో ముగ్గురకు ఉంది. అందువలన మూడవ వాడైన ఇతనికి ముమ్మడి సింగమ నాయకుడనే పేరు వచ్చింది. ఇతని పితామహుని వలెనే ఈయనకు కూడా సర్వజ్ఞ నామధేయం ఉంది.

లింగమనీడు తమ్ముడు వేదగిరినీడు. కుమార వేదగిరినీడు పెదకోమటి వేమారెడ్డి సోదరుడు మాచారెడ్డిని సంహరించి, తమ్మపడిగములో వేయించుకున్నాడు. పెదకోమటి వేముడు కుమారగిరిని సంహరించి తమ్మపడిగమున పొదిగించాడు.

లింగమనాయకుడు పంద్రెండవయేట దండెత్తివెళ్లి పెదకోమటి వేమారెడ్డిని సంహరించి, నందికంత పోతురాజుకఠారి తెచ్చాడని చెప్పుకున్నాం. ఇది 1420లో జరిగింది.

దక్షిణాధీశుని ముత్యాల శాల మర్యాదలయ్యాక శ్రీనాథులవారు రాచకొండ వెళ్ళారు. తమ బద్ధ శత్రువుల విద్యాధికారి రాపటం రేచెర్లవారికి కొంత యిబ్బంది కలిగే ఉంటుంది.

రావుసింగ భూపాలుడు మహాపండితుడు. రచయిత. హంపీ పాలకుడైన ప్రౌఢదేవరాయలుగాని, ఆనాటి దక్షిణాపథంలోని యితర రాజులుగాని అతని పాండిత్యాన్ని, రచనలను మించినవారు గాదు. రావు సింగభూపాలుడు రసార్ణవసుధాకరము, సంగీత రత్నాకరము వ్రాసి సర్వజ్ఞ బిరుదు దాల్చినవాడు, విశ్వేశ్వరాది కవి, పండిత పోషకుడు. ఈ కవిచే చమత్కార చంద్రిక వ్రాయించాడు. ఇందులో సింగన ప్రశస్తి చాలా ఉంది.

ముమ్మడి సింగమ నాయకుడు అన్ని మర్యాదలూ చేయించాడు.

## మనోధర్మం తెలిసిన మహనీయుడు

సింగ భూపాలుడు నిండు కొలువులో ఉండగా, కొలువు కూటమిలో కాలుపెట్టి, శ్రీనాథులవారు మంచిపద్యం చెప్పారు. ఆ సీస పద్యంలోని మొదటి మూడు పాదాలను గమనించండి.

**దీనార టంకాల తీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాల శాల**
**పగుల గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచుఢక్క**
**చంద్ర భూషణ క్రియాశక్తి రాయల యొద్ద పాదుకొల్పితి సార్వభౌమ బిరుదు**

ఈ పద్యంలోని నాలుగు పాదాలలో మూడు పాదాలు దక్షిణాధీశు దర్బారులో తాను సాధించినవి చెప్పారు. అవన్నీ యీ మధ్యకాలంలో జరిగినవి. నాలుగవ చరణంలో తన కృతులన్నిటిలోకీ ప్రౌఢంగా ఉండే శృంగార నైషధాన్ని నిలిపారు. శ్రీ హర్షుని నైషధానికి తాను శృంగారం అలది అలంకరించారు. పాండితీ ప్రకర్షకు ప్రతిబింబమైన యీ రచన సామాన్యమైనది కాదు. నైషధం విద్వదౌషధం కదా!

"పలుకుతోడై తాంధ్ర భాషా మహాకావ్య
నైషధ గ్రంథ సందర్భమునను" అన్నారు.

గొప్పగొప్పవాళ్లే తనను గౌరవించారు. తాను గొప్ప సాహిత్య సంగ్రామం చేసి విజయాన్ని సాధించారు. మహా రచన చేశారు. సోమరిపోతులకు మింగుడు పడని రచన. మేధావులు మెచ్చుకునే రచన. కాని సర్వజ్ఞ సింగ భూపాలుణ్ని మెప్పించటం సామాన్య విషయం కాదు.

"ఓ సరస్వతీ! రావు సింగ మహీపాలుడు ధీవిశాలుడు. వారి కొలువులో నీవు నెలకొని ఉన్నావు. తల్లీ! నన్నెలా కాపాడుతావో! అమ్మా! శారదాంబా!" అంటూ సమ్మోహనంగా చెప్పారు. ఆ పద్యభాగం చూడండి.

ఎటుల మెప్పించెదో నన్ను నింకమీద - రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు - సరస సద్గుణ నికురంబ! శారదాంబ!!

ఈ పద్యంలో, తన ఇతర గ్రంథాలను గాని, రెడ్డి రాజులనుగాని చెప్పలేదు.

ఓరుగల్లు నుండి ఈనాటి వరకు రెడ్డి, వెలమల కక్షలు చల్లారలేదు. ఆ విషయం కూలంకషంగా తెలిసిన శ్రీనాథులవారు కావాలనే చెప్పలేదు. రాజనీతి పారంగతుడైన శ్రీనాథులవారికి ఇలాంటివన్నీ గోలీలాటలే. గోరు ముద్దలే!

బలమైన విజయనగర సామ్రాజ్య పాలకుడు దక్షిణాధీశుడు. రాజాధిరాజ బిరుదాంకితుడు. తనను గారవించాడు. తాను వారి ముత్యాల శాలలో కనకాభిషేకం చేయించుకోగలిగారు. కాని సాహితీరంగంలో మీరు సర్వజ్ఞులు. పరమేశ్వరునంతటి వారు. అనే ధ్వనిని స్ఫురించేలా చేశారు.

సింగ భూపాలుడు ఆదరించాడు. ఆప్యాయంగా గౌరవించాడు. రాజమర్యాదలు జరిపించాడు. శ్రీనాథులవారు పద్యాలు కురిపించారు.

ఏమిచ్చెరా యోరి యెమ్ము లిచ్చెదధీచి యెమ్ములర్థులకు దాసొమ్ములగునె
మహిమ చెప్పెద వేరి మాంసమిచ్చెను శిబి కండలర్థులకు బంగారమగునె
జీమూత వాహనుండేమిచ్చెరా యోరి అడిగిన ప్రాణముల్ విడిచెనపుడు
కర్ణుని త్యాగంబు వర్ణించెదవు భట్ట చర్మమర్థికి పట్టు వస్త్రమగునె
పూనియవి చెప్పజూపగా రాని యీవు - లెన్నడో నాటి వార్తల కేమి చెప్ప
ప్రథన విజయుండు ఖడ్గ నారాయణుండు - ఇచ్చు కవులకు సింగ భూమీశ్వరుండు.

ఈ చాటువు శ్రీనాథులవారిదని, కాదని వాదన ఉంది.

సభ మెచ్చకుండా ఎలా ఉండగలదు. పొగడ్తలతో సభాసదులు, సర్వజ్ఞ సింగ భూపాలుడు మురిసిపోయారు.

ఆ సభలో ఒక సమస్యనిచ్చి పూరించమన్నారు. ఆ సమస్య "కుక్కవొ నక్కవో ఫణివొ క్రోతివొ పిల్లివొ బూతపిల్లివో". ఇంతకు ముందెచ్చటా ఇలాంటి సమస్యా పూరణాలు శ్రీనాథులవారికిచ్చినట్లు లేదు.

వారు పూరించారు.

దక్కక రావు సింగ వసుధావరు ధర్థుల కర్థమిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని, దధీచిని, ఖేచరు, వేల్పు మ్రాను, బెం
పెక్కిన కామధేనువు, శిబీంద్రుల నెన్నుదు భట్ట దిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోతివొ పిల్లివొ బూతపిల్లివో.

సర్వజ్ఞ సింగ భూపాలుని మీద మరో మారు కందంలో చెప్పారు.

సర్వజ్ఞ నామ ధేయము - శర్వునకే, రావు సింగ జనపాలునకే

యుర్వింజెల్లును, దక్కొరు - సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే!

తర్వాత కాలంలో ప్రత్యర్థులు బద్ధ శత్రువైన సింగభూపాలుని పొగిడి, యాచించి నందికంత పోతురాజు కఠారి తెచ్చావని ఎత్తిపొడిచిన వారికి తన పద్యాన్ని వాళ్లు సరిగా అర్థం చేసుకోలేదని యీ క్రింది విధంగా పద్యాన్ని విరిచి, చదివి వినిపించారట.

సర్వజ్ఞ నామధేయము - శర్వునకే; రావు సింగ జనపాలునకే

యుర్వింజెల్లును? దక్కొరు - సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే!

విమర్శకుల నోళ్లు మూతపడినాయి. శ్రీనాథులవారి ప్రజ్ఞాపాటవాలు ప్రస్ఫుటమయినాయి.

లింగమనేని మీద ఒక చాటువు ఉంది. ఇది ఎవరు చెప్పారో తెలియటం లేదు.

**బల్లరగండ లింగవిభు పాదమునందు బసిండియందె తా**

**ఘల్లురు ఘల్లు ఘల్లురని ఘల్లని మ్రోయగ భీతి గుండియల్**

**ఝల్లురు ఝల్లు ఝల్లురని ఝల్లున నల్లలలాడుచుందు రా**

**యల్లయరెడ్డి వేముడును నాతని తమ్ముడు వీరభద్రుడున్.**

**విజయాన్ని సాధించారు**

శ్రీనాథులవారి వచో వైభవానికి, ప్రతిభకు, పాండిత్యానికి పండితుడైన రావు సింగ మహీపాలుడు ముగ్ధుడయ్యాడు. మెచ్చుకున్నాడు. తన కోరిక తెలియజేస్తే, నెరవేరుస్తానన్నాడు.

శ్రీనాథులవారికి తన మిత్రుడు, ప్రభువు అయిన పెదకోమటి వేమారెడ్డి మనసులో మెదిలాడు. కొండవీటివారు పూజించి, సగర్వంగా ఎంచుకునే 'నందికంత పోతురాజు కఠారి' వెలమ ప్రభువు వద్ద ఉంది. కొండవీటి ప్రాభవ చిహ్నం అలా ఉండిపోవటం రాజమహేంద్రవర పాలకులకు కూడా తలవంపుగా ఉంది. ఈ కఠారిని తీసుకొని వెళ్లగలిగితే, పెదకోమటి వేమారెడ్డి ఋణాన్ని తీర్చుకున్నట్లవుతుంది. తనజీవితంతో ముడిపడిన గతకాలపు ప్రాభవం కొండవీడు. నేటి వైభవం రాజమహేంద్రవరం. తాను సాధించగలిగితే పంటరెడ్ల తలవంపు తీర్చినట్లవుతుంది.

చనిపోయిన వారిమీద పగలేమిటన్నారు శ్రీనాథులవారు. వెలమ ప్రభువులు ఆ భావాన్ని గ్రహించి కఠారి నందించారు. తమ్మపడిగలో బొమ్మ పెట్టటం మాని వేశారు.

శ్రీనాథుడు తిరుగు ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. తాను రెడ్లకు, వెలమలకు మిత్రత్వాన్ని కల్పించాలనుకున్నా అది సాధ్యం కాలేదు. కాని కఠారి తీసుకోవటం వలన కొంతవరకు ప్రశాంతత సమకూడింది. పరాభవం తుడిచివేయబడింది.

శ్రీనాథులవారు సర్వజ్ఞ సింగ భూపాలుని వద్దకు వెళ్లిన సంగతి వెల్గోటివారి వంశ చరిత్రలో ఉంది. నాగ్న జిత్తీయ పరిణయమను ప్రబంధములో గూడ ఈ ప్రశంస ఉంది.

ధన రాజ్యంబులు మాని నెమ్మది ప్రమోదంబంది తన్గోరు న
ట్టి నృపాలాగ్రణి కోర్కి తీర్చుట కకుంఠీభూత చేతస్కుడై
చని సాధించిన సత్కవి ప్రవరు రాజన్యాగ్రణీమాన్యు నే
బ్రణుతింతున్ బహుశైవ సంగధిత శుంభద్గాధు శ్రీనాథునిన్

నాగ్న జిత్తీయ పరిణయము వ్రాసిన వారు వల్లూరి నరసింహకవి. ఆ రచనలో పూర్వ కవిస్తుతిలో ఈ పద్యం ఉంది.

ఆంధ్ర సాహిత్య లోకంలో కనకాభిషేకం, కఠారి తీసుకురావటం శాశ్వత స్మృతులుగా మిగిలి ఉన్నాయి.

## పోతన



శ్రీనాథులవారికి, బమ్మెర పోతనామాత్యునికి బంధుత్వం ఉందని, లేదని వాదనలున్నాయి. ఉన్నదన్న వారు బావ-బావమరుదుల సంబంధం కల్పించారు. అనేక రసవత్తరపు సాహిత్య సంఘటనలు సృష్టించారు. లోతుగా పరిశీలించి నిజాన్ని వెలువరించాలనుకున్నా తేలే విషయం కాదు. భవిష్యత్తులో లభించే చారిత్రక సామగ్రి వలన సరియైన నిర్ణయం చేయవలసి ఉంటుంది.

ఐతే, సహజ కవి అయిన పోతన మీద శ్రీనాథ కృతంగా చాటువులు దొరకటం లేదు. తమ సమకాలీన జగత్తును రసవత్తరంగా చాటుధారతో ముంచెత్తిన కవిసార్వభౌములవారు పోతనామాత్యులను పద్యాలలో బంధించకుండా ఉండగలరా? తమ సునిశిత పరిహాసాలతో అలరించకుండా ఉండగలరా? భవిష్యత్తు నిర్ణయిస్తుంది. మనం అందాకా ఆగవలసిందే.

## పెద్దల అంచనాలు

బమ్మెర పోతనామాత్యుని కాలాన్ని అనేక మంది అంచనా గట్టారు.

| | |
|---|---|
| శ్రీ చాగంటి శేషయ్య | 1450 - 1510 |
| శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రి | 1410 - 1470 |

| | |
|---|---|
| శ్రీ నిడదవోలు వెంకట్రావు | 1410 - 1470 |
| శ్రీ ఏటుకూరి బలరామమూర్తి | 1400 - 1460 |

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు శ్రీనాథునికన్నా 15 లేక 20 సంవత్సరాలు చిన్నవాడన్నారు.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ 15వ శతాబ్ది ఉత్తరార్థం అన్నారు.

## ఇదే కాలంలో ఇతర పాలకుల వివరాలు

| | |
|---|---|
| సర్వజ్ఞ సింగన (మసోశ) | 1430 - 1475 |
| ప్రౌఢ దేవరాయలు | 1426 - 1446 |
| కపిలేశ్వర గజపతి | 1434 - 1468 |
| శ్రీనాథులవారు షుమారు | 1370 - 1450 |
| ఫిరోజ్ షా | 1397 - 1422 |
| అహ్మదుషా | 1422 - 1435 |
| రెండవ అల్లాఉద్దీన్ | 1435 - 1458 |

ఈ వివరాల వలన పోతనగారు 1410 - 1470 మధ్య జీవించి ఉంటారని భావిస్తున్నాను. సర్వజ్ఞ సింగ భూపాలుని వద్దకు యువకుడుగా వచ్చారని అనుకుందాం. 1430 ప్రాంతంనుండి ఉండి ఉండాలి. శ్రీనాథుడు 1435 ప్రాంతంలో హంపీ విజయనగరం నుండి రాచకొండ వెళ్లి ఉంటారు. అక్కడనే పోతనామాత్యుని కలవటానికి అవకాశం కలిగి ఉంటుంది. పోతనగారి రచనలు చూసి ఉంటారు. ఒకరి పోకడను మరొకరు అర్థం చేసుకొని ఉంటారు. మహా రచయితలైన యీ ఇరువురి భావాలు పరస్పరం ప్రభావితం చేయకుండా ఉంటాయా? వెంటనే కాకపోయినా పోతనామాత్యుని జీవన విధానము, ఆలోచనలు తన జీవిత చరమ సమయంలో తీవ్రంగా ఆలోచించేలా శ్రీనాథులవారిని చేసి ఉంటాయని భావిస్తున్నాను. ఈ విషయం తరువాత చెప్పుకుందాము.

## శ్రీనాథుని సలహా

తన రచనలను అంకితమిస్తూ ప్రభువులనాశ్రయించి, హాయిగా జీవించే శైలి శ్రీనాథులవారిది. మడిదున్నుకొని బ్రతికే సహజకవికి శ్రీనాథులవారో సలహా చెప్పారనే మాటఉంది. ఎప్పుడు జరిగిందో అంచనాలు లేవు.

ఆ సలహా చూడండి.

కమ్మని గ్రంథం బొక్కటి - ఇమ్ముగ నే నృపతికైన కృతి ఇచ్చినచో
కొమ్మని యీయరె అర్థం - బిమ్మహి దున్నంగనేల నిట్టి మహాత్ముల్.

ఐతే శృంగార శ్రీనాథులవారి సలహా పోతన కాదన్నా ఎక్కడో మనసు పొరలలో

దాగి, ఆర్థిక పరిస్థితి సరిలేని సమయంలో బయటకు దూకింది. మనసును లొంగదీసింది. ఆ క్షణంలో పోతనామాత్యులు నిగ్రహించుకున్నారు. అప్పుడు ఆంధ్ర కవితా జగత్తులో అద్భుతమయిన పద్యం ఆవిర్భవించింది.

## కాటుక కంటి నీరు

తాను ఎవరికైనా అంకితమివ్వాలనుకున్న బలహీన ఘడియలో, తన కనుల ముందు కలత వారినమోముతో, కన్నీటిధారతో నిలచిన చదువుల తల్లిని అనునయిస్తూ, పోతనామాత్యుని మెత్తని మనసు ద్రవించి, పద్యంగా రూపొందింది. ఆ స్పందనలో ఎంతలోతు ఉందో, ఎంత జాలి ఉందో చూడండి.

కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాకటికింగొనిపోయి, అల్ల క
ర్ణాట కిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఆ తరువాత పోతనామాత్యునికి యిలాంటి భావాలు ఏనాడు కలగలేదు. కలగకపోగా అలాంటివారిని 'పడుపు కూడు భుజించేవాళ్లుగా' భావించారు. అలా భావిస్తూ పోతనగారు పద్యం చెప్పారు.

బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
గూళలకిచ్చి అప్పడుపు కూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమల కందమూల గౌ
ద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై

పోతనగారికి షుమారు రెండు వందల సంవత్సరాలకు పూర్వం 'మంచెన' తన 'కేయూరబాహు' చరిత్రలో ఇలాంటి పద్యమే వ్రాశాడు. మంచెన పద్యం కొద్దిగా మారి పోతనగారి చాటువుగా ప్రచారాన్ని పొందింది.

## కర్ణాట కిరాట కీచకులు

మరో చిన్న విషయం చెపుతాను. 'కర్ణాట కిరాట కీచకుల కమ్మను' అన్నారు. ఎవరీ కర్ణాట కిరాట కీచకులు? కిరాటుడు అంటే వైశ్యుడని శబ్దరత్నాకరము, బ్రౌణ్యము చెపుతున్నాయి. సూర్యరాయాంధ్రమయితే వైశ్యుడు, మ్లేచ్ఛుడు అని అర్థం చెపుతోంది. కర్ణాట మ్లేచ్ఛుడైన కీచకుడెవరై ఉంటారు? ఆనాడు కర్ణాట ప్రాంతంలో కొంత, మరాట్వాడాలో కొంత, ఆంధ్ర దేశంలో తెలంగాణాలో అధికభాగం పాలిస్తున్నవారు బహమనీ సుల్తాన్ అహమ్మద్ శాహు. ఇతను 1424లో గోల్కొండ దుర్గంలో విడిది చేసి, ఖాన్ ఇ ఆజమ్ అతీఫ్ ఖాన్ అను సర్దారును ఓరుగల్లు మీదకు పంపించాడు. అతను ఓరుగల్లుతోపాటు

అనేక ప్రధాన దుర్గాలను స్వాధీనం చేసుకొని పరిసర ప్రాంతాలను పాడుచేశాడు. దేవాలయాలు నేలమట్టం చేశాడు. ఓరుగల్లు స్వాధీనం చేసుకొన్నపుడు అచట జరిగిన యుద్ధంలో ఏడువేల హిందువులతోపాటు ఆ దేశపురాజును చంపాడు. అతన్ని ఓరుగంటి పాలకుని చేసి, తెలంగాణా మొత్తం జయించమని అహమ్మదుశాహు ఖాన్ న్ను ఆదేశించాడు. ఖాన్ ఆపని నాలుగు నెలలోనే చేశాడని ఫెరిస్తా వ్రాశాడు. అది కాదని తెలంగాణాలో అడుగడుగునా పోరాటం జరుగుతూనే ఉందని, గోలకొండ కుత్బుశాహి వంశస్థాపకుడైన సుల్తాన్ కుల్లీ కుత్బుశాహు కాలంలోనే తెలంగాణాలో తురకారణ్యము స్థిరముగ నెలకొన్నదని డాక్టరు నేలకూరి వేంకట రమణయ్యగారు వ్రాశారు.

ఐతే రాచకొండ వెలమ ప్రభువులు అహమ్మదు శాహుకు కప్పం కడతామని సంధిచేసుకున్నారు. వెంటనే గుజరాతు, బహమన్ రాజ్యాల మధ్య యుద్ధం వచ్చింది. అహమ్మదు శాహు పరాజయం పొందాడు. అప్పుడు ఇమ్మడి అనపోతానాయకుని తమ్ముడు సింగమ నేడు విజృంభించి, బహ్మనీ సేనలనోడించి, ఓరుగంటిని మరల ఆక్రమించాడు.

1433లో బహమనీలు తెలంగాణాలోని రామగిరి మొదలగు దుర్గాలనాక్రమించారు.

ఈ పోరాటాలలో ముస్లింలు చేసిన విధ్వంసం స్వయంగా తెలుసుకున్న పోతనగారు "కర్ణాట కిరాట కీచకుల కమ్మను" అన్నారు. ఇది నా భావన; నా పరిశోధన.

శ్రీనాథులవారి పద్యాల పొంకాన్ని పోతనగారు గమనించారనేది స్పష్టమౌతోంది. భీమేశ్వర పురాణంలోని

" శ్రీ భీమనాయక శివ నామధేయంబు
జింతింప నేర్చిన జిహ్వ జిహ్వ"

అనే తృతీయాశ్వాసంలోని 198వ పద్యాన్ని పరిశీలించి, ఆ ఛాయలతో పోతనామాత్యుడు తన భాగవతంలో "కమలాక్షు నర్చించు కరములు కరములు" అనే పద్యం (7-169) వ్రాశారనే భావం చాలామంది పద్య ప్రియులు వెల్లడించారు. ఇలా మరికొన్ని ఉదాహరణలివ్వవచ్చును.

## పోతనగారి చాటువులు

శ్రీనాథులవారి మీద పోతనగారు చెప్పిన చాటువులు ఇంతవరకు ఒక్కటి కూడా లభించలేదు. పోతనగారివని చెప్పే చాటువులు రెండు, మూడిటికన్నా మించి ఉన్నట్లు కన్పించుట లేదు.

సింగభూపాలుని మీద పోతనగారిదని చెప్పబడుతున్న చాటువు ఉంది. ఏ సందర్భంలో దానిని చెప్పారో తెలియదు.

రసికులైనవారు రమణుల కొకవేళ - వంగుటెల్ల ధర్మ వర్తనంబు
ఈరసమున విల్లు నారికి వంగదా? - చిత్ర జాతరూప! సింగ భూప!

## భాగవతం

ఆంధ్ర మహాభాగవతాన్ని పోతనామాత్యుడు మానవ మాత్రునకెవ్వరికీ అంకితమివ్వలేదు. ప్రధమ స్కంధంలోనే, ఎత్తుకోవటమే "శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్. . .నందాంగనా డింభకున్" అన్నారు.(1). పోతనగారికి రామునికన్నా శ్రీకృష్ణుడంటేనే ప్రధమ ప్రేమ ఉన్నట్లుంది. ఆపైన "క్షోణీతలంబు నెన్నుదురు సోకగ"- "వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికి" మ్రొక్కుకున్నారు (6). 'మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్' నివ్వాలని' 'అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ' ను ప్రార్థించారు(8). ఆపైన కర్తృక భావాన్ని కాదని నిష్కామక్రియగా,

పలికెడిది భాగవతమట - పలికించు విభుండు రామభద్రుండట, నే
పలికిన భవహర మగునట - పలికెద వేరొండు గాథ పలుకగ నేలా! (16)

అన్నారు. ఇలా అనటం ఆయనకే చెల్లింది.

'నేనంధ్ర భాషన్ రచియింపంబూనిన' అంటూ 'శ్రీ మహా భాగవతంబునకు ప్రారంభం కావించారు .

పోతనగారి జీవిత విధానం, స్వతంత్ర భావాలు స్పష్టంగా కన్పించే పద్యం చదివాకయినా, శ్రీనాథులవారు తన జీవితాన్ని విశ్లేషించుకోకుండా ఉంటారా? చూద్దాం?

పోతనగారి పద్యం చూడండి.

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని, సొక్కి శరీరము వాసి, కాలు చే
సమ్మెట పోటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్ -

( శ్రీ మహా భాగవతము 1-11 )

# పదిహేనవ ప్రకరణము

## తిరుగు ప్రయాణం

హంపీ విజయనగరం, రాచకొండ దేవరకొండలలో విజయభేరి మ్రోగించిన కవిసార్వభౌములవారు తిరుగు ప్రయాణం ప్రారంభించారు. ఆయన దారిలో ఎవరెవరిని కలుసుకున్నారో, ఏమి చేశారో తెలియదు. చివరకు రాణ్మహేంద్రవరం చేరారు. తమకూ కొండవీటికీ పరమ శత్రువులైన రేచెర్ల వెలమల దగ్గరనుండి శ్రీనాథులవారు తెచ్చిన నందికంఠ

పోతురాజు కఠారిని వేమ, వీరభద్రారెడ్లు స్వీకరించారు. రెడ్ల పాలనకు కలిగిన అపకీర్తిని తొలగించి, ఆ వీరఖడ్గాన్ని తెచ్చిన శ్రీనాథులవారిని చూసి పొంగిపోయారు. హంపీ విజయనగరంలో సాధించిన విజయం సామాన్యమైనదికాదు. పైపెచ్చు తాము ఏదో రీతిలో హంపీ పాలకుల సామంతులుగా ఉంటున్న స్థితిలో, శ్రీనాథులవారు అక్కడి ప్రముఖులందరితో పరిచయాలు పొంది, గౌరవపురస్కారాలందుకోవటం, రాచకీయంగా రాజ్మహేంద్రవరానికి చాలా మంచిది. అవసరం కూడాను.

పంటరెండ్ల ప్రాభవ చిహ్నంగా శ్రీనాథులవారు బాగా ఎదిగారు. దక్షిణాధీశునితో అరమరికలు లేని పరిచయం కలిగింది. కనకాభిషేకం సామాన్య విషయం కాదు. అంతటి ప్రతిభాశాలిని తమ ఆస్థానంలో నిలుపుకొని, ఆదరించటం వేమ వీరభద్రారెడ్లకు అవసరం. కాబట్టి శ్రీనాథులవారికి సముచిత స్థానం కల్పించాలి. కల్పించారు.

## కాశీఖండం ప్రారంభించారు

సంతత పరమేశ్వరార్చన కళాశీలుండయిన శ్రీనాథులవారు హరవిలాసం, భీమఖండం రచించారు. తన భక్తి చాటుకున్నారు. స్కాంద పురాణంలో ఉన్న కాశీఖండం తెలుగులో వ్రాసి పరమేశ్వరుని పేర మూడు కావ్యాలు వ్రాసిన ఘనత పొందాలనుకున్నారు. తాను పెదకోమటి వేమారెడ్డి వెంట కాశీ వెళ్లి అన్నపూర్ణను, విశ్వేశ్వరుని సేవించి వచ్చారు. ఆ అనుభవాలన్నింటినీ సుమదామంగా కూర్చి కావ్యాలంకారం చేయాలనుకున్నారు. ఒక మంచిరోజున కాశీఖండం ప్రారంభించారు.

"చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు" అంటూ తన రచనా విన్యాసాలను చెప్పుకుంటూ "ప్రాయమెంతయు మిగుల గైవాలకుండ" కాశీఖండ రచన చేస్తానన్నారు.

ఈ వార్త పండితులలో, కవులలో సంచలనం కల్గించింది. అల్లాడ వేమారెడ్డి చెవిని పడింది. వీర భద్రారెడ్డికీ తెల్సింది. అన్నదమ్ములిద్దరూ ఆలోచించారు. ఆ గ్రంథాన్ని అంకితం తీసుకుంటే తమ కీర్తి శాశ్వతంగా ఉంటుందని వీరభద్రారెడ్డి భావించాడు.

అప్పుడు -

త్రైలోక్య విజయాభిధంబైన సౌధంబు చంద్ర శాలా ప్రవేశంబునందు
సచివ సైన్యాధీశ సామంత నృప వార సీమంతినీ జన శ్రేణి గొలువ
శాస్త్ర మీమాంసయు సాహిత్య గోష్ఠియు విద్వత్కవీంద్రులు విస్తరింప
కర్పూర కస్తూరికా సంకుమద గంధ సార సౌరభము దిక్పూరితముగ
నిజ భుజా విక్రమంబున నిఖిల దిశలు - గెలిచి, తను రాజ్య పీఠమెక్కించినట్టి
యన్న వేమేశ్వరు నిజాంక మాశ్రయించి -నిండు గొలువుండె గన్నుల పండువగుచు
( కాశీ. పీఠిక - 10 )

ఇలా కన్నులపండువుగా నిండుకొలువుండి శ్రీనాథులవారిని పిలువనంపారు. ఆపైన

ఈ క్షోణిన్నిను బోలు సత్కవులు లేరీ నేటి కాలంబునన్
ద్రాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజ ద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢ సాహిత్యముల్. ( కాశీ పీఠిక - 14 )

ఇక్కడ కొంచెం ఆగి చళుక్య భీమవరాన్ని గూర్చి తెలుసుకొన్న తర్వాత ముందుకు సాగుదాము.

## చాళుక్య భీమవరం

పిఠాపురంలో ఉన్న మల్లపదేవుని శిలాశాసనం వలన చాళుక్య భీముడు 360 యుద్ధాలలో విజయుడయి, తన పేరిట చాళుక్య భీమేశ్వర దేవుని ప్రతిష్ఠించి దేవాలయం నిర్మించాడని తెలుస్తోంది. అది చామర్లకోట సమీపంలో వుంది. ఆ గ్రామానికి పూర్వం చాళుక్య భీమ నగరి లేక చాళుక్య భీమ పట్టణమని పేరుండేదని శాసనం వలన తెలుస్తోందని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వ్రాశారు.

చాళుక్య భీమేశ్వరునికి, అల్లాడరెడ్డి భార్య జియ్య మల్లసానమ్మ కొంత భూమిని దానం చేసిందని చెప్పుకున్నాము. రెడ్డి రాజులు యీ దేవునీ ఆరాధించారు.

శ్రీనాథులవారి పద్యంలోని ద్రాక్షారామం, చళుక్య భీమవరం రెండూ శైవక్షేత్రాలు. వారకాంతల నివాసాలు.

## ఈ ప్రబంధము అంకితము చేయుము

తన తమ్ముడు అల్లాడ వీరభద్రారెడ్డి పేర ఒక కృతి చేసి యివ్వవలసిందిగా అన్నగారైన అల్లాడ వేమారెడ్డి అర్థించాడు -

వచియింతు వేముల వాడ భీమన భంగి నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాకృత్తు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాది మహాప్రబంధములు పెక్కు - చెప్పినాడవు మాకు నాశ్రితుడ వనఘ!
ఇపుడు చెప్పదొడంగిన ఈ ప్రబంధ - మంకితము సేయు వీరభద్రయ్య పేర
( కాశీ. పీఠిక - 13 )

ఆ తరువాత 'కర్పూర వసంత రాయండు వీరభద్రేశ్వరుండు కర్పూర తాంబూల సహితంబుగా జాంబూనదాంబరా భరణంబు'లిచ్చాడు.

కొండవీటి పాలకులతోనే కర్పూర వసంతరాయుల బిరుదు ఆగిపోలేదు. రాజమహేంద్రవరంలో కూడా రాణించింది.

శ్రీనాథులవారు సమాధానం చెప్పారు. కాశీఖండాన్ని వీరభద్రారెడ్డికి అంకితమివ్వటానికంగీకరించారు.

ఆంధ్ర క్షమామండలాఖండలుండైన వేమ భూపతి కృపావీక్షణంబు
ఘోడెరాయాంక సద్గురు రాజ భీమేశ్వర స్వామి పద సమారాధనంబు
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి చంద్రాంశు నవసుధా సారధార
వేదాద్రి నరసింహ విపుల వక్ష స్థలీ కల్హార మాలికా గంధలహరి
కారణంబులు నుద్బోధకములు గాగ - సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరు ప్రబంధ విభుని జేసి - కాశికా ఖండము దెనుంగుగా నొనర్తు"

( కాశీ. పీఠిక - 16 )

సామర్లకోటకైఫీయత్‌లో కోరుకొండలోని నరసింహస్వామియే వేదాద్రి నరసింహస్వామియని ఉన్నది. ఇందువలన, ఈ వేదాద్రి నరసింహుడు జగ్గయ్యపేట దగ్గరున్న వేదాద్రి క్షేత్రానికి సంబంధించిన నరసింహస్వామి కాదు. రాజమహేంద్రవరం దగ్గరున్న కోరుకొండలోని నరసింహస్వామియని చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు శ్రీనాథుని కవితా సమీక్ష ద్వితీయ సంపుటంలో, ఆముఖంలో వ్రాశారు.

శ్రీనాథులవారు అంకితం సంగతి అందంగా చెప్పారు.

కలిగె బదియాఱు వన్నె బంగారమునకు - పద్మ రాగంబుతోడి సంపర్క లబ్ధి
కాశికా ఖండమను మహాగ్రంథమునకు - నాయకుడు వీరభద్ర భూనాథుడగుట.

( కాశీ. పీఠిక - 17 )

కాటయ వేమారెడ్డికి పెదకోమటి వేమారెడ్డికి మధ్య రగిలిన సెగలు చల్లారి చాలా కాలమయింది. అవన్నీ గతకాలపు చరితలు. అందుకని నేడు "మనుతుల్యుండగు కాటభూవిభుని"అన్నారు. (పీఠి - 43)

## కాశీఖండం - అయఃపిండం

కాశీఖండం ఏ వడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా రచించారు. యౌవనంలో అద్భుతంగా శృంగార నైషధం వ్రాసిన శ్రీనాథులవారు జీవిత చరమ భాగంలో నిండుగా కాశీఖండం వ్రాయటం, ఈ రెండు గ్రంథాలు అనన్యసామాన్యం కావటం వారి జీవితంలో ప్రత్యేక సంఘటనలుగా భాసిస్తాయి.

వారు ఏకాగ్రతలో కాశీఖండం వ్రాశారు. ఇందులో యోగశాస్త్రం, మంత్రశాస్త్రం, సాముద్రిక శాస్త్రం మొదలగు వానిని చొప్పించారు. శృంగార నైషధం కన్నా కాశీఖండంలో పలుకుబడుల అందాలు విరివిగా ఉన్నాయి.

శృంగార నైషధాన్ని 'విద్వదౌషధం' అని, కాశీఖండాన్ని "అయఃపిండం" అని అన్నారు.

"అనన్యమైన తన ప్రతిభతో కాశీఖండంలో వ్రాసిన గుణనిధి కథలాగా మిగతా కథలన్నీ శ్రద్ధగా వ్రాస్తే, శ్రీనాథుడు తిక్కనగారికన్నా ఒక మెట్టుపైనే ఉండేవాడు. ఇంతటి శైలీసంపన్నుడు తెలుగు సాహిత్యంలో గ్రంథకర్తల శ్రేణిలో రెండవ తరగతివాడని కొందరనటానికి అశ్రద్ధయే కారణం" అంటారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. వారింకా యిలా అన్నారు. "తాను మోజుపడి చెప్పుకున్న నైషధంలో కూడా తిక్కన కవితాగుణముల గాఢ పాకముల మాటట్లుంచిన, కథ సుడితిరిగి మందగమనము చూపును. అయినను యితని సమ్మోహనమయిన ప్రతిభ ఎన్ని లోపములనైనను సురక్షితముగ మ్రింగి వేయును."

పింగళి లక్ష్మీకాంతంగారు ఆంధ్ర సాహిత్య చరిత్రలో కాశీ ఖండాన్ని గూర్చి ఇలా అన్నారు. "కవిసార్వభౌముని యుద్దండ శైలికి ఈ గ్రంథమే లక్ష్యభూతమయినది. నైషధాదుల యందు కానవచ్చు శయ్యా రామణీయకమునకు ఇయ్యెడనే పరిణామము కలిగెను. మరి ఇతని నానాశాస్త్ర పరిచయమునకు, లోకవృత్త పరిజ్ఞానమునకు, మానవ ప్రకృతి పరిశీలనకు ఈ గ్రంథమే సాక్షీభూతముగా పేర్కొనదగియున్నది". ( పుట - 403 )

కాశీఖండంలో ఆనాటి వీరశైవులు, మైలారుదేవులు చేసే ఆత్మ బలిదానాలు, చంపుడుగుళ్ళు, సతీ సహగమనాలు, సిడివేయటాలు వర్ణించబడినాయి. ఈ మాత్రమయినా జనజీవితాన్ని వర్ణించిన ప్రాచీనకవులు, ఒక్క శైవకవులుతప్ప, ఇంకెవ్వరూ లేనరవచ్చును.

ఒక విషయం గమనించాలి. శ్రీనాథులవారు ప్రజాకవికాదు, రాజకవి మాత్రమే. ఐనప్పటికీ ప్రజాజీవితంలో తాను స్పందించినంతవరకు తనకవితలో, ముఖ్యంగా చాటువులలో వర్ణించారు.

## తనంతటివాడు కల్గినన్

తనకు విద్యానగరంలో కలిగిన అనుభూతిని కాశీఖండంలో - కంటకుడైన శాత్రవుడొకండు - కలిగితే ఎలా వుంటుందో చెప్పిన తీరు చాలా గొప్పగా ఉంది.

కంటికి నిద్ర వచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటక మించునే? యితర వైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగల యట్టి మనుష్యున కెట్టివానికిన్
గంటకుఁడైన శాత్రవు డొకండుతనంతటివాఁడు కల్గినన్॥ ( కాశీ 108 )

## ఏడుపు వర్ణన

శ్రీనాథులవారు అన్నికులాల స్త్రీలను వర్ణించారు. సున్నితంగా, ఎబ్బెట్టుగా, సరసంగా, సుందరంగా ఎన్నోపదచిత్రాలతో స్త్రీలను చూపెట్టారు. ఆడపిల్ల ఏడుపు, పద్యంలో

బిగించి, ఆ తరువాత వచ్చిన అల్లసాని పెద్దనకు, ముక్కుతిమ్మనకు, భట్టుమూర్తి ప్రభృతులకు మార్గం చూపించారు.

కాశీఖండంలో ఆడపిల్ల దుఃఖవర్ణన చూడండి.

కొసరి వసంతకాలమున కోయిల గ్రోల్చిన భంగి నేడ్చె న
బ్బిసరుహ నేత్ర కొండచరి పెద్దయెలుంగున వెక్కి వెక్కి వె
క్కసమగు మన్యు వేగమున కాటుక కన్నుల నీరు సోనలై
యుసిరిక కాయలంతలు పయోధరముల్ దిగజారునట్లుగన్

( కాశీ 5 - 167 )

కాశీఖండాన్ని గూర్చి చాలా చెప్పవచ్చును. కాని ఈ రచనయొక్క ప్రధానోద్దేశం కావ్యవిమర్శ కాదు. అందువలన వదలి వేస్తున్నాను.

## వీరభద్రారెడ్డి సోదరుల మీద పద్యాలు

అనేక సందర్భాలలో శ్రీనాథులవారు తన ప్రభువులమీద చాటువులు చెప్పారు. రాజమహేంద్రవరపాలకులు మీద చెప్పిన పద్యాలు చూడండి.

దండయాత్రా ఘోష తమ్మట ధ్వనులచే గంతులు వేయించె గప్పకొండ
కితవ కాలాభీల కీలానలము చేత నేల పొంగడగించె బాలకొండ
ఆరట్టజా దట్ట హయ ధట్టముల చేత మట్టి తూర్పెత్తించె బొట్టునూరు
భూరి ప్రతాపాగ్ని బుటములు పెట్టించె విద్వేషులన గళా వెండిపురము
అనగ నుతికెక్కి తౌర! కేళాది రాయ! - అరుల పండువ మండువా యవన హరణ
భళిర ధూళియ మాళవ బందికార! - విజయ రఘురామ! అల్లాడ విభునివేమ!

(చా.ప.మ.మ. 96)

## వేమారెడ్డి మీద మరోపద్యం

వీర రసాతిరేక! రణ విశ్రుత! వేమ నరేంద్ర! నీయశం
బారభమాన తార కర హారసమానము; నీ భుజా మహం
బారభమాన తార కర హార సమానము; నీ పరాక్రమం
బారభమాన తార కర హార సమానము చిత్రమారయన్

పదాలకున్న నానార్థాలు వాడుకొని, మేధస్సును కేంద్రీకరించి కనికట్టు చేసి కూర్చిన గారడీ విద్య యీ పద్యం. కావ్యాలలో రెండు కథలు లేక మూడు కథలు ఒకేసారి నడుపుకుపోవటానికి ఈ గారడీ మేధస్సునే వాడారు. కొంత కుస్తీపడితేగాని ఈ పద్యం బోధపడదు.

ఇక్కడ మూడు పర్యాయాలు 'ఆరభమాన తార కర హార' అని వస్తుంది. మొదటి

పర్యాయం యశస్సును, రెండో పర్యాయం భుజ బలాన్ని, మూడోపర్యాయం పరాక్రమాన్ని పోల్చి చెప్పారు. మొదటి పర్యాయం పాదరసం, నక్షత్రాలు, సాటిలేని వెండివడగళ్లు, ముత్యపు దండల్లాగా తెల్లనైన యశస్సు కలవాడని అర్థం, రెండోసారి భుజ బలాన్ని సూచించేటప్పుడు, అంగారకుడు, అగ్ని, పగడం, మేరు పర్వతం, బంగారాలతో పోల్చదగిందని భావం. మూడోది పరాక్రమంగాబట్టి పరమేశ్వరునంత ఐశ్వర్యం గలవారైనా శత్రువులు ఆజ్ఞా బద్ధులై అర్పించే కానుకలకు, వీణాగాన సంకీర్తనకు నెలవైనదని అర్థం. (తెలుగు చాటువు పుట్టు పూర్వోత్తరాలు )

వేమారెడ్డి పరమేశ్వర భక్తుడు. ఆయన మీద మరో పద్యం ఉంది.

**కాంచీ శ్రీగిరి కాశీ - పంచారామాది దేవ భవనంబుల వ్రా**
**యించెను వేమక్ష్మాపతి - యంచిత భూదాన శాసనాక్షర పంక్తుల్.**

అమరారామం, క్షీరారామం, సోమారామం, కుమారా రామం, ద్రాక్షారామం - వీటిని పంచా రామాలనేవారు.

## పదహారవ ప్రకరణము

### దొడ్డారెడ్డి

ఈయన వేమ, వీరభద్రారెడ్ల తరువాత వాడు. బలపరాక్రమాదులు గలవాడు. గుర్రపుస్వారీలో చాలా గొప్పవాడు. "రాజకుంజర సింహము" అనే గుర్రాన్ని అధిరోహించి ఇరువది నాల్గు మూరల దూరం దూకించాడని శ్రీనాథులవారు కాశీఖండంలో వ్రాశారు.

హరి దాటించె ఖురోప కంఠమున వాహ్యాళి ప్రదేశంబునం
దరరే! యల్లయ రెడ్డి నందనుడు దొడ్డయ్య క్షమాధీశ్వరుం
డిరువై నాలుగు మూళ్ల మేర యను గోసెక్కింపగా నేల? య
ద్ధరణీ నాథుని కీర్తి దాటె గడు నుద్దండించి బ్రహ్మాండముల్ ( కాశీ - 53 )

నిశ్శంక కొమ్మన తన శివలీలా విలాసంలో కూడా యీ విషయాన్ని వర్ణించాడు.

అరెరే! అల్లయ దొడ్డ భూవిభుడు వాహారేహరేవంతు డిం
పరుదారన్వడి మూలగూరికడ వాహ్యాళిస్థలిన్ రాజకుం
జర సింహంబను వారువంబును యదృచ్ఛాలీల దాటింపడే
తిరమై ఇర్వది నాల్గుమూళ్ల నిడు వుత్సేకంబు చేయెత్తగన్

(అవతారిక 77, రెడ్డి సంచిక 374 పుట)

గుర్రపు స్వారీలో ప్రజ్ఞానిధి అయిన దొడ్డారెడ్డి తన అన్నలు వేమ, వీరభద్రారెడ్ల మాదిరిగానే సాహిత్య పోషణ చేశాడు. నిశ్శంక కొమ్మన వ్రాసిన శివలీలా విలాసం అనే

గ్రంథాన్ని అంకితం తీసుకున్నాడు. ఈ గ్రంథం వలన దొడ్డారెడ్డిని గూర్చి మనకు చాలా విషయాలు వివరంగా తెలుస్తున్నాయి.

ఆరుద్రగారు తమ సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో ఇలా వ్రాశారు. "పట్టిస గ్రామానికి దగ్గరలో ఉన్న పోలవరంలో మహానందీశ్వర దేవాలయం ఉంది. నిశ్శంక కొమ్మన దీనికి స్థానాధిపతిగా ఉండేవాడు. 1408 లో వేసిన శాసనం వలన ఇది తెలుస్తున్నది. ఇందులో, చోడ భక్తరాజు కుమారుడైన అన్నదేవుడు కొప్పాక గ్రామంలో కొన్న భూముల వివరణ ఉంది. ఈ భూములను అన్నదేవుడు మహానందీశ్వర లింగదేవుని ఆలయానికి దానమిచ్చాడు. అన్నదేవుని వద్ద కొమ్మన కవిగా ఉండి ఉంటాడు. అన్నదేవుణ్ని అల్లాడరెడ్డి 1415 యుద్ధంలో చంపివేశాడు. ఈ సంగ్రామంలో అల్లాడ రెడ్డి మూడవ కొడుకు దొడ్డారెడ్డి పాల్గొని ఉంటాడు".

శివలీలా విలాసంలో యీ పద్యం చూడండి.

స్తుతి చేయందగు నల్లడేంద్ర తనయున్ దొడ్డ క్షమాపాలకున్
హిత హేమాద్రి విశిష్ట దాన కలనా నిర్దిష్ట ధూనిర్ఝి తాం
చిత వాణిన్, స్థలవీథి ముక్త శిశిరగ్ర. . . ధారాపయన్
స్తుతి దూరీ ( 'ర?' ) ప్రతిఘాత చోడవ కృతాంత స్రావ రత్నాకరున్

( శివలీలా విలాసం అవతారిక 72 )

దొడ్డారెడ్డి అనేక యుద్ధాలలో పాల్గొన్నాడు. వడ్డాది, శృంగారంకోట, లోతుగడ్డ జయించాడు. శ్రీనాథులవారు కాశీఖండంలో వర్ణించిన తీరు ఈ విషయాన్ని వివరిస్తుంది.

**ఔరా! యల్లయరెడ్డి దొడ్డ వసుధాధ్యక్షుండు ధాటీ చమూ**
**భేరీ భాంకృతి ఘోర ఘోషమున నిర్భేదించె నొడ్డాది, శృం**
**గారం కోటయు, లోతుగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్**
**కీరాంభోధి తటంబునన్నిలిపె దిక్సీ మా జయస్తంభముల్** ( కాశీ పీఠిక - 52 )

అవి మామూలు యుద్ధాలు కావు. యుద్ధంలో శత్రువులు నేలకొరిగినపుడు అప్సరసలు ఆడిన విధానాన్ని కొమ్మన వ్రాశాడు.

ధృక్కర్యాధిప బాహు డల్లడ ధరిత్రీ నాథు దొడ్డాంకుచే
నుక్కాడన్ రిపుకోటి యాజిబడుచో నొప్పార (రు?) నాకంబులో
జక్కాకీటట డుడ్డుడూ ధణధణ ఝుంఝుం ధిమిం దిద్ధిమం
ధిక్కోత్తోణక కీర్ణ వాద్యములతో దివ్యాంగనా నృత్యముల్ ( శివలీల - 74 )

దొడ్డారెడ్డి "చాలా పురాణాలు విన్నాను. కాని సర్గవంశ చరిత్రలు మొదలైన వాటిచేత శివచరిత్రకు ఏకతము కల్గదు ఎంధు వినంగ. కాబట్టి కేవలం శివచరితం

వ్రాయమని" అడిగాడు. శివ లీలా విలాసం అవతారిక 30వ పద్యం చూడండి.

కేవల శివ చరితమునే - భావన వినగోరుదుం ప్రబంధ నిధాన
శ్రీవరలగ వినిపింపుము - భావరసాలంకృతాంధ్ర భాషా సరణిన్

( శివలీలా విలాసం అవతారిక 30 )

శ్రీనాథులవారు హరవిలాసంలో శివలీలలు కొన్ని చెప్పారు. నిశ్శంక కొమ్మన శివలీలలన్నిటిని గుది గుచ్చి, దొడ్డారెడ్డి కోరిక నెరవేర్చారు.

ఈ పుస్తకం పూర్తిగా దొరకలేదు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చెరో అసంపూర్ణ ప్రతిని సంపాదించగలిగారు. మల్లంపల్లి వారు తమ రెడ్డిరాజ్యాల చరిత్ర అనే ఆంగ్ల గ్రంథంలో అనుబంధంగా ప్రకటించారు.

శివలీలా విలాసంలో 73వ పద్యం దొడ్డారెడ్డిని గూర్చి వివరిస్తుంది.

ఎడప కాగ్రహములు విడువని నృపతులు వీడరు (విడుతురు?) నిజరాజ్య విహరణములు
సొలవ కాజ్ఞలు సేయ జొరని భూరమణులు చొత్తు రుగ్రాచల స్థూల గుహలు
కడక కప్పంబు లీగానని నృపతులు గొంతురు నానాస్త్ర ఘర్షణములు
వరుస పాదములకు వ్రాలని జన విభుల్ వ్రాలుదు రాజి ధరా తలమున
దన సముద్దండ జైత్ర యాత్రా ప్రతిష్ఠ - భూరి భేరీ భణంకార ఘోర రవము
నఖిల దిక్కుల దళుకొత్తు నప్పుడనిన - బొగడనేల నల్లయదొడ్డ భూపమణిని

( శివలీలా 73 )

వీరభద్రారెడ్డి ప్రతి సంవత్సరం వసంతోత్సవాలు చేయించేవాడని నిశ్శంక కొమ్మన శివలీలా విలాసంలో వ్రాశాడు.

కాశీఖండంలో అల్లాడ వేమారెడ్డి దండయాత్రలను గూర్చి పద్యాలున్నాయి.

సప్తమాడియ రాయ చంద్రబింబాననా చికుర వల్లరులపై జిన్నిపువ్వు
ఝూడె జంతుర్నాటి జననాథ శుద్ధాంత కుచ కుంభములమీది కుంకుమంబు
బారహ దొంతి భూపాల లీలావతీ గండ స్థలంబుల గలికి నవ్వు
కలుప పల్క్యోడ్డాది కటకాధిపతి వధూ సీమంత వీథుల జేరుచుక్క
యల్లడాధీశు వేమక్ష్మాధినాథు - భూరినిష్ఠుర ధాటీ విహార చటుల
సైన్య నాసీర తుక్ఖార శఫపుటోత్థ - వింధ్య పార్శ్వ వసుంధరా విపుల ధూళి

( కాశీ పీఠిక - 34 )

కొంచెం అర్థం కూడా చెప్పుకుందాం.

అల్లయ వేమారెడ్డి దండయాత్రలు చేశాడు. సేనల ముందు గుర్రపుదండు ఉండేది. గుర్రాల గిట్టలనుండి దుమ్మురేచేది. అలా లేచిన వింధ్య పార్శ్వ సీమల యందలి కెంధూళి

'మాండెము' ప్రభువు యొక్క అంతఃపుర స్త్రీల శిరోజాలలో అలంకరించుకునే 'చిన్నిపువ్వు' అనే నగగా ఉంది. ఈనాటి శృంగవరపు కోట ప్రాంతాన్ని శ్రీనాథులవారి కాలంలో 'జంతుర్నాడు' అని పిలచేవారు. ఆ జంతుర్నాడు పాలకుల రాణివాసపు కుచ కుంభముల మీద అలదిన కుంకుమముగా ప్రకాశించింది. బారహదొంతి అనగా వరుసగా ఉన్న మన్యపు రాజ్యాలు. బారహదొంతి మన్యపు రాజుల విలాసవతుల చెక్కిళ్ల మీద అందమైన నవ్వుగా ఉంది. కలువపల్లి, వడ్డాది, కటకాధిపతుల అంతఃపుర వధువుల పాపటలలో చేర్చుక్కలుగా ఉంది. అనగా వేమారెడ్డి ఈ దేశాలనన్నిటినీ జయించాడని శ్రీనాథులవారు చాలా అందంగా పద్యం కట్టారు.

ఇక్కడ ధూళిని శ్రీనాథులవారు వర్ణించారు. భవిష్యత్తులో కృష్ణరాయలు తన కళింగ జైత్రయాత్రను "తోకచిచ్చు"గా చెప్పారు.

మరో పద్యం చూడండి.

పండువా సురథాణి పావడం బంపిన భద్రేభములు వీట బాళెముండు
నొడ్డె ధాత్రీనాథు డుపద పుత్తెంచిన బింబాధరోష్ఠి సంబెళ వహించు
కర్ణాట భూపతి కానుక యనిపిన ముక్తాత పత్రంబు మ్రోల మెఱయు
యవనాధిపతి యుపాయనముగా నొసగిన పాగా హయంబులు వాగె వచ్చు
దూరమంతంత బారుహదొంతి మన్నె
సప్తమాడియ రాజన్య సమితి మ్రొక్కు
రాయవేశ్యాభుజంగ సంగ్రామ పార్థ
గాయగోవాళ వేమన క్ష్మాధవునకు (భీమ 1 - 38) ( కాశీ పీఠిక - 35 )

ఈ పద్యం భీమేశ్వర పురాణంలోనూ, కాశీఖండం పీఠికలోనూ ఉంది. శ్రీనాథులవారు కావాలనే రెండు కావ్యాలలో వేమారెడ్డి ఘనకీర్తిని నిలిపారు.

రాయ వేశ్యాభుజంగ, సంగ్రామ పార్థ, గాయగోవాళ మొదలగు బిరుదులు గల అల్లయ వేమారెడ్డి భూపాలునకు పండువాసుల్తాను కానుకగా పంపిన భద్రజాతి యేనుగులు రాజవీథిలో విడిచి ఉంటాయి. ఓఢ్రదేశపురాజు కానుకగా పంపించిన ఎర్రని పెదవులు గల అందగత్తె తాంబూల కరండమును పట్టుకొని ఉంటుంది. కర్ణాటాధీశ్వరుడు కానుకగా పంపించిన ముత్యాల గొడుగు మ్రోలనే మెరుస్తూ ఉంటుంది. యవనాధిపతి (బసుళ గుల్బర్గా పాలిస్తున్న బహమనీ రాజు) నజరాణగా పంపిన గుర్రాలు హయశాలనుండి కళ్లెలతో వస్తుంటాయి. బారహదొంతి మన్యముల మన్నీంద్రులను, ఏడుమాడెముల కొండ దొరలును, దూరదూరంగా నిలబడి (భయభక్తులతో) మోకరిల్లుతూ ఉంటారు.

ఇలా వేమారెడ్డిని కీర్తించారు శ్రీనాథులవారు.

## వీరభద్రారెడ్డి

వేమారెడ్డి విజయ కీర్తులను, శివారాధనను మనసారా వర్ణించిన శ్రీనాథులవారు వీరభద్రారెడ్డి విశేషాలు చెప్పారు.

ఇంతకుముందు కాటయ వేమారెడ్డి కుమార్తె అనితల్లిని వీరభద్రారెడ్డి వివాహం చేసుకున్నాడని చెప్పుకున్నాం. వీరభద్రారెడ్డి అలా రాజమహేంద్రవర రాజ్యపాలకుడయ్యాడని అనుకున్నాం. శ్రీనాథులవారి కాశీఖండం కృతి అందుకున్న వీరభద్రారెడ్డి మీద చెప్పిన పద్యం చూడండి.

మకర కుండల దివ్య మాణిక్య దీప్తులు చెక్కుటద్దములపై జీరువాఱ
డాకాలి గండపెండారంబు దాపున బొమ్మలై వైరి భూభుజులు వ్రేల
గమియంగ నలదిన కస్తూరి నెత్తావి యష్టదిక్కుల యందు నవఘళింప
మొగము చూచిన మాత్ర మూర్ధాభిషిక్తులు మోడ్పు జేతులు మస్తముల ఘటింప
మెఱుగు దీగెల బోలు భామినులు గొలువ - నిండు కొలువుండె గన్నుల పండువగుచు
రాయవేశ్యాభుజంగ, వీర ప్రతాప - విభవు డల్లాడ భూపతి వీరవిభుడు

( కాశీ పీఠిక - 45 )

చెవులకు పెట్టుకున్న మకర కుండలాలతో పొదిగిన మాణిక్యముల కాంతులు చెక్కిళ్లమీద కదలుతుండగా, ఎడమకాలికి వేసుకున్న గండపెండారము ప్రక్కన బొమ్మలుగా శత్రురాజులు వ్రేలాడుతుండగా, వంటినిండా అలదిన కస్తూరి వాసనలు ఎనిమిది దిశలలోనూ వ్యాపిస్తుండగా, మోము చూసినంతనే రాజులు తలలమీద చేతులు జోడించి ఉండగా, రెండువైపులా మెరపు తీగలవంటి అందాల వనితలు నిలబడి కొలుస్తుండగా కన్నుల పండువుగా వీరభద్ర భూపాలుడు కొలువుతీరి ఉన్నాడు.

ద్వితీయాశ్వాసాంతములో వ్రాసిన మత్తేభంలో (165) "ఉత్కల, కర్ణాట, తురుష్క రాట్పరమ మిత్రా!" అని సంబోధించారు.

అప్పటికి దక్షిణ భారతదేశంలో ప్రధానంగా ఉన్న ముగ్గురు పాలకులతో స్నేహంగా వేమ వీర భద్రారెడ్లు రాజమహేంద్రవర పాలనను లౌకికంగా సాగిస్తున్నారు. కాని అనువంశిక రాజ్యం మాదిరిగా రేచెర్లవారితో శత్రుత్వం నడుస్తూనే ఉంది.

ఇలాగే తృతీయా శ్వాసంలో "కర్ణాటోత్కల పారశీక నృప సఖ్య ప్రాభవ శ్రీనిధీ" (248) అన్నారు.

మరల కాశీఖండం పరిశీలిద్దాం.

అల్లాడరెడ్డి నలుగురు పుత్రులలో వేమారెడ్డి, వీర భద్రారెడ్డి, దొడ్డారెడ్డి విశేషాలు తెలుసుకున్నాము. ఇక నాల్గవ కుమారుడు అన్నారెడ్డిని గూర్చి కొంత చెప్పుకుందాం.

**అన్నారెడ్డి**

సరి యేరీ? జలరాశి వేష్టిత మహీ చక్రంబునన్వి క్రమా
పరగాండీవికి జక్రవాళ మహిభృత్పర్యంత విశ్వంభరో
ద్ధరణ ప్రౌఢ భుజాభుజంగ మునకున్ ధాత్రీశు లల్లాడ భూ
వరు నన్నయ్య కకుంఠ వాఙ్మయ కళా వైకుంఠ రాట్పుయ్యకున్

( కాశీ పీఠిక - 54 )

అన్నయరెడ్డి సామాన్యుడు కాదు. పరాక్రమంలో అర్జుననంతటివాడు. భూభారమంతా మోస్తున్న శేషుని వంటి బాహువులు గలవాడు. భాషా పాండిత్యంలో విష్ణుమూర్తికి శయ్యగాఉండే శేషునకు సముడు. ఇలాంటి అన్నయ్యకు సాటియైన రాజులు సముద్రాలు చుట్టి వున్న భూ వలయంలో ఎక్కడున్నారు? అనగా ఎక్కడా లేరని చెప్పటం.

పంటరెడ్ల వివరాలు ఇలా కాశీఖండంలో వ్రాయటం షష్ట్యంతములలో మరికొంత వివరణలివ్వటంవలన రెడ్డిరాజుల చరిత్ర మనకు తెలుస్తోంది. ఇలా శ్రీనాథులవారు తనను ఆదరించిన పంటభూపతులకు శాశ్వతత్వం తెచ్చిపెట్టారు. ఎఱ్ఱనగారు కూడా వీరిని గూర్చి వ్రాసిన సంగతి ముందుగానే చెప్పుకున్నాం.

మనం ఆ కాలపు ప్రముఖులను పరిశీలిద్దాము.

**విస్సన మంత్రి**

ఈయన విశేషాలు తెలియటం లేదు. ఎవరివద్ద మంత్రిగా ఉన్నారో, ఏమేమి కావ్యాలు అందుకున్నారో తెలియటం లేదు. కాని శ్రీనాథులవారు "స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మరి హేమ పాత్రాన్నమెవ్వరి పంక్తి గుడుతు?" అన్నారు.

విస్సన మంత్రి ఆర్థికంగా బలమైనవాడు కావటమేగాక సాహిత్య ప్రియుడయి ఉండాలి. లేకుంటే శ్రీనాథులవారి బంధువైనా అయి ఉండాలి. అందుకే ఆదరించి, ప్రక్కన కూర్చోబెట్టుకొని, బంగారు పళ్లెంలో భోజనం పెట్టించాడు.

విస్సన ఆతిథ్యం శ్రీనాథులవారిని రంజింపజేసింది. అవసాన దశలో కూడా మరచిపోలేని రీతిలో మనసులో ముద్ర వేసింది. ధన్యుడు విస్సనమంత్రి.

**రాయని భాస్కరుడు**

కాటయ వేమారెడ్డి వద్ద రాయని భాస్కరుడు మంత్రిగా ఉన్నట్లు ఒక చాటు పద్యం వలన తెలుస్తోంది.

కలయ పసిండి ఘంటమున గాటయ వేమ సమక్షమందు స
త్ఫలముగ రాయన ప్రభుని బాచడు వ్రాసిన వ్రాల మ్రోతలున్

గలుగలు గల్లుగల్లురన గంటక మంత్రుల గుండె లన్నియున్
జలుజలు జల్లుజల్లురనె సత్కవి వర్యులు మేలు మేలన్
( కొండవీటి సామ్రాజ్యము - పుట 59 )

శ్రీనాథులవారు తన చివరిదశలో "భాస్కరుడు మున్నె దేవుని పాలికరిగె"నని వాపోయారు. వారి స్నేహబంధమలాంటిది.

రాయని భాస్కరుని పేర అనేకమంది ఉన్నారు. ముప్పది ఇద్దరు మంత్రుల సీసమాలికలో పేర్కొనబడిన రాయని భాస్కరుడు ఈయనో కాదో తేలలేదు.

**కాటమరాజు కథ**

సింహపురి పాలకుడైన మనుమసిద్ధికి, నెఱగడ్డపాటి యేలిక కాటమరాజుకు యుద్ధం జరిగింది. పుల్లరి యిస్తానని ఒడంబడిక చేసుకొని, కాటమరాజు తన పశువులను మనుమ సిద్ధి బీళ్లల్లో మేపుకున్నాడు. తన కోడెదూడలలో నష్టం వచ్చిందని పుల్లరి యివ్వలేదు. చివరకు సోమశిల వద్ద భీకర సంగ్రామం జరిగింది. మనుమసిద్ధి తరపున ఖడ్గ తిక్కన యుద్ధానికి వెళ్లాడు. ఓడిపోయి తిరిగి వచ్చాడు. స్నానానికి దొడ్లోనీళ్లుంచి పసుపుముద్ద పెట్టటం, అన్నంలో విరిగిన పాలు పోయటం పద్యాలుగా వచ్చాయి. ఖడ్గతిక్కన రోషం తెచ్చుకొని తిరిగి రణరంగానికి వెళ్లి పోరాడి చనిపోయాడు. ఈయన కవితిక్కనకు బంధువు.

ఈ కథను శ్రీనాథులవారు ద్విపదగా వ్రాశారనే వాదన వుంది. కథాకాలం పదమూడవ శతాబ్దం.

శ్రీనాథులవారి పలనాటి వీరచరిత్రలో ఉన్న పట్టు ఇందులో లేదు. పలనాటి వీరుల మీద చెప్పిన చాటువుల వంటివి ఒక్కటీ దొరకలేదు. రచన చాలాపేలవంగా ఉంది.

పినమల్లయ్య అనే రచయిత తన రచనలో శ్రీనాథులవారే దాన్ని వ్రాశారని చెప్పిన ద్విపద పాదాలు చూడండి.

"వలనొప్పు శ్రీనాథు వచన పద్ధతిని
సలిపెడు యదు శాస్త్ర చరిత మంతయును
వినుపింతు యాదవ వీరుల చరిత" మన్నారు.

మరొకరు "శ్రీనాథుడను కవి శ్రేష్ఠుండు ద్విపదగా రచియించె కాటమరాజు చరిత" అన్నారు.

ఎవరేమి వ్రాసినా కాటమరాజు కథ కవిసార్వభౌమ శ్రీనాథులవారు వ్రాయలేదు. వారి శైలి అమృతధార. లేకుంటే శ్రీనాథులవారిపేరు మీద ఎవరో అనామకుడు వ్రాసిఉండ వచ్చును.

# పదిహేడవ ప్రకరణము

## మరో యాత్ర

భారతదేశంలో పంచ శైవ మఠాలున్నాయి. అవి (1) వారణాశి (2) కేదార (3) కాళహస్తి (4) పట్టిసం (5) శ్రీశైలం

శ్రీశైలంలోని శైవమఠానికి చాలా ప్రత్యేకత ఉంది. అక్కడ ఉన్న పండితారాధ్య పీఠాన్ని పాలిస్తూ భిక్షావృత్తి మఠం ఉంది. భిక్షావృత్తి మఠానికి అధిపతి 'శాంత భిక్షా వృత్తి' యతీంద్రుడు. ఈయన మూల భృత్యుడు పువ్వుల శాంతయ్య.

శాంత భిక్షావృత్తి యతీంద్రులకు సాహిత్యాభిలాష ఉంది. శివకవుల తర్వాత శైవ సాహిత్యంలో ఊపు తగ్గింది. క్రొత్త రచనలు తక్కువగా వచ్చాయి. ఒక్క శ్రీనాథులవారు మాత్రమే హర విలాసం, భీమఖండం, కాశీ ఖండం వ్రాశారు. ఈ మూడు గ్రంథాలు మంచిపేరు తెచ్చుకున్నాయి.

శాంత భిక్ష యతీశ్వరులు యివన్నీ గమనించారు. అద్భుత కవితా శక్తిగల శ్రీనాథులవారితో శైవానికి అనుకూలంగా మంచి పుస్తకం వ్రాయించాలనుకున్నాడు. శ్రీనాథులవారిని శ్రీశైలం రావలసిందిగా ఆహ్వానం పంపించాడు.

## శివరాత్రి మాహాత్మ్యం

శ్రీనాథులవారు శిష్య సమేతంగా శ్రీశైలం వెళ్లారు. మల్లికార్జున స్వామిని, భ్రమరాంబను సేవించారు. రెడ్డిరాజులు నిర్మించిన సోపానాలు చూశారు. వీరశిరోమండపం దర్శించారు. దేవాలయ ప్రాకారం మీద చెక్కిన శివలీలలు, శైవగాథలు చూశారు.

యతీంద్రుడు సాదరంగా, తన మూల భృత్యుడైన పువ్వుల శాంతయ్య పేర శివరాత్రి మాహాత్మ్యం రచింపమని అడిగాడు. శ్రీనాథులవా రంగీకరించారు.

ఇది ఐదు ఆశ్వాసాల రచన. గతంలో ఈ గ్రంథం పూర్తిగా లభించలేదు. లభించినంతవరకు ఆంధ్ర సాహిత్య పరిషత్‌వారు ప్రచురించారు. ఈ మధ్య పూర్తి గ్రంథం దొరికింది.

ఈశాన సంహితలో అతి సంగ్రహంగా ఉన్న కథను ప్రబంధంగా మలచారు. ఈ రచనలో ఆనాటి సాంఘిక పరిస్థితులున్నాయి. సామాజిక జీవన ప్రతిబింబంగా వ్రాశారు. దీనిని 1995లో తెలుగు విశ్వ విద్యాలయంవారు ముద్రించారు.

ఈ రచన 1448కి అటూయిటుగా వ్రాసి ఉంటారు. రాణ్మహేంద్రవరం 1448లో కటకంవారి స్వాధీనమయింది. సారవంతమయిన కృష్ణ, గోదావరి ప్రాంతాలను ఆక్రమించాలనే కోరికతోనే అనేక యుద్ధాలు జరిగాయి. వాటిలో భాగంగానే గజపతుల

దండయాత్రలు వచ్చాయి.

## రాజకీయాలలో మార్పు

ఇంతకు ముందు కళింగ పాలకుడు 4వ భాను దేవుడు (1409 - 1434) వెలమ ప్రభువుల సాయంతో రాణ్మహేంద్రవరం మీద దండయాత్ర చేయటం చెప్పుకున్నాము. ఆ సమయంలో భానుదేవుడు వీరభద్రారెడ్డిని ఓడించి సామంతుని చేసుకున్నాడు. కళింగసేనలు అంతటితో ఆగలేదు. కృష్ణానదిని దాటి, విజయనగరం వారి క్రిందనున్న కొండవీటిని ఆక్రమించాయి.

ఆ తర్వాత ప్రౌఢ దేవరాయలు తిరిగి కొండవీడు నాక్రమించాడు. రాజమండ్రిని వశపరచుకున్నాడు. వీరభద్రారెడ్డి సామంతుడయ్యాడని కూడా చెప్పుకున్నాం.

## కపిలేశ్వర గజపతి (1435 - 68)

ఈయన గంగ వంశపు భానుదేవుని వద్ద మంత్రిగా ఉండేవాడు. భానుదేవుడు రెడ్డి రాజ్యం మీద దండయాత్రకు వెళ్లినపుడు, కపిలేశ్వర గజపతి సింహాసనాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఇది 1434లో జరిగింది. 1435 జూన్ 29న పట్టాభిషేకం చేసుకున్నాడు.

కటకంవారి సైన్యాలు 1444లో రాణ్మహేంద్రవరం మీదకొచ్చాయి. ప్రౌఢ దేవరాయలు తన ప్రధానియైన మల్లప్ప ఒడయరును సైన్యంతో పంపించాడు. ఒడయరు శాసనం ద్రాక్షారామంలో 1444లో ఉంది. అందులో తాను రాజమహేంద్రవరానికి అధిపతియైనట్లు చెప్పుకున్నాడు. అనగా కపిలేశ్వర గజపతి ఓడిపోయి వెనుకకు తగ్గినట్లు భావించాలి.

అల్లాడ వీరభద్రారెడ్డి పాలన ఎలా సాగిందో ఊహించుకోవలసిందే. బహుశ నామమాత్రపు సామంతుడుగా నిలచి ఉండవచ్చును.

ప్రౌఢ దేవరాయలు 1446లో చనిపోయాక ఆయన కుమారుడు మల్లికార్జునరాయలు (1447-65) రాజ్యానికొచ్చాడు. అసమర్థుడైన ఈయన పాలన వలన గజపతులు విజృంభించారు

## హంవీరుడు

కపిలేంద్ర గజపతి కుమారుడు హంవీరుడు 1448లో రాజమండ్రి నాక్రమించాడు. ఆతర్వాత కంజీవరం వరకు క్రమేణా జయించాడు.

కపిలేశ్వర గజపతి తమ్ముడు పరశురాముడు. ఇతని కుమారుడైన రాఘవదేవ నరేంద్రుని రాణ్మహేంద్రవరానికి తన ప్రతినిధిగా కపిలేంద్ర గజపతి నియమించాడు.

ఈ వార్తలు శ్రీశైలం చేరుకున్నాయి. శ్రీనాథులవారి మనసు కలత బారింది. ఘంట

నడవలేదు. ధార పలచబారింది. ఘుమఘుమలు సన్నగిల్లాయి. కవితా శిల్పం కొరవడింది. శరీర పటుత్వం సన్నగిల్లింది.

ఎలాగైతేనేమి శివరాత్రి మాహాత్మ్యం పూర్తి చేశాననిపించారు.

భవిష్యత్తేమిటనే ప్రశ్న మరోమారు ఎదుట నిలచింది.

## తిరుగు ప్రయాణం

మల్లికార్జున స్వామికి నమస్కరించి, శ్రీనాథులవారు గృహోన్ముఖులైనారు. ఆయన గృహ విశేషాలు యింతవరకు పూర్తిగా తెలియలేదు.

శ్రీనాథులవారి అత్తవారి గ్రామం దగ్గుమిల్లి. ఇది నేటి గుడివాడ దగ్గర ఉంది. బిడ్డలెంతమందో తెలియదు. ఒక ఆడపిల్లను మాత్రం కొండవీటిలోనే యిచ్చారు. ఆమె కొడుకును తానే పెంచారు. పెద్దవాణ్ని చేశారు.

భార్యపేరు తెలియటంలేదు. ఒక బావమరది దుగ్గన. మంచికవి. శ్రీనాథులవారి వెంట పర్యటనలు చేశాడని అంటారు.

దుగ్గన శ్రీనాథులవారి బావమరదులలో మూడవవాడు. శ్రీనాథులవారిని గురువుగా ఆరాధించాడు. కవితారీతులు నేర్చుకున్నాడు.

దుగ్గన తన నాసికేతోపాఖ్యానంలో గంగయ మంత్రి అనే ఆయన శ్రీనాథుని పొగడి కావ్యం వ్రాసి తనకు అంకితం యివ్వమని తనను అడిగినట్లు వ్రాశాడు.

"కవి సార్వభౌముడై కర్ణాట విభుచేత కనక రత్నాభిషేకములు గనిన
శ్రీనాథ సుకవి కూరిమి చేయుమఱదివి దుగ్గయ కవిరాజ! . . . . ."

ఇలాగే ఆశ్వాసాంత గద్యంలో కూడా వుంది. "ఇది శ్రీమత్కమల నాభ పౌత్ర, మారయామాత్య పుత్ర, కవి సార్వభౌమ, సకల విద్యా సనాథ, శ్రీనాథ మహాకవీంద్ర ప్రసాద లబ్ధ కవితా విశేష దగ్గుబల్లి తిప్పనార్య ప్రియతనూజ దుగ్గన నామధేయ. . ." అని ఉంది.

దుగ్గన శివ కాంచీ మాహాత్మ్యం, నాసికేతోపాఖ్యానం వ్రాశాడు.

మిగతా బంధువుల విశేషాలు తెలియటం లేదు.

శ్రీనాథులవారితో శివరాత్రి మాహాత్మ్యం వ్రాయించిన శాంతభిక్షావృత్తి యతీంద్రుడు, గౌరన కవి చేత నవనాథ చరిత్ర వ్రాయించాడు. ఈ గ్రంథం మల్లికార్జున దేవునికి అంకితం యిచ్చాడు. గౌరన సంస్కృతం బాగా చదువుకున్నాడు. శ్రీనాథులవారి మాదిరిగా తత్సమ సమాసాలు గుప్పించలేదు. సంస్కృత తెలుగు వ్రాయలేదు. జాను తెనుగు కమ్మగా వ్రాశాడు.

శ్రీనాథులవారి భవిష్యత్తు విషయం చెప్పుకునే ముందు, రెడ్డి రాజుల పాలనను అంచనా వేసుకుందాం.

కొర్లపాటి శ్రీరామమూర్తిగారు శ్రీనాథుడు అనే తన పరిశోధన గ్రంథంలో యిలా వ్రాశారు.

"సమష్టిపై రెడ్డి రాజ్యము సముజ్వలము. రెడ్డిరాజులు వీర శిఖామణులు. అంతేకాదు; ధిషణాధురంధరులు. పరమ భక్తులు. విష్ణుభక్తి విలసితులైన ఈశ్వరార్చన కళా శీలురు. ప్రజా రాజ్యముతో పాటు కళా సామ్రాజ్యము నేలిన రసిక వీరులు. కొందరు స్వయము కోవిదులు. అందరు కోవిద పోషకులు. అంతేకాదు; సంస్కృతాంధ్ర సాహిత్యముల భాగ్య సౌభాగ్యములు వారి వైభవ ప్రాభవములు. సరస్వతీ దేవి కచ్ఛపీ నిక్వణములు కంకణ ధ్వనులైన కాలమది. ఏతన్మహనీయ సాహితీ విహాయసమున సహస్ర కిరణుడై వెలుగొందినది సకల విద్యా సనాథుడు కవిసార్వభౌముడు శ్రీనాథుడు." ( పుట - 46 )

## పదునెనిమిదవ ప్రకరణము

### కాలం కాటేసింది

ఆంధ్రదేశం తిరిగి వచ్చిన శ్రీనాథులవారు ఎక్కడకు వెళ్లినట్లు?

దేశం పరిస్థితి చాలా మారిపోయింది. ఎటువైపు చూసినా చెడువార్తలే విన్పిస్తున్నాయి. గతంలో ఉన్న గ్రామాధికారులు, అనుకూలురైన రాజోద్యోగులు యీనాడు లేరు. వ్యతిరేకత గలవారు పాలనాధికారం చేత బట్టుకున్నారు. కొండవీడు, రాజమండ్రి పాలనలలో శ్రీనాథులవారు కవి రాజుగానే గాక, అధికార దర్పాన్ని కూడా అలవరచుకున్నారు. రాజమహేంద్రవరాన్ని ఆక్రమించిన గజపతుల పాలనలో తన అభిమానులలో చాలామంది పదవులను కోల్పోయారు. ఆయన వ్యతిరేక వర్గం తలెత్తి బుస కొడుతోంది. అవకాశం కొరకు ఎదురు చూస్తోంది. బ్రాహ్మణ్యంలో కూడా కొంతమంది ఆయన విమర్శల వలన కలత చెంది, కత్తి నూరుక కూర్చున్నారు. అవకాశంకొరకు చూస్తున్నారు.

### పేదరికం

తన పేర అగ్రహారాలు లేవు. తాను అలా ఆశించలేదు. రాజసం ఊపిరిగా ఉన్న కవిసార్వభౌముడాయన. ఈనాడు తాను పోషించవలసిన బంధువులు, పరిజనం చాలామంది ఉన్నారు. తన అలవాట్లు రాజసంతో కూడినవి; భోగలాలసతో నిండినవి. తనను గౌరవించి. సత్కరించి, సంభావించి, తన స్నేహం అమూల్యమైనదని అఖండ ఖ్యాతినందిస్తుందని భావించిన వారంతా ఇహలోకాన్ని వదిలారు. మిగిలినవారు రాజ్యాన్ని పోగొట్టుకున్నారు. ఇప్పుడు తానేం చేయాలి? శేషజీవితం గౌరవప్రదంగా ఎలా గడపాలి?

వారి మనసులో పోతనామాత్యులు మెదిలారు. నిర్మలమైన చిరునగవుతో, సహజ కవితారూపంతో తన వంక చూస్తున్నట్లుంది. వారి చిరునగవులో ఏదో భావమున్నట్లుంది

తన జీవితాన్ని చూసి వారేమనుకుంటున్నారో? పోతనగారి పద్యం స్ఫురించింది.

"బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
గూళలకిచ్చి అప్పడుపు కూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైననేమి? . . . . "

"చిన్నవాడవైనా పెద్దమాట చెప్పావయ్యా !" అనుకున్నారు. "పడుపు కూడు భుజించుట కంటె" ఎంత సూటిగా, ఘాటుగా చెప్పావయ్యా? ఎన్నిరాజ్యాలు తిరిగాడీ శ్రీనాథుడు! ఎన్ని మన్ననలను పొందాడీ కవిరాజు! సభా ప్రాంగణాలు దద్దరిల్లజేసి, ఎన్ని సత్కారాలు పొందాడీ కవిసార్వభౌముడు! అవన్నీ ఏమైనాయి? ఆ సంపదంతా ఏమయింది?"

శ్రీనాథులవారికి మనసంతా పోటెత్తిన సాగరంగా ఉంది. తుఫాను అలల మాదిరిగా భావాలు కల్లోల పరుస్తున్నాయి. ఆ దశలో వారికి కావలసింది ప్రశాంతత. ఆటుపోటులు లేని నిర్మల శాంత జీవనం.

ఆ ఆలోచనలలో పోతనామాత్యుడు వారికి ఆదర్శంగా కన్పించాడేమో! ఘంటాన్ని చేబూని కవితా వ్యవసాయంలో శృంగార నైషధాన్ని, కాశీ ఖండాన్ని తెనుగువారి కందించి దేశభాషలందు తెనుగులెస్స అన్న మహనీయుడు ఇకపై కవితా వ్యవసాయంమాని, పొలాలు దున్నించి పండించాలనుకున్నారు. వెంటనే మనుషులను పంపించారు. నేటి అమరావతికి దగ్గరలో కృష్ణానది మధ్యనున్న బొడ్డుపల్లిని కౌలుకు తీసుకున్నారు. ఏకసాల్ కౌలుకు ఏడు నూర్లటంకాలు చెల్లించాలి.

బాపన సేద్యం కలిసిరాలేదు. కృష్ణకు వరదలొచ్చాయి. తొలిపంట తుడుచుక పోయింది. విత్తనం కూడా చేతికి రాలేదు. మరల దున్నించి విత్తించారు. విత్తనం అంటలేదు. మొలక లోనే పురుగు నాకిపోయింది. అక్కడక్కడా నువ్వు పెసర మొక్కలు ఫరవాలేదనిపించాయి. పంటకొచ్చింది. పిట్టలు వ్రాలాయి. గింజ మిగలకుండా తినిపోయాయి. చేతికి చిట్టెడు గింజలు రాలేదు. కాని కౌలు చెల్లించాలి. ఏడు నూర్ల టంకాలు. ఒకటా రెండా! ఏడు నూర్ల టంకాలు!!



కృష్ణానదిలో అమరావతికి పడమరగా ఎద్దువాగు అనే కొండవాగు ఉంది. అకాల వర్షాల వలన వాగు పొంగి బొడ్డుపల్లి పంటచేలను తుడిచివేసింది. శ్రీనాథులవారు వాడిన "గొడ్డేరి" అనే పదం యీ వాగువలననే వాడి ఉండవచ్చునని, ఇంకా పూర్తిగా యిదేనని చెప్పలేమని మా మిత్రులు వావిలాల సుబ్బారావుగారు సందేహం వెలిబుచ్చారు.

శ్రీనాథులవారు కౌలునకు తీసికొనిన బొడ్డుపల్లి, అమరావతి ప్రక్కన కృష్ణలో ఉండేదని, ఆ లంక కొట్టుక పోయిందని బొడ్డుపల్లి పురుషోత్తంగారు ధ్రువీకరించారు.

ఇంతకుముందే చెప్పినట్లుగా రాఘవదేవ నరేంద్రుడు రాజమండ్రినుండి కపిలేశ్వర గజపతి తరపున రాజప్రతినిధిగా పాలిస్తున్నాడు. విజయవాడ, కొండవీడు వారి క్రిందనేవున్నాయి. ఈ ప్రాంతాన్ని ఎవరి క్రింద ఉంచారో తెలియదు.

## కష్టకాలం

కౌలు చెల్లించమని యొత్తిడి పెరిగింది. అమ్మి కట్టాలన్నా అమ్మదగిన వస్తువులుగాని, బంగారంగాని లేవు. ఏనాటి కానాడు రాజులు, దండనాథులిచ్చినది విరజిమ్మిన శ్రీనాథులవారికి రేపేమిటనే యోచన ఉన్నట్లు లేదు. అప్రయత్నంగా ఆ కష్టకాలంలో బాధనంతా ఒక పద్యంగా వెలిబుచ్చారు.

కాశికా విశ్వేశు గలసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయడిచ్చు
కైలాసగిరి బంట మైలారు విభుడేగె దిన వెచ్చ మేరాజు తీర్చగలడు
రంభగూడె తెనుంగు రాయరాహుత్తుండు కస్తూరి కేరాజు బ్రస్తుతింతు
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మఱి హేమ పాత్రాన్న మెవ్వని పంక్తి గలుగు
భాస్కరుడు మున్నె దేవుని పాలి కరిగె
కలియుగంబున నికనుండ కష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగు చున్నాడు శ్రీనాథు డమరపురికి

అనారోగ్యం, వార్ధక్యం కన్నా ఆ మహనీయుని ఆర్థిక దుస్థితి బాగా క్రుంగదీసింది. బకాయి బాధ జీవితంలో ప్రథమంగా వారు అనుభవించారు. ఆ క్లిష్ట సమయంలో తన వారందరూ గుర్తొచ్చారు. ఆ దైన్యస్థితిలో కూడా వారిని రాజసం వదలలేదు. అది జన్మతః వచ్చినది కావటం వలన పొంగి దుమికింది. అందుకే 'దివిజ కవివరుగుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి' అన్నారు. తాను వెళ్తున్నాననలేదు. ఎవరేది యివ్వాలనుకున్నా శ్రీనాథులకివ్వమని ఆజ్ఞాపించే కవిరాజాయన. ఆంధ్ర పౌరుషాహంకారాలు మూర్తీభవించిన పుంభావ సరస్వతి ఆయన.

## శిక్షలు కాదు నరక యాతనలు

రాచరిక వ్యవస్థలో ఆనాడు శిక్షలు క్రూరాతిక్రూరంగా ఉండేవి. పన్ను చెల్లించ పోతే సంకెళ్లు వేసేవారు. కొట్టేవారు. జరిమానాలు వేసేవారు. గోతులలో వేసి ర కుమ్మేవారు. వీధులలో ఈడ్చేవారు. ఎండలో నిలబెట్టేవారు. పట్టకారులతో తొ

పెట్టేవారు. గోళ్ల పట్టకార్లతో ఊడగొట్టేవారు. అందుకే గోళ్లూడగొట్టి వసూలు చేశారనే సామెత వచ్చింది.

శ్రీనాథులవారి పల్నాటి వీర చరిత్రలోను, మల్లన వ్రాసిన రుక్మాంగద చరిత్రలోను ఆనాటి శిక్షా విధానాలు కన్పిస్తాయి.

కట్టిరి కొట్టి రీడ్చి రధికంబుగ లాగిరి గుండు రొమ్మునన్
బెట్టిరి, బెంగ ద్రోచిరి, తపింపగ నెండల నిల్పి రంటగా
జుట్టిన పచ్చడంబు నడి జూడన దోచిరి పట్టుకారులన్
బట్టిరి నిత్రుపాసముల పాలుగజేసిరి ఎర్రవిందడున్ ( రుక్మాంగద చరిత్ర )

ఒక ముస్లిం చరిత్రకారుడు యిలా వ్రాశాడు. "కాళ్లు చేతులు నరకటం, చెవులు ముక్కులు కోసి వేయటం, కళ్లు పీకివేయటం, సీసం కరిగించి నోట్లో పోయటం, గోళ్లల్లో మేకులు కొట్టటం, మనుషులను సజీవంగా దహించటం, రంపంతో కోయటం లేక కొరత వేయటం సర్వసాధారణం........"

హిందూ రాజరిక పాలనలో బ్రాహ్మణులకు ఇలాంటి బాధలు లేవు. ఈ శిక్షలు బ్రాహ్మణేతరులైనవారికి మాత్రమే విధించేవారు. ఏ ప్రభుత్వమున్నా యీ బాధలు తప్పేవికావు. కాని శ్రీనాథులవారివంటి బ్రాహ్మణ ప్రముఖునకు ఇలాంటి శిక్ష వేయటానికి వ్యక్తిగత కక్షలే కారణమనిపిస్తున్నాయి. రైతులకు విధించే శిక్షనే విధించినా అంతవరకు చరిత్రలో ఇలాంటి శిక్షలు బ్రాహ్మణులకు విధించిన ఆధారాలేమీ లేవు.



సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ఇలా అన్నారు. "చిత్రమేమనగా క్రీ.శ.1900 వరకు హైదరాబాద్ సీమలోని పల్లెలలోని పటేల్ పట్వారీ లివే పద్ధతులను అవలంబిస్తూ ఉండిరి. ఊరిముందర చావడి యుండెడిది. అందు చేతులకు కట్టే బేడీలు వేయు 'కోడాలు' ఉండెడివి. రెండు చేతులను మణికట్టు వరకు రెండు కట్టెల రంధ్రములందుంచి, ఒక వెదురు చీలను (గొడిగను) వాటికి బిగించువారు. మరియు ఎండలో నిలబెట్టి బండలెత్తుట, లేక ఊరి ముందర నుండు గుండును భుజముపై మోయించుట లేక ఒక పెద్ద మొద్దుకు గొలుసును కట్టి దానిని కాళ్లకు తగిలించుట; ఇట్టివన్నియు చేయిస్తూ ఉండిరి. అనగా ఒడ్డెరాజుల సృష్టి దేశమునంతటను వ్యాపించె నన్నమాట. అయితే, తటాలున ఒడ్డెరాజులే ఈ శిక్షలన్నిటిని ప్రవేశ పెట్టినారనుటకాదు. అంతకు ముందును ఇట్టివి యాచారములందుండెనేమో! కాని వాఙ్మయములో వాటి

సూచన లరుదు."

**చివరిదశ**

చందోలులో, కంజీవరంలో, కొండవీటిలో, రాణ్మహేంద్రవరంలో, విద్యానగరంలో, రాచకొండలో తన కవితా సుధారసాన్ని కావ్యాలలో నింపి, చాటువులలో అలది, ధనాన్ని లెక్కించకుండా అతిథులు 'తినలేమో కవిశేఖరా!' అని మొత్తుకునేటట్లు ఆదరించిన శ్రీనాథులవారు నేడు నిరుపేద! కౌలు చెల్లించలేని కడుపేద!!

కపిలేంద్ర గజపతి కవితా పోషకుడే. దైవభక్తి, బ్రాహ్మణభక్తి ఉన్నవాడే. గజపతుల మతాభిమానము, భక్తి ప్రపత్తులు, కళా సాహిత్య పోషణ మరపు రానివే. ఐతేనేమి ఈ వార్త ఆయన వరకు వెళ్లలేదు. కట్టవలసినవాడు కవిసార్వభౌముడయినా, కఠినంగా శిక్షించి వసూలు చేయాలనుకున్నారు గాబోలు. లేక కక్ష గట్టిన పాతకాలపు వారు నేడు అధికారం చెలాయిస్తూ పన్నాగం పన్నారేమో!

**శిక్ష**

శిక్ష చెప్పారు. నిర్దాక్షిణ్యంగా అమలు పరచాలన్నారు. పుంభావ సరస్వతి నిశ్చలంగా నిలబడ్డారు. దృఢ సంకల్పంతో అన్నిటికీ సిద్ధమయినారు.

నగరివాకిట తూర్పుకు తిప్పి నిలబెట్టారు. పండిన పండువంటి ఆ మహనీయుని మెడలో ఇనుప గుళ్లతో చేసిన 'పొగడదండ' వేశారు. లలిత లలితంగా శృంగారాన్నలది సుకుమార రచన గావించిన ఆంధ్ర నైషధకర్త చేతులకు అరదండాలు వేశారు. అల్లాడ వీర భద్రారెడ్డికి కాశీఖండాన్ని అంకితమిచ్చి విద్వాంసుడుగా ఆయన వద్ద యశశ్చంద్రికలతో ప్రకాశించిన తేజోమూర్తికి వెదురుగొడియ తగిలించారు. ఆంధ్రసరస్వతిని తన భుజ స్కంధాలపై నిలిపి, దేశదేశాలలో అనంతశోభలు చేకూర్చి, అర్చించి, ఆరాధించిన అక్షరశిల్పి, దేశ భాషలందు తెనుగు లెస్స అని నినదించిన కవిసార్వభౌముడు, శ్రీనాథ కవిరాజు మూపు మీద నగరి వాకిటనున్న నల్ల గుండు నిలిపారు. చుట్టూ జనంచేరి జాలిగా, బాధగా చూస్తున్నారు. రాజోద్యోగులు కొరకొయ్య వేస్తుంటే, ఎదురించే ధైర్యంలేక ప్రజలు మూగగా రోదించారు. పొడిచిన సూర్యుడు తాను బాధపెడుతున్నాననేది మరచి కన్నార్పక చూస్తూనే ఉన్నాడు.

అంతటి క్లిష్ట సమయంలో కూడా శిరసు వంచని శ్రీనాథులవారు, కవితామూర్తిగానే కాకుండా, మానవుని ధైర్యానికి, ఆత్మగౌరవానికి ప్రతీకగా నిలిచారు. జీవితాన్ని కవితా కదనంతో నడిపి, రాజకీయ కవిగా రాణించి, చాటు పద్య శృంగార, చతుర భాషణునిగా కీర్తి ఘటించి, అమరావతి నుండి అమరావతికి పయనించబోతున్న ఆ మహనీయుని అక్షర శిల్పంగా, అంతరాంతరాల లోతులనుండి ఆవేదనా భరితంగా వెలువడిన పద్యం గజపతులకు శాశ్వత

అపకీర్తి శాపం వంటిది. ఆంధ్ర భాషాభిమానుల కన్నీటి జాలువంటిది. తెలుగు మాట బ్రతికున్నంత కాలం మనసులో మెదిలే ముల్లువంటిది. మూగమనసు బాధ వంటిది.

కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా పురవీథి నెదురెండ బొగడ దండ
ఆంధ్ర నైషధకర్త యంఘ్రి యుగ్మంబున దగిలి యుండెను గదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత వియ్యమందెను గదా వెదురు గొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా నగరవాకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలుపెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు!

ఆ దశలో ఎవరాదరించారో, ఎవరు సేదదీర్చారో, చేయి సాయమిచ్చి నీడపట్టుకు ఎవరు చేర్చారో, లేదో చరిత్రలో దాగి ఉంది. ఆ తర్వాత ఏమయిందో తెలియదు!

తీయని తెనుగుభాషకు మరింత తీపికూర్చి, దేశభాషలందు తెనుగులెస్స అని తొలిసారిగా అన్న శ్రీనాథులవారు తెలుగు భాష ఉన్నంతకాలం ఉంటారు. తెలుగువారికి తీపిగుర్తుగానే ఉంటారు. మనబోటివారికి స్ఫూర్తినిస్తూనే ఉంటారు. తననాదరించిన పంటరెడ్ల ప్రాభవ చిహ్నంగా తెలుగు చరిత్రలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉంటారు.

విజయవాడ
22-2-97

- పోలవరపు కోటేశ్వర రావు



అనుబంధములు

## కొండవీటి కోట

కొండవీటి సామ్రాజ్యము అనే గ్రంథాన్ని ముద్దులపల్లి గురుబ్రహ్మ శర్మగారు వ్రాసి 29-9-1920న ప్రచురించారు. వారు దండ కవిలెలు, స్థానికుల కథలు, చరిత్ర, శాసనాలు చాలావరకు ఆ పుస్తకంలో ఇచ్చారు. ఆ పుస్తకాన్నుండి, దండకవిలెలనుండి సంపాదించిన సమాచారాన్ని యిస్తున్నాను.

1810వ సంవత్సరంలో 'సర్వేయర్ జనరల్'గా ఉన్న మెకంజీ ఉద్యోగస్తులతో దేశ చరిత్రలను గూర్చి సమాచారం ప్రోగుచేయించారు. ఆ ఉద్యోగస్తులు ప్రతి గ్రామాన్ని చూసి, అక్కడున్న శాసనాదులను సంపాదించారు. గ్రామాధికారుల నుండి వాజ్మూలము (కైఫీయ్యతు ) తీసుకున్నారు. రికార్డులు తయారు చేయించారు. సి.పి.బ్రౌన్‌గారు ఆ రికార్డులను పరిశీలించి, వాటి ప్రతులకు, తన విమర్శలు జోడించి, గవర్నమెంట్ వోరియంటల్ మానిస్క్రిప్టు లైబ్రరీ - మద్రాసులో వాటిని ఉంచారు.

పులిగడ్డ మల్లయ్య అనేవారు కొండవీడు వెళ్లి కైఫీయతులను వ్రాయించారు.

## కొండవీడు

దీని చుట్టుకొలత 50 కిలోమీటర్లు. ఈ కొండ మీద దాదాపు 50 శిఖరాలున్నాయి. పర్వతము పైన దాదాపు ఎనిమిది కిలోమీటర్ల చదరం ఉంది. మూడు చెరువులున్నాయి. వీటిని (1) వెదుళ్ల చెరువు (2) ముత్యాలమ్మ చెరువు (3) పుట్టలమ్మ చెరువని యిప్పుడు పిలుస్తున్నారు. ఈ చదరపు స్థలమునకు చుట్టూవున్న పర్వత శిఖరాలను కలుపుతూ కోట కట్టారు. ఆ గిరిదుర్గంలో లోతైన నూతులున్నాయి. కొండవీటి చాంతాడు అనే మాట వినే ఉంటారు.

కొండమీద ఎక్కడ చూసినా కోటగోడలు, మేడలు మిద్దెలు పడిపోయి దిబ్బలుగా ఉన్నాయి.

900 సంవత్సరాల క్రితం 'విశ్వంభర దేవుడు' అనే రాజు కొండవీటి కోటను కట్టించాడనే విషయం దండకవిలెలో ఉంది. కొండమీద ఉత్తరదిశలో (1) ఆరకోట (2) పిల్లకోట (3) పెదమాలెము కోట (4) చినమాలెము కోట (5) తట్టు కోట అని పిలువబడే కోటలున్నాయి.

కోట క్రింద రెండున్నర కిలోమీటర్ల చుట్టు కొలత గల మరో చిన్న కోట ఉంది. దీని చుట్టూ లోతైన అగడ్త ఉంది. కోటకు నాల్గుమూలలలోను, మధ్యమధ్య బురుజులున్నాయి. దీనిని రాయని భాస్కరుడు నిర్మించాడట. ఇందులో అందమైన

గోపీనాథాలయం ఉండేది. ప్రస్తుతం శిథిలమయిపోయింది.

కొండపైన మధ్యభాగంలో పుట్టకోట ఉంది. దీనిని ప్రోలయ వెమారెడ్డి కట్టించాడు.

కొండమీద ఇరవై ఒక్క బురుజులున్నాయి. ఒకటి రెండు తప్ప మిగతావన్నీ పడిపోయాయి.

## బురుజుల పేర్లు

1. కోనేటయ్య బురుజు
2. పెదతిరుపతయ్య బురుజు
3. చుక్కల కొండ బురుజు
4. సజ్జామహల్ బురుజు
5. బొల్లు సూరయ్య బురుజు
6. కాట్రేటి బురుజు
7. మిర్యాల చట్ట బురుజు ( ఇది బాగా వుంది)
8. పాముకుదురు బురుజు
9. గంజి కాలువ బురుజు
10. పోతరాజు బురుజు
11. జెట్టి బురుజు
12. లేళ్ల కురువ బురుజు
13. పడమటగవి బురుజు
14. హనుమంతుని బురుజు
15. వీరన్న బురుజు
16. బ్రహ్మదేవుని బురుజు
17. తిరుపతి బురుజు
18. బొందం కొండల బురుజు
19. తూర్పు కట్టెల దిడ్డి
20 అల్లవారి బురుజు
21. ముల్లగూరమ్మ బురుజు.

కొండవీటి పురం 12 లేక 13 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో ఏడువాడలతో ఉండేది.

కొండవీటిని కాకతీయులు, రెడ్లు, గజపతులు, విజయనగర పాలకులు, ముస్లింలు, పాలించారు. చివరకు 1788లో ఈస్టిండియా కంపెనీ వారికి నైజాంనవాబు ఇచ్చాడు. అలా ఈ సీమ అంతా ఆంగ్లేయుల క్రిందకు వెళ్లింది.

ముందు కొండవీడు జిల్లాగా ఉంది. తర్వాత కార్య స్థానం గుంటూరుకు మార్చారు. తరువాత కొండవీటిని తాలూకాగా మార్చారు. ఇప్పుడు గ్రామంగా మిగిలింది.

కొండవీటి సీమ మీద ఉన్న పద్యం కొన్ని వివరాలిస్తుంది.

శ్రీమించు కొండవీడ్ సీమలో ప్రఖ్యాతి గాంచిన గ్రామాది గణము వినుడు,
ఎలమితో చెప్పేవి ఏవేవి అంటేను పాలడుగు, పులివర్రు, ప్రత్తిపాడు,
సంతన రావూరు, సరసన నూతక్కి, పొంతన చేబ్రోలు, పొన్ను నూరు,
మంగళగిరియును, మరి మంచి మునుగోడు, దంగైన నాదెండ్ల, రాయిపూడి,
పంటలధికంబు గుంటూరు ప్రజల కెల్లపాడిపంటలు గలిగుండు తాడికొండ,
దాచిన ధనమ్ము వంటిది కూచిపూడ పరమ మల్లేశ వినవయ్య పార్వతీశ.

కొండవీటిని కుండిన పురమని కూడా పిలిచేవారు. రుక్మిణీదేవి కన్నవారి పట్టణం యీ కుండిన నగరమని, యింకా యిలాంటి కథలు చాలా ఉన్నాయి.

## గృహ రాజ సౌధము, త్రైలోక్య విజయ సౌధము

పెదకోమటి వేమారెడ్డి కొండవీటిలో 'గృహరాజ సౌధము' అనే పేరుతో గొప్పరాజ సౌధాన్ని నిర్మించాడు. శ్రీనాథులవారు వ్రాసిన చెరువు శాసనంలో గృహరాజ సౌధం విషయం ఉంది.

"అశ్రాంత గృహరాజ సౌధ నివసల్లక్ష్మీ కరాభ్యంతర క్రీడాంభోరుహ తాళ వృంత పవన ప్రస్తార విస్తారితః" అని వ్రాశారు.

ఇలాగే రాజమహేంద్రవరంలో వీరభద్రారెడ్డి నివసించే భవనాన్ని "త్రైలోక్య విజయసౌధము" అని పిలిచేవారు. వీరభద్రారెడ్డి ఈ భవనముపైన నిలచి చూస్తే, గోదావరి తరంగ తాండవం కన్పిస్తుండేదని ఒక పద్యం శ్రీనాథులవారు వ్రాశారు.

**త్రైలోక్య విజయ సౌధ వి**
**శాల మహోత్తుంగ చంద్రశాలా సతత**
**వ్యాలోకిత గౌతమ క**
**న్యాలహరీ విరహ తాండవాటోపునకున్** ( కాశీ - 65 )

ఈనాడు వాటి గుర్తులు కూడా లేవు. రాజమహేంద్రవరంపైన నేటి రాజమండ్రి పెరిగింది. కొండవీటిలో త్రవ్వకాలు చేస్తే కొంత సమాచారం దొరకవచ్చును.

## పంటరెడ్ల పాలన - ఒక పరిశీలన

పరిపాలనా సౌకర్యం కొరకు గ్రామాలను నాలుగు తరగతులుగా విభజించారు. (1) రాజు క్రింద ఉండే రాచ ఊళ్లు (2) నాయంకరపట్లు అని పిలువబడే సైన్యాధిపతుల ఊళ్లు (3) బ్రాహ్మణులు వంశపారంపర్య హక్కులతో అనుభవించే అగ్రహారాలు (4) దేవుని క్రింద ఉండే గ్రామాలు.

సామంతులు పన్నులు వసూలు చేసేవారు. తమ సైన్యాలకయ్యే ఖర్చులను మినహాయించి, ఎక్కువ భాగం కప్పంగా రాజుకు చెల్లించేవారు.

ముసునూరి నాయకులు పంటలో ఆరోవంతు పన్నుగా తీసుకునేవారు. రెడ్డి రాజులు కూడా అదే పద్ధతినవలంభించి ఉంటారనుకుంటున్నాను.

కొండవీటి పాలకులు విశాల ప్రాతిపదికపై రాజ్యాన్ని భూములుగా పేర్కొన్నారు. ప్రతి భూమినీ సీమలుగాను, ప్రతి సీమను నాయంకరములుగాను విడదీశారు. నాడు, స్థలము, గ్రామము ఒకదానికన్న మరొకటి చిన్నది. ప్రతి దుర్గం క్రింద ఒకటి రెండు భూములుండేవి.

## పన్నులు

భూములను కొలిచి వర్గీకరించేవారు. మెట్ట భూములు, తరి భూములమీద పంటరూపంలోను, తోటల మీద ధన రూపంలోను పన్ను విధించేవారు.

ప్రకృతి వైపరీత్యాలొచ్చి పన్నులు చెల్లించలేక పోతే, పన్నుల వసూలు కొరకు గుత్తపాడుకున్న గుత్తదారులు రైతులను నానాహింసలు పెట్టేవారు. క్రూరాతి క్రూరంగా వసూళ్ళు కొనసాగించేవారు. ఇలా విధించే శిక్షలకు శ్రీనాథ కవిరాజుకు విధించిన శిక్ష ఒక నమూనా మాత్రమే.

పుల్లరి పన్ను, జరిమానా పన్ను ఉండేది. గనుల మీద, వృత్తి కట్నాల పేరుతో మగ్గాల మీద, నూనె గానుగల మీద పన్నులుండేవి. ఉప్పు పన్ను ఉండేది. సంతల్లో, రేవుల్లో సుంకాలు వసూలు చేసేవారు. ఎగుమతి, దిగుమతి సుంకాలుండేవి. ఉప్పు పత్రలనుండి తయారయ్యే చవుడు ప్రభుత్వ గుత్తాధికారంలో ఉండేది. ఈ రెంటినుండి మంచి ఆదాయం వచ్చేది.

ప్రభుత్వాలేగాక గ్రామ సంస్థలు కూడా పన్నులు వేసేవి.

కొన్ని పన్నులు విచిత్రంగా ఉండేవి. తలారిపన్ను, యువరాజు ఖర్చులకు 'దొగరాచ' పన్ను, రాజమాత ఖర్చులకు పన్ను, విదేశ వ్యవహారాల మంత్రి కొరకు 'సంధి విగ్రహి' పన్ను, సైన్యాధిపతి కొరకు 'వడివెల' పన్ను, రాజద్వార పాలకునికి యివ్వటానికి పన్ను, సింగినాదం పన్ను ఉండేవి. ఇలా ఎన్నోరీతులుగా సామాన్య ప్రజలను పీల్చి పిప్పిచేసేవారు.

సింగినాదం పన్ను అనగా ప్రమాదం వచ్చినపుడు గ్రామస్తులను హెచ్చరించటానికి ఎత్తయిన ప్రదేశంలో నిలబడి కొమ్ముబూర ఊదేవాని కొరకు ప్రజల నుండి వసూలు చేసేపన్ను. శృంగనాదమే సింగినాదమయింది. వివాహాలకు యిలాంటి మ్రోతలు లేనపుడు ఎగతాళిగా సింగినాదంలేదు జీలకర్ర లేదు అనే సామెత పుట్టుకొచ్చింది.

రెడ్డి, కరణం మొదలయిన వాళ్లు గ్రామపాలన చూసేవారు. రెడ్డి అనేది అధికార హోదాను తెలిపే పదం. రెడ్డి పన్నులు వసూలు చేసేవాడు. కరణం లెక్కలు వ్రాసేవాడు.

గ్రామాలలో ముప్పెట్టి ఉండేది. వ్యవసాయ కూలీలు ఈ మూడు రకాల వెట్టి చేసేవారు. (1) రాచ వెట్టి (2) గ్రామ వెట్టి (3) కుల వెట్టి. పాల్కురికి సోమన బసవ పురాణంలో దీనినే ముప్పెట్టి అన్నాడు.

అతివృష్టి, అనావృష్టి, మూషికాలు, శలభాలు, శునకాలు అడవి జంతువుల వలన ఈతి బాధలు కలిగేవి. రాజులు ప్రజలనాదుకునే వనరులు, మార్గాలు తక్కువ. ప్రజలు చాలా బాధలు పడేవారు.

దోపిడి గాండ్రనుండి, క్రూర మృగాలనుండి, రక్షణకై ఊరుచుట్టూ ప్రహరీ గోడ

కట్టుకొని, ద్వారాలు, బురుజులు నిర్మించేవారు. గోడ వెలుపలో లేక గోడమీదనో 'ప్రహరీ కాపు' ప్రహరీ తిరుగుతుండేవాడు. అదే దారికాపు అయింది.

ఈ విషయం భీమేశ్వర పురాణంలో "భైరవు డర్ధ రాత్రంబు ప్రహరి తిరుగు" అని "గవని కాపుల వారు దిక్పాలవరులు" అని శ్రీనాథులవారు వ్రాశారు (3 -88)

## పంటలు

ఈనాడు పండించే పంటలన్నీ దాదాపు ఆనాడు పండించారు. తర్వాత కాలంలో మిరపకాయలు, పుగాకు వంటి కొన్ని పంటలు విదేశీయుల ద్వారా వచ్చాయి.

కారం కొరకు మిరియాలు వాడేవారు. అందువలననే తర్వాత కాలంలో క్రొత్తగా దేశంలో ప్రవేశించిన కారమున్న కాయను మిరియం కాయ అన్నారు. అదే మిరప కాయ అయింది. మిర్చి అనీ పిలిచారు.

ప్రజలు షడ్రసాలను ఆనందిచేవారు. తీపి, వగరు, కారము, చేదు, ఉప్పు, పులుపు షడ్రుచులుగా వర్ణింపబడినాయి.

## శిక్షాస్మృతులు - పక్షపాతాలు

శిక్షలు బహు క్రూరంగా ఉండేవి. ద్రోహికి మరణ శిక్ష , చర్మం ఒలిచివెయ్యటం, కాళ్లూ చేతులు నరికి వేయటం, రాతి గానుగలలో పడవేసి గానుగాడటం ఉండేది. ఇతర శిక్షలలో కాళ్లూ చేతులు కట్టేసి కొట్టటం, వీధులలో యీడ్వటం, ఎండలో నిలబెట్టటం, గుండెల మీద బండలు పెట్టటం, పట్టకార్లుతో తొడపాసెం పెట్టటం, గోతిలో పడవేసి రోకళ్లతో కుమ్మటం ఉండేది.

అన్ని కులాల వారికి శిక్షలు సమంగా ఉండేవి కావు. కుల ప్రాతిపదిక మీద బ్రాహ్మణులు వ్రాసిన శిక్షాస్మృతులనాధారం చేసుకొని శిక్షించేవారు.

మను స్మృతి చూడండి :

**మౌండ్యం ప్రాణాంత కో దండః బ్రాహ్మణస్య విధేయతే।**
**ఇతరేషాంతం వర్ణానాం దండః ప్రాణాంతికో భవేత్॥**

బ్రాహ్మణునికి పిలక కోయటం, అదే నేరం చేసిన యితర వర్ణాలవారికి గొంతులు కోయటం శిక్ష మను స్మృతి (8 - 379)

**నజాతు బ్రాహ్మణం హన్యాత్ సర్వపాపేష్వ వస్థితమ్ ।**
**రాష్ట్రాదేనం బహిః కుర్యాత్ సమగ్రధన మక్షతం॥** మను స్మృతి 8 - 380

బ్రాహ్మణుడు పాపియగుగాక వానిని చంపగూడదు. అక్షయమైన ధనం యిచ్చి రాష్ట్రం (దేశం) వెలుపలికి సాగనంపవలెను.

ఇలా సమాజాన్ని హింసిస్తూ, దేవ బ్రాహ్మణ, క్షత్రియానుకూలంగా చాలా ధర్మ

శాస్త్రాలు వచ్చాయి. కేతన విజ్ఞానేశ్వరీయంలోనూ కావలసినంత అగ్రవర్ణ అనుకూలత వుంది.

దేవుడినీ, ప్రభువును, బ్రాహ్మణునీ నిందించిన వారికి 1008 పణాలు జరిమానాలు విధించాలని విజ్ఞానేశ్వరీయం చెపుతోంది.

తనకులం వాడి భార్యను చెరిస్తే వేయి పణాలు, తనకులంకన్నా తక్కువ కులంవాడి భార్యను చెరిస్తే 500 పణాలు శిక్ష విధించాలని యీ నీతి శాస్త్రం చెపుతోంది.

ఇలా కుల ప్రాంతిపదిక మీద క్రూరమైన నీతి శాస్త్రాలు వ్రాసి దారుణంగా సామాన్యులను హింసించారు.

ఇందువలన దేశం రాజకీయ కల్లోలాలతో తలక్రిందులవుతున్నా, గ్రామస్థులు పట్టించుకునేవారు కాదు. మరోవైపు స్వయంపూర్ణగ్రామాలలోని వారు యింతటి బానిసత్వంలోకూడా నోరుమెదపకుండా చూస్తూ ఊరుకునేవారు. ఎవరొచ్చినా యీ బానిసత్వం తప్పదని భావించారు. ఇందువలననే విదేశీయులు, పర మతాలవారు కాలూనుకొని పాలించగలిగారు.

## సైన్యాలు, ఆయుధాలు

రెడ్డి ప్రభువుల సైన్యాలు గజ, తురగ, పదాతి దళాలుగా ఉండేవి. కాల్బలంలో నాలుగు శాఖలుండేవి. (1) సెలగోల బలం - అనగా ఈటెలు విసిరేవాళ్లు (2) విలుకాండ్రు (3) కైజీతగాండ్రు (4) ఎక్కట్లు.

దినభత్యం మీదనో, వారభత్యం మీదనో యుద్ధకాలంలో తాత్కాలికంగా చేర్చుకోబడేవాళ్లు కైజీతగాళ్లు. విజయావకాశాలు తక్కువగా ఉన్నపుడు యుద్ధం చివరి దశలో రంగంలో దించటానికి సిద్ధంగా ఉంచేవాళ్లను ఎక్కట్లు అవేవారు. వీరే తరువాత కాలంలో "వంటరు"లని పిలువబడ్డారు.

వీరికి భూములిచ్చి ప్రతినగరంలోనూ ముఖ్యమైన గ్రామాల్లోనూ ఉంచేవారు.

ఆనాటి యుద్ధాల్లో వాడే ఆయుధాలు 18 రకాలుగా వుండేవని శ్రీనాథులవారు చెప్పారు.

(1) చురకత్తి (2) పరిఘము (గద లేక లాఠీ) (3) శూలం (4) ప్రాసము (విసిరే ఈటె) (5)కుంతము (రౌతులుపయోగించే ఈటె) (6) ఖడ్గం (7) ముసలం(దుడ్డుకర్ర) (8)ముద్గరము (సుత్తి) (9) చక్రం (10) భిండివాలము (విసిరే ఆయుధం) (11) గద (12)పరశువు, గండ్రగొడ్డలి (13) బల్లెం (14) బాకు (15) కటారు (16) సాంగము (పొడవైన విల్లు) (17) ధనువు (18) శరధి (అంబుల పొది)

ఇవి గాక రాళ్లు విసిరే పాషాణ యంత్రాలుండేవి.

అగడ్తలు దాటి, కోట గోడలకు నిచ్చెనలు వేసి ఎక్కేవారు. లగ్గలు పట్టించటం అనేవారు.

## హింస - దోపిడి

దండు కదిలినపుడు రాజదర్బారు కదలినట్లుండేది. బలగాలు శత్రురాజ్యంలో అడుగిడిన వెంటనే గ్రామాలను దోచుకునేవారు. స్త్రీలను నానావిధాలుగా బాధించేవారు. కనిపించిన మగవారిని చంపి, గ్రామాలు తగలబెట్టేవారు. క్రూరాతి క్రూరంగా ప్రవర్తించేవారు. స్వభాష, పరభాష అనే తేడా లేకుండా ప్రవర్తించేవారు.

సైన్యాలను నడిపించేవారి ప్రవర్తన విచిత్రంగా ఉండేది. నమ్మక ద్రోహం చెయటం, యుద్ధరంగాన్ని విడిచి సైన్యంతో వెళ్లిపోవటం, శత్రువులతో చేయికలపటం సర్వసాధారణంగా జరిగేది. దేశభక్తి, భాషాభిమానాలు దాదాపులేవు. స్వదేశం, స్వభాష అనే ప్రత్యేకాభిమానాలు ప్రభువులకేనాడు ఉన్నట్లు కన్పించదు.

## ప్రోత్సహింపబడిన వ్యభిచారాలు

ఇల్లు, దుస్తులు, నగలు, పూలు, అత్తరు, వక్క, తాంబూలం, స్త్రీ భోగవుస్తువులుగా ఆనాటివారు భావించారు. ఈ ఎనిమిది కలిపి అష్టభోగాలన్నారు. మధ్యయుగాల్లో ఖచ్చితంగా అష్టభోగాలను సంపన్నులు, అధికారులు అనుభవించేవారు.

స్త్రీ భోగవస్తువు. వ్యభిచారమనే పేరుతో కాకపోయినా, రాజ పోషణ ఉండేది. ఉన్నత కులాలవారు ప్రోత్సహించి, అనుభవించేవారు. శ్రీనాథులవారి పద్యాలలో రాయవేశ్యాభుజంగ మొదలైన సమాసాలు, విరివిగా శృంగార వర్ణనలు ఉన్నాయి. చాటువులలో వారు స్త్రీ వర్ణనలను అధికంగా చేశారు. , హరవిలాసంలో శివుని పురుషాయిత వర్ణనలుండటానికి ఆనాటి ఉన్నత వర్గాలవారి అభిరుచులే కారణం. చివరకు దేవాలయాలు సైతం మరోరూపంలో అనుమతించాయి. కాకతీయుల కాలంలో ప్రారంభమయిన నృత్యపూజ, రెడ్డిరాజులు, వెలమ ప్రభువుల ఆస్థానాలలో పోషింపబడి, రాజనర్తకీ సాంప్రదాయం పాదుకొంది. విజయనగర పాలనలో విరివిగా పెరిగింది.

'లకుమ' విషయం వివరించి ఉన్నాను. సింగభూపాలుని ప్రియురాలు 'భోగిని' విషయం తెలిసిందే. క్రీడాభిరామంలో మాచల్దేవి సంగతి చెప్పుకున్నాం.

స్త్రీల చనుకట్టును కవులు వదల్లేదు. ఎన్నో ఊహలతో, ఎన్నో పోకడలు పోయారు. ఆడవారి సంభాషణలలో కూడా అందంగా వాటిని గూర్చి చెప్పారు. చనుకట్టు స్త్రీకి గర్వకారణమైన అందమని ఆనాటివారు భావించారు.

శృంగార నైషధంలో (3-89) దమయంతి మహా అందంగా వొట్టు పెట్టింది. "అనవిలుకాని పాద నలినంబులపై, రతి చన్ను దోయిపై" అని.

క్రీడాభిరామంలో వ్యభిచారగృహాలు, బ్రాహ్మణ విధవల తిరుగుబోతుతనాలు పరిపరివిధాల వర్ణించారు.

ఇలా ఎంతయినా చెప్పవచ్చును.

## దానాలు, వ్రతాలు

దానాలు, వ్రతాలు విరివిగా చేసేవారు. ఏకాదశీ వ్రతం చేస్తే ఎటువంటి పాపాలు చేసినా స్వర్గాన్ని చేరవచ్చుననే నమ్మకం ఉండేది. ఇలాంటివెన్నో నమ్మకాలు ప్రజల్లో విరివిగా ఉండేవి.

దానాలు, వ్రతాలు, రాజులకు, ధనవంతులకు బాగా పేరు తెచ్చాయి. బ్రాహ్మణుల భుక్తికి, రక్తికి అనుకూలించాయి.

అనవేమారెడ్డి బ్రహ్మాండ దానం, కనక ధారా దానం, గోసహస్ర దానం, కల్పతరు దానం చేశాడు. పదహారు మహాదానాలలో యీ నాలుగూ ఉన్నాయి. కుమారగిరి తులా పురుషదానం చేశాడు. అల్లయ వేమారెడ్డి ద్రాక్షారామంలో గోసహస్ర దానం చేశాడు.

## శ్రుతి మించిన భక్తి

శివభక్తి, అతి భయంకరమైన జుగుప్సాకరమైన చర్యలను గొప్పగా ప్రోత్సహించింది. కొడుకును చంపి, భైరవ యోగికి మాంసం వండిపెట్టి చిరుతొండనంబి, తిరువెంగళాంబ శివసాయుజ్యం పొందారని హర విలాసంలో శ్రీనాథులవారు వ్రాశారు. శివరాత్రి ఉత్సవాన్ని చూసిన పుణ్యానికి మరుజన్మలో కుబేరుడై జన్మించాడని, సకల దుర్వ్యసనాలున్న ఒక బ్రాహ్మణుని గూర్చి కాశీఖండంలో చెప్పారు.

శాక్తేయులు, కాలాముఖులు, మైలారు దేవులు, వీరరసాత్మకమైన పూజలు, శ్రీనాథులవారి రచనలలో కన్పిస్తాయి.

## అనేక మతాలు - శాఖలు

మరో మతం వైష్ణవం. మరికొందరు శివుడినీ, విష్ణువును కలిపి పూజించి హరిహరోపాసన అన్నారు. సామాన్యులు కొలిచే గ్రామదేవతలు, పోతురాజు ఉన్నారు. గ్రామదేవతలను సంతృప్తి పరచేందుకు జంతు బలులిచ్చేవారు. పురాలు కట్టి కొలిచేవారు. మూలగూరమ్మ ఒక శక్తి. ఈమెకు కొండవీటి పాలకులు దేవాలయం కట్టించారు. చాలాదానాలు చేశారు. నందికంత పోతురాజు కఠారిని గూర్చి చెప్పిఉన్నాను.

ప్రాణాయామంద్వారా అష్టసిద్ధులు సాధించవచ్చుననే నాథసిద్ధ పంథా ఉంది. శ్రీనాథుడు కాశీఖండంలో హఠయోగం గురించి వ్రాశాడు.

భైరవీతంత్రం లేక చక్ర పూజ మరో ఆరాధన. పంచ 'మ' కారాలయిన మద్యం,

మాంసం, మత్స్యం, ముద్ర (వేపిన బియ్యం), మైథునం ఉపాసించటం వలన ముక్తి సాధించవచ్చునని వీరి నమ్మకం. కుల భేదంతో నిమిత్తం లేకుండా స్త్రీ పురుషులు సమష్టి భోజనం నుంచి, సమిష్టి సంభోగం వరకు ఈ పూజా క్రమంలో పాల్గొనేవారు.

తాంత్రిక పూజ మరొకటి. ఆత్మ హింస తాంత్రిక పూజారూపాలలో ఒకటి. రెడ్డి రాజుల కాలంలో అన్నవేమారెడ్డి శ్రీశైలంలో మల్లికార్జున లింగానికి ఎదురుగా వీరశిరోమండపం కట్టించిన సంగతి యింతకు ముందే వ్రాశాను. ఈ మండపంలో శివభక్తులు శారీరక హింస చేసుకునేవారు. శ్రీశైలంలో ఒక శిఖరం నుండి దూకి శివభక్తులు ప్రాణత్యాగం చేసేవారు. పాల్కురికి సోమన వ్రాసిన పండితారాధ్య చరిత్రలో "పడియెడు దేహంబు, పడిన దేహంబు, నడిమి దేహంబు లెస్సంగ బెక్కాడు" అని వ్రాశాడు. తమ అంగాలను ఖండించుకొని శివప్రీతి కొరకు అర్పించేవారు.

## వినోదాలు

రాజులు, సామంతులు వినోదం కొరకు వేటకు వెళ్ళేవారు. ద్వంద్వయుద్ధాలు సామాన్యులు చేసేవారు. ఆబోతులు, దున్నపోతుల పోట్లాటలుండేవి. కోడిపందాలు, గొర్రె పోతుల పందాలు ఉండేవి. క్రీడాభిరామంలో గొర్రెపందాన్ని, కోడి పందాన్ని వర్ణించారు. పాములాట, నాగస్వరము ఉండేవి.

## బావులు - చెరువులు

వ్యవసాయాభివృద్ధికి రెడ్డి రాజులు బాగా కృషి చేశారు. అమలాపురం తాలూకాలోని రెడ్డి నూతులు వీరు త్రవ్వించినవే. పెదకోమటి వేమారెడ్డి భార్య సూరాంబిక 'సంతానపయోధి' అనే చెరువు త్రవ్వించింది. పెదకోమటి వేమారెడ్డి కొడుకు రాచవేమారెడ్డి తన తల్లి త్రవ్వించిన చెరువుకు నీరు తెచ్చేందుకు జగనొప్పగండ కాలువను త్రవ్వించాడు.

ధనవంతులు చాలాచోట్ల చెరువులు త్రవ్వించారు. ఉప్పల హనుమయ్య, కావూరి వల్లభశెట్టి (గోవర్ధన సముద్రం) చెరువులు త్రవ్వించారు. ప్రజోపయోగంకోసం సముద్రాలంత చెరువులనెన్నిటినో శ్రీగిరిరెడ్డి త్రవ్వించాడు. మరో రాచవేమారెడ్డి పెద్ద చెరువు నిర్మించి, బద్దింపూడి జనార్దనునకు దానం చేశాడు.

పశుపోషణ బాగా జరిగేది.

## చేతిపనులు

పంచాననం వారమని, విశ్వకర్మ సంతతివారమని చెప్పుకుంటూ (1) కంసాలి (2)కమ్మరి (3) కంచరి (4) వడ్రంగి (5) స్థపతులు విశ్వకర్మకులంగా ఏర్పడ్డారు. వీరు నైపుణ్యం గల చేతిపనివారు.

సన్నని నూలు బట్టలు నేసే నేతపనివారు ఎగుమతులకు కూడా వస్త్రాలు తయారు

చేసేవారు. కలంకారీ రంగులతో అద్దకాలు వేసేవారు. చిత్రలేఖనానికి కావలసిన సామగ్రి తయారయ్యేది. ఇనుముకరిగించి వస్తువులు తయారు చేసేవారు. యుద్ధసామగ్రి, కత్తులు మొదలైనవి తయారు చేయటానికి మంచి ఇనుము తయారయేది.

## లలిత కళలు

సంగీత, సాహిత్య, నృత్యాలకు మంచి ప్రోత్సాహముండేది. ఈ వివరాలు యింతకు ముందే యిచ్చివున్నాను.

శ్రీనాథ మహాకవి కూడా ఆనాటి తుచ్ఛ విశ్వాసాలను, దుర్భర కర్మకాండను మతం ముద్రవేసి ప్రశంసించారు.

అదేకాలంలో చాలామంది రచయితలు వివిధ రాజులవద్ద మనకు కన్పిస్తారు.

విక్రమార్క చరిత్ర వ్రాసిన జక్కన, భోజరాజీయం వ్రాసిన అనంతుడు, షోడశ కుమార చరిత్ర వ్రాసిన అన్నయ, సింహాసన ద్వాత్రింశిక వ్రాసిన కోరవి గోపరాజు, నవనాథ చరిత్ర వ్రాసిన గౌరన, రుక్మాంగద చరిత్ర వ్రాసిన మల్లన, భాగవత దశమ స్కంధం వ్రాసిన మడికి సింగన, సకల నీతి సమ్మతం అనే రాజనీతి గ్రంథాన్ని, పద్మపురాణం, వశిష్ఠ రామాయణం కూడా యాయన వ్రాశాడు.

## నృత్యాలు

శ్రీనాథులవారు నృత్యవర్ణనలు చాలా చేసారు.

విరుల దండలతోటి వేణికా భారంబు పొంకంబు పిఱుదుల బొరలి యాడ
మణితులా కోటి కోమల ఝణత్కారంబు రవలి మట్టెల మ్రోత యవఘళింప
కుదురునిండిన చిన్ని గుబ్బ చన్నుల మీద ముత్యాల త్రిసరంబు మురువుజూప
వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ లేత వెన్నెల బుక్కిలించి యుమియ

సాని యీశానియై మహోత్సవమునందు
కేల నవచంద్రకాంతపు గిన్నె పూని
వీధి భిక్షాటన మొనర్చు వేళ జేయు
మరుల నృత్యంబు జగముల మరులుకొలుపు (భీమే 1 - 105)

జాదుర జాదురంబు మృదు చర్చరి గీతులు వారుణీ రసా
స్వాద మదాతి రేకముల చంద్రిక కాయగ దక్షవాటికా
వేదుల మీదటన్ కనక వీణలు మీటుచు బాడి రచ్చరల్
మోద మెలర్పగా భువన మోహన విగ్రహు భీమనాథునిన్ (భీమే 5 - 103)

అనువగు కౌనుతీగె లసియాడ బయోధరముల్ వణంకగా
గనక మరాళ కీరకల కంఠ మయూర రథాధి రూఢలై
వనితలు భీమనాయకుని వారక యేసిరి కమ్మదేనియల్
చినుకు పసిండి లేజెఱకు సింగిణి విండ్లను బుష్పబాణముల్ (భీమే 5 - 104)

జాయప వ్రాసిన నృత్తరత్నావళిలోని 'దేశి' నృత్యాలన్నీ రెడ్డిరాజుల కాలంలో ఉన్నాయి. పేరిణి, గోండ్లి, దండలాసక, కంచుక క్రీడ, జక్కిణి, చిందు మొదలగు దేశి నృత్యాలు విరివిగా ఆదరించబడినాయి. రాత్రులందు తోలుబొమ్మలాటలుండేవి. శ్రీనాథులవారి రచనల నిండా ఈ నృత్యాల విశేషాలు వర్ణింపబడినాయి. దర్బారు నృత్యాలుండేవి. పలనాటి వీరచరిత్రలో నలగామరాజు దర్బారులో జరిగిన నృత్యాన్ని శ్రీనాథులవారు యిలా వర్ణించారు. ఇందులో వారు వాడిన నృత్య సాంకేతిక పదాలు వారి ప్రజ్ఞను విశదీకరిస్తాయి.

నాట్యమేళము వారు నవ విలాసముల - వచ్చి నమ్రత మొక్కి ప్రక్కగా నిల్వ
ఘన వైభవంబున కామ భూ విభుడు - నవ్వుచు సెలవిచ్చె నాట్యంబు సేయ
వర మృదంగము లెస్స వాయించు మేటి -కుడి భాగమున యందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటి దిశను - నిలిచి రుత్సాహంబు నేరుపు మీర
ముఖవీణ వాయించు ముఖ్యుడొకండు - రాగమాలాపించు రమణులిద్దరును
నిండు వేడుక తోడ నిలచిరి వెనుక - కంజ లోచన యను ఘనమైన పాత్ర
మదను పట్టపుదంతి మంజులవాణి - భరత శాస్త్రోచిత బహు రాగములను
గరిమతో నేర్చిన కంతు బాణంబు - వచ్చి సభాసదుల్ వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన - వేత్ర పాణికి దగ వినయంబు జూపి
అతడొసంగిన గజ్జ లతి భక్తి తోడ - పాదములం గట్టి పంచ వర్ణముల
కాశ గట్టిగ కట్టి కడు జపంబమర - మద్దెల తాళాల మధ్య నిల్చుండి
ఓర చూపున రాజు నొయ్యన జూచి - సమ పాద యుతమైన సాథనక స్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి - పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సభ కట్టి నాట్యంబు సభ యెల్ల గ్రమ్మ - కైకోలు విడుదలల్ కనుపింప జేసి
వెలయంగ తొమ్మిది విధములైనట్టి - భూచారి నాట్యంబు పొందుగా సలిపి
పదునారు విధములై పరగిన యట్టి - ఆకాశ చారియు నమరంగ నాడి
అంగహారాఖ్య గలట్టి నాట్యంబు - విదితమౌ తొమ్మిది విధముల నాడి

గతి, చారి భేదముల్ గనుపడునట్టు - భ్రమణ సంయుత దీప్తి పటిమ మీరంగ
పాణి భేదములను పాటించి చూపి - స్థానక పంచమ సంయుక్తి అమర
ప్రేరణి దేశిని ప్రేంకణ శుద్ధ - దండికా కుండలి తగు బాహు చారి
సప్త తాండవములు సల్పె చిత్రముగ - సభ వారలాశ్చర్య సంయుక్తులైరి.

దేలయాలలో దేవుని పూజల్లో, ఉపచారాల్లో మార్గ పద్ధతి నాట్యాలుండేవి. పవళింపు సేవలో, దేవాలయం బయట ఉత్సవ విగ్రహాల ముందు, భక్తుల ముందు, వివాహాలలో, ఊరేగింపులలో దేశి పద్ధతి నాట్యాలుండేవి.

దండి 'దశకుమార చరిత్ర'లోను, తిక్కన 'నిర్వచనోత్తర రామాయణం''లోను, భారతంలో ఉత్తర, మేనక మొదలగు వారితోను, బుద్ధ భూపాలుని రంగనాథ రామాయణంలోను ఆనాటి నృత్య, గీత, వాద్యాలను గూర్చి వ్రాశారు. ఇదే సాంప్రదాయం 14, 15, 16వ శతాబ్దాల రాజులు, ఆ తర్వాతవారు పాటించారు.

యక్ష గానాలనే సంగీత నాటకాలు ఈ కాలంలోనే ప్రారంభమయ్యాయి.

శ్రీనాథులవారి కాలంలో కూచిపూడి నృత్యాలు లేవు. రాజనర్తకీ సాంప్రదాయం, దేవదాసీ సాంప్రదాయం మాత్రమే ఉన్నాయి.

**చిత్ర లేఖనం :**

వేశ్యల పడకటింటి గోడల మీద రతిబంధ చిత్రాలుండేవి. (పోడశకుమార చరిత్ర). దేవాలయం గోడల మీద పురాణ కథా చిత్రాలు, రాజ భవనాలలో భిత్తి చిత్రాలుండేవి.

గొడ్డు చర్మంతో చేసిన వజ్రలేపాన్ని ఫలకం మీద వ్రాసి తెల్లగాను, నున్నగాను మెరిసేటట్లు చేసేవారు. దానిమీద తూలికతో రేఖలు గీస్తారు. వర్తికతో (బ్రష్ ) రంగులు అద్దుతారు. లఖమి కుంచె మెత్తని జంతు రోమాలతో చేస్తారు. దీంతో రంగులను సరి చేయటానికి దిద్దటానికి వాడతారు. ఇలా తూలిక, వర్తిక, లఖమి కుంచెలు వాడారు.

**శిల్పం, చిత్రలేఖనం, సంగీతం :**

శిల్పం, చిత్ర లేఖనం బాగా పెరిగాయి. అనవేమారెడ్డి శ్రీశైల దేవాలయ ప్రాకారం మీద శివభక్తుల జీవితాలు చెక్కించాడు. వీరు నిర్మించిన దేవాలయాల మీద శిల్పాలు ఈనాటికీ వింతగొలుపుతుంటాయి. శివుడు, పార్వతి, కాల భైరవుడు, సప్త మాతృకలు, అనేక రకాల వినాయకులు, లక్ష్మి, సరస్వతి, విష్ణుమూర్తి యిత్యాది దేవతా విగ్రహాలు అందంగా చెక్కనవి కన్పిస్తాయి. ఇలాగే శ్రీరాముడు, సీతా దేవి, లక్ష్మణుడు, హనుమంతుడు, గరుత్మంతుడు, నంది, ద్వారపాలకుల శిల్పాలు అనేక చోట్ల చెక్కబడినాయి. ఈ విగ్రహాలన్నీ బిగుసుకున్నట్లుంటాయి. ఆగమశాస్త్రాధారంగా శిల్పాలు తయారు చేయటం వలన బిగుసుకు పోయినట్లు కన్పిస్తున్నాయి.

సంగీతం బాగా పోషించబడింది. పెదకోమటి వేమారెడ్డి సంగీత చింతామణి వ్రాశాడు. అందులో వాద్య విభాగంలో వీణను వర్ణించాడు. వృత్త విభాగంలో దేశీ వృత్తాలను వర్ణించాడు. కాటయ వేమారెడ్డికి, కుమారగిరిరెడ్డికి సంగీతం, నృత్యం తెలుసు. రాణ్మహేంద్రవరపాలకుడు వీరభద్రారెడ్డికి లక్ష్యలక్షణాలతో సంగీత శాస్త్రం తెలుసు. ఇలాగే రేచర్ల నాయకులు రెండవసింగన, కోరుకొండ ముమ్మిడి నాయకుని సోదరుడు సింగయనాయకుడు సంగీత విద్వాంసులేగాక సంగీత శాస్త్ర గ్రంథాలు వ్రాశారు. ఆ రోజుల్లో సుధాదిగీతాలు, సులాది గీతాలు, జతి గీతాలు, తుమ్మెద పదాలు, ప్రభాత పదాలు, గొబ్బి పదాలు, కల్యాణ గీతాలు, మంగళ గీతాలు యింకా చాలా ఉన్నాయి. దాక్షారామంలో వసంతోత్సవాలప్పుడు హిందోళ రాగంలో జాతర పాటలు పాడుతున్నట్లు శ్రీనాథులవారు వ్రాశారు.

### గారడీ విద్యలు :

జల స్తంభన, శిలా స్తంభన, అగ్ని స్తంభన, ఇంద్రజాల, మహేంద్రజాల, అదృశ్యకరణ, నష్ట వస్తు సముద్ధరణ, టక్కు టమార మొదలగు గారడీలు వుండేవి. చేతబడులుండేవి. మంత్ర శాస్త్రం మీద నమ్మిక బాగా ఉండేది.

### ఇస్లాం ప్రభావం :

చాతుర్వర్ణ్య వ్యవస్థలో రెడ్డిరాజులు, వెలమ దొరలు విజయనగర నరపతులు, ముసునూరివారు నాలుగవ వర్ణం వారు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో శూద్రులు రాచరికానికి పనికిరారు. కాని శూద్రపాలనను బ్రాహ్మలు అంగీకరించక తప్పలేదు. హిందూ సమాజం ఊహించలేని రీతిలో దొంతరులుగా, బహుకులాలుగా విడిపోవడానికి అంతవరకు ఈ వ్యవస్థ గొప్పతనాన్ని చెపుతూ, తమ ప్రత్యేకత నిలుపుకుంటూ రావటమే కారణం. భారతీయ జీవన విధానంలో యీ కుల నిర్ణయం, న్యాయశాస్త్రంలో కుల పక్షపాతం, భారతీయుల్ని నిలువునా నాశనం చేసింది. కాని ఇస్లాం ప్రవేశించి, దేశాన్ని గజగజలాడించాక, ఏకులం వాడైనా దేవ, బ్రాహ్మణ రక్షణ చేసి, బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చి ఆదరిస్తే చాలుననే దశకు బ్రాహ్మణ మేధావులు పయనించారు. ఇలా నాలుగవ వర్ణం వారికి అనేక సౌకర్యాలు లభించాయి. ఈ సౌకర్యాలు పోరాడి సంపాదించినవి కావు. ఇస్లాంను చూసి, భయపడి, చట్టాన్ని, ఆచారాన్ని సడలించటం వలన లభించాయి. దేవభాష అనే సంస్కృతాన్ని చదివే అవకాశం చతుర్థ కులస్థులకు ఇందువలన లభించింది.

యదార్థానికి సంస్కృతం దేవభాషకాదు. దేవ నాగరీకాదు. పాణిని సంస్కరించిన వైదిక ప్రాకృతం.

శూద్ర ప్రభువుల వద్ద సైనిక పదవులు, మంత్రిపదవులు గుమస్తా ఉద్యోగాలు, సంకోచం లేకుండా బ్రాహ్మణులు చేశారు. మత కట్టుబాట్లపైన ఇస్లాం సమ్మెట దెబ్బలు

కొట్టింది. తలలు వంచక తప్పలేదు.

సామాన్య ప్రజలు ఎక్కువగా ఇస్లాం స్వీకరించసాగారు. పెద్ద కులాలవారిలో కొందరు మతం మార్చుకొని ముస్లిం పాలకుల దరి చేరటం సాంఘిక నడవడిలో బలమైన మార్పును సూచిస్తోంది. ఒకటి రెండు ఉదాహరణలు చెపుతాను.

నాగయ గన్న మంత్రి ఓరుగల్లు సామ్రాజ్యంలో కటకపాలుడు. మార్కండేయ పురాణాన్ని కృతి తీసుకున్నాడు. ఓరుగల్లు పడిపోయాక, ముస్లింలలో కలసిపోయాడు. మల్లిక్ మక్బూల్ అని పేరు మార్చుకున్నాడు. అక్కడే స్థిరపడిపోయాడు.

తెలంగాణాకు చెందిన పద్మ నాయకసేనాని కన్నయ్య నాయకుడు ప్రతాపరుద్రుడు బందీ అయ్యాక మతం మార్చుకొని మాలిక్ మఖ్బూల్ అనిపేరు పెట్టుకున్నాడు. మహమ్మద్ బిన్ తుగ్లక్ కొలువులో చేరాడు. తర్వాత కాలంలో ఢిల్లీలో ఉపప్రధాని పదవి వరకు పెరిగాడు.

1422లో ఫిరోజిషా తమ్ముడు ఒకటవ అహమ్మద్‌షా బహమనీ, విజయనగరం మీద దాడి చేసి దేవరాయల కొడుకు విజయ రాయలను తుంగభద్ర యొడ్డున ఓడించాడు. అప్పుడు దొరికిన ఇద్దరు ప్రముఖ బ్రాహ్మణులు మతం మార్చుకున్నారు. ఒకరు తరువాత బీరారు పాలకుడయ్యాడు. మరొకరి కొడుకు అహమ్మద్ నగర ప్రభువయ్యాడు.

ఇక సామాన్యుల సంగతి చెప్పనవసరం లేదు.

## రాజనీతి

భారతదేశంలో ఏ రాచరిక వ్యవస్థ అయినా తన రాజ్య విస్తరణకు, తన శత్రువు శత్రువు తన మిత్రుడు (తాత్కాలికంగా) అనే భావంతోనే మనుగడ సాగించింది. ఏరాజ్యాన్నయినా జయించి పాలించడమే ప్రాధన్యాత వహించింది.

నీతిసారం వ్రాసిన రుద్రదేవుడు (మొదటి ప్రతాపరుద్రుడు) రాజ్యం ఎంత పెద్దదిగా ఉంటే రాజు అంత గొప్పవాడవుతాడు గనుక ఇతర రాజ్యాలమీద దాడిచేసి వాటిని కలుపుకోవటం రాజధర్మం అంటాడు.

శత్రువుల రక్తంతోను, వారి భార్యల కన్నీళ్లతోను నేల తడవకపోతే రాజుకు గొప్పేముంది? ప్రతిష్ఠేముంది అంటాడు బద్దెన.

పరాజయాన్ని మించిన దుఃఖం, విజయాన్ని మించిన ఆనందం ఉండదు. కాబట్టి లక్ష్యసాధనకు ఏమార్గాన్నయినా తొక్కవచ్చునని, యుద్ధంలో విజయం పొందడంతో పాపాలన్నీ పరిహారమయిపోతాయని కామందక 'నీతిశాస్త్రం' అంటుంది.

ఇలా ఎన్నో నీతులు చెప్పారు. అన్నిటిలోనూ ఒకే సూత్రం రాజ్యవిస్తరణ, విజయం.

## భాషలు

భారతీయులకు ఒకదశలో ప్రాకృతం అనుసంధాన భాషగా ఉండేది. ఆ తర్వాత సంస్కృతం వచ్చింది. క్రమేణా ప్రాంతీయ భాషలు రూపుదిద్దుకున్నాయి. గాసట బీసటగా

ఉన్న తెనుగును సంస్కరిస్తానని నన్నయ భట్టారకుడు సంస్కృత పద భూయిష్టమైన తెలుగును వ్రాసి అసలు తెలుగు నడుం విరగ్గొట్టాడు. పురాణాలు, ఐతిహాసాలు సంస్కృతం నుండి తెనుగులోకి అనువదించి, సహజపరిణామం లేకుండా ఛాందసాన్ని నెత్తిన మోపారు. తెలుగుతనం మసిబార్చారు.

తెలుగు వ్యాకరణం సంస్కృతంలో వ్రాసిన పెద్దలు తెలుగునెలా ఉద్ధరించగలరు.

తెలుగు సహజ భాష. ప్రజల భాష. సంస్కృతం ఏనాడూ ప్రజల భాషకాదు. ఇది గ్రంథభాష. పుస్తకాల్లోనే ఉండే భాష.

ఈ బరువు వలన, ఏ కావ్యం తీసి చదివినా సంస్కృతం చదివినట్లుంటుంది. లేకుంటే విభక్తులు తగిలించిన సంస్కృత శబ్దాలు ముంచెత్తుతాయి. వడగళ్ల వానలా ముసురుకుంటాయి.

కొండవీటి పాలకులు సంస్కృతాన్ని, సంస్కృత తెలుగును సమాదరించారు.

## ఆనాటి తినుబండారాలు

శ్రీనాథులవారు తన గ్రంథాల్లో ఆనాటి ఆంధ్ర ప్రజలు ఏమేమి ఆరగించారో వ్రాశారు. భోజన ప్రియులకు నోరూరించే పదార్థాలను వారు వివరించారు.

ఖండశర్కర జున్ను కండ చక్కెరలు దోసెలు వడల్పె వె పాసెముల తోడ
కమ్మగా కాచిన కఱియాల నేతితో కమనీయ పంచ భష్యముల తోడ
సంబారముల తోటి శాక పాకముతోడ పక్వమైన పెసర పప్పుతోడ
తేనియ ధారతో పానకంబుల తోడ శిఖరషాడబరస శ్రేణితోడ
నచ్చలవణాదికముతోడ నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము వెట్టు ద్వాదశీ పుణ్య వేళ
లింగ మంత్రి నవీన రుక్మాంగదుండు ( భీమే. 1 - 61 )

ద్రాక్షాపానక ఖండ శర్కరలతో రంభా ఫల శ్రేణితో
గోక్షీరంబుల తోడ, మండెగలతో గ్రొన్నేతితో, పప్పుతో
నక్షయ్యంబగు నేరు బ్రాలకల మాహారంబు నిశ్శంకతం
కుక్షుల్ నిండగ నారగించితిమి యక్షుద్రక్షుధా శాంతికిన్ ( భీమే 2 - 142 )

పప్పును పిండివంటలును పానకముల్ ఘృతముల్ గుడంబులుం
కుప్పలుగాగ చుట్టునను కూర్పగ కూడిన యేరు బ్రాల తె
ల్లప్పుర భోగి వంటకము కమ్మని తాలిపు సొజ్జె పిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తములాకటి చిచ్చు పెచ్చునన్ ( భీమే 2 - 140 )

శనివారోత్సవ మాచరించె ముని శిష్య వ్రాతముందాను గ
మ్మని పణ్యారముతోడ బూరెగమితో మండెంగ దండంబుతో
ననుగుం బాసెముతోడ బాండుకల మాహారంబుతో నేతితో
ఘనరంభాఫల ఖండ శర్కరలతో కారుణ్య పాథోధికిన్ ( భీమే 2 - 67 )

క్రీడాభిరామంలో పూటకూళ్ల యింటివారు వడ్డించే ఆనాటి ఆహార పదార్థాల వివరాలు చూడండి.

కప్పుర భోగి వంటకము కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును, క్రొత్తగ కాచిన యాలనే, పెస
ర్పప్పును కొమ్మునల్లరటి పండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పల తోడ గ్రొంబెరుగు లక్ష్మణ వజ్ఝల యింట రూకకున్ ( 166 క్రీడా )

మాంస వంటకం తీరు చూడండి.

"మిరియము, నుల్లియున్, పసుపు, మెంతియు, ఇంగువ, జీరకంబు, శ
ర్కరయును, జింతపండును, గరాంబువు, కమ్మనినేయి, తైలమున్
బెరుగును మేళవించి - " వండారు ( హర 2 - 121 )

ఇలాగే 'తినలేమో కవిశేఖరా!' పద్యం 'జొన్న కలి' పద్యం వివరిస్తాయి.

సామాన్యులకు జొన్నకూడు, రాగిసంకటి మామూలు ఆహారంగా ఉండేది. రాజులకు, బ్రాహ్మణులకు, రాజోద్యోగులలో పై తరగతివారికి, ఉన్నత వ్యాపారులకు ఎన్నో రకాల ఖాద్యాలుండేవి. విస్తరణ భీతితో వ్రాయటంలేదు.

## ముగింపు

చాలాదూరం వచ్చాం. పంటరెడ్లు, శ్రీనాథులవారు, వారి కావ్యాలు, చాటువులు, పర్యటనలు వివరించాను. ఇక ముగించాలని ఉంది.

రెడ్డి ప్రభువుల పాలనకు, శ్రీనాథులవారి జీవితానికి అవినాభావసంబంధం గమనించారు గదా! ఇందువలన జమిలిగా వున్న ఈలతా పుష్పాలను, సౌరభాలను పలువిధాలైన రంగులను నా శక్తికొలది, నాతోచిన కొంధికి, నేను ఊహించిన రీతిలో వివరించాను.

ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్రన గారిని, శ్రీనాథ కవి సార్వభౌములను, ఇతర కవులను రెడ్డిరాజులు ఆదరించకున్నచో యీనాడు మనకు లభిస్తున్న ఆనాటి చరిత్ర చాలా భాగం

దొరికి ఉండేది కాదు.

శ్రీనాథులవారి వలన చరిత్రలోకి జారిపోకుండా అనేకమంది, అనేక ప్రదేశాలు, ఆచార వ్యవహారాలు మనకనులముందు నిలచి ఉన్నాయి.

ఆనాటి రాజకీయ కల్లోలాల మధ్య కొండవీటిని, రాజమహేంద్రవరాన్ని, అద్దంకి, చందవోలులను కేంద్రంగా ముమ్మూర్తులా తెలుగు పాలకులుగా పంటరెడ్లు ప్రకాశించారు. రాచకొండ, దేవరకొండవారు సైతము దీప్తి ప్రతాపాలలో సాహిత్య సంగీతాలలో సమస్థాయిలలోనే నిలబడటం, తెలుగు భాషకు సేవలు చేయటం మరచిపోరానిది.

ఆ కల్లోల పరిస్థితులలో రాజకీయ విజ్ఞతను ప్రదర్శించి, ముసునూరి ప్రోలయ నాయకుని అధ్యక్షునిగా ఎన్నుకోవటం వలన, సమిష్ఠిగా, ముస్లింలనెదిరించగలిగారు. ఆనాటి చరిత్రకు దీపకళిక వంటి విలస శాసనం ప్రోలయ వేయించిందే. కాపయ కాలంలో మరల ఆంధ్రావని కత్తుల బోనయింది. ఈ అన్నదమ్ముల వివరాలు యింకా మరింతగా వెలుగులోకి రావలసి ఉంది.

రెడ్డి ప్రభువుల ప్రాభవంతోపాటు పూలదండలో దారంగా ఉన్న కవిరాజు ఆంధ్రదేశాన్ని పీడించిన పోరాటాల మధ్య, ఖడ్గధారల మధ్య, సామరస్యం కొరకు చేసిన కృషిని, ఆ పర్యటనలను, నాకు తోచిన రీతిలో మీ ముందుంచాను. దేశభాషలందు తెనుగు లెస్స అని తెలుగు సరస్వతి శిరస్సుపై వెలకట్టలేని కీర్తి కిరీటాన్ని నిలిపి, తేనెసోనల తెనుగును మనసారా కీర్తించిన మాన్యమూర్తి శ్రీనాథులవారు. వారి పలుకుబడులే పదివేలుగా భావించాను: పల్నాటివీర చరిత్ర, చాటుకవితలు, క్రీడాభిరామ విశేషాలు, కావ్యాలు అందించిన కవిరాజును కీర్తించి, ఆరాధిస్తున్నాను. వారినాదరించిన వారందరినీ అభిమానిస్తున్నాను.

- పోలవరపు కోటేశ్వరరావు

విజయవాడ,

10-3-1997

# పోలవరపు కోటేశ్వరరావు గారి ముద్రిత రచనలు

1. కాకుళయ్య కథలు 1990

   జాతీయ స్థాయి ప్రథమ బహుమతి పొందిన

   తెలుగు కథానికా సంపుటి

2. మనము - మన నృత్యాలు 1992

   తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారం లభించింది

3. కృష్ణా తరంగాలు (కథానికలు) 1992

4. లచ్చుమయ్య కథలు 1994

5. కృష్ణవేణి గేయాలు 1994

   (ఇందులోని కొన్ని పాటలు సంగీత రూపకముగా

   ఆకాశవాణి వారు ప్రసారం చేశారు.

   ఆకాశవాణి జాతీయ స్థాయి ప్రథమ బహుమతి లభించింది)

6. మహాత్మా! జిందాబాద్ (నాటిక) 1995

   ఆకాశవాణి, విజయవాడ వారు ప్రసారం చేశారు

7. మా ఊరి మనుషులు (కథానికలు) 1995

8. శ్రీనాథులవారొచ్చారు. (నాటిక) 1996

9. ఆముక్తమాల్యద - ఆంధ్ర మహావిష్ణువు 1996

   అను రాయలు-రంగన్న (నాటిక)

10. సోమూరి జీవితం 1997

11. కృష్ణా గోదావరి బేసిన్ - నూనె, సహజ వాయు సంపద 1997

12. కొండవీటి ప్రాభవం - శ్రీనాథుని వైభవం 1997



క్షోణితలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి జంచరీకచయ సుందరవేణికి రక్షితానత
శ్రేణికి దోయజాతభవ చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్

( పోతన గారి శ్రీ మహాభాగవతము 1 - 6 )